# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 12 సంచిక : 11 హైదరాబాద్ 160 నవంబర్ 2014 పేజీలు : 68 రు. 20

- హుదూద్ బీభత్సంపై రెండు వ్యాసాలు
- తెలంగాణలో ఆగని రైతుల ఆత్మహత్యలు
- జయలలితకు శిక్ష దేనికి సంకేతం?
- మోడీ పాలనపై రెండు వ్యాసాలు
- తెలంగాణ విద్యార్థి ఆర్థిక సహాయ పథకం
- ఎన్‌కౌంటర్లపై సుప్రీంకోర్టు తీర్పు
- ‘హాంకాంగ్‌ను ముట్టడిద్దాం’ ఉద్యమం

# ఆర్ ఎస్ రావు స్మారకోపన్యాసం, సదస్సు

కార్యక్రమం:

నవంబర్ 8, 2014 శనివారం, సా. 6 గం.లకు

## ఆర్ ఎస్ రావు స్మారకోపన్యాసం

**దొడ్డి కొమురయ్య హాల్**

సుందరయ్య విజ్ఞాన కేంద్రం, బాగ్‌లింగంపల్లి హైదరాబాద్

అంశం : **విద్యా వ్యవస్థ విధ్వంసం - సంక్షోభ సూచనలు**

వక్త : **ప్రొ. జి. హరగోపాల్**

పౌరహక్కుల నాయకులు, సామాజిక విశ్లేషకులు

**నవంబర్ 9, 2014 ఆదివారం , ఉ. 10 నుంచి సా. 5.30 వరకు**

**సెమినార్ హాల్, స్కూల్ ఆఫ్ సోషల్ సైన్సెస్,**

సెంట్రల్ యూనివర్సిటీ (యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాద్) గచ్చిబౌలి

(కోఠీ, నాంపల్లి, మెహదీపట్నంల నుంచి సెంట్రల్ యూనివర్సిటీకి బస్సులు ఉంటాయి)

అంశం : **వ్యవసాయంలో మార్పులు - కొత్త నిర్మాణాలు**

హర్యానా, బీహార్, పశ్చిమ బెంగాల్, ఒడిశా, ఆంధ్రప్రదేశ్, తెలంగాణ వ్యవసాయ రంగంలో వస్తున్న మార్పుల మీద క్షేత్రస్థాయి పరిశోధనా పత్రాలు, మార్పులను అర్థం చేసుకునే సైద్ధాంతిక పత్రాలు ఉంటాయి

**సమాజంలో మార్పులను అధ్యయనం చేద్దాం!**
**సమాజంలో మార్పులను అర్థం చేసుకుందాం!**
**ప్రజానుకూల సామాజిక మార్పులను ఆహ్వానిద్దాం!**

**ఆలోచనాపరులందరికీ ఆహ్వానం**

**- ఆర్.ఎస్. రావు మిత్రులు**

**వీక్షణం,** రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

**ISSN 2231-6892**

**160**

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

నవంబర్ 2014
సంపుటి : 12
సంచిక : 11





**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – జి.యాదగిరి; నల్గొండ – జి. వెంకటేశ్వర్లు; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎం. రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – వి. శంకరయ్య; వరంగల్ – ఎ.కుమార్. **ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; ప్రకాశం – కర్ణ సతీష్‌బాబు; విశాఖపట్నం – పి.వి. రమణ; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత



**ప్రింటర్స్**
**డక్కన్ ప్రెస్ /**
**చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

**డిస్ట్రిబ్యూటర్స్**
**ఆనంద్ ఏజన్సీస్**
హైదరాబాద్
ఫోన్ : 98484 28516
92468 26191

**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు,**
**డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**
మైత్రీ రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 20 | రు. 20 |
| సంవత్సరం | రు. 240 | రు. 200 |
| మూడు సంవత్సరాలు | రు. 600 | రు. 540 |
| ఐదు సంవత్సరాలు | రు. 1000 | రు. 900 |
| పది సంవత్సరాలు | రు. 2000 | రు. 1700 |

ఆన్‌లైన్ ద్వారా డబ్బులు పంపేవారు మాత్రమే బ్యాంక్ స్లిప్‌లపై 'veekshanam' అని రాసి వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

**వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో ఎం.ఎం. ప్రసాద్ రు. 5000, వై. రాజేంద్రప్రసాద్, రు. 5555, ఎస్.వి.ఎస్. రామారావు రు.500 (హైదరాబాద్) ఆర్థిక సహాయం అందజేశారు. వారికి కృతజ్ఞతలు. - సం.**

వీక్షణం సెప్టెంబర్ సంచికలో 'మీలో ఎవరు కోటీశ్వరుడు' మీద అక్టోబర్‌లో వచ్చిన 'మీలో ఎవరు తెలివిలేని బిచ్చగాడు? అనే వ్యాఖ్య స్పందన బాగుంది. టివిలో వచ్చే మోసపూరిత ప్రోగ్రాంల వెనుక ఉన్న చిట్టాను రచయిత విప్పినారు. ఇలాంటి ప్రోగ్రాంలు నేడు అన్ని భాషల్లో, ప్రాంతీయ, జాతీయ టివి ఛానళ్లలో వస్తున్నాయి. మీడియా యజమానులూ, పెట్టుబడిదారులూ ప్రజల వద్ద ఉన్న సొమ్మును ఎలా రాబట్టాలో ప్రణాళికలు వేసి ఇలాంటి ప్రోగ్రాంలు సినిమా రంగానికి చెందిన ప్రముఖుల చేత చేయిస్తున్నారు. మన సినిమా హీరోలకు సినిమాలో ఉన్న సామాజిక బాధ్యత, సామాజిక ఆచరణలో కనిపించదు. (అది ఈ మధ్య జయలలిత బెయిల్ కోసం ఆమె అనుయాయిల కంటే సినిమా రంగానికి చెందినవారే ఎక్కువ ఆందోళన చేశారు. ఇది వారి అసలైన బాధ్యత) ఈ వ్యాసంలో ఉన్న ప్రతి వాక్యాన్ని చదివితే డబ్బులు ఎలా పోగవుతున్నాయో, అవి పెట్టుబడిదారులకు ఎలా లాభాలుగా మారుతున్నాయో మనకు స్పష్టంగా అర్థమవుతుంది. పెట్టుబడిదారీ విధానం స్థిరపడుతున్న క్రమంలో సంపద, సరుకు రూపంలో చలామణి అవుతుంది. కావున పెట్టుబడిదారులు, ప్రజలను మభ్యపెట్టి, సంపదను రాబట్టడానికి సరుకు రూపంలో ఇలాంటి ప్రోగ్రాంలు చేయిస్తుంటారు. కొంతమందిని ఎంపిక చేసి, కొద్ది మొత్తంలో వారికి సొమ్ము ఇచ్చి, వారి చేత ప్రజలను నమ్మించి, కోట్లాది మంది ప్రజలతో ఆ ప్రోగ్రాంలను చూసే విధంగా ప్రచారం చేసి, ప్రకటనల ద్వారా, మెసేజ్‌ల ద్వారా వచ్చే సొమ్ము తన లాభాల ఖాతాలో వేసుకుంటారు. పెట్టుబడిదారులు ఇలాంటి కార్యక్రమాలను టివిలోనే కాకుండా చిట్‌ఫండ్స్, చిటీలూ, ప్రైవేట్ బ్యాంకుల ద్వారా లోన్ల పేర చేస్తుంటారు. ఇవి శరీరంలోని నాడులలా, సమాజంలో ఈ సంస్థలు సంబంధాలు కలిగి ఉంటాయి. ఇవన్నీ శ్రమతో సంబంధం లేకుండా సంపదను సృష్టించవచ్చు అనే మాయమాటలు ప్రజల మెదడులోకి చొప్పిస్తాయి. ప్రజలను శ్రమకు దూరం చేస్తుంటాయి. ఇంత మంచి విషయాన్ని తెలియచేసిన రచయితకు, ప్రచురించిన వీక్షణం పత్రికకు మా కృతజ్ఞతలు.

**- సృజన్,** కల్వకుర్తి

వీక్షణం అక్టోబర్ సంపాదకీయంలో 'వంది మాగధుల భజనకే వంద రోజుల పాలన' ఇప్పటి మోడీ ప్రభుత్వ పరిపాలనను కళ్లకు కట్టినట్లుగా చూపెట్టింది. ప్రజలకు ఎన్నో భ్రమలు చూపెట్టి అధికారంలోకి వచ్చిన మోడీ యుపిఏ విధానాలనే కొనసాగిస్తున్నాడు.

**- తుమ్మురుగోటి రాములు,** మిర్యాలగూడ

వీక్షణం గత సంచికలో అస్తిత్వ ఉద్యమాలపై వచ్చిన మూడు వ్యాసాలు అస్తిత్వ ఉద్యమాలు లేవనెత్తుతున్న ప్రజాస్వామిక సమస్యలను ప్రతిబింబిస్తూ వాటి పరిధి, పరిమితిని వివరించాయి. అస్తిత్వ ఉద్యమాలు తమ హక్కులను సాధించుకోవడంలో ఎందుకు విఫలం అవుతున్నాయో రచయితలు వివరించారు. తమ స్వీయ ప్రయోజనాల కోసం విడిపోయి పీడనకు గురయ్యే మెజారిటీ ప్రజలను కలుపుకొని సాగకపోవడం వల్ల తమ లక్ష్యాన్ని చేరుకోకపోగా అస్తిత్వ ఉద్యమాలు పాలకులకే ఉపయోగ పడుతున్నాయనే వాస్తవాన్ని తెలిపారు. కుల సమాజంలో అస్తిత్వాలను ప్రకటిస్తూ చరిత్రలో చాలా ఉద్యమాలు వచ్చాయి. అస్తిత్వ ఉద్యమాలు తెస్తున్న సమస్యల పరిష్కారం కోసం ప్రభుత్వాలపై ఒత్తిడి తెస్తూనే సమాజంలో మౌలిక మార్పు కోసం పీడితులందరూ కలిసి సాగాలనే స్పృహను నింపిన రచయితలకు కృతజ్ఞతలు.

**- ఎల్. సంతోష,** కరీంనగర్

అక్టోబర్ సంచికలో శ్రీలంక తమిళులపై వచ్చిన వ్యాసం బాగుంది. శ్రీలంకలో తమిళ జాతి విముక్తి పోరాటంపై జరిగిన ఘోర అకృత్యాలు సభ్య సమాజానికి కానరాకుండా రాజపక్సే ప్రభుత్వం తొక్కి పెట్టింది. శ్రీలంక తమిళుల ఆకాంక్షలను పాలకులు అణచివేసినా ఆ జాతి లేవనెత్తుతున్న సమస్యలకు ప్రజాస్వామ్య పరిష్కారం దొరకనంత వరకూ అవి మళ్లీ మళ్లీ ఎగిసిపడుతూనే ఉంటాయి. వివిధ వేదికల మీద ప్రజాస్వామిక వాదులు తమిళజాతి కోసం గొంతెత్తుతున్న తీరే దీనికి నిదర్శనం. రచయిత ఈ విషయాలను చాలా వివరంగా, ఉదాహరణలతో తెలిపారు. దేశాలేవైనా, ప్రాంతాలేవైనా ప్రజలు లేవనెత్తుతున్న మౌలిక సమస్యలను ప్రజాస్వామికంగా పరిష్కరించనంత కాలం ప్రజలు ఉద్యమిస్తూనే ఉంటారనే చారిత్రక వాస్తవాన్ని రచయిత బాగా చెప్పారు.

**- సిఎచ్. సుదర్శన్,** విజయనగరం

నూటొక్క రోజులు నిండకుండానే నయా నిజాంగా తనను తాను రుజువు చేసుకుంటున్న కెసిఆర్ పట్ల అందరు అప్రమత్తంగా ఉండాల్సిన అవసరం ఉంది. ప్రజాస్వామిక విలువల పట్ల ఎలాంటి గౌరవం లేని దొర బిడ్డ తన వర్గ స్వభావానికి తగినట్లుగానే పరమ ఫ్యూడల్ నిరంకుశపు పోకడలకు పోతున్నాడు. అతడి మీద అనవసరపు భ్రమలు పెట్టుకున్న ప్రజలు, తెలంగాణ మేధావులు, జర్నలిస్టులు, తెరాసలోని సాధారణ కార్యకర్తలు భ్రమలు వీడి త్వరగా మేల్కోవాల్సిన తరుణం ఆసన్నమయింది. తెరాస ప్రభుత్వపు అప్రజాస్వామిక నిర్బంధకాండకు వ్యతిరేకంగా గొంతెత్తాల్సిన అవసరం ఉంది. కేవలం బతుకమ్మలు, బోనాలు ఆడుకోవడానికి కాదు తెలంగాణ కోసం కొట్లాడింది. వందలాది మంది రక్తతర్పణం చేసి పోరాడింది ఆంధ్రోడి నిరంకుశత్వం స్థానంలో తెలంగాణోడి నిరంకుశత్వం కింద మగ్గడానికి కాదనే సంగతి గుర్తుంచుకోవాలి. నిర్బంధాలు, ఎన్‌కౌంటర్లు, అణిచివేతలు లేని ప్రజాస్వామిక తెలంగాణ కోసం పోరాటాన్ని మరింత దృఢంగా కొనసాగించాలి. కొందరు జర్నలిస్టులు ఈ విషయంలో మౌనం వహించడం శోచనీయం.

**- నటాషా** (ఇమెయిల్ ద్వారా)

వీక్షణం అక్టోబర్ సంచికలో తెలిపినట్టు తిరుపతిలో కూడ ప్రత్యామ్నాయ రాజకీయ వేదిక సమావేశం జగరనివ్వలేదని చదివాను. మావోయిస్టు పార్టీ ఆచరణ మీద ఎవరికైనా ఎలాంటి అంచనా, అభిప్రాయమైనా ఉండవచ్చు. మావోయిస్టు పార్టీ రాజకీయాలతో విభేదించే, వ్యతిరేకించే వారు కూడ సమావేశం జరుపనీయకుండా హింస, నిర్బంధాలు ఉపయోగించడాన్ని వ్యతిరేకించాలి. అలాగే రాజధాని విషయంలో రాయలసీమలో ఉన్న ఆందోళనను ప్రభుత్వం గుర్తించకున్నా వామపక్ష సంస్థలు, కార్యకర్తలు గుర్తించాలి. దీనిని ఒక రాజకీయ సమస్యగా గుర్తించి అన్ని ప్రాంతాల ప్రజలను ఒక వేదిక మీదికి తీసుకు రావలసిన అవసరం ఎంతైనా ఉంది. బూర్జువా ప్రజాస్వామిక విలువలను కూడ విప్లవకారులే నిలబెట్టాల్సిన అవసరం వెనుకబడ్డ దేశాల్లో ఉంది. ప్రభుత్వం చేయకపోతే, కర్నూలులో ఏ ప్రభుత్వ కార్యాలయాలు, సంస్థలు ఏర్పర్చవచ్చో చర్చించి దానికి కావలసిన ఉద్యమాన్ని వామపక్ష సంస్థలే నడపాలి.

**- నరేంద్రమోహన్,** వీక్షణం బ్లాగ్‌పై

వీక్షణంలో వచ్చే కొన్ని వ్యాసాలు అర్థం చేసుకోవడంలో ఇబ్బందిగా ఉంది. వ్యాసాలలో విషయం ఉన్నా విశ్లేషణ సులభతరంగా అర్థమయ్యేటట్లు ఉంటే ఇంకా బాగుంటుంది. కొన్ని వ్యాసాలు ఫరవాలేదు, కానీ సిద్ధాంతపరమైన, విద్యాపరమైన, ఆర్థికపరమైన వ్యాసాలు చదువుతున్నప్పుడు విషయం అర్థం చేసుకోవడం కష్టమవుతోంది. వీటిని పత్రిక నిర్వాహకులు సులభతరం చేస్తే పాఠకులకు ఉపయోగకరంగా ఉంటుంది.

**- పులిరాజు భద్రయ్య,** ఖమ్మం

అక్టోబర్ సంచికలో షేక్ కరీముల్లా రాసిన 'సంపన్నుల సేవలో మోడీ పాలన' వ్యాసం సందర్భోచితంగా ఉంది. పాలకులు మారినా, విధానాలలో మార్పు రాదనడానికి మోడీ పాలన సాగుతోందనడానికి వ్యవసాయ రంగానికి బడ్జెట్ కుదించి కార్పొరేట్, రక్షణ రంగానికి చేసిన కేటాయింపులే నిదర్శనమని సోదాహరణంగా రచయిత వివరించారు. ఇటీవలి మోడీ అమెరికా పర్యటన కూడా దీనిని రుజువు చేసింది. మోడీ అధికారంలోకి రావడానికి కారణమైన కార్పొరేట్ రంగానికి తన కృతజ్ఞతలు తెలుపుకోవడంలో భాగంగా ఎటువంటి సంశయం లేకుండా తన విధానాలు ప్రకటిస్తున్నాడు.

**- ఎం. నరేష్,** వరంగల్

# దొంగలు దొంగ సొమ్ము బైటపెట్టగలరా?



స్విస్ బ్యాంకులలో ఉన్న భారతీయ అక్రమ సంపదను భారత దేశానికి తేవడం గురించి, కనీసం ఆ సంపన్నుల పేర్లు బైటపెట్టడం గురించి మళ్లీ ఒకసారి చర్చ ప్రారంభమయింది. ఆయాదేశాలతో తనకు ఉన్న ఒప్పందాల కారణంగా, అక్రమ సంపద ఖాతాదారుల పేర్లు బైటికి చెప్పలేనని ఎన్‌డిఏ నాయకత్వంలోని భారత ప్రభుత్వం సుప్రీంకోర్టుకు అక్టోబర్ 24న తెలియజేసింది. ఈ ప్రకటనే భాజపా ఎన్నికల వాగ్దానాన్ని తలకిందులు చేయగా, మరొక పిల్లిమొగ్గ వేసి అక్టోబర్ 26న అదే ప్రభుత్వం సుప్రీంకోర్టు ముందర ముగ్గురు చిన్నచేపల పేర్లు బయటపెట్టి తిమింగిలాలను దాచేసింది. ఆ మాత్రం పేర్లయినా ప్రకటించడం తప్పు అని పారిశ్రామికవేత్తల, వ్యాపారస్తుల సమాఖ్యలు కన్నెర్ర చేస్తుండగా, అధికారపక్షపు పిల్లిమొగ్గల మీద ప్రతిపక్షాలు బాణాలు సంధిస్తున్నాయి. ఈ వివాదంలో కొత్తదనమేమీ లేదు, పాత్రలు, పాత్రధారులు మాత్రం మారారు. నిన్న అధికారపక్షాన్ని తీవ్రంగా విమర్శించి, మేము అధికారంలోకి వచ్చిన వెంటనే ఆ సొమ్ము తీసుకొస్తాం అన్న అప్పటి ప్రతిపక్షాలు ఇప్పుడు నంగిగా మాట్లాడుతున్నాయి. నిన్న అధికారపక్షంగా ఉండి నంగిగా మాట్లాడినవారు ఇవాళ ఒంటికాలిమీద లేస్తున్నారు. ఇంతకూ ఇది దొంగసొమ్ము వ్యవహారం. మాటలు విసురుకుంటున్నవారు అటూ ఇటూ కూడ దొంగలే అయినప్పుడు స్పందనలు, ప్రతిస్పందనలు ఇలా ఉండడంలో ఆశ్చర్యం లేదు.

భారతదేశంలో చట్టాల ప్రకారం ఆదాయం మీద పన్ను ఉంటుంది. ఆ పన్ను ఎగ్గొట్టడానికి అసలు ఆదాయాన్నో, ఆదాయంలో కొంతభాగాన్నో చూపకపోవడం సంపన్నులు నేర్చుకున్న ఒక ఎత్తుగడ. ఇలా లెక్కకు రాని ఆదాయాన్ని, సంపదను నల్లధనం అనడం ఒక అలవాటు. నిజానికి నలుపు అక్రమానికి, చెడుకు, తప్పుకు చిహ్నం అని భావించే శ్వేతజాతి, వలసవాద భావజాలం నుంచి వచ్చిన మాట ఇది. నల్లవాళ్లమే అయిన భారతీయులం ఆ మాటను నిరాక్షేపణగా వాడడం భావదాస్యం. అది అక్రమ ధనం. అయితే ఇటువంటి అక్రమ ధనానికి ఒకప్పుడు పన్నులు చెల్లించని ధనం అని ఏకైక అర్థమే ఉండేది గాని, ఇవాళ అక్రమ ధన సముపార్జనకు ఎన్నో మార్గాలున్నాయి. ముఖ్యంగా విదేశ వాణిజ్యంలో ఓవర్ ఇన్వాయిసింగ్, అండర్ ఇన్వాయిసింగ్‌ల ద్వారా దేశంలోకి రావలసిన సంపద బైటినుంచి బైటికే తరలిపోవడం, ప్రభుత్వ లావాదేవీల్లో రాజకీయ నాయకులకు, అధికారులకు అందే ముడుపులు, క్రీడాకారులు, సినిమానటులు, వృత్తినిపుణులు, పారిశ్రామికవేత్తలు, వ్యాపారస్తులు తమ ఆర్జనలో గణనీయ భాగాన్ని బైటికి ప్రకటించక పోవడం వంటి ఎన్నో మార్గాలలో దేశంలో అక్రమ సంపద పోగు పడుతున్నది. ఈ అక్రమ సంపదలో కొంత భాగం విదేశాలనుంచే వస్తున్నది. కొంత భాగం సురక్షితంగా ఉంచుకోవాలనే లక్ష్యంతో ఇటువంటి అక్రమ సంపద నిలువ చేసే దేశాలకు, నగర రాజ్యాలకు తరలిపోతున్నది. ఇటువంటి అక్రమ సంపదను నిలువచేసే స్థావరాలు ముప్పైకి పైగా ఉండగా, అటువంటి ఒక్కొక్క స్థావరంలో ఎన్నెన్నో బ్యాంకులలో ఆ సంపద ఉంది. అక్రమ సంపద నిలువ స్థావరం అనే మాటకు స్విస్ బ్యాంకు అనేది పర్యాయపదంగా మారింది గాని, స్విట్జర్లాండ్‌లో కూడ ఎన్నో బ్యాంకులున్నాయి. అంటే ఎన్నో చోట్ల ఉన్న అక్రమ సంపదలో ఒక్కచోట ఉన్నదాని గురించే ఇప్పుడు చర్చ జరుగుతున్నదన్నమాట.

అటువంటి స్విస్ బ్యాంకులలో ఒకానొక బ్యాంకు ఖాతాదారుల జాబితా మరొక విదేశీ బ్యాంకు ఉద్యోగి ద్వారా బైటపడి, 2007 లో ఫ్రాన్స్ ప్రభుత్వం చేతికి చిక్కింది. దాదాపు 700 మంది భారతీయుల పేర్లున్న ఆ జాబితాను ఫ్రాన్స్ ప్రభుత్వం భారత ప్రభుత్వానికి ఇచ్చిందిగాని భారత ప్రభుత్వం దాని మీద ఏ చర్యా తీసుకోలేదు. ఆ తర్వాత కొద్ది నెలలకే మరొక సమాచారం బైటపడింది. అంతకు రెండు సంవత్సరాల ముందు స్విస్ బ్యాంకింగ్ అసోసియేషన్ విడుదల చేసిన గణాంకాల ప్రకారం స్విస్ బ్యాంకులలో భారతీయుల ఖాతాలలో డెబ్బైరెండు లక్షల కోట్ల రూపాయలు ఉన్నాయి. ఈ వార్తల ఆధారంగా దేశంలో అక్రమ సంపదను దేశంలోకి తిరిగి తీసుకురావాలనే ఆలోచన, అలా తీసుకురా గలిగితే దేశ ఆర్థికవ్యవస్థ ఎంత మెరుగవుతుందనే ఆలోచనలు సాగాయి. విభిన్న రాజకీయ పక్షాలు, స్వచ్ఛంద సంస్థలు, మేధావులు వేరువేరు అంకెలు ప్రకటించడం మొదలపెట్టారు. రాందేవ్ బాబా, ఆమ్ ఆద్మీ పార్టీ వంటి వారు కూడ ఈ అక్రమ సంపదను దేశంలోకి తీసుకు రావాలని కోరారు. అప్పటికి ప్రతిపక్షంలో ఉండిన భారతీయ జనతా పార్టీ ఒక అడుగు ముందుకు వేసి తాను అధికారంలోకి రాగానే ఈ అక్రమ సంపదను తీసుకొస్తానని ప్రకటించింది. అధికారానికి వచ్చిన నాలుగు నెలలైనా ఆ దిశగా కనీస ప్రయత్నాలైనా చేయకపోగా, ఇప్పుడు ఆయా దేశాలతో ఉన్న ఒప్పందాల ఆటంకాల గురించి, న్యాయవిచారణా పద్ధతుల గురించి సాకులు చెపుతున్నది. నిజానికి ఇది కేవలం విదేశీ బ్యాంకులలో పోగుపడి ఉన్న సంపద సమస్య మాత్రమే కాదు. దేశ ఆర్థిక వ్యవస్థలో ఉద్దేశపూర్వకంగానే అక్రమాలకు అవకాశాలు కల్పిస్తున్న పాలక విధానాల సమస్య. ఆ విధానాల వల్ల లాభపడుతున్న పాలకవర్గ ముఠాల మధ్య తగాదాలలో భాగంగా కొన్ని వాస్తవాలు బైటపడ వచ్చునేమో గాని, మొత్తంగా పాలకవర్గ ప్రయోజనాలకు వ్యతిరేకమైన పనులు జరగవు. దేశంలో అక్రమ సంపద పోగుపడడానికి, అది దేశం దాటిపోవడానికి, భారతీయుల విదేశీ లావాదేవీలలో అక్రమాలు జరిగి దేశ సంపద సరిహద్దుల ఆవల పోగుపడడానికి అవకాశం ఇస్తున్న రాజకీయార్థిక విధానాలు రద్దయితే తప్ప ఈ సమస్య సమసిపోదు. ఆ రాజకీయార్థిక విధానాలు రద్దు కావడమంటే ఇవాళ పార్లమెంటరీ రాజకీయపక్షాలలో అధికారపక్షంలోనైనా, ప్రతిపక్షంలోనైనా ఉన్న పాలకవర్గ ముఠాల అధికారం రద్దు కావడమే. ప్రజలను, ముఖ్యంగా మధ్యతరగతి బుద్ధిజీవులను ఆకర్షించడానికి, భ్రమల్లో ముంచడానికి ఆ పాలకవర్గ ముఠాలు ఎంత దేశభక్తియుతంగా మాట్లాడినా, ఆదర్శవంతమైన నినాదాలు ఇచ్చినా అంతిమంగా ప్రజలను దోపిడీ పీడనలకు గురిచేసే వ్యవస్థను యథాతథంగా నిలిపి ఉంచడమే వారి లక్ష్యం. ఒక్కమాటలో చెప్పాలంటే దొంగల రాజ్యం ఇది. వారి పాలనలో దొంగసొమ్ము వివరాలు బైటపడుతాయా? వీ

# పరిష్కారం సరే, సంభాషణైనా లేని తెలంగాణ

తెలంగాణ రాష్ట్ర సమితి పద్నాలుగు సంవత్సరాల పాటు ప్రజా ఆకాంక్షలతో పాటు ప్రయాణించింది గనుక, ప్రజల పోరాటానికి ఏదో ఒక స్థాయిలో నాయకత్వం వహించింది గనుక ఇవాళ అది ప్రజల సమస్యల పట్ల వ్యవహరిస్తున్న తీరు చూస్తుంటే విచారంగా ఉన్నది. ప్రజలతో సంబంధం లేని, ప్రజలకు దూరమైన రాజకీయ నాయకులు ప్రజాసమస్యలను వినరు, అర్థం చేసుకోరు, సహానుభూతి ప్రకటించరు, సమస్యల హోరెత్తుతున్న ప్రజలతో మాట్లాడడానికి సిద్ధపడరు – అది అర్థం చేసుకోవచ్చు. కాని నిన్నమొన్నటిదాకా ప్రజాసమూహాల మధ్య తిరిగినవారు, ప్రజల సమస్యల మీద గళమెత్తినవారు, ఆ సమస్యల పరిష్కార మార్గమిదే అని చూపిన వారు, ఇవాళ ఆ సమస్యలను పరిష్కరించగల స్థానాలలో కూచుని అవే సమస్యల మీద ప్రజల ఆవేదనలను అవహాస్యం చేయడం ఆశ్చర్యకరంగా కాదుగాని విషాదకరంగా ఉన్నది. తెలంగాణ రాష్ట్రానికి తప్పనిసరిగా చరిత్ర వల్ల ఏర్పడిన సమస్యలు, రాష్ట్ర విభజన చట్టం వల్ల తలెత్తిన సమస్యలు, ఇవాళ్టికీ గోతికాడి నక్కల్లా పొంచి కూచున్న ప్రత్యర్థుల వల్ల సమస్యలు ఉన్నాయి. అవన్నీ నిజమే. అయినా ప్రజల సమస్యలకు పరిష్కారాలు కనిపెట్టడం నుంచి, కనీసం ప్రజలతో సంభాషించడం నుంచి దూరం జరగడానికి అవి కారణాలు కావు. ప్రత్యర్థుల ఒత్తిడి పెరిగినప్పుడే మిత్రులతో ఐక్యత పెంచుకోవలసి ఉంటుంది. ప్రజల మీద ఆధారపడడం కన్న, ప్రజలతో సన్నిహితం కావడం కన్న, ప్రజలను పరిగణనలోకి తీసుకోవడం కన్న మించిన మరొక మార్గమేదీ లేదు. కాని తెరాస ప్రభుత్వం తన ముందుకు సమస్యలు తీసుకువస్తున్న ప్రజాసమూహాలతో సంభాషణకు కూడ సిద్ధపడడం లేదు. సమస్యలతో సతమతం అవుతున్న, ఆత్మహత్యలకు సిద్ధపడుతున్న ప్రజాసమూహాలలో ధైర్యాన్నీ, ఆత్మవిశ్వాసాన్నీ ఇవ్వడానికి కూడ ప్రయత్నించడం లేదు. సమస్యలు ఎవరు కల్పించినవైనా కావచ్చు, నిజమైన సమస్యలు కూడ కాకపోవచ్చు, అపోహల మీద, అపార్థాల మీద ఏర్పడిన సమస్యలైనా కావచ్చు. కాని ఆ సమస్యలు లేవనెత్తుతున్న ప్రజలతో మాట్లాడడం, వారికి ఆశ్వాసాన్నీ, విశ్వాసాన్నీ ఇవ్వడం నిర్ణయాధికారంలో ఉన్నవారు తప్పనిసరిగా చేయవలసిన పనులు. ఆత్మహత్యలు చేసుకుంటున్న రైతు కుటుంబాలకు ధైర్యవచనాలు చెప్పేబదులు, రైతులు ఆత్మహత్యలు చేసుకోవద్దనీ, ఏ కష్టం వచ్చినా ఆదుకునే ప్రభుత్వం ఉందనీ సాంత్వన పలికే బదులు, అవి వ్యవసాయ సమస్యల ఆత్మహత్యలో కాదో అని అనుమానపు సన్నాయి నొక్కులు నొక్కడం ఉద్యమ కెరటాల మీద అధికారానికి వచ్చిన రాజకీయపక్షానికి తగినది కాదు. అలాగే గతంలో జూనియర్ వైద్యులు ఇవే కోర్కెల మీద సమ్మెకు దిగినప్పుడు ప్రతిపక్షంగా సమర్థించినవారికి, గద్దెనెక్కగానే అవి గొంతెమ్మ కోర్కెలని అనిపించినప్పటికీ, అదయినా చర్చల ద్వారా పరిష్కరించవలసినదే తప్ప నిర్లక్ష్యం ద్వారానో, ఆగ్రహం ద్వారానో కాదు. ఎన్ని భిన్నాభిప్రాయాలున్నా రాష్ట్ర సాధనలో ఐక్యంగా నిలిచి విజయం సాధించిన తెలంగాణ సమాజంలో ఇంత వేగంగా శ్మశానశాంతికి ప్రయత్నించడం భావ్యం కాదు. ధిక్కార స్వభావానికి ప్రతీక అయిన తెలంగాణ గళాన్ని ఎవరూ ఆపలేరు. వీ

# పాలకుల కళ్లు తెర్పించని హుదూద్ బీభత్సం

ఉత్తరాంధ్ర, ప్రత్యేకించి విశాఖపట్నం ప్రజానీకం మీద హుదూద్ తుపాను రూపంలో సముద్రం సాగించిన విధ్వంసక దాడి అత్యంత విషాదకరమైన ఫలితాలను మిగిల్చింది. అసాధారణమైన వేగంతో గాలులు, ఎడతెరిపిలేని వర్షాలు, విరుచుకుపడిన సముద్రం, పొంగిపొర్లిన నదులూ గెడ్డలూ శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం జిల్లాల ప్రజల జీవితాల్ని, జీవనోపాధుల్ని, వనరుల్ని అల్లకల్లోలం చేశాయి. ఇటువంటి ప్రకృతి బీభత్సాలను ఆపగలిగిన శక్తి మనకింకా రాకపోయి ఉండవచ్చు. కాని వాటి తీవ్రతను తగ్గించడానికి, నష్టనివారణ చర్యలు తీసుకోవడానికి, విధ్వంసానంతర సహాయచర్యలు తీసుకోవడానికి, ఇటువంటి విలయాలు పునరావృతం కాకుండా చూడడానికి ప్రయత్నించడమే మనం చేయవలసిన పని. తుపాను హెచ్చరికల క్రమం లో ప్రభావిత ప్రాంతాల నుంచి ప్రజలను సురక్షిత ప్రాంతాలకు తరలించి, ప్రాణనష్టాన్ని తగ్గించడంలో మెరుగైన శక్తిసామర్థ్యాలు చూపిన పాలకులు ఇతరంగా హ్రస్వదృష్టిని, తప్పుడు అభివృద్ధి నమూనాపట్ల మోజును స్పష్టంగా చూపుకుంటున్నారు. తీరప్రాంతాల మీద ఒత్తిడిని తగ్గించడం, మడ అడవులను సంరక్షించడం, తీర ప్రాంత వాతావరణపు సున్నితత్వాన్ని పరిరక్షించడం వంటి చర్యలు తీసుకోకపోగా, పాలక అభివృద్ధి నమూనా తీర ప్రాంతాలను విలాస, విహార, వ్యాపార, కాలుష్యకారక కేంద్రాలుగా మార్చివేసి ఇటువంటి విలయానికి అవకాశం ఇచ్చింది. కనీసం విధ్వంసం తర్వాతనైనా విధ్వంస కారణాల గురించి సమగ్ర సమీక్ష జరిపి, ఆ అభివృద్ధి నమూనా గురించి పునరాలోచనకు పూనుకునే బదులు, ప్రళయ బీభత్స శిథిలాల మధ్యనే నిలబడి మళ్లీ అదే అభివృద్ధి నమూనాను కొనసాగిస్తామనీ, మరింత కసిగా ఆ నమూనాను అమలు చేస్తున్నామనీ పాలకులు ప్రకటిస్తున్నారు. 'ప్రకృతి మీద తన విజయాలకు మనిషి తనను తాను ఎంతైనా పొగుడుకోవచ్చు గాని, అటువంటి ప్రతి ఒక్క విజయానికీ ప్రకృతి మనమీద ప్రతీకారం తీర్చుకుంటుంది' అని ఫ్రెడరిక్ ఎంగెల్స్ అన్నమాట విశాఖపట్నం విధ్వంసం మరొకసారి ప్రకటిస్తున్నది. గత కొన్ని దశాబ్దాలలో అనుసరించిన అభివృద్ధి నమూనా పర్యవసానాలు ఇవి. ఈ విలయంలో దారుణంగా నష్టపోయిన ఉత్తరాంధ్ర ప్రజానీకానికి సంఘీభావం ప్రకటించడం, సహాయ సహకారాలు అందించడం ఇవాళ మనందరి బాధ్యత. అదే సమయంలో, పాలకుల తప్పుడు అభివృద్ధి నమూనాకు, రంగుల కలలకు వ్యతిరేకంగా పోరాడవలసిందిగా ఆ ప్రజలకు విజ్ఞప్తి చేయవలసి ఉంది. సహజ వనరులతో సంపన్నమైన ఉత్తరాంధ్ర ప్రజానుకూల అభివృద్ధి నమూనాను అనుసరించినపుడే భవిష్యత్తులోనైనా ఇటువంటి ప్రమాదాల నుంచి బైటపడుతుంది. పారిశ్రామిక రాజధాని పేరుతో సున్నిత తీరప్రాంతం మీద ఒత్తిడి తేకుండా, ఇబ్బడిముబ్బడిగా ఓడరేవులతో బంగాళాఖాతం తీరప్రాంతమంతా తుపాను బీభత్సాలకు ఆలవాలం చేయకుండా పాలకులను అడ్డుకోవడమే ఈ బీభత్సం నుంచి మనం గుణపాఠాలు నేర్చుకున్నా మనడానికి గుర్తు. తమ స్వార్థ ప్రయోజనాల వల్ల పాలకులు ఎలాగూ ఆ పాఠాలు నేర్చుకోరు. కాని బతుకును, ప్రకృతిని, భవిష్యత్తును ప్రేమించే ప్రజలే పాలకుల మెడలు వంచి ఆ పాఠాలు నేర్పవలసి ఉంది. వీ

# సంక్షోభానికి మరొక సూచన హాంకాంగ్ కల్లోలం

జనచైనా పక్కలో పెట్టుబడిదారీ బల్లెంగా చాలకాలం కొనసాగి, ఆ చైనానే పెట్టుబడిదారీ దుర్గం అయిన తర్వాత ఒక సరిహద్దు కాపలాదారుగా మిగిలిన హాంకాంగ్ లో ప్రజాస్వామ్యం కోసం నెల రోజులుగా సాగుతున్న ప్రజాందోళన పెట్టుబడిదారీ సంక్షోభానికి, కమ్యూనిస్టు పార్టీ పేరు మీద చైనా పాలకవర్గాలు అనుసరిస్తున్న నిరంకుశత్వానికి సూచనగా నిలుస్తుంది. బ్రిటిష్ వలసగా ఉండిన హాంకాంగ్ 1997లో అధికారికంగా చైనా చేతికి వచ్చింది. అప్పటికే ప్రజాస్వామిక ఉద్యమాలతో ఎన్నికల వ్యవస్థను, వాక్స్వాతంత్ర్యాలను సాధించుకున్న హాంకాంగ్ ప్రజలు, అప్పటికే నిరంకుశ పెట్టుబడిదారీ రాజ్యంగా మారిన చైనా నుంచి తమ పాత ప్రజాస్వామిక వ్యవస్థ కొనసాగడానికి హామీ పొందారు. దాదాపు రెండు దశాబ్దాలు గడిచిన తర్వాత ఇప్పుడు చైనా పాలకవర్గాలు, ప్రత్యేకించి నేషనల్ పీపుల్స్ కాంగ్రెస్ స్టాండింగ్ కమిటీ హాంకాంగ్ లో ఎన్నికల సంస్కరణలు జరుపుతామని, ప్రజల వోటింగ్ హక్కులను కత్తిరిస్తామని ఆగస్ట్ 31న ప్రకటించిన తర్వాత హాంకాంగ్ ప్రజలలో అసంతృప్తి రగిలింది. హాంకాంగ్ ఫెడరేషన్ ఆఫ్ స్టూడెంట్స్, స్కాలరిజం అనే విద్యార్థి సంస్థలు ఇచ్చిన తరగతుల బహిష్కరణ, కేంద్ర ప్రభుత్వ కార్యాలయాల ముట్టడి పిలుపులతో ఆ అసంతృప్తి క్రమక్రమంగా ఆందోళన రూపం ధరించింది. ఆక్యుపై సెంట్రల్ విత్ లవ్ అండ్ పీస్ ఉద్యమంగానూ, హాంకాంగ్ అంబరెల్లా రెవల్యూషన్ పేరుతోనూ ఆందోళన విస్తరించింది. హాంకాంగ్‌లో సార్వత్రిక వయోజన వోటు హక్కు ఇవ్వాలనీ, హాంకాంగ్ స్పెషల్ అడ్మినిస్ట్రేటివ్ రీజియన్ పేరుతో సాగే హాంకాంగ్ ప్రభుత్వ ప్రధాన కార్యనిర్వహణాధికారి సి వై లియుంగ్ రాజీనామా చేయాలనీ, హాంకాంగ్ ఎన్నికల సంస్కరణల గురించి చైనా ప్రభుత్వం తీసుకున్న నిర్ణయాన్ని ఉపసంహరించాలని, హాంకాంగ్ ప్రధానాధికారిని ప్రత్యక్ష ఎన్నికల ద్వారా ఎన్నుకునే వీలు కల్పించాలనీ ప్రధాన డిమాండ్లతో ఆందోళన ఇప్పటికీ సాగుతున్నది. అన్ని ప్రభుత్వాల లాగే హాంకాంగ్ ప్రభుత్వం కూడ ఆందోళనకారుల మీద దమనకాండకు పాల్పడినప్పటికీ ఆందోళన ఆగలేదు. ప్రభుత్వానికీ, ఆందోళనకారులకూ మధ్య చర్చలు జరిగినా సఫలం కాలేదు. ఇటువంటి సంక్షుభిత సమయాలలో తమ పబ్బం గడుపుకోవడానికి ప్రయత్నించే సిఐఎ వంటి శక్తులు, పాత అధికారవర్గాలు ఎట్లాగూ ఇటువంటి ఆందోళనలోకి దిగుతాయి గనుక ఇది అమెరికా అనుకూల, చైనా వ్యతిరేక ఆందోళన అనే వ్యాఖ్యలూ వచ్చాయి. కాని కొందరు పరిశీలకులు గుర్తించినట్టుగా ఇది పైకి చూడడానికి బూర్జువా ప్రజాస్వామిక లక్ష్యాలతో సాగుతున్న ఆందోళనగా కనిపించినప్పటికీ, సారాంశంలో హాంకాంగ్ లో తీవ్రంగా పెరిగిపోతున్న అసమానతల పట్ల, ఆశ్రిత పెట్టుబడి పట్ల, చైనా కమ్యూనిస్టుపార్టీ నిరంకుశ పాలన పట్ల హాంకాంగ్ ప్రజలలో, ముఖ్యంగా యువతరంలో వ్యక్తమవుతున్న అసంతృప్తికి చిహ్నం. అంటే కమ్యూనిజం ముసుగు వేసుకున్నప్పటికీ పెట్టుబడిదారీ విధానం సంక్షోభం నుంచి, ప్రజల అసంతృప్తి ప్రజ్వలనం నుంచి తప్పించుకోజాలదని ఈ ఆందోళన మరొకసారి తెలియజేస్తున్నది. వీ

---

ఇస్లామిక్ స్టేట్ ఆఫ్ ఇరాక్ అండ్ ది లెవాంత్ (సిరియా) (ఐఎస్ఐఎల్ లేదా ఐఎస్ఐఎస్) తీవ్రవాదులు ఇరాక్‌లోనూ, సిరియాలోనూ హింసాకాండ సాగిస్తున్నారని ప్రతిరోజూ గగ్గోలు పెట్టే అమెరికన్ ప్రచార సాధనాలు (వాటిని యథాతథంగా అనుకరించే అన్ని దేశాల ప్రచార సాధనాలు) ఆ సంస్థ పేరులోని ఇస్లామిక్ అనే మాటను బట్టి వారిని మతోన్మాదులుగా చిత్రిస్తున్నారు. ఆ చిత్రణ పట్ల ఆగ్రహంతో మిడిల్ ఈస్ట్ మానిటర్ పత్రికలో లాతుఫ్ వేసిన ఈ కార్టూన్ ఇజ్రాయిల్ మతోన్మాదం గురించి వ్యంగ్యంగా చిత్రిస్తుంది. మరతుపాకి ధరించి, గాజాను రక్తసిక్తం చేస్తున్న సైనికుడు జూయిష్ స్టేట్ ఇన్ ఇజ్రాయిల్ అండ్ ది లెవాంత్ అనే యూదు మతోన్మాద పతాక ధరించి ఉన్నాడు.





❖ **చేగువేరా** – జీవితం – ఉద్యమం – కందిమళ్ల ప్రతాపరెడ్డి – విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ – 154 పేజీలు, 1/8 డెమీ, రు. 90, ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, గిరిప్రసాద్ భవన్, బండ్లగూడ (నాగోల్), జీఎస్ఐ (పోస్ట్) హైదరాబాద్ – 68; ఫోన్: 24224458, 24224459; email: visalaandhraph@yahoo.com



❖ **గదర్ విప్లవం** – కందిమళ్ల ప్రతాపరెడ్డి – మానస్ పబ్లికేషన్స్ – 112 పేజీలు, 1/8 డెమీ, రు. 70, ప్రతులకు : మానస్ పబ్లికేషన్స్, 69 (1-7-18/8) ఆజమాబాద్, హైదరాబాద్ – 500020; సెల్ : 98490 81212; విశాలాంధ్ర బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు



❖ **అనుపమ** – కవిత్వం – బండ్ల మాధవరావు – సాహితీ మిత్రులు – 112, పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: సాహితీ మిత్రులు, 28-10-16, మస్జిద్ రోడ్, అరుండల్‌పేట్, కారల్‌మార్క్స్ రోడ్, విజయవాడ – 520002; ఫోన్: 0866-2433359, 09490634849; నవోదయ పబ్లిషర్స్; నవోదయ బుక్‌హౌస్; www.kinege.com



❖ **ఉపాధ్యాయుడి పాఠాలు** – ఆకుల భూమయ్య వ్యాసాలు – నడుస్తున్న తెలంగాణ ప్రచురణ – 463 పేజీలు, 1/8 డెమీ, రు. 200, ప్రతులకు: నడుస్తున్న తెలంగాణ, క్వార్టర్ నెం. ఆర్-9, ఒయు క్వార్టర్స్, ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాద్ – 500 007; నవోదయ; దిశ; సహచర పుస్తకాల షాపులలో



❖ **నమ్మకాలు వమ్మవుతున్నచోట** – కవిత్వం – ఏలేశ్వరం వెంకటేశ్ – స్నేహసాహితి ప్రచురణలు – 112 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: ఏలేశ్వరం శ్రీదేవి, c/o శ్రీ సత్య జువెలర్స్, 19-7-21/1, లక్ష్మీనగర్, గోదావరిఖని – 505209; ఫోన్: 08728-246112, 9849487146



❖ **అమరవీరులారా లాల్‌సలాం! లాల్‌సలాం!!** – అమరవీరుడు కామ్రేడ్ పేరేప మృత్యుంజయుడు (5.10.1914 – 16.5.1950) శత జయంతి సంవత్సరం (1914 – 2014) – 48 పేజీలు, 1/8 డెమీ, వెల లేదు; ప్రతులకు: పి.పి.సి. జోషి, ఫ్లాట్ నెం 122, సెక్టర్ 22ఎ, అలకాపూర్ టౌన్‌షిప్, పుప్పాలగూడ, హైదరాబాద్-89 సెల్: 93466 89306; joshippc@yahoo.co.in



❖ **మానేరు గల గల** – సాహిత్యం – వారాల ఆనంద్ – తెలంగాణ రచయితల సంగం – 118 పేజీలు, 1/8 డెమీ, రు. 75



❖ **బంగారు తెలంగాణలో చలనచిత్రం** – సినిమా వ్యాసాలు – వారాల ఆనంద్ – ప్రోజ్ పొయెట్రీ ఫోరమ్ –60 పేజీలు, 1/8 డెమీ, రు. 60

ఈ రెండు పుస్తకాల ప్రతులకు: ఇందిర రాణి, ఇ.నెం. 8-4-841, హనుమాన్‌నగర్, కరీంనగర్ – 505001; సెల్: 9440501281



❖ **తెలంగాణ రాష్ట్రం** – చరిత్ర ఉద్యమాలు – ఎలికట్టె శంకర్‌రావు – నోముల సాహిత్య సమితి – 303 పేజీలు, 1/8 డెమీ, రు. 200



❖ **నోముల పురస్కార కథలు** – (2012, 2013) – సంపాదకుడు: ఎన్.ఎస్. రజనీశ్ – నోముల సాహిత్య సమితి – 119 పేజీలు, 1/8 డెమీ, రు. 80

ఈ రెండు పుస్తకాల ప్రతులకు: ఎన్.ఎస్. అరుణ, నోముల సాహిత్య సమితి, సాయిటవర్స్, నాగార్జున కాలనీ, నల్లగొండ, తెలంగాణ; సెల్: 7799114349; ప్రముఖ పుస్తకాల షాపుల్లో



❖ **'మద్య'తరగతి 'మందు'హాసం** – (శ్రీశ్రీ సాహిత్యైతి'హాసం') – యాధాటి కాశీపతి – 116 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: శ్రీమతి పుష్పలత యాధాటి, 6-3-1090/సి/202, లక్ష్మీ హోమ్స్, సోమాజీగూడ, హైదరాబాద్-500082; www.kinege.com



❖ **ప్రజా కళలు – సాహిత్యం** – అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య, 24 పేజీలు, 1/8 డెమీ, రు. 30, ప్రతులకు: అరుణోదయ, ఇ.నెం. 2-1-716 (బి-6, ఎఫ్-4) ఎస్‌వీఎస్ స్కూల్ ఎదురుగా, ఒయు రోడ్, విద్యానగర్, హైదరాబాద్-500 044; ఫోన్: 040-27668471




❖ **పాలస్తీనా ప్రజా పోరాటం** – కె. బాలగోపాల్ – మానవ హక్కుల వేదిక ప్రచురణ – 16 పేజీలు, 1/8 డెమీ, రు. 5,



❖ **నక్సలిజంపై రాజ్యం అణచివేత – మూల్యం చెల్లిస్తున్న ఆదివాసులు** – మానవ హక్కుల వేదిక ప్రచురణ – 78 పేజీలు, 1/8 డెమీ, రు. 30



❖ **చుండూరు** – ఒక మారణకాండ తర్వాత – మానవ హక్కుల వేదిక ప్రచురణ – 103 పేజీలు, 1/8 డెమీ, రు. 30




❖ **ట్సుందూర్** – యన్ అట్రాసిటీ అండ్ ఇట్స్ ఆఫ్టర్‌మాత్ – మానవ హక్కుల వేదిక ప్రచురణ – 70 పేజీలు, 1/8 డెమీ, రు. 30

ఈ నాలుగు పుస్తకాలు ప్రతులకు: ఎస్. జీవన్‌కుమార్, 3-12-117/ఎ-2/బి, పి.ఎస్. కాలనీ, గణేష్‌నగర్, రామంతపూర్, హైదరాబాద్-500 013 ఫోన్: 040-27039519, www.humanrightsforum.org

# వర్తమాన చరిత్ర - రాజకీయార్థిక దృష్టి

**బొగ్గుగనుల పందారం – సుప్రీంకోర్టు తీర్పు – కేంద్రం తారుమారు**

రెండున్నర దశాబ్దాలుగా సాగుతూ, రెండు సంవత్సరాల కింద బైటపడి, చిత్రవిచిత్రమైన మలుపులు తిరుగుతున్న బొగ్గు వ్యవహారం దేశ రాజకీయార్థిక స్థితికి, పరిణామాలకు ఒక అద్భుతమైన ప్రతీక. దేశపు సహజ సంపదలలో ప్రధానమైన బొగ్గు నిలువలను ఆశ్రితులకు కట్టబెట్టడంలో సాగిన అపారమైన అవినీతి, వరుసగా ఒక్కొక్క రాజ్యాంగబద్ధ సంస్థనూ విధ్వంసం చేసిన రీతి, చివరికి అత్యున్నత న్యాయస్థానపు తీర్పును తారుమారు చేయడానికి కేంద్ర ప్రభుత్వం ఆర్డినెన్స్ తేవడం దేశ రాజకీయార్థిక వ్యవస్థ గమనాన్ని అర్థం చేసుకోదలచుకున్న వారికి గొప్పవనరు.

దేశంలోని సహజ వనరులను కొల్లగొట్టే రాజకీయార్థిక విధానాన్ని ప్రారంభించినది బ్రిటిష్ వలసవాదం. ముఖ్యంగా భూమిలో నిక్షిప్తమై ఉన్న ఖనిజ వనరులు ఎక్కడెక్కడ ఉన్నాయో సర్వేలు చేసి, ఎన్ని నిలువలు ఉన్నాయో లెక్కలు కట్టి దాదాపుగా అన్నిటికన్నీ బ్రిటిష్ కంపెనీలకో, వాటికి దళారీలుగా పనిచేసే భారతీయుల కంపెనీలకో అప్పగించింది వలసవాద ప్రభుత్వం. ఆ ప్రైవేటు యాజమాన్యపు గనుల్లో అత్యంత దుర్భరమైన పని పరిస్థితులు ఉండినందువల్ల కొంత, జాతీయోద్యమ కాలంలో గనుల్లో బలంగా ఉండిన కార్మికోద్యమం వల్ల కొంత, కొందరు జాతీయోద్యమ నాయకుల్లోనైనా సామ్యవాద భావాలు ఉండడం వల్ల కొంత వలసవాద పాలన అనంతరం గనులను ప్రైవేటు యజమానుల అధీనం నుంచి తప్పించి జాతీయం చేయాలనే ఆలోచనలు వచ్చాయి. దేశంలో ఉన్న చిన్నా పెద్దా ఖనిజాలన్నీ కలిపితే దాదాపు ఇరవై వేల చోట్ల ఖనిజ నిక్షేపాలున్నాయి.

ప్రస్తుతం దాదాపు 2,700 గనుల్లో 90 రకాల ఖనిజాలను తవ్వి తీస్తున్నారు. వీటిలో ప్రధానమైనది బొగ్గు. భారత భూగర్భంలో బొగ్గు ఉన్నదని బ్రిటిష్ వలసవాద పరిశోధకులు పద్దెనిమిదో శతాబ్దంలోనే గుర్తించి, 1774 నాటికి ప్రణాళికాబద్ధమైన తవ్వకాలు చేపట్టడంతో బొగ్గుగనులు ప్రారంభమయ్యాయి. ఆవిరితో నడిచే రైల్వే ఇంజన్ ఉనికిలోకి వచ్చి, అందుకోసం బొగ్గు అవసరం పెరిగిన తర్వాత, అంటే 1850ల తర్వాత దేశంలో బొగ్గు గనులు, గనుల్లో ఉత్పత్తి పెరగడం మొదలయింది. మొదట బ్రిటిష్ ప్రైవేటు పెట్టుబడిదారుల యాజమాన్యంలో మాత్రమే ఉండిన బొగ్గుగనులు, 1910 నాటికి టాటాల వంటి దేశీయ బడా, దళారీ పెట్టుబడిదారుల చేతుల్లోకి కూడ వచ్చాయి.

వలస పాలన అనంతరం నామమాత్రంగానైనా ప్రాచుర్యంలోకి వచ్చిన విధానాల వల్ల గనులు, ఖనిజాల (అభివృద్ధి, క్రమబద్ధీకరణ) చట్టం 1948 వచ్చినా, 1957లో సవరణలతో ఖనిజ రాయితీల నిబంధనలు, ఖనిజ సంరక్షణ, అభివృద్ధి నిబంధనలు వంటి నిర్దేశక సూత్రాలు తయారయినా బొగ్గు గనుల్లో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల యాజమాన్యం, ప్రైవేటు యాజమాన్యం కూడ కొనసాగుతూ వచ్చాయి. చివరికి భారత ప్రభుత్వం 1971లో కోకింగ్ బొగ్గు గనులను, 1973లో నాన్ కోకింగ్ బొగ్గు గనులను జాతీయం చేసింది. అప్పటికీ టాటాల వంటి ఒకటి రెండు ఇనుము, ఉక్కు పరిశ్రమలకు అనుబంధంగా ఉండిన గనులను మినహాయించారు. ఈ చట్టాల ప్రకారం దేశంలోని బొగ్గుగనులన్నీ కోల్ ఇండియా లిమిటెడ్ అనే కేంద్రప్రభుత్వ సంస్థ ఆధ్వర్యంలోకి రాగా, ఆంధ్రప్రదేశ్ లోని గనులు కేంద్ర–రాష్ట్ర ప్రభుత్వాల సంయుక్త సంస్థ అయిన సింగరేణి కాలరీస్ కంపెనీ లిమిటెడ్ ఆధ్వర్యంలో కొనసాగాయి.

నూతన ఆర్థిక విధానాలు మొదలయిన తర్వాత బొగ్గు గనుల జాతీయకరణ తిరోగమనమార్గం పట్టింది. ఆ తర్వాత బొగ్గు గనుల విషయంలో జరిగిన అక్రమాలు, కుంభకోణాలు చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. 1993లో జరిగిన చట్టసవరణ ప్రకారం విద్యుదుత్పత్తి, ఇనుము, ఉక్కు, బొగ్గు శుద్ధి, తదితర పరిశ్రమలకు అనుబంధంగా ప్రైవేటు పారిశ్రామిక, వ్యాపార సంస్థలకు బొగ్గుగనులను అప్పగించ వచ్చునని కేంద్ర ప్రభుత్వం నిర్ణయించింది. నిజానికి ఈ చట్టసవరణకు ఏడాది ముందుగానే, జూలై 1992లో, అంటే నూతన ఆర్థికవిధానాలు మొదలయిన ఏడాదికి ఇనుము, ఉక్కు, విద్యుదుత్పత్తి పరిశ్రమలకు అనుబంధంగా బొగ్గు గనులను కేటాయించడానికి ఒక అభ్యర్థనల పరిశీలక కమిటీని కేంద్ర ప్రభుత్వం నియమించింది. ఆ కమిటీ దేశవ్యాప్తంగా ఇలా లీజుకు ఇవ్వదలచిన 143 బొగ్గు బ్లాకుల జాబితా తయారు చేసి ఆసక్తి ఉన్నవారు దరఖాస్తు చేసుకోవచ్చునని ఆహ్వానించింది. అలా దరఖాస్తు చేసుకున్నవారికి అనుమతి ఇవ్వడానికి పది ప్రాతిపదిక అంశాలున్నాయి గాని అవన్నీ నామమాత్రమైనవే, ఆశ్రిత పక్షపాతానికి, అవినీతికి, కుంభకోణానికి అవకాశం ఇచ్చేవే.

ఇంతకూ ఈ అనుమతి పొందినవారు ప్రభుత్వానికి చెల్లించవలసినది ఏమీ లేదు. అక్షరాలా ఏమీ లేదు. దరఖాస్తు చేసుకున్నవారిలో అర్హత ఉన్నదని పరిశీలక కమిటీ గుర్తించినవారికి ప్రభుత్వం ఆ బ్లాకుకు సంబంధించిన భూభౌతిక పరిశోధనా నివేదిక ఇస్తుంది. ఆ నివేదిక తయారు చేయడానికి ప్రభుత్వానికి అయిన ఖర్చు ఆ కంపెనీవారు ఇస్తే చాలు. అంటే వంద రెండు వందల రూపాయల ఖరీదు చేసే నివేదిక కొనుక్కుంటే కోట్లాది రూపాయల బొగ్గు నిలువల మీద అధికారం సంపాదించవచ్చునన్నమాట. అలా '1993 నుంచి 2005 వరకు బొగ్గు గనులు అప్పగించడానికి నిర్దిష్టమైన మార్గదర్శక సూత్రమేమీ లేదు' అని కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ (కాగ్) నివేదికే స్పష్టం చేసింది. 2005లో బొగ్గు రంగ నిపుణుల కమిటీ బొగ్గు గనులను లీజుకు ఇవ్వడానికి మార్గదర్శక సూత్రాలను సవరించమని, గనులను వేలం వేయమని సూచించింది.

ఆ సిఫారసులు కూడ అమలు కాకుండా బొగ్గు గనుల అప్పగింత

వ్యవహారం ఎంత అక్రమంగా సాగిందంటే భారతదేశపు మొత్తం వార్షిక బొగ్గు వినియోగం డెబ్బై కోట్ల టన్నులు కాగా, 4,400 కోట్ల టన్నుల బొగ్గు ఉత్పత్తికి అనుమతులు ఇవ్వడం జరిగింది. అంటే బొగ్గు ఉత్పత్తి చేస్తామని లీజుకు తీసుకున్నవారు ప్రస్తుతం ఉత్పత్తి చేయకపోయినా, ఆ భూమిని మరొక అవసరానికి వాడినా, బొగ్గు ఉత్పత్తి చేసి నిలువ చేసుకున్నా, లీజు నిబంధన ప్రకారం ఏదో ఒక ఇనుము, ఉక్కు, విద్యుదుత్పత్తి పరిశ్రమకు అనుబంధంగా ఉండకపోయినా ఫరవాలేదన్నమాట. ఆ విధంగా మొత్తం 218 బ్లాకులలో బొగ్గు తవ్వకానికి ప్రభుత్వం అనుమతి ఇచ్చినా వాస్తవంగా తవ్వకాలు నలభై బ్లాకులలో కూడ జరగలేదు. సుప్రీం కోర్టయితే నాలుగు బ్లాకులు మినహా మిగిలిన అనుమతులన్నిటినీ రద్దు చేయాలని తీర్పు ఇచ్చింది.

అయితే ఆ సుప్రీం కోర్టు తీర్పు రావడానికన్న ముందు జరిగిన మరికొన్ని విచిత్రాల గురించి కూడ చెప్పుకోవాలి. ప్రతి సంవత్సరం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ఆదాయ వ్యయాలను పరిశీలించి, వాటిలో జరిగిన లోపాలను ప్రజల ముందుంచడానికి రాజ్యాంగబద్ధంగా ఏర్పాటయిన కంట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ (సిఎజి – కాగ్) అనే సంస్థ ఉంది. రాష్ట్రపతికి మాత్రమే జవాబుదారీగా ఉండే ఈ స్వతంత్ర సంస్థ కేంద్ర ప్రభుత్వ ఖాతాల మీద నివేదికలను రాష్ట్రపతికి, రాష్ట్ర ప్రభుత్వ ఖాతాల మీద నివేదికలను గవర్నర్ కు సమర్పించాలి. ఆ నివేదికలను పార్లమెంటులోనూ, శాసనసభలలోను ప్రవేశపెడతారు. ఈ నివేదికలన్నీ అయిపోయిన వ్యవహారాల మీద పరిశోధనలు కాబట్టి కొంత, రాజకీయ వివాదాల వల్ల కొంత వాటికి ప్రాధాన్యత లేకుండా పోయింది గాని, అవి సాధారణంగా ప్రభుత్వాల అవకతవకల మీద, అక్రమాల మీద విలువైన సమాచారం అందజేస్తాయి.

అలా సమర్పించడానికి తయారయిన ముసాయిదా నివేదికలో బొగ్గు గనులను వేలం వేయకుండా అక్రమంగా అప్పగించడం వల్ల కేంద్ర ప్రభుత్వం పది లక్షల అరవైఏడు వేల కోట్ల రూపాయలు నష్టపోయిందని రాసిన విషయం 2012 మార్చ్ లో పత్రికలకు పొక్కింది. తుది నివేదిక సమయానికి ఆ అంకె ఒక లక్షా ఎనభై ఆరువేల కోట్ల రూపాయలకు తగ్గింది గాని అది అక్రమ వ్యవహారమనే మాట అలాగే ఉండిపోయింది. భారత ప్రభుత్వానికి బొగ్గు గనులను వేలం వేసే చట్టబద్ధ అధికారం ఉందని, అలా వేలం వేసి ఉంటే ఎక్కువ ఆదాయం వచ్చేదని, వేలం వేయకుండా కంపెనీలకు ఇష్టారాజ్యంగా అప్పగించడం వల్ల ప్రజాధనానికి నష్టం జరిగిందని కాగ్ నివేదిక రాసింది. ఆ లీజు అవినీతి వ్యవహారంలో బొగ్గు శాఖ మంత్రులకూ, సుబోధ్ కాంత్ సహాయ్, మధు కోడా వంటి కేంద్ర, రాష్ట్ర రాజకీయ నాయకులకూ, టాటా, జిందాల్ వంటి బడా పారిశ్రామిక, వ్యాపారవేత్తలకూ సంబంధం ఉందని ఆ నివేదిక రాసింది. అప్పటికే కుంభకోణాల ఆరోపణలలో మునిగి ఉన్న యుపిఎ ప్రభుత్వం మీద ఇది మరొక అస్త్రంగా దొరికి, ప్రతిపక్షాలు, ప్రచారసాధనాలు ప్రధానమంత్రి మీద, సంబంధిత శాఖల మంత్రుల మీద విరుచుకుపడ్డాయి. ఈ ఆరోపణలు వచ్చిన కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలలో భారతీయ జనతా పార్టీ కూడ ఉన్నప్పటికీ, అది కేంద్రంలో, పార్లమెంటులో తీవ్రమైన విమర్శలను ఎక్కుపెట్టింది. భాజపా నాయకులు చేసిన ఫిర్యాదు మేరకు కేంద్ర విజిలెన్స్ కమిషన్ ఈ వ్యవహారంపై దర్యాప్తు జరపమని సిబిఐని ఆదేశించింది. ఈ బొగ్గు గనుల అనుమతులు పొందిన కంపెనీలలో తమకు వ్యాపార ప్రకటనలు ఇచ్చే పెద్ద కంపెనీలను పక్కన పెట్టి, చిన్నా చితకా కంపెనీలను ఎంచుకుని పత్రికలు, ఛానళ్లు హడావుడి ప్రారంభించాయి. అప్పుడు కొన్ని వారాల పాటు ఈ బొగ్గు మసి గురించి రాయని పత్రికా, మాట్లాడని ఛానలూ లేదు. కాని అదంతా కేవలం సంచలనాత్మకత కోసమే తప్ప నిజంగా వాస్తవాలు బైటపెట్టడానికి కాదని త్వరలోనే వాటి మౌనం ద్వారా రుజువయింది.

ఈ పత్రికల, ఛానళ్ల వార్తల ఆధారంగా, కొన్ని బొగ్గుగనుల అనుమతులను రద్దు చేయాలని కోరుతూ 2012 సెప్టెంబర్ లో ఎం ఎల్ శర్మ అనే న్యాయవాది సుప్రీం కోర్టులో ప్రజాప్రయోజన వ్యాజ్యం వేశారు. ఆ వ్యాజ్యానికి ప్రశాంత్ భూషణ్ నాయకత్వంలోని కామన్ కాజ్ అనే స్వచ్ఛంద సంస్థ జతకలిసింది. ఈలోగా పార్లమెంటరీ స్టాండింగ్ కమిటీ బొగ్గు గనుల అప్పగింత అక్రమాలు జరిగినది 2005–09 మధ్య మాత్రమే కాదని, 1993 నుంచి 2004 వరకు ఇచ్చిన అనుమతులలో కూడ అక్రమాలు ఉన్నాయని ప్రకటించింది. బొగ్గు గనుల అప్పగింతలో అక్రమాలు జరిగాయని బొగ్గుశాఖ కార్యదర్శిగా తాను 2004లోనే ప్రధాని మన్మోహన్ సింగ్ దృష్టికి తీసుకువచ్చానని, కాని ఏ చర్యా తీసుకోకపోవడం వల్ల ఆ తర్వాత కూడ అక్రమాలు జరిగాయని మాజీ బొగ్గు శాఖ కార్యదర్శి పి.సి. పరఖ్ మరొక సంచలనానికి దారితీశారు.

అలా, సుప్రీంకోర్టు మొత్తంగా 1993 నుంచి 2009 దాకా అన్ని అనుమతులనూ పరిశీలనలోకి తీసుకోవలసి వచ్చింది. ఈలోగా సిబిఐ కేంద్ర కార్యాలయంలో ఈ బొగ్గుగనుల అనుమతుల అక్రమాల కేసుకు సంబంధించిన ఫైళ్లు గల్లంతయ్యాయి. అలా ఎన్నెన్నో మలుపులు తిరుగుతూ సుప్రీంకోర్టు మొత్తంగా 218 బ్లాకులకు సంబంధించిన అనుమతులను పరిగణనలోకి తీసుకుని 2014 జూలైలో ఒక ప్రత్యేక సిబిఐ కోర్టును కూడ నియమించింది. చివరికి 2014 సెప్టెంబర్ 24న ఇచ్చిన తీర్పులో సుప్రీం కోర్టు న్యాయమూర్తులు జస్టిస్ ఆర్ ఎం లోధా, మదన్ బి లోకూర్, కురియన్ జోసెఫ్‌లు ఈ ఇరవై సంవత్సరాలలో వేర్వేరు పార్టీల, కూటములతో ఉన్న కేంద్రప్రభుత్వాల మీద తీవ్రమైన వ్యాఖ్యలతో తీర్పు ఇచ్చారు. 218 బ్లాకులలో 214 బ్లాకుల అనుమతులను రద్దు చేశారు. సుప్రీంకోర్టు తీర్పు వెలువడి నెల కూడ గడవకుండానే, అక్టోబర్ 21న ఆ తీర్పును తారుమారు చేయడానికి, ఆ అక్రమ గనుల లీజుదారులకే మళ్లీ ఆ గనులు కట్టబెట్టడానికి ఎన్‌డిఎ ప్రభుత్వం ఒక ఆర్డినెన్సును తీసుకువచ్చింది. సుప్రీంకోర్టు వ్యాఖ్యలకు గురైన పాత అక్రమ కంపెనీలు కూడ కొత్తగా దరఖాస్తు చేసుకోవడానికి అర్హులేనని నిస్సిగ్గుగా రాసింది.

భారత రాజకీయార్థిక వ్యవస్థ ఎంత అక్రమాల పుట్టగా ఉన్నదో, అన్ని రాజకీయ పక్షాలకూ సంబంధం ఉన్న బొగ్గు మంత్రిత్వశాఖ, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు, ప్రధానమంత్రి కార్యాలయం, కాగ్, సిబిఐ, సుప్రీంకోర్టు, ప్రచారసాధనాలు మొదలైన అన్ని నిర్మాణాలూ భారత ప్రజల సంపదను కొల్లగొట్టే మహాయజ్ఞంలో ఎట్లా భాగం పంచుకుంటున్నాయో సవివరంగా చూపే కథ ఇది. వీ

# పాలకుల 'అభివృద్ధి' ఫలితమే హుదూద్

*హుదూద్ బీభత్సం ఉత్తర కోస్తా మూడు జిల్లాలను తీవ్రంగా దెబ్బతీసిందనీ, ఈ తుఫాను ప్రకృతి వైపరీత్యాల నుంచి ప్రజలను కాపాడడంలో పాలకుల వైఫల్యాలను మరోసారి ఎత్తిచూపిందనీ అంటున్నారు* **పి.వి. రమణ**

సిటీ ఆఫ్ డెస్టినీ, నవ్యాంధ్రప్రదేశ్ ఆర్థిక, పర్యాటక రాజధానిగా వర్ణించబడుతూ, అమెరికా అధ్యక్షుడు ఒబామాతో భారత ప్రధాని మోడీ జరిపిన చర్చల సందర్భంగా ప్రస్తావించిన స్మార్ట్‌సిటీ విశాఖ నగరం... నేడు హుదూద్ తుఫాన్ కారణంగా విదేశీ దండయాత్ర తర్వాత ధ్వంసమైన నగరంగా మారిపోయింది.

పచ్చని చెట్లతో కనువిందుచేసే విశాఖ నగరంలో ఇప్పుడు నిలువనీడ కరువైపోయింది. ఏ రోడ్డు, ఏ వీథి చూసినా నిండుగా కనిపించే లక్షలాది చెట్లు నేడు మోడు బారిపోయాయి. విశాఖ అనగానే ఎవరికైనా గుర్తొచ్చేది సముద్ర తీరం, పచ్చని చెట్లు. ఏపుగా పెరిగిన చెట్లు, భారీ వృక్షాలు రోడ్ల మీద నడిచే వారందరికీ చల్లని నీడనిచ్చేవి. కాసేపు ఎండలో నడిచినా, కొంత దూరం వెళ్లిన తర్వాత ఏదో చెట్టు కిందకు చేరి సాంత్వన పొందేవారు. నేడు ఆ పరిస్థితి పూర్తిగా మారిపోయింది.

అటు కొండలు, ఇటు సముద్ర తీరం. సహజసిద్ధమైన అందాలను సంతరించుకున్న యారాడ కొండ, దిక్కుల్ని చూపే లైట్ హౌస్, పారిశ్రామిక ప్రాంతంగా పేరుగాంచిన పోర్టు, స్టీల్ ప్లాంట్, షిప్‌యార్డ్, నేవల్ డాక్‌యార్డ్, బిఎచ్‌పివి, కోరమండల్ అన్నీ నిస్తేజంగా మారిపోయాయి. కాంక్రీట్ జంగిల్‌గా మారిన సిటీ నిజస్వరూపం బయటపడింది.

హుదూద్ తుఫాన్ అక్టోబర్ 11 (శనివారం) రాత్రి విశాఖపట్నంకు 210 కిలోమీటర్ల దూరంలో ఆగ్నేయ దిశలో కేంద్రీకృతమై, స్థిరంగా ప్రయాణిస్తూ ఆదివారం ఉదయం తీరం సమీపానికి చేరుకుంది. శనివారం అర్ధరాత్రి నుండి తుఫాన్ విధ్వంసం పెరుగుతూ వచ్చింది. ఆదివారం ఉదయం 11.25కు విశాఖ నగరానికి 30 కిలోమీటర్ల దూరంలో పశ్చిమ వాయవ్య దిశలో పూడిమడక వద్ద తీరాన్ని తాకింది. 11.40కి తుఫాన్ కేంద్రం తీరాన్ని దాటింది. తీరాన్ని తాకే ముందు కొద్ది సేపు గాలి, వర్షం ఆగాయి. కాని మరికొంత సేపటికే మహోగ్రంగా విరుచుకుపడింది. శనివారం రాత్రి నుండే తుఫాను గాలుల్లో ఇళ్ల తలుపులు, కిటికీలు కొట్టుకొని విరిగిపోయాయి. లక్షలాది మంది రాత్రంతా నిద్ర లేక బితుకు బితుకుమని గడిపారు. ఆదివారం తెల్లవారుజాము నుండి గాలి 150 కిలోమీటర్ల వేగం అందుకుంది. విశాఖపట్నంకు తుఫాను 80 కిలో మీటర్ల దూరంలో ఉండగా గాలి 180 కిలోమీటర్ల వేగం అందుకుంది. దానితో చెట్లు, విద్యుత్ స్తంభాలు, సెల్ టవర్లు, ఇళ్ల పైకప్పులు, భారీ హోర్డింగులు కుప్పకూలిపోయాయి. ఎటుచూసినా భయం. కుంభవృష్టి. వందల సంవత్సరాల వయస్సు ఉన్న భారీ వృక్షాలు కూడా కూకటివేళ్లతో పెకిలించబడి ఒరిగిపోయాయి.

180-200 కిలోమీటర్ల వేగంతో వీచిన పెనుగాలులకు తోడు భారీ వర్షం కుండపోతగా పడడంతో రహదారి మార్గాలన్నీ బంద్దై పోయాయి. రైళ్లు, విమానాలు ఆగిపోయాయి. ప్రజలు ఇళ్లలోంచి కదలలేని పరిస్థితి ఏర్పడింది. అపార్ట్‌మెంట్‌లలో ఉన్న వారు తీవ్రమైన భయంతో గడిపారు. కొన్ని అపార్ట్‌మెంట్‌లు కంపించాయని కూడా చెప్పుకున్నారు. పాకలు, షెడ్‌లు ఎగిరిపోయాయి. ఇళ్లల్లో కిటికీలు, అద్దాలు బద్దలైపోయాయి. అనేక చోట్ల ప్రహరీగోడలు కూలిపోయాయి. పెట్రోల్ బంకులన్నీ ధ్వంసం అయ్యాయి.

సముద్రపు అలలు 3 నుండి 9 మీటర్ల వరకూ ఎగిసిపడ్డాయి. తీర ప్రాంతాలైన రుషికొండ, సాగర్‌నగర్, జాలారిపేట, గంగవరం ప్రాంతాల లోకి సముద్రపు నీరు చొచ్చుకువచ్చి మత్స్యకారుల పడవలు, వలలు కొట్టుకుపోయాయి. తుఫాన్ హెచ్చరిక కేంద్రం కూడా దెబ్బతింది. రాడార్ కేంద్రంలోకి వర్షపునీరు రావడంతో తాత్కాలికంగా మూసివేశారు. రాడార్ కేంద్రానికి, తుఫాన్ హెచ్చరిక కేంద్రానికి సంబంధాలు తెగిపోయాయి.

**తుఫాన్ సృష్టించిన విధ్వంసం**

ఉత్తరాంధ్రలో 10 లక్షలకు పైగా చెట్లు నేలకూలిపోయాయని అంచనా. విశాఖ జిల్లాలో మొత్తం భూభాగంలో 48 శాతం అడవులు ఉన్నాయి. విశాఖ నగర పరిధిలోని 72 వార్డులలో 65 వార్డులు తుఫాన్ బీభత్సానికి గురయ్యాయి. వైజాగ్ స్టీల్‌ప్లాంట్‌కు విద్యుత్ సరఫరా చేసే 15 టవర్లు కుప్పకూలిపోయాయి. ప్లాంట్‌కు చెందిన 3,600 హెక్టార్ల స్థలంలో 40 శాతం ఆవరించి ఉన్న 50 లక్షల చెట్లలో అధిక శాతం నాశనమయ్యాయి. ఫిషింగ్ హార్బర్‌లో పెను విధ్వంసం కారణంగా 60 మరబోట్లు నీటిలో మునిగిపోయి ధ్వంసమయ్యాయి. 250 బోట్లు పాక్షికంగా ధ్వంసమయ్యాయి. గ్రేటర్ విశాఖలో ఉన్న 135 పార్కులలో అత్యధిక శాతం నాశనమయ్యాయి. గాజువాక, పెదగంట్యాడ, ఇతర పారిశ్రామిక వాడల్లో 1300 చిన్నా, మధ్యతరహా పరిశ్రమలున్నాయి. వాటిల్లో 90 శాతం భవనాల పైకప్పులు ఎగిరిపోయి భారీ నష్టం సంభవించింది.

ఉత్తరాంధ్రలో 74 విద్యుత్ టవర్లు నాశనమయ్యాయి. 3 జిల్లాలలో విద్యుత్ సరఫరాకు సంబంధించిన 400 కె.వి. టవర్లు 34, 200 కె.వి. టవర్లు 20, 132 కె.వి. టవర్లు 20 ఒకేసారి పడిపోవడం దేశ చరిత్రలోనే ప్రథమమని ఇంధనశాఖ ముఖ్య కార్యదర్శి అజయ్‌జైన్ అన్నారు. డిస్ట్రిబ్యూషన్‌కు రు. 700 కోట్లు, ట్రాన్స్‌కోకు రు. 300 కోట్లు నష్టం వాటిల్లిందని చెప్పారు.

విశాఖకు 70 కిలోమీటర్ల దూరంలో ఉన్న రాంబిల్లి మండలం సముద్ర తీర ప్రాంతాన దేశంలోనే మొట్టమొదటి అత్యాధునిక నేవల్ బేస్ ఏర్పాటుకు నిర్ణయించారు. ఇక్క నుండి యుద్ధ విమానాలను కూడా నడపడానికి అవసరమైన నిర్మాణాలను చేపట్టాలని ప్రణాళికలున్నాయి. ఎక్కడైతే ఈ నిర్మాణం చేయదలుచుకున్నారో ఆ ప్రాంతమంతా తుఫాన్ తాకిడికి ధ్వంసమైపోయింది. రోడ్డు సౌకర్యాలు నాశనం కావడంతో చిక్కుకుపోయిన వేలాదిమంది గ్రామస్తులకు హెలికాప్టర్ల ద్వారా ఆహారాన్ని అందించారు. విశాఖలో ఉన్న నేవల్‌బేస్‌కు తుఫాన్ కారణంగా రు. 2000 కోట్లు నష్టం వాటిల్లిందని అధికారులు చెప్పారు. 'ఈ ప్రాంతంలో పరిశ్రమలైనా, నేవీ నిర్మాణాలైనా ఏర్పాటు చేసే ముందు మరింత లోతుగా ఆలోచించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఇంతవరకు విశాఖలో భద్రంగా ఉంటుందనుకున్న అభిప్రాయం ఈ హుదూద్ తుఫాన్‌తో మారిపోయింది' అని మాజీ నేవీ కమాండర్, సెంటర్ ఫర్ పాలసీ స్టడీస్ విశ్లేషకులు సి. ఉదయభాస్కర్ వ్యాఖ్యానించారు.

అరకు వెళ్లే రహదారి పూర్తిగా ధ్వంసమైంది. పలుచోట్ల భారీ వృక్షాలు కూలిపోయి రోడ్లకు అడ్డంగా పడ్డాయి. గెడ్డలన్నీ పొంగిపొర్లాయి. కొండచరియలు పడి అరకు లోయలో ఐదుగురు గిరిజనులు సజీవ సమాధయ్యారు. పది రోజుల తరువాత మరో మూడు శవాలు బయట పడ్డాయి. ఏజెన్సీలో మిరియాలు, కాఫీ తోటలు ధ్వంసమయ్యాయి. వాటి విస్తీర్ణం 3,400 హెక్టార్లు. కాఫీ తోటలకు రక్షణగా ఉండే 65 వేల టేకు చెట్లు వేళ్లతో సహా పెకిలించబడ్డాయి. రుషికొండ ఐ.టి. సెజ్‌లో సెప్టెంబర్ 29న రు. 23.5 కోట్లతో నిర్మించిన ఇంక్యుబేషన్ సెంటర్‌ను రాష్ట్ర ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు అట్టహాసంగా ప్రారంభించారు. పూర్తిగా అద్దాలతో నిర్మించిన ఈ భవనం ధ్వంసమైంది. అనేక ఇతర ఐటి కంపెనీలో కంప్యూటర్లు ధ్వంసమయ్యాయి.

నగరంలో ఉన్న 741 మురికివాడల్లో నివసిస్తున్న ప్రజల పరిస్థితి మరీ దారుణంగా ఉంది. వారు నివసిస్తున్న తాటాకుల ఇళ్లు, రేకుల షెడ్లు గాలికి ఎగిరిపోయి నిలువనీడ లేక నీరు, ఆహారం లాంటి కనీస అవసరాలు అందక తీవ్రమైన ఇబ్బందులు పడ్డారు. చెట్ల కిందే 80వేల మంది చిరు వ్యాపారులు జీవించేవారు. వారి జీవితాలు చెల్లాచెదురై పోయాయి. టీ, టిఫిన్లు, మినీ మీల్స్, కళ్లజోళ్లు, టోపీలు, చెరుకురసం బండ్లు లాంటి వ్యాపారాలతో సామాన్య ప్రజలకు అందుబాటులో ఉండేవి వీరి వ్యాపారాలు. కాని నేడు వారి వ్యాపారాలు ఎక్కడి నుండి చేయాలో తెలియని అయోమయ పరిస్థితిలో పడ్డారు. పాన్‌షాపులు నాశనమయ్యాయి. వీధుల్లో కూరగాయలు, పండ్లు అమ్మే తోపుడు బండ్లు నాశనమయ్యాయి. వీటిపై ఆధారపడే వేలాదిమంది ప్రజల బతుకులు రోడ్డున పడ్డాయి. 15 వేల భవన నిర్మాణ కార్మికుల కుటుంబాలు పనుల్లేక పస్తులుంటున్నారు. వీరిలో అధికశాతం పొరుగు జిల్లాలైన విజయనగరం, శ్రీకాకుళం నుంచి వలస వచ్చినవారే.

తుఫాను కారణంగా ప్రభుత్వ ఆసుపత్రి కె.జి.హెచ్‌లో చికిత్స పొందుతున్న రోగులు వైద్యం సరిగ్గా అందక ఆదివారం నాడు ఆరుగురు, సోమవారం నాడు తొమ్మిది మంది, మంగళవారం పన్నెండు మంది, బుధవారం ఐదుగురు చనిపోయారు. ప్రభుత్వ అంచనాల ప్రకారం 2,250 కిలోమీటర్ల జాతీయ రహదారులు, 3,176 కిలోమీటర్ల పంచాయితీ రహదారులు, 648 కిలోమీటర్ల మున్సిపల్ రోడ్లు ధ్వంసమయ్యాయి.

గ్రేటర్ విశాఖలో దాదాపు 3 లక్షల చెట్లు నాశనమయ్యాయని హార్టికల్చర్ అధికారి దామోదర్ రావు చెప్పారు. ఉత్తరాంధ్ర, తూర్పుగోదావరి జిల్లాలలో 20.93 లక్షల కుటుంబాలు తుఫాను బీభత్సానికి ప్రభావితమయ్యాయని ప్రభుత్వం తెలిపింది. మత్స్యకారుల పడవలు 1,110, తెప్పలు 698, వలలు 2,129 ధ్వంసమైనట్లుగా మత్స్యశాఖ అధికారులు తెలిపారు. 80 ప్రైమరీ, 237 సెకండరీ స్కూళ్లు దెబ్బతిన్నాయని విద్యాశాఖాధికారులు తెలిపారు. ఉత్తరాంధ్ర 3 జిల్లాల్లో 443 ఆవులు, 1070 గేదెలు, 665 గొర్రెలు, 2525 మేకలు చనిపోయినట్లు తెలిపారు. లక్షల సంఖ్యలో కోళ్లు చనిపోయాయి. 1.44 లక్షల హెక్టార్ల భూముల్లో పంటలపై ప్రభావం చూపడం వలన 2.30 లక్షల టన్నుల ఆహార ధాన్యాల ఉత్పత్తికి నష్టం వాటిల్లిన పరిస్థితి ఏర్పడిందని అధికారులు వివరించారు.

శ్రీకాకుళం జిల్లాలో వంశధార, నాగావళి నదులలో వరద ప్రమాద స్థాయికి మించిపోయింది. 31 గ్రామాలు జలదిగ్బంధంలో చిక్కుకున్నాయి. 50 ఇళ్లు నేలమట్టం అయ్యాయి. 12మంది చనిపోయారు. 60 వేల హెక్టార్ల భూమిలో వరి పంట దెబ్బతింది. రణస్థలం మండలంలో 18 వందల ఎకరాల్లో కొబ్బరి చెట్లు, 1300 ఎకరాల్లో అరటి, 1000 ఎకరాల్లో జీడి తోటలు ధ్వంసమయ్యాయి. కొవ్వాడ, జీరుకొవ్వాడ, మత్స్యలేశం తదితర తీర గ్రామాల్లో ఇళ్లన్నీ నేలమట్టమయ్యాయి. చేపల బోట్లన్నీ ధ్వంసమయ్యాయి. ఇలాంటి ప్రకృతి బీభత్సానికి గురయ్యే ప్రాంతంలోనే ప్రమాదమని తెలిసి కూడా అణువిద్యుత్ ప్లాంటును నిర్మిస్తామంటున్నారు మన పాలకులు.

విజయనగరం జిల్లాలో వేల సంఖ్యలో తాటిచెట్లు నేలకూలాయి. 13,685 ఇళ్లు కూలిపోయాయి. 8 మంది చనిపోయారు. 650 ఇళ్లు పాక్షికంగా దెబ్బతిన్నాయి. 636 చెరువులకు గండ్లు పడ్డాయి. వాగులు, వంకలు పొంగిపొర్లాయి. దాదాపు 140 చేపల బోట్లు, 250 వలలు సముద్రంలోకి కొట్టుకుపోయాయి. అనేక లోతట్టు ప్రాంతాలు నీటిలో మునిగిపోయాయి. దాదాపు 46 వేల హెక్టార్లలో వరి పంట, 3,810 హెక్టార్లలో చెరుకు, 1,853 హెక్టార్లలో ఉద్యానపంటలు దెబ్బతిన్నాయి.

తూర్పుగోదావరి జిల్లా వ్యాప్తంగా తుఫాన్ ప్రభావం పెద్దగా లేకపోయినప్పటికి తీర ప్రాంతాలైన ఉప్పాడ, కొత్తపల్లి, కాకినాడ రూరల్, తొండంగిలతో సహా 16 మండలాలలోని 78 గ్రామాలు తుఫాన్ తాకిడికి గురయ్యాయి. కొత్తపల్లి మండలం, కోనపాపపేటలో శనివారం రాత్రి నుంచే సముద్రపు అలలు 15మీటర్ల ఎత్తున ఎగసిపడడంతో 50 ఇళ్లు సముద్రంలో కలిసిపోయాయి. మరో 25 ఇళ్లు ధ్వంసమయ్యాయి. తొండంగి మండలంలో సముద్రం 30 మీటర్లు ముందుకు వచ్చింది.

**విధ్వంసానికి బాధ్యులెవరు?**

మన దేశంలో ఉన్న 7,516 కిలోమీటర్ల తీరప్రాంతంలో 5,700 కిలోమీటర్ల ప్రాంతంలో తుఫాన్లు, సునామీలు సంభవించే పరిస్థితులున్నాయి. భారీ నిర్మాణ కార్యక్రమాలు, పెరిగిపోతున్న పట్టణీకరణ, భూతాపం, రక్షణ కల్పించే మడఅడవులు, సరుగుడు చెట్ల తొలగింపు లాంటి కారణాల వల్ల పెరిగిపోయిన ఉష్ణోగ్రతలు హుదూద్ తుఫాన్ తీవ్ర బీభత్సానికి కారణమయ్యాయని నిపుణులు అంటున్నారు.

జూన్ 2014లో విశాఖ జిల్లాలో కేవలం వడదెబ్బ కారణంగానే 204 మంది చనిపోవడం పెరుగుతున్న ఉష్ణోగ్రతల ప్రభావం ఏ స్థాయిలో ఉందో అర్థమవుతుంది.

'1987లో తుఫాన్ వచ్చినా అది భీమిలి దగ్గరలో దాటింది. ఉధృతమైన పట్టణీకరణ వలన నగరంలో పెరిగిన తీవ్రమైన వేడి కారణంగానే హుదుద్ విశాఖపై దాడిచేసింది. నగరంలో ఉష్ణోగ్రతలు పెంచే ఏ కార్యక్రమాలైనా మరింత తీవ్రమైన ప్రకృతి బీభత్సాలు సృష్టిస్తాయనడానికి దీనిని ఒక హెచ్చరికగా తీసుకోవాలని' గతంలో వాతావరణ శాఖాధికారిగా పనిచేసిన ఎస్.వి. రావు అన్నారు. 'ప్రకృతి బీభత్సాలకు ప్రభావితమయ్యే ప్రాంతాలలో 40 శాతం ప్రాంతీయ ఉష్ణోగ్రత పరిస్థితులే కారణమని' జె.ఎన్.టి.యు. ప్రొఫెసర్, పర్యావరణ విశ్లేషకులు మురళీకృష్ణ అన్నారు. 'పర్యవసానాలను లెక్కచేయకుండా చేసే పట్టణీకరణను నియంత్రించాలని 1988లో కేంద్రప్రభుత్వం కోస్టల్ జోన్ మేనేజ్‌మెంట్ చట్టాన్ని తెచ్చింది. దీనికోసం జాతీయ కోస్టల్ జోన్ మేనేజ్‌మెంట్ అథారిటీని కూడా ఏర్పాటు చేసింది. అయినా ఆ చట్టాన్ని సరిగ్గా అమలు చేసిన దాఖలాలు లేవు' అని కూడా అన్నారు.

'వాతావరణ శాఖ రికార్డుల ప్రకారం దేశంలో 1891 నుండి వచ్చిన తుఫాన్‌లలో నేరుగా నగరాన్నే ధ్వంసం చేసిన మొట్టమొదటి తుఫానుగా హుదుద్‌ని చెప్పుకోవచ్చు. సాధారణంగా తుఫాన్‌లు ప్రయాణిస్తూ ఎక్కడ వేడి ప్రాంతాలుంటాయో అక్కడ తీరాన్ని దాటుతాయి. విశాఖలో అదే జరిగింది. అక్టోబర్ 19 వరకూ వచ్చిన సమాచారాన్ని విశ్లేషిస్తే, నవంబర్‌లో మరిన్ని భారీ తుఫాన్‌లు రావడానికి అవకాశం కనిపిస్తుంది. నవంబర్‌లో వీచే తూర్పు గాలులతో పాటు పెరిగిపోయిన సముద్రపు వేడి దీనికి తోడ్పడతాయి. విశాఖలో ఇంకా ఉష్ణోగ్రతలు, కాలుష్యం పెరగడం జరిగితే విశాఖకు మరిన్ని తీవ్రమైన తుఫానులు వచ్చే అవకాశం ఉంది' అని భారత వాతావరణ శాఖ డైరెక్టర్ కె. సీతారాం అన్నారు.

'హుదుద్ తుఫాన్ మనకో గుణపాఠం. ప్రకృతి నియమాలను, చట్టాలను గౌరవించాల్సిన అవసరం మనకు తెలియజెప్పింది. గతంలో సముద్ర తీరం వెంబడి దట్టమైన మడ అడవులు, సరుగుడు చెట్లూ ఉండేవి. తుఫాన్‌లు, ఉప్పెనలు వచ్చినప్పుడు అవి నష్టతీవ్రతను తగ్గించేవి. అభివృద్ధి పేరుతో విచక్షణా రహితంగా చెట్లు కొట్టేయడం వల్లే ఇంత భారీ నష్టం వాటిల్లింది. శ్రీకాకుళం నుండి నెల్లూరు వరకూ తీరం వెంబడి మడ అడవులు, సరుగుడు చెట్లు పెట్టనికోటలా ఉండేవి. సునామి వచ్చినప్పుడు మచిలీపట్నం ప్రాంతంలో చాలా తీరప్రాంత గ్రామాలను మడఅడవులే కాపాడాయి. తూర్పు కనుమల్లో ఉన్న చెట్లు పెనుగాలుల్ని అడ్డుకునేవి. అభివృద్ధి పేరుతో అడవుల్ని హరించడంతో ఇప్పుడు ఇబ్బందులు తప్పడం లేదు. తీరం నుండి 500 మీటర్ల వరకూ బోర్ వెల్స్ కూడా వేయరాదని సి.ఆర్.జెడ్ చట్టం చెపుతుంది. దాన్ని పట్టించుకోకుండా తీరం వెంబడి బోర్‌లు వేసి భూగర్భ జలాలు తోడేస్తున్నారు. దీంతో ఏర్పడిన ఖాళీ ప్రాంతంలోకి ఉప్పునీరు చేరిపోయింది. తీరానికి అతి దగ్గరలో చేస్తున్న భారీ నిర్మాణాల వల్ల భవిష్యత్‌లో ఉప్పెనల వంటివి వస్తే భారీ ప్రాణ, ఆస్తి నష్టం తప్పదు' అని కేంద్ర ఇంధనవరులు, ఆర్థికశాఖ విశ్రాంత కార్యదర్శి ఇ.ఎ.ఎస్. శర్మ అన్నారు. ఇప్పటివరకూ పరిశ్రమల నుండి వచ్చే కాలుష్యాన్ని చెట్లు నియంత్రిస్తుండేవి. అలాంటి చెట్లు మొత్తం ధ్వంసం కావడంతో కాలుష్య తీవ్రతకు అడ్డుకట్ట వేసే సాధనాలు లేవు. దీంతో ఉష్ణోగ్రతలు మరింత పెరిగే ప్రమాదముందని నిపుణులు హెచ్చరిస్తున్నారు.

తీరప్రాంతాల ఇసుక నేలల్లో మడఅడవులు పెరుగుతాయి. వీటివల్ల తీరప్రాంత భూమి కోతకు గురవకుండా ఉండడమే కాకుండా, భూభాగంపై తుఫానుల తీవ్రత పెరగకుండా కూడా కాపాడతాయి. సముద్రపు అలలు ఎక్కువ ఎత్తు లేవకుండా అదుపు చేస్తాయి. సముద్ర భాగం ముందుకు చొచ్చుకు రాకుండా, తీరంలోని మత్స్యకార గ్రామాలను కాపాడతాయి. 10 సంవత్సరాల క్రితం మన రాష్ట్రంలోని తీరం వెంబడి 582.66 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణంతో ఉన్న కోరంకి అభయారణ్యం నేడు 40 శాతానికి తగ్గిపోయింది. ప్రధానంగా తూర్పు, పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలో మడ అడవులు ఎక్కువగా అంతరించి పోయాయి. ఆక్వాసాగుకు పెద్దఎత్తున చెరువులు తవ్వడమే దీనికికారణం.

ది ఎనర్జీ అండ్ రిసోర్సెస్ ఇన్‌స్టిట్యూట్ (టెరి) నిర్వహించిన అధ్యయనం ప్రకారం విశాఖపట్నంపై 20 అడుగుల ఎత్తున సముద్ర అలలు ఎగసిపడే ప్రమాదం పొంచి ఉందని చెపుతూ 'వాతావరణాన్ని తట్టుకోగల కోస్తా నగరాలు' అన్న అంశంపై విశాఖపట్నం, గోవాలోని పనాజీ నగరాలపై సంవత్సరం పాటు జరిపిన అధ్యయనానికి సంబంధించిన నివేదికను అక్టోబర్ 10న విడుదల చేసారు. వాతావరణ మార్పులు, ప్రకృతి విపత్తుల నేపథ్యంలో విశాఖపట్నానికి సముద్రం నుంచి పెనుముప్పు ఉందని ఈ నివేదిక తెలిపింది. గత 50 – 60 సంవత్సరాల గణాంకాలు పరిశీలిస్తే ఇప్పటికే విశాఖపట్నంతో పాటు పరిసర ప్రాంతాలలో కూడా సముద్ర మట్టం పెరుగుతుందని, తీరం కోతకు గురవుతుందని చెప్పారు. 2010 సంవత్సరంలో 6 – 13 అడుగుల ఎత్తున అలల్ని చూసిన విశాఖ ఇకముందు 20 అడుగుల ఎత్తున అలల్ని ఎదుర్కోవలసి వస్తుందని తెలిపారు. సముద్ర మట్టం ప్రతీ సంవత్సరం అర అడుగు నుండి 3 అడుగుల వరకూ పెరిగే ప్రమాదం ఉందని కూడా హెచ్చరించారు.

మారుతున్న వాతావరణ పరిస్థితులలో విశాఖపట్నానికి పెనుముప్పు వచ్చే ప్రమాదం ఉందని, సముద్ర మట్టం పెరగడంతో పాటు తుఫానులు, ఈదురుగాలులు, భారీ వర్షాలు, సంభవించి నగరాన్ని జలమయం చేస్తుందని, వరదలు వచ్చేందుకు అవకాశాలున్నాయని పేర్కొన్నారు. విమానాశ్రయం, నేవల్ డాక్‌యార్డ్, రైల్వేస్టేషన్‌లతో పాటు జాతీయ రహదారి కూడా లోతట్టు ప్రాంతాలలోనే ఉన్నాయి. ప్రకృతి వైపరీత్యాలు సంభవిస్తే అన్ని రకాల రవాణా వ్యవస్థలు దెబ్బతినే ప్రమాదం ఉందని తెలిపారు. విశాఖలోని పలు వార్డులు నీటమునిగే ప్రమాదముందని, పోర్టు, రైల్వే స్టేషన్, స్టీల్‌ప్లాంట్, ఎన్.టి.పి.సి, గంగవరంతో పాటు అన్ని ప్రకృతి వైపరీత్యాలకు తీవ్రంగా నష్టపోయే ప్రమాదముందని వివరించారు.

**'నేను నుండి మనం'కు...**

ఒకవైపు హుదుద్ అంత విధ్వంసం సృష్టించినా, మరో వైపు అత్యధిక శాతం ప్రజలలో సమష్టితత్వాన్ని బయటకు తెచ్చింది. సెల్‌ఫోన్‌లు పనిచేయలేదు. టీ.వీలు ఆగిపోయాయి. సీరియల్‌లు, సినిమాలు, ప్రచారాల హోరు ఎక్కడా లేవు. మర్చిపోయిన రేడియోలు ఉపయోగ పడ్డాయి. తిరస్కారంగా చూసిన లాండ్‌లైన్ ఫోన్‌లే అందరికీ దిక్కయ్యాయి. కొవ్వొత్తులు, నూనె దీపాలే వెలుగునిచ్చాయి. ఎటువైపు చూసినా అంతులేని విషాదం, కళ్లెదుటే కూలిపోయిన నివాసాలు, నీళ్లు, పాలు, తిండి లేక తిప్పలు, ఇన్ని ఉన్నా మనుషుల్లో ఉన్న సమష్టి కృషి చైతన్యాన్ని తుఫాన్ పరిస్థితి అద్భుతంగా ఆవిష్కరించడం గుర్తించాలి. చెట్లూ, ఎలక్ట్రిక్ స్తంభాలు, వైర్లు తెగి పడిపోయి వీథులన్నీ కుప్పలు

కుప్పలుగా నిండిపోయి నడవలేని పరిస్థితి ఏర్పడినప్పుడు వాటిని తొలగించడానికి సాధారణ మనుషులు అపురూపమైన సమష్టి కృషిని ప్రదర్శించడం అపూర్వం. కరెంటు లేకపోయినా, టీవీలు లేకపోయినా మనుషులు కాలాన్ని గడపగలిగారు. తోటి మనుషులతో, కుటుంబ సభ్యులతో మనసు విప్పి మాట్లాడుకున్నారు. పక్కవారికి సహాయం చేయడానికి ప్రతి ఒక్కరూ సిద్ధపడడం, అనేక చోట్ల ఎప్పుడూ పక్కవారితో మాట్లాడని వాళ్లు కూడా తమ భయాలను, సందేహాలను పంచుకుంటూ మానసిక ధైర్యాన్ని పొందడం కనబడింది. వ్యక్తి నుండి సమిష్టికి పరిణామంలో ఎంత అద్భుత శక్తి వుంటుందో అనుభవంలోకి వచ్చింది.

వేగంగా విస్తరించిన ఆధునిక సాంకేతిక విజ్ఞానం, ప్రకృతి ప్రళయం ముందు మోకరిల్లింది. స్విచ్ నొక్కితే చాలు అన్ని సౌఖ్యాలూ కాళ్ల దగ్గరకి రావడమే గొప్ప అనుకునే నగర వాసులకు, అవి లేకపోతే బతకలేమని వాదించే వాళ్లకు గొప్ప కనువిప్పు అయింది. మనుషుల మధ్య సజీవ సంబంధాలను తెంచేసిన సామ్రాజ్యవాద సంస్కృతికి ప్రత్యమ్నాయమైన సమష్టి కార్యాచరణతో పాటు సాంకేతిక విజ్ఞానానికి పూర్తిగా బానిస కాకూడదనే జ్ఞానాన్ని కూడా ఇచ్చిన తుఫాన్‌గా హుదూద్‌ను గుర్తుంచుకోవాలి.

**విధ్వంసానికి కారణమైన అభివృద్ధి నమూనాను వదలమంటున్న పాలకులు**

విశాఖను రక్షించుకోవాలంటే సముద్రతీరాన్ని రక్షించుకోవాలని, సి.ఆర్.జెడ్ చట్టాన్ని అమలు చేయాలని, మడఅడవులు రక్షించుకోవాలనీ, సరుగుడు చెట్లను నాటాలనీ, నూతన నిర్మాణాలు, పరిశ్రమలు ఆపాలనీ, ఉష్ణోగ్రతలు పెరగకుండా చూడాలనీ ఒకవైపు మేధావులు, శాస్త్రవేత్తలు, సామాజిక వేత్తలు ఘోషిస్తుంటే, మరో వైపు వాటి గురించి ఏమీ మాట్లాడకుండా హుదుద్ బీభత్సానికి కారణమైన అభివృద్ధి నమూనానే మరింత దృఢంగా అమలు చేస్తామని ప్రకటిస్తున్నారు మన పాలకులు.

'వస్తున్నా మీకోసం. సాయమందే వరకూ విశాఖ నుండే పాలన' అని ప్రారంభించిన చంద్రబాబు నాయుడు 'దేశ భవిష్యత్ అంతా తీరప్రాంత నగరాలదే. ప్రపంచంలోని ఏ నగరానికీ శాశ్వతంగా రక్షణ ఉండదు. విపత్తులకు పారిశ్రామిక వేత్తలు భయపడరు. పారిశ్రామిక వేత్తలు కష్టపడాలి. విశాఖపట్నాన్ని మళ్లీ నిలబెట్టాలి. విపత్తును గెలిచాం. భవిష్యత్‌లో ఈ వేగం చాలదు. హైదరాబాద్ కన్నా కసిగా విశాఖను అభివృద్ధి చేస్తా. విశాఖకు కొత్తరూపు తెస్తాను. విపత్తులను తట్టుకోగల భూగర్భ విద్యుత్ లైన్లు, పచ్చదనానికి పునరుద్దరణ, సాగర తీరాన్ని మరింత ఆహ్లాదకరం చేస్తూ ఎలాంటి ప్రకృతి విపత్తునైనా ఎదుర్కొందాం. విశాఖ అభివృద్ధిని ఎవరూ అడ్డుకోలేరు. తుఫానులే భయపడేలా, తుఫాను రహిత నగరంగా నిర్మిస్తాం' అంటూ విశాఖను సామాన్య మానవులకు అందుబాటులో ఉండని అంతర్జాతీయ స్థాయికి తీసుకుపోతానని నొక్కి మరీ చెపుతున్నారు.

ఆందోళనకరమైన పరిస్థితులలో కూడా శ్రీకాకుళంలో పర్యటించి నప్పుడు 'ఇచ్ఛాపురం నుండి నెల్లూరు వరకూ తీరాన్ని ఆనుకుని బ్రహ్మాండమైన అత్యాధునిక నాలుగు రోడ్ల నిర్మాణాన్ని చేపట్టబోతున్నాం. ఇది నాకు ఎన్నాళ్ల నుంచో ఉన్న మధురమైన కల. మన రాష్ట్రంలో తీరం పొడవునా జాతీయ రహదారిని పోలిన అత్యాధునిక రహదారుల్ని నిర్మిద్దాం. సముద్రానికి 500 మీటర్ల దూరంలోనే ఈ రోడ్లను నిర్మిద్దాం. చిన్నా పెద్దా 14 ఓడరేవులు నిర్మాణమైతే పర్యాటకరంగానికి, పారిశ్రామిక రంగ పురోభివృద్ధికి తోడ్పడుతుంది...' అని మాట్లాడుతూ అక్కడే ఉన్న జిల్లా కలక్టర్ గౌరవ్ ఉప్పల్‌కు అందుకవసరమైన భూమిపై దృష్టిపెట్టి లెక్కలు వేయించి నివేదిక పంపాలని ఆదేశించారు.

'ప్రపంచంలో చైనా, జపాన్, కొరియా, తైవాన్ దేశాలలో తుఫాన్ల ముప్పు ఉన్నా అవి ఎంతగా అభివృద్ధి చెందాయో మనం చూశాం. ప్రకృతి వైపరీత్యాల కారణంగా విశాఖపట్నం అభివృద్ధి పరంగా వెనుకబడిపోతుందని అనుకోవడం పొరపాటు. ప్రపంచ చరిత్రలో తీరప్రాంతాలలో ఉన్న నగరాలు వాణిజ్యపరంగా అభివృద్ధి సాధించాయి. విశాఖపట్నం కూడా త్వరలో వాణిజ్య రాజధానిగా రూపొందుతుంది. బ్రాండ్ విశాఖ భద్రం. తుఫాన్‌లో అది చెక్కు చెదరదు. పెట్టుబడులు రావనేది పెద్ద అపోహ' అని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి ఐ.వి.ఆర్. కృష్ణారావు అంటున్నారు.

విశాఖపట్నాన్ని అమెరికా సహాయంతో స్మార్ట్ సిటీగా రూపొందించాలని తీసుకున్న నిర్ణయాన్ని తుఫాన్ సహాయక చర్యల నుండే శ్రీకారం చుట్టాలన్న చంద్రబాబు నిర్ణయానికి ప్రధాని మోడీ సుముఖత తెలుపుతూ 'ఇదొక మంచి ఆలోచన' అని వ్యాఖ్యానించారు. దానికి ప్రక్కనే ఉన్న పట్టణాభివృద్ధి శాఖామంత్రి వెంకయ్యానాయుడు కూడా అంగీకారం తెలిపారు.

ఒకవైపు సి.ఆర్.జెడ్ నిబంధనలను పాటించకపోవడం వల్లనే తీర ప్రాంతం ప్రమాదానికి గురైందని మేధావులు మాట్లాడుతుంటే, జూన్ 15న కేంద్ర పట్టణాభివృద్ధిశాఖ మంత్రి వెంకయ్యానాయుడు తీర ప్రాంతాల్లో అభివృద్ధి కోసం సి.ఆర్.జెడ్. నిబంధనలను సడలించడానికి పరిశీలిస్తున్నామని, ప్రస్తుత సి.ఆర్.జెడ్. నిబంధనలు కఠినతరంగా ఉండడం వల్ల విశాఖతో పాటు దేశవ్యాప్తంగా తీర ప్రాంతాలలో అభివృద్ధికి ఆటంకం ఏర్పడుతుందని, పర్యావరణం పేరిట ప్రగతిని అడ్డుకోరాదని, అదే సమయంలో అభివృద్ధి పేరుతో పర్యావరణానికి చేటు చేయరాదని అన్నారు.

'పెట్టుబడిదారీ విధానం, దాని ఆర్థికవేత్తలు సర్వసాధారణంగా పర్యావరణ సమస్యలను తప్పించుకోవలసిన వాటిగానే చూస్తారు తప్ప, పరిష్కరించవలసిన వాటిగా చూడరు' అన్న నోబెల్ బహుమతి గ్రహీత ఆర్థిక శాస్త్రవేత్త రాబర్ట్ సాలో మాటలు గుర్తుంచుకోవాలి. పెరుగుతున్న భూతాపం కారణంగా ప్రపంచవ్యాప్తంగా ఏర్పడే తుఫానులు, వేడి గాలులు, వరదల వలన కోట్లాది మంది పేదలు, బలహీనులు, వృద్ధులు ప్రమాదంలోకి నెట్టబడతారు. వీరిని రక్షించే సాధనాలేవీ ప్రస్తుత ప్రభుత్వాల దగ్గర లేవు. 2 డిగ్రీల కన్నా భూతాపం పెరిగితే ఏర్పడబోయే దారుణమైన, వెనక్కి తిరిగి రాలేని పరిణామాలు ఎదుర్కోవలసి వస్తుందని శాస్త్రవేత్తలు హెచ్చరించడాన్ని గుర్తు చేసుకోవాలి.

ప్రకృతి వైపరీత్యాల వలన ఎంతో కొంత నష్టం ఉంటుందని అందరికీ తెలుసు. కానీ గతంలో వచ్చినవాటికి, నేడు వస్తున్నవాటికీ పోలికే లేనంత తీవ్రస్థాయిలో నేడు విధ్వంసం జరుగుతుంది. ఒకవైపు సామ్రాజ్యవాద విధానాలు ప్రపంచవ్యాప్తంగా గ్లోబల్ వార్మింగ్‌కు కారణమవుతూ విధ్వంసం సృష్టిస్తుంటే, మరోవైపు వాటినే అనుసరిస్తున్న మన పాలకుల అభివృద్ధి నమూనా ఫలితమే హుదూద్ లాంటి విధ్వంసాలని వేరే చెప్పనవసరం లేదు. ఇంత నష్టం జరిగినా మోడీ, చంద్రబాబులు ఆ విధానాలనే కొనసాగిస్తామని చెప్పడాన్ని వ్యతిరేకించాలి. వీ

*(రచయిత కార్మికోద్యమ నాయకుడు)*

# తుఫాన్ ముప్పు తప్పేది తీర పరిరక్షణతోనే

*పర్యావరణాన్ని విధ్వంసం చేసిన ఫలితమే హుదూద్ అనీ, హుదూద్‌కు ముందు చూపించిన చొరవ తరువాత చూపించకుండా ప్రచారానికే మన పాలకులు పరిమితమయ్యారనీ అంటున్నారు* **దుప్పల రవికుమార్**

అక్టోబర్ 6న అండమాన్‌ను ఆనుకుని ఉన్న సముద్ర ఉపరితలంలో ఏర్పడిన అల్పపీడనం తుఫాను 8వ తేదీ నాటికి తుఫాను గాలిగా మారింది. శాస్త్రవేత్తలు రానున్న ప్రమాదాన్ని ముందే పసిగట్టి హెచ్చరికలు చేశారు. అది సృష్టించనున్న బీభత్సాన్ని ఊహించలేక పోయినప్పటికీ దానికో పేరు పెట్టారు. ఆ పేరు హుదూద్. ఖురాన్‌లో సులేమాన్ కథలో హెచ్చరిక చేయబడ్డ ఈ పక్షిని అశుభశకునంగా భావిస్తారు. ముద్దొచ్చే ఈ హూపోను ఇజ్రాయెల్‌లో జాతీయ పక్షిగా గుర్తిస్తారు. మొత్తానికి, ఇదే మన కోస్తాతీర ప్రాంత ఆర్థిక వ్యవస్థను అతలాకుతలం చేసే మరో తుఫానుగా రూపాంతరం చెందుతుందని శాస్త్రవేత్తలు ఈ తుఫానుకు ఆ పేరు పెట్టినప్పుడు గుర్తించి ఉండరు.

పదో తేదీకల్లా దాని తీవ్రత పెరిగిపెరిగి దారుణ తుఫాను గాలిగా అవతరించి బంగాళాఖాతం అంచున ఉన్న విశాఖపట్నానికి 175 కిలోమీటర్ల వేగంతో చేరుకుంది. పన్నెండో తేదీన విశాఖకు 50 కిమీ దూరంలో ఉన్న పూడిమడక గ్రామం దగ్గర తీరాన్ని దాటేసింది. అప్పటికి గాలుల ఉధృతి గంటకు 190 కిలోమీటర్లకు చేరుకుంది. అక్కడ నుంచి ఆ గాలులు ఉత్తరప్రదేశ్ మీదుగా నేపాల్‌వైపు సాగాయి. ఆయా ప్రాంతాలకు చేరేసరికి గాలులు మేఘాలను కాస్త కరిగించి వర్షాలుగానూ, దేశం దాటినప్పటికి విపరీతమైన మంచు పడడంగానూ మారాయి. ఆంధ్రప్రదేశ్‌లో సాగించిన విధ్వంసం వల్ల సుమారుగా 60 వేల కోట్ల రూపాయల నష్టం వాటిల్లిందని ప్రాథమిక అంచనా.

జన జీవితాన్ని అతలాకుతలం చేసిన ఈ తుఫానును ముందే పసిగట్టి తగినవిధంగా హెచ్చరించిన మన సాంకేతిక అభివృద్ధిని ముందుగా మనం అభినందించాలి. మొత్తంగా తుఫానును మనం ఎదుర్కొన్న తీరులో రెండు దశలున్నాయి. తుఫాను రాక ముందు, వచ్చిన తరువాతగా ఆ రెండు దశల గురించి మాట్లాడుకుంటే మొదటి దశలో ప్రతి అడుగు ఆచితూచి వేసి ప్రాణ నష్టాన్ని, ఆస్తి నష్టాన్ని గణనీయంగా తగ్గించుకో గలిగాం. ప్రతి ఏటా అక్టోబర్ మాసంలో చెప్పి మరీ వస్తున్న ప్రకృతి వైపరీత్యాలను ఎదుర్కొనేందుకు జాతీయ విపత్తుల నివారణ సంస్థను ఏర్పాటు చేసుకుని ఏటికేడాది తుఫానులు వస్తున్నప్పుడు మనం మరింత అప్రమత్తం కాగలగుతున్నాం. సైనిక సిబ్బందిని, అధికారిక సిబ్బందిని తగు విధంగా మోహరించి తుఫాను ప్రమాదాన్ని ఎదుర్కోవడమెలానో నేర్చుకుంటున్నాం. అందుకు అనుగుణంగానే ప్రజలను సైతం మానసికంగా సన్నద్ధం చేస్తున్నాం. దీనికి తగ్గట్టుగానే వాతావరణ శాఖ తుఫాను హెచ్చరికలు అందజేసిన వెంటనే, గాలులు కళింగాంధ్ర తీరాన్ని తాకడానికి ఇరవై నాలుగు గంటల ముందరే రైలు, విమాన సర్వీసులను రద్దుచేసుకున్నాం. జాతీయ రహదారిని దిగ్బంధనం చేశాం. అంతే కాకుండా తీరప్రాంతం పొడుగునా మత్స్యకారులు జీవికకోసం సముద్రంలోకి వేటకు వెళ్లకుండా నిలవరించగలిగాం. ముందే ప్రమాద హెచ్చరికలు తగు విధంగా ప్రజలందరికీ చేరవేయడం వల్లన మూడు రోజులకు సరిపడా ఆహార పదార్థాలు చాలా కుటుంబాలు సిద్ధం చేసుకోగలిగాయి. కేవలం ఈ జాగ్రత్తలు తీసుకోవడం వల్లనే ఉధృతమైన హుదూద్ ఉపద్రవంలో మరణాల సంఖ్యను మూడును మించకుండా చేయగలిగాం.

ప్రకృతి విలయాన్ని నివ్వెరపోయి చూసిన సామాన్యులు, ముఖ్యంగా విశాఖవాసులు 2008లో వచ్చిన నర్గిస్ తుఫాను తర్వాత అంతకు మించిన బీభత్సాన్ని సృష్టించిన హుదూద్ తుఫాను రేపిన గాలులు చేసిన బీభత్సాన్ని ఎప్పటికీ మరవడం సాధ్యం కాదు. పచ్చదనంతో శతాబ్దాలుగా శోభిల్లిన విశాఖనగరం13న ఎవరో కక్షపూని బూడిదరంగు నగరం మీద చిమ్మినట్టుగా మిగిలింది. లక్షల ఎకరాలలో పండుతున్న రకరకాల పంటలను తుఫాను నేలమట్టం చేసేసింది. రెండు రోజుల పాటు ఏం జరుగుతున్నదో ఇక్కడి ప్రజలకు అర్థం కాలేదు. గంటకు దాదాపు రెండు వందల మైళ్ల వేగంతో వీచిన గాలులను నోళ్లు తెరుచుకుని చూస్తుండిపోయారు. చిమ్మచీకటిలో ఆ గాలులు రేపిన ఘోషను మౌనంగా వినుకుంటూ బిక్కచచ్చిపోయారు. వర్షపాతం పెద్దగా నమోదు కాకపోవడం పెద్ద ఉపశమనం. లేదంటే నష్టం ఇప్పటి అంచనాలకు రెట్టింపయ్యేది. పన్నెండో తేదీ మధ్యాహ్నం పన్నెండు గంటలకల్లా తుఫాను ఉపశమించినప్పటికీ పదమూడు తెల్లవారే వరకూ దానిని ఎవరూ నమ్మలేదు. ఎందుకంటే తుఫాను గాలి తీవ్రతకు విశాఖలోని వాతావరణ కేంద్రం పరికరాలు సైతం కొట్టుకుపోయేసరికి సమాచారం కోసం ఇతర దేశాలు అందించే వాతావరణ విశేషాలపైన ఆధార పడవలసిన పరిస్థితి ప్రభుత్వానికి ఏర్పడింది. ఆ తరువాతి క్షణం నుంచే ప్రభుత్వం అందించే సహాయం కోసం ఎదురుచూపులు మొదలయ్యాయి.

శాస్త్రీయ అంశాలమీద ఆధారపడకుండా ఎమోషనల్‌గా నిర్ణయాలు తీసుకునే రాజకీయ నాయకులున్న ప్రస్తుత తరుణంలో నూతనంగా ఏర్పడిన ఆంధ్రప్రదేశ్‌కు ఇంకా రాజధాని ఏర్పడలేదు. ఇంతలో విలయంలా ముంచుకొచ్చిన తుఫాను ముఖ్యమంత్రి చంద్రబాబుకు ఒక చక్కటి అవకాశంగా కనిపించింది. వెంటనే బాబు తన మకాంను విశాఖకు మార్చేశారు. ఆపై వారం రోజులపాటు నాటకీయ ఫక్కీలో ముఖ్యమంత్రి తుఫాను అనంతర సహాయక కార్యక్రమాలను దగ్గరుండి పర్యవేక్షించారు. స్థానిక, జాతీయ మీడియా దృష్టిలో పడడం వరకు ఎంతో విజయం సాధించారు. కాని వారం రోజుల పాటు శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం మూడు జిల్లాల ప్రజలు విద్యుత్తు లేక

అల్లల్లాడిపోయారు. ఒక దశలో కేంద్రం నుంచి తుఫానుల నష్టాన్ని అంచనా వేసే బృందం వచ్చేవరకు సహాయక కార్యక్రమాలు జరగవనే ప్రజలు అనుమానించారు. ఆధునిక జీవనం యావత్తూ విద్యుత్తుపైన ఆధారపడి ఉండడం వలన ఆసుపత్రులలో రోగులు, చిన్నారులు, వృద్ధులు అందరికంటే ఎక్కువగా మహిళలు వారంరోజుల పాటు పడిన కష్టాలు అన్నీ ఇన్నీ కావు. మొత్తంగా తుఫాను అనంతర చర్యలలో ప్రభుత్వం ఘోరంగా విఫలమైందనే చెప్పాలి. స్థానిక నగర పాలక వ్యవస్థ, పోలీసు యంత్రాంగం, స్థానిక పట్టణాభివృద్ధి సంస్థ ప్రజలకు వెంటవెంటనే స్పందించి ఆదుకోవడంలో, సహాయక, పునరావాస కార్యక్రమాలు చేపట్టడంలో, మంచినీరు, విద్యుత్తు పునరుద్ధరణలో దారుణంగా విఫలమయ్యాయి.

తుఫాను విధ్వంసం ధాటికి నష్టపోని రంగమే లేదు. పొలాలలో పంటలన్నీ నేలమట్టం కావడంతో రైతన్న వెన్ను విరిగిపోయింది. విశాఖ హార్బరులో నిల్వచేసిన వేలాది టన్నుల ఎరువులు తడిసి ముద్దయి ఎందుకూ కొరగాకుండా పోయాయి. దీనివల్ల రానున్న రబీ సీజన్‌లో రైతుల ఎరువుల అవసరాలు తీర్చడానికి ప్రభుత్వం ఎంతో కసరత్తు చేయాల్సి ఉంది. విమానాశ్రయంలో సాంకేతిక పరికరాలన్నీ ధ్వంసం అయ్యాయి. స్టీల్‌ప్లాంట్ తదితర పబ్లిక్ రంగ సంస్థలకు అపార నష్టం జరిగింది. కోళ్ల పరిశ్రమ కోలుకోలేని విధంగా నష్టపోయింది. సుందర విశాఖ నగరానికి ఆభరణంగా విలసిల్లిన మహావృక్షాలన్నింటిని కూకటివేళ్లతో పెకలించడం వల్ల నగరం శోభలేనిదిగా మారింది. తీరప్రాంతంలో నివశిస్తున్న జాలరి గ్రామాల ప్రజలు, పట్టణంలోని మురికివాడల్లో బతుకులీడుస్తున్న ప్రజలు తుఫాను దాటికి వారి జీవితాలు అతలాకుతలం అయిపోయాయి. అదీఇదీ అని లేకుండా అన్ని రంగాలలో కడుపు దేవుకుపోయేట్టు, కోలుకోవడానికి ఏళ్లూపూళ్లూ పట్టేటంత నష్టం మిగిల్చింది ఈ హుదూద్ తుఫాను.

తుఫాను ప్రమాదం గట్టెక్కిన వెంటనే విశాఖపట్నంలో ధరలు ఆకాశానికంటేశాయి. పాల ప్యాకెట్ ధర 100 రూపాయలకు, కూరగాయల ధరలు గాయాలు చేసేలా పెరిగిపోయాయి. ఈ విధంగా ప్రకృతి వైపరీత్యాలు సంభవించినప్పుడు ధరలు విపరీతంగా పెంచి లాభాలు పోగేసుకోవాలనుకోవడం మనిషి స్వార్థానికి, దురాశకు నిలువెత్తు నిదర్శనమని చెప్పడంతో సరిపెట్టుకోకూడదు. ఇలాంటి సంఘటనలు జరిగినప్పుడే ఆయా సమాజాలు ఎంతగానో వెనుకబడిన సమాజాలని ప్రపంచానికి చాటిచెప్పే ఉదాహరణలివి. పెద్ద మనసుతో ప్రజలను ఆదుకోవాల్సింది పోయి, ఇదే అదనుగా దోచుకోవాలను కోవడం ఆ ప్రాంతపు ప్రజల వెనుకబాటుతనానికి నిదర్శనం.

పర్యావరణంలో కలుగుతున్న మార్పుల ఫలితంగానే భూకంపాలు తుఫానులు, సునామీలు వంటి ప్రకృతి ఉత్పాతాలు సంభవిస్తున్నాయని శాస్త్రవేత్తలు హెచ్చరిస్తున్నారు. పెరుగుతున్న సాంకేతిక పరిజ్ఞానం ముంచుకొస్తున్న ముప్పును హెచ్చరించగలదే గాని, ప్రజలకు ఎటువంటి సాయం చేయగలిగే పరిస్థితిలో లేదు. దీనిని మనం సమర్థంగా అధిగమించడానికి ప్రభుత్వం అనేక జాగ్రత్తలు తీసుకోవాల్సి ఉంది. 2006లోనే జాతీయ విపత్తుల నివారణ సంస్థ (ఎన్‌డిఎంఎ)ను ఏర్పాటు చేసుకున్నాం. అంతేకాకుండా 2009లో జాతీయ విపత్తుల సహాయ సైన్యాన్ని (ఎన్‌డిఆర్‌ఎఫ్) కూడా మన దేశంలో రూపొందించాం. ప్రతి ఏటా తుఫానులు సర్వసాధారణమైన మనకు ఈ సరికే ఏ స్థాయి ప్రకృతి విలయం వచ్చినా దానిని ఎదుర్కొనే సత్తా మనకుండి ఉండాల్సింది. కాని, మన ఆదర్శాలకు వాస్తవిక ఆచరణకు నడుమ అఖాతమంత తేడా ఉండడం వల్ల తుఫాను వచ్చిన ప్రతిసారి చిగురుటాకులా నిలువెల్లా వణికిపోతున్నాం. పాలనను పడకేయించి, యావత్తు ప్రభుత్వ యంత్రాంగమంతా విపత్తు నివారణలోనే మునిగితేలిపోతోంది. ప్రజల సానుభూతి కోసం నాయకులు, నాయకుల సాయం కోసం ప్రజలు చేతులు దేబరించుకుంటూ నిల్చునేలా చేస్తున్నాం. ఈ తీరంతా మారాలి.

విగ్రహాలు ప్రతిష్ఠించడానికి, నగరాలను సుందరంగా తీర్చిదిద్దడానికి మన పాలకులు ఎంతో శ్రద్ధ చూపిస్తారు. దానికోసం లెక్కలేనట్టు నిధులు వెచ్చిస్తారు. కాని, తుఫాను రక్షణ కేంద్రాలను నిర్లక్ష్యం చేస్తారు. మూడు రోజుల పాటు మత్స్యకార గ్రామాల ప్రజలంతా బిక్కుబిక్కుమంటూ వారి గుడిసెలలోనే గడిపారు గాని, విశాఖ తీరప్రాంతాన్ని అనుకుని ఉన్న 146 తుఫాను రక్షణ కేంద్రాలు వారికి ఆశ్రయమివ్వలేకపోయాయి. దానికి మన పాలకుల నిర్లక్ష్యమే కారణం. అభివృద్ధి పేరిట సాగుతున్న కార్యకలాపాలు సముద్ర తీర ప్రాంతాన్ని కలుషితం చేస్తున్నాయి. అక్కడున్న జీవ వైవిధ్యాన్ని దారుణంగా దెబ్బతీస్తున్నాయి.

తీరంవెంట సహజ సిద్ధంగా పెరుగుతున్న మడ అడవులు, సరుగుడు చెట్లు, బీల భూములు, ఉప్పునీరు మంచినీరు కలిసే ప్రాంతాలు (బ్రాకిష్), కొండల మీద పెరిగే వృక్ష సముదాయాలు... వీటిపై ప్రభుత్వం పైసా పెట్టుబడి పెట్టనక్కరలేదు. సముద్రం చుట్టూ ఉండే ఈ కానపీ సహజ సిద్ధంగా తుఫానుల గాలులను, వర్షపు ఉధృతిని కొంతవరకు తట్టుకుని ఆపగలుగుతాయి. వాటిని దాటిన తరువాతే మనుషులను సమీపిస్తాయి. కాని, దురదృష్టవశాత్తు ఉన్న అన్ని పర్యావరణ పరిరక్షణ చట్టాలను తుంగలోతొక్కి మాస్టర్‌ప్లాన్‌ల పేరుతో ఉడా (విశాఖ అర్బన్ డెవలప్‌మెంట్ అథారిటీ) అన్ని అక్రమ నిర్మాణాలకు, ఇతర పనులకు పచ్చజెండా ఊపేస్తోంది.

పర్యావరణ మార్పులతోనే, ఫసిఫిక్ సముద్ర ప్రాంతంలో పుట్టి పెరుగుతున్న ఎల్‌నినో, లానినో వంటి వాతావరణ వ్యవస్థల వల్ల తుఫానులు, అతివృష్టి, అనావృష్టి వంటివి సంభవిస్తున్నాయని శాస్త్రవేత్తలు చెప్తున్నా మనం చెవిన పెట్టుకోవడం లేదు. కోస్టల్ రెగ్యులేషన్ జోన్ (సిఆర్‌జెడ్) నియమాలను కఠినతరం చేసి మన తీరప్రాంత పరిరక్షణకు నడుం బిగించడానికి ఈ హుదూద్ తుఫాను ఒక హెచ్చరికగా మనకు నిలవాలి.

*(రచయిత ఆంగ్ల విభాగంలో అసిస్టెంట్ ప్రొఫెసర్, ఆదిత్య ఇంజనీరింగ్ కళాశాల, టెక్కలి)* వీ

*వీక్షణంకు వచ్చే రచనలలో కొన్ని జిరాక్స్ కాపీలు వస్తున్నాయి. జిరాక్స్ నాణ్యత సరిగా ఉండడంలేదు. కొన్నిటిలో చేతి రాతలు కూడా కష్టంగా ఉంటున్నాయి. అందువల్ల అర్థం చేసుకొని టైప్ చేయడంలో చాలా ఇబ్బందులు, సమస్యలు ఎదురవుతున్నాయి. అక్షరాలు అర్థమయ్యేలా రాయండి. జిరాక్స్ మీరు ఉంచుకుని ఒరిజినల్స్ మాకు పంపి సహకరించండి. – సం.*

# తెలంగాణలో ఆగని రైతుల ఆత్మహత్యలు

***పూర్వ ఆంధ్రప్రదేశ్‌లోనూ, ఇప్పటి తెలంగాణలోనూ తాము వేసిన పంటలకు ప్రభుత్వాల నుంచి ఎటువంటి భరోసా, పరిష్కార మార్గాలు లేక, పాలకుల నిర్లక్ష్య ధోరణి వల్ల రైతులు ఆత్మహత్యలకు పాల్పడుతున్నారని అంటున్నారు* కె. సజయ**

అందరిలానే నూతన తెలంగాణ రాష్ట్రం మీద గంపెండంత ఆశ పెట్టుకున్నారు రైతాంగం. మరీ ముఖ్యంగా ఇకనైనా ఆత్మహత్యల పరంపర కొంతైనా ఆగుతుందని ఆశపడ్డారు. నాలుగు నెలలు తిరిగేసరికి వాతావరణ మార్పుల వల్ల వర్షాలు లేక కళ్లముందే వేసిన పంటలు నిట్టనిలువునా ఎండిపోతే తట్టుకోలేక నూతన రాష్ట్రంలో రెండు వందల పైచిలుకు చిన్న, సన్నకారు రైతులు తమ ఉసురు తామే తీసుకున్నారు. రోజురోజుకి పెరుగుతున్న ఈ సంఖ్య మిగిలిన వారికి గుబులు పుట్టిస్తోంది. దీనికి కారణం ప్రస్తుత టిఆర్‌ఎస్ ప్రభుత్వ విధానాలే పూర్తిగా కానప్పటికీ ఇప్పటివరకూ కనీసం ఒక్కసారంటే ఒక్కసారైనా తెలంగాణ రాష్ట్ర మొట్టమొదటి ముఖ్యమంత్రి కల్వకుంట్ల చంద్రశేఖరరావు నుంచి ఆత్మహత్యలకు పాల్పడకండి, ప్రభుత్వం ఈ సమస్య పరిష్కారం కోసం పనిచేస్తుందనే ఒక బలమైన హామీ మాత్రం రాలేదు. ఒకటి రెండు సందర్భాలలో ఒకరిద్దరు కేబినెట్ మంత్రులు చెప్పినప్పటికీ అది విమర్శ చేస్తున్న ప్రతిపక్షాలకు సమాధానంగా వచ్చిందే గానీ బతుకు మీద భరోసా కల్పించేదిగా ఏ మాత్రం లేదు. నిజానికి ముఖ్యమంత్రి ప్రాతినిధ్యం వహిస్తున్న గజ్వేలు నియోజకవర్గంలో అధికారయంత్రాంగం ఒక మూడు ఆత్మహత్యల కుటుంబాలను సంఘటన జరిగిన వెంటనే పరామర్శించిందని విన్నప్పుడు ఈ ప్రభుత్వం అంతమేరకైనా స్పందించిందని అభినందించాం. అయితే ఆ తర్వాత ఎక్కడా మిగిలిన జిల్లాలో అధికారులు కాదు కదా కనీసం ప్రజాప్రతినిధులెవ్వరూ ఈ కుటుంబాలను పరామర్శించిన దాఖలాలు లేవు. ఇది తీవ్రంగానే పరిగణించాల్సిన విషయం.

'తమ స్థాయికి మించి రైతులు కౌలుకి ఎక్కువ భూమి తీసుకుని పెట్టుబడి పెట్టలేకపోవడం ప్రభుత్వ బాధ్యత ఎలా అవుతుంది' అని ఒక ప్రభుత్వ రెవెన్యూ అధికారి ఒకచోట అంటే, ఇంకో అధికారి 'నేను అధికారిగా ఉన్నచోట ఇలాంటి అంశాలకు తావే లేదని' తేల్చేస్తాడు. మరోచోట 'ఇప్పటికే చాలా ఎక్స్‌గ్రేషియాలు అందించాం, కొన్ని నిజమైన రైతు ఆత్మహత్యలు కానివాటికి కూడా మానవత్వంతో సహాయం అందించాం, మాకు ఇదొక్కటే పనికాదు కదా చాలా విషయాలు చూసుకోవాల్సి ఉంటుంది' అని ఇంకొకరంటారు. 'మీరు పెట్టే సభలకు వస్తే బాధితులంతా కలిసి మా మీద పడిపోయి సహాయం చేయమంటారు, ఎక్కడి నుంచి తెస్తాం' అని ఒక ప్రజాప్రతినిధి అంటే, ఇంకొకరు 'ఇది వైరస్ లాంటి సమస్య ఒకరు ఆత్మహత్య చేసుకుంటే వరసబెట్టి వందమంది చేసుకుంటారు, పరిహారం ఇవ్వడమే పరిష్కారం కాదు కదా' అని అంటారు. 'ఇట్లాంటి ప్రమాదం ఉంటుంది కాబట్టి జర్నలిస్టులు ఈ అంశాల్ని మీడియాలో హైలైట్ చేయొద్దని ' మరొకరు చెపుతారు. 'ఇదంతా పాత పాలకుల పాపమే గానీ మేం నిరంతరం రైతు సంక్షేమం గురించే ఆలోచిస్తున్నాం' అని ఇంకొకరంటారు.

ఇక ప్రతిపక్షాల దగ్గరికొస్తే ప్రభుత్వం మీద రొడ్డకొట్టుడు విమర్శలు తప్పించి, రెండు దశాబ్దాలుగా కొనసాగుతున్న వ్యవసాయ సంక్షోభానికి నివారణగా తీసుకోవాల్సిన నిర్మాణాత్మకమైన సూచనలు ఏవీ కనిపించవు సరికదా కనీసం బాధితులకు మేమున్నామనే భరోసా కూడా అందించవు. ఏది ఏమయినా గానీ గత నాలుగునెలలుగా రోజుకి కనీసం మూడుకి తగ్గకుండా వరుస బెట్టి జరుగుతున్న రైతు ఆత్మహత్యలపై నూతన తెలంగాణ ప్రభుత్వం నుంచి ఎదురవుతున్న స్పందన ఏమాత్రం ఆశాజనకంగా లేదు.

గత రెండు దశాబ్దాలుగా తెలంగాణలో నిరంతరాయంగా సాగుతున్న రైతు ఆత్మహత్యలకు పరిష్కారం ఏమిటనేది అనేకమందిని కలచివేస్తున్న విషయం. నిజానికి మలిదశ తెలంగాణ ఉద్యమానికి ఊపిరి అందించింది తెలంగాణలో జరుగుతున్న రైతు ఆత్మహత్యలే అనేదే వాస్తవం. ఆనాటి ఉమ్మడి రాష్ట్రంలో వలస విధానాలకు తెలంగాణ రైతాంగం విలవిలలాడిపోయింది. తత్ఫలితం వేల సంఖ్యలో ప్రతి సంవత్సరం నిరంతరాయంగా జరిగిన చిన్న సన్నకారు రైతాంగ ఆత్మహత్యలు. నూతన రాష్ట్రం ఏర్పడేనాటికి ఈ సంఖ్య తెలంగాణలో 25 వేలకు దాటింది. వాస్తవానికి కొత్తప్రభుత్వం ఏర్పడిన వెంటనే ఈ అంశం మీద దృష్టి సారిస్తుందని, బాధిత కుటుంబాలన్నింటికీ కనీసం ఇంతకు ముందు ప్రకటించిన ఎక్స్‌గ్రేషియా మొత్తాన్నైనా అందిస్తారని, ఆ కుటుంబ మహిళలకు వ్యవసాయంలో కొనసాగే విధంగా విధానాల రూపకల్పన ఉంటుందని, వారి పిల్లల చదువుకు భరోసా కల్పిస్తుందని భావించాం. ఇది కేవలం మేమేదో ఊహించుకున్నది కాదు, ఏడెనిమిది ఏళ్ల నుంచి ఒక రాజకీయ పార్టీగా వారి నుంచి వచ్చిన హామీలను దృష్టిలో ఉంచుకునే ఈ అవగాహనకు రావడం జరిగింది. రాష్ట్ర విభజన నిర్ణయం జరిగిన వెంటనే 2014 మార్చ్ 6న హైదరాబాద్ ఇందిరాపార్క్ వద్ద 'అంతర్జాతీయ మహిళా దినోత్సవం' సందర్భంగా తెలంగాణలోని పదిజిల్లాల రైతు ఆత్మహత్యల కుటుంబాలు జరిపిన ధర్నాకు టిఆర్‌ఎస్ అధికార ప్రతినిధిగా వచ్చి తన్నీరు హరీష్‌రావు మాట్లాడుతూ 'రైతాంగానికి ఎదురవుతున్న అనేక ఇబ్బందులను ప్రభుత్వాలు పట్టించుకోకపోవడం వల్లే ఈ రోజు రైతు ఆత్మహత్యలు జరుగుతున్నాయి. పరిశ్రమలు దివాలా తీస్తే అదనంగా అప్పులు ఇచ్చి మరీ వాటిని నిలబెట్టటానికి ప్రయత్నిస్తున్నారు గానీ రైతు దివాలా తీస్తే ఆ రైతును ఆదుకునే విధానం

లేదు. వందలకోట్లు ఎగబెట్టిన ఇండస్ట్రియలిస్టులకు రకరకాల హామీలు దొరుకుతున్నాయి కానీ దేశానికి అన్నం పెడుతూ, ఎండనకా, వాననకా, రాత్రనకా పొద్దనకా పని చేసే రైతన్న విషయంలో మాత్రం చాలా నిర్లక్ష్య ధోరణి కొనసాగుతోంది. ప్రకృతి వైపరీత్యాలకు రైతులు బాధ్యులు కానప్పటికీ ఆత్మస్థైర్యం దెబ్బతిని ఆత్మహత్యలను ఆశ్రయిస్తున్నారు. నా పంట పోయింది, పెట్టుబడి పోయింది, అప్పు ఎలా తీర్చాలి, ఎలా బతకాలి, నా పిల్లల్నెలా సాదుకోవాలి అనే దిగులుతో రైతులు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. అంటే వ్యవస్థలో లోపం ఉంది. రైతుకు ఒక విశ్వాసాన్ని, రైతును ప్రభుత్వం కాపాడుతుందనే నమ్మకాన్ని కల్పించడంలో ప్రభుత్వాలు విఫలమయ్యాయి. కాబట్టే వరంగల్ జిల్లాలో ఒక్క వడగళ్ల వాన పడగానే పంట దెబ్బతినడంతో ఐదు మంది రైతులు ఆత్మహత్యలను ఆశ్రయించారు. బోర్లెండిపోయి, బావులెండి పోయి, మోటర్లు కాలిపోయి, కరెంట్ సక్కగా రాక, మార్కెట్‌కు పోతే సరైన గిట్టుబాటు ధర రాక ఇలా రకరకాలైన సమస్యలు కనిపిస్తున్నాయి. విత్తనం కల్తీదొస్తుంది, కల్తీ విత్తనమిచ్చిన పరిశ్రమల మీద ఏ చర్యలు ఉండవు. కల్తీవిత్తనాలతో పంట సరిగా మొలవక ఆత్మహత్యలు చేసుకునేది ఒకరైతే, నీటి కోసం బోర్లు వేసీ వేసీ విఫలమై చావుని ఆశ్రయించేది మరొకరు, కరెంట్ సరిగా రాక, ఫ్లక్ట్యువేషన్స్ తో మోటర్లు కాలిపోయి, కనీసం మూడు నాలుగు గంటల కరెంట్ కూడా అందక కళ్ల ముందే పంటెండిపోతూ ఉంటే బతుకు మీది ఆశను తుంచేసుకునేవారు మరొకరు. సకాలంలో ఎరువులు రాకపోవడం ఒక సమస్య. ఇలా అనేకమయిన సమస్యలు రైతులను చుట్టి ముట్టి ఉన్నాయి. వీటన్నిటినీ సమన్వయ పరచగలిగినప్పుడు మాత్రమే మనం ఈ రైతు ఆత్మహత్యలను ఆపగలిగే అవకాశం ఉంటుంది. నిజంగా ఇది ఒక ప్రధానమైన సమస్య, ఒక కీలకమైన సమస్య. భారతదేశంలో రైతు ఆత్మహత్యలంటే ముందుగా గుర్తుకు వచ్చేది విదర్భ, తెలంగాణ ప్రాంతాలే. ఎందుకు ఇక్కడే ఈ విధంగా జరుగుతున్నాయో పరిశోధించవలసి ఉంది. ఇప్పుడు కొత్తగా తెలంగాణ రాష్ట్రం ఏర్పడబోతోంది. ఎన్నో ఆశలు ఉన్నాయి, సమస్యలకు పరిష్కారం దొరుకుతుందనేటువంటి విశ్వాసంతో ప్రజలంతా ఎదురు చూస్తున్నారు. ఇప్పుడు రాబోయే తెలంగాణ ప్రభుత్వం కూడా చాలా బాధ్యతాయుతంగా, ఎవరు ఆ స్థానంలో ఉన్నా గానీ ముందు రైతులకు ఆత్మహత్యల వైపు వెళ్లకుండా బతుకు మీద ఆత్మవిశ్వాసాన్ని కల్పించాలి. ఇప్పటివరకూ ఆత్మహత్యలు చేసుకున్న కుటుంబాలను ఏ విధంగా రక్షించుకోవాలో, ఆదుకోవాలో అనేది ఒక బాధ్యతైతే, ఇక ముందు ఏ రైతూ ఆత్మహత్య చేసుకోకుండా చూసుకోవాల్సిన బాధ్యత వచ్చేటటువంటి ప్రభుత్వాల మీద ఉంటుంది. మీరు ఆత్మహత్యలు చేసుకోండి మేము ఏదో చేస్తామని అనడం ఏ మాత్రం సరైనది కాదు. ఇప్పటి వరకూ ఆత్మహత్యలు జరిగాయి, ఇకముందు జరగడానికి వీల్లేదు. ఏ కుటుంబంలో కూడా ఇలాంటి పరిస్థితి రాకుండా ఒక ఆత్మవిశ్వాసాన్ని కల్పించవలసిన బాధ్యత అధికారపార్టీ, ప్రతిపక్ష పార్టీలు, సామాజిక సంస్థలు, స్వచ్ఛంద సంస్థలు ఇలా ప్రతి ఒక్కరి మీదా ఉంటుంది. అలా అందరం కలిసినపుడే రైతులను కాపాడుకునే అవకాశం ఉంటుంది. జీవితం చాలా విలువైనది. రైతు ఆత్మహత్య కుటుంబాల్లోని మహిళలు, పిల్లలు పడే బాధ ఎంత చెప్పినా తక్కువే అవుతుంది. ప్రభుత్వం అందించే లక్షా యాభైవేల కోసం సంవత్సరాల తరబడి తిరుగుతూ రకరకాల డాక్యుమెంట్లు, సర్టిఫికెట్లు అధికారులకు అందచేయాలనడం చాలా సమస్యాత్మకం. భవిష్యత్తులో ఏ రైతూ ఆత్మహత్య చేసుకునే పరిస్థితులు లేకుండా, వ్యవసాయం లాభసాటిగా ఉండేలా, ఆత్మవిశ్వాసం పెంచేవిధంగా, విపత్కర పరిస్థితుల్లో రైతు కుటుంబాలను ఆదుకునే విధంగా ప్రభుత్వాల చర్యలు ఉండాలనీ, ఆ వైపుగా టిఆర్ఎస్ పార్టీ కృషి చేస్తుందనీ...' అన్నారు. నిజానికి ఆ రోజు ఆయన చేసిన ప్రసంగం బాధిత కుటుంబాల్లో ఒక బలమైన విశ్వాసాన్ని కలిగించిందనడం ఎంత మాత్రం అతిశయోక్తి కాదు.

అయితే ఇప్పుడు తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన తర్వాత కొత్త ప్రభుత్వ పగ్గాలు టిఆర్ఎస్ పార్టీ అందుకున్న తర్వాత ఈ అంశం మీద చాలా కాలంగా పనిచేస్తున్న, మాట్లాడుతున్న సామాజిక కార్యకర్తలు, జర్నలిస్టులు, హక్కుల కార్యకర్తలు అందరికీ అతిపెద్ద ప్రశ్నార్థకంగా ఉన్నదేమంటే రైతుల ఆత్మహత్యల గురించి ఒక అవగాహనతో ఉన్న పార్టీ అధికారంలో కొచ్చిన తర్వాత దీనిని ఒక ముఖ్యమైన సమస్యగా ఎందుకు మాట్లాడటం లేదు? ఇది ఏదో ఒక ఎక్స్‌గ్రేషియాకు మాత్రమే పరిమితమైన సమస్యగా మేం చూడడం లేదు. నిజానికి ఏ రాజకీయ పార్టీకి కూడా రైతుల ఆత్మహత్యలు అనే అంశం ఏ రకం గానూ ప్రాధాన్యతగా లేదు. కేవలం ప్రభుత్వాన్ని విమర్శించాలనే ధోరణే ప్రతిపక్ష పార్టీల్లో కనిపిస్తోంది కానీ ఆ బాధిత కుటుంబాలకు ఒక బలమైన భరోసా నివ్వడంలో విఫలమయ్యామనే చెప్పుకోవచ్చు. ఉద్యమ చైతన్యంతో ఉన్న తెలంగాణ సమాజం కూడా ఈ అంశం మీద ఎలా స్పందించాలో అర్థం కాని పరిస్థితిలోకి వెళ్లిందనిస్తోంది. తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన తర్వాత జిల్లాల్లో గానీ, రాష్ట్ర రాజధానిలో గానీ ఈ అంశం మీద అనేక సభలు, సమావేశాలు జరిగాయి. సమస్యను అధికారులు, ప్రజాప్రతినిధులు, కేబినెట్ మంత్రుల దృష్టికి తీసుకెళ్లినపుడు వారి స్పందన మిశ్రమంగా ఉంది. అసలు సమస్య తీవ్రతనే గుర్తించ లేదనడం గుడ్డి విమర్శే అవుతుంది. కానీ దీనికి సంబంధించి తీసుకోవలసిన చర్యలమీద స్పష్టత, అందుకు తీసుకోవాల్సిన ప్రణాళికాబద్ధమైన చర్యలు వాస్తవరూపంలో కనిపించడం లేదు. ఉదాహరణకు ఏదైనా ఒక ప్రమాదం జరిగిందను కుందాం, దానికి తక్షణం స్పందించి బాధితులకు అవసరమైన వైద్య సహాయం, ఇతర సహాయక చర్యలు ఎంత ముఖ్యమో భవిష్యత్‌లో అలాంటి ప్రమాదాలు జరగకుండా తీసుకోవలసిన దీర్ఘకాలిక చర్యలు కూడా అంతే ముఖ్యమైనవి. అంతే కానీ బాధితుల మీదే బాధ్యతంతా నెట్టివేయడమనేవి ప్రభుత్వాలు అనుసరించదగ్గ చర్య మాత్రం కాదు. అయితే దురదృష్టవశాత్తూ ఈనాటి రాజకీయ వ్యవస్థలో పైన చెప్పిన ఈ రెండు అంశాలు నిర్లక్ష్యానికి గురవుతున్నాయనే చెప్పుకోవాలి.

ఈ సమస్య తీవ్రతను ప్రభుత్వానికి తెలియజేసే ఉద్దేశంతో 2014 సెప్టెంబర్ 27న మెదక్ జిల్లా సిద్దిపేటలో వ్యవసాయ సంక్షోభం – రైతుల ఆత్మహత్యల మీద ఒక ప్రజావేదికను నిర్వహించారు. కేరింగ్ సిటిజన్స్ కలెక్టివ్, రైతు స్వరాజ్య వేదిక, దళిత్ బహుజన్ ఫ్రంట్, తెలంగాణ ప్రోగ్రెసివ్ టీచర్స్ ఫెడరేషన్, తెలంగాణ విద్యావంతుల వేదిక, తెలంగాణ వికాస సమితి, తెలంగాణ రైతు సంఘాల ఫెడరేషన్, మానవహక్కులవేదిక వంటి వివిధ ప్రజాసంఘాల ఆధ్వర్యంలో రైతు ఆత్మహత్య కుటుంబాలు ఒక విస్తృత సమావేశాన్ని నిర్వహించి ప్రజాప్రతినిధులను, ప్రభుత్వ అధికారులను ఆహ్వానించారు. ఈ

ప్రజావేదికలో అన్ని తెలంగాణ జిల్లాల నుండి దాదాపు 150 మందికి పైగా రైతులు, రైతు ఆత్మహత్య బాధిత కుటుంబాలు, సామాజిక కార్యకర్తలు, రచయితలు, ఉపాధ్యాయులు, పరిశోధకులు, ఉద్యమకారులు, తెలంగాణ రైతు రక్షణ సమితి, రైతు సంఘాల నాయకులు పాల్గొని వ్యవసాయ సంక్షోభానికి ప్రభుత్వం, పౌరసమాజం తీసుకోవాల్సిన చర్యల గురించి చర్చించారు. ఈ సమావేశంలో తెలంగాణ రైతాంగం ఎదుర్కొంటున్న వివిధ అంశాలను చాలా కూలంకషంగా చర్చించి వాటి ఆధారంగా తీర్మానాలు చేసి సమావేశం చివరలో వక్తలుగా వచ్చిన స్థానిక శాసనసభ్యులు, భారీ నీటిపారుదల శాఖామంత్రి టి.హరీష్‌రావు, మెదక్ ఎం.పి. కె.ప్రభాకర రెడ్డి, ఎం.ఎల్.సి. సుధాకర్‌రెడ్డిలకు అందజేశారు. ఆ తీర్మానాల సారాంశం సంక్షిప్తంగా:

1. గత రెండు దశాబ్దాల నుంచి ఇప్పటివరకూ జరిగిన రైతు ఆత్మహత్య కుటుంబాలకు గౌరవప్రదమైన జీవనోపాధి కల్పించాలి. వారు వ్యవసాయంలో కొనసాగేలా అవసరమైన ప్రత్యేక విధాన పరమైన మార్పులు తీసుకోవాలి. రైతు ఆత్మహత్యలను గుర్తించే క్రమాన్ని 13 డాక్యుమెంట్ల నిబంధనతో కాకుండా మరింత సులభతరం చేయాలి. జి.వో 421/2004 ను సవరించి ఎక్స్‌గ్రేషియా మొత్తాన్ని 5 లక్షల రూపాయలకు పెంచాలి. త్రిసభ్య కమిటీ విచారణను సత్వరం పూర్తిచేసి ఆత్మహత్య జరిగిన రెండు మూడు నెలలలోపే ఆయా కుటుంబాలకు సత్వర నష్టపరిహారాన్ని అందించాలి. ఈ కుటుంబాలకు ఆహార భద్రత అంత్యోదయ కార్డులను తప్పనిసరిగా అందజేయాలి. ఈ కుటుంబాల పిల్లల చదువుల బాధ్యతను ప్రభుత్వమే తీసుకుని వారు జీవితంలో నిలదొక్కుకునేలా చేయూత నందించాలి.

2. తెలంగాణలో ఏర్పడిన వ్యవసాయ సంక్షోభాన్ని అర్థం చేసుకుని సమీక్షించడానికి, ఉపయుక్తమైన సూచనలు అందించడానికి, జయతీ ఘోష్ కమిషన్ లాగా ఒక స్వతంత్ర కమిషన్ ను తక్షణమే ఏర్పాటు చేసి సంక్షోభ నివారణకు నిర్మాణాత్మమైన చర్యలు చేపట్టాలి. ఇందులో అన్ని ప్రజా సమూహాలను భాగస్వామ్యం చేయాలి.

3. తెలంగాణలోని వివిధ జిల్లాలలో ఉన్న ప్రత్యేక పరిస్థితులను దృష్టిలో పెట్టుకుని ప్రత్యేక వ్యవసాయ విధానాన్ని ప్రకటించాలి.

4. సాగునీరు ప్రధాన సమస్యగా ఉన్నందున రైతులు సాగుచేసే ప్రతి ఎకరానికి నీరు అందించే వ్యవస్థను ఏర్పాటు చేయాలి. బోరు బావులను తగ్గించే విధంగా ప్రత్యామ్నాయ నీటిపారుదల వ్యవస్థల వైపు దృష్టి సారించాలి. చెరువుల పునరుద్ధరణలో అవకతవకలు జరగకుండా సుదీర్ఘకాలం పాటు మన్నేవిధంగా చెరువుల మరమ్మత్తు జరగాలి. గొలుసుకట్టు చెరువుల వ్యవస్థను పునరుద్ధరించే దిశగా కాలక్రమంలో భూగర్భ జలాలు పెంచే దిశగా పటిష్ఠమైన ప్రణాళికలు తయారు చేసి ప్రజల, పంచాయితీల భాగస్వామ్యం ఉండేలా ఒక సబ్ కమిటీని వేసి అవి పనిచేసే వాతావరణాన్ని కల్పించాలి. దీనిలో మహిళలు, యువకులు, పశు పెంపకం దార్ల భాగస్వామ్యం ఉండాలి. అనవసర రాజకీయ జోక్యాన్ని నివారించాలి.

5. సాగులో ఖర్చు తగ్గించే సుస్థిర వ్యవసాయ పద్ధతులను, ఆహార భద్రతను పెంచే చిరుధాన్యాలు, పప్పు ధాన్యాల మిశ్రమ పంటల సాగును ప్రోత్సహించడం వాటికి తగ్గ మార్కెట్ వ్యవస్థలను ఏర్పరచాలి.

6. భౌగోళికంగా అనువుగాని వ్యాపార పంటలను నివారించే విధంగా చర్యలు తీసుకోవాలి.

7. రైతాంగానికి 9 గంటలపాటు పగటేళ కరెంట్ అందించేందుకు చర్యలు తీసుకోవడం ద్వారా, కరెంట్ షాకుల ద్వారా జరిగే అనేక అకాల మరణాలను నివారించగలుగుతారు. సోలార్ విద్యుత్ ఉత్పత్తికి విధాన నిర్ణయాలు తీసుకోవాలి. అవసరమైనన్ని నిధులు కేటాయించాలి.

8. రైతులకు ఆదాయం పెరిగేలా ఖర్చులు, ధరలు, రుణాలను ఎప్పటికప్పుడు సమీక్షించే ఒక ఆదాయ కమిషన్‌ను ఏర్పాటు చేయాలి.

9. వ్యవసాయ రంగానికి నిధుల కేటాయింపు పెంచాలి. సాధారణ బడ్జెట్‌లో 10 శాతం కేటాయిస్తూ ప్రత్యేక వ్యవసాయ బడ్జెట్‌ను ప్రవేశపెట్టాలి.

10. వాస్తవ సాగుదార్లైన మహిళా రైతులు, కౌలు రైతులు, చిన్న సన్నకారు రైతులకు సానుకూలంగా ఉండే విధానాల రూపకల్పన చాలా తక్షణ అవసరం. ఈ వర్గాలకు అవసరమైన పరిశోధనలు, విస్తరణ వ్యవస్థల రూపకల్పన, సంస్థాగత మద్దతు వ్యవస్థలు యుద్ధ ప్రాతిపదికన చేపట్టాలి.

11. ఊరుమ్మడి భూములను పరిరక్షిస్తూనే, పడావు భూములను సాగులోకి తీసుకువచ్చి భూమిలేని వారికి అందుబాటులోకి తీసుకురావాలి. స్థానిక వాతావరణానికి అనుకూలమైన సాంప్రదాయ పశుసంపదను పెంచే విధంగా చర్యలు తీసుకోవాలి.

12. సుస్థిర వ్యవసాయ విధానాలను విస్తృతంగా అందుబాటులోకి తీసుకొచ్చే విధంగా ప్రతిజిల్లాలో మండల స్థాయిలోనే రైతులకు అందు బాటులో వ్యవసాయ క్షేత్రాల్లోనే శిక్షణ ఉండేలా చర్యలు తీసుకోవాలి.

13. వ్యవసాయం చేయని వారు వందలకొద్దీ ఎకరాలను వాణిజ్య అవసరాల కోసం వ్యవసాయ భూములు కొనకుండా పటిష్ఠమైన చర్యలు తీసుకోవాలి.

14. వ్యవసాయరంగ సంక్షోభ నివారణకు, రైతాంగానికి ఒక సామాజిక భరోసా అందించడంలో పౌరసమాజం కీలకమైన పాత్ర పోషించాలి. ప్రభుత్వం, పౌరసమాజ సంస్థలు ఉమ్మడి బాధ్యత తీసుకోవాలి.

ప్రభుత్వ కార్యాలయాల్లో ప్రతి అధికారికీ తమ భర్తలు నిజమైన వ్యవసాయ సమస్యలతోనే చనిపోయారని ఆదుకోమని వినతి పత్రాలు ఇవ్వడానికి వెళ్లినపుడల్లా ఈ స్త్రీలకు ఎదురయ్యేది ఛీత్కారాలు, అవమానాలే. ఈ మగవాళ్ల చావుకు ఆ ఇంటి ఆడవాళ్లే కారణమంటూ తీర్పునిచ్చేసి వారి పరిస్థితుల పట్ల ఏ మాత్రం సానుభూతి చూపించక పోగా అధికార దర్పంతో అవమానిస్తూ వ్యవహరించే యంత్రాంగం, ఆ చావులకు కారణమవుతున్న విధానాల మీద కనీసంగా కూడా దృష్టి సారించదు. పైగా చనిపోయిన వారి గురించి మాట్లాడడం కాదండి, మిగిలిన రైతుల గురించి మాట్లాడరెందుకు అని మాలాంటి సామాజిక కార్యకర్తలను నిలదీస్తారు. అయ్యా అధికారులూ, పాలకులూ–మేం మాట్లాడుతున్నది బతికి ఉండి జీవన పోరాటం చేస్తున్న ఆయా కుటుంబాల గురించే కాదు, రోజురోజుకి రైతులను ఆత్మహత్యల పరంపరలోకి జార్చివేస్తున్న పరిస్థితుల గురించి. అర్థమవుతుందనే అనుకుంటున్నాను.

*(రచయిత సామాజిక కార్యకర్త కేరింగ్ సిటిజన్స్ కలెక్టివ్)* వీ

# ఫాస్ట్ పథకానికి గల నేపథ్యం

***ప్రత్యేక రాష్ట్రం ఏర్పడ్డ తరువాత విద్యార్థుల ఫీ రియింబర్స్‌మెంట్ పథకాన్ని మార్చి తెలంగాణ ప్రభుత్వం ఫాస్ట్ పథకాన్ని తేవడంలో గల ఉద్దేశాన్ని వివరిస్తున్నారు ఎ. నర్సింహారెడ్డి***

**2009**లో మాజీ ముఖ్యమంత్రి వై.ఎస్.రాజశేఖరరెడ్డి ప్రవేశపెట్టిన ఫీ రియింబర్స్‌మెంట్ పథకాన్ని తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం రద్దు చేసింది. దాని స్థానంలో 'ఫాస్ట్' (ఫైనాన్షియల్ ఎసిస్టెన్స్ టు స్టూడెంట్స్ ఆఫ్ తెలంగాణ) పథకాన్ని ప్రవేశపెడుతూ జి.ఒ.నెం.36ను జూలై 30న జారీ చేసింది. ఫీ రియింబర్స్‌మెంట్ పథకం దుర్వినియోగం అవుతున్నందున, మరో వైపు ప్రభుత్వ ఖజానాకు భారం అవుతున్నందున రద్దు చేశారనడంలో సందేహం లేదు. అయితే నూతనంగా ప్రవేశపెట్టిన ఫాస్ట్ పథకానికి విద్యార్థులు అర్హత సంపాదించడానికి 1956 నవంబర్ ఒకటి కటాఫ్ తేదీని నిర్ణయించడంపై వివాదం చెలరేగింది. నిజానికి ఈ వివాదానికి మూలాలు 1952లోనే పడ్డాయి. 'నాన్ ముల్కీ గో బ్యాక్' ఉద్యమ నాటి నుండి 1956 నవంబర్‌లో తెలంగాణ ప్రాంతాన్ని ఆంధ్రలో విలీనం చేశాక కూడా తెలంగాణ ప్రాంత విద్యావకాశాలు, ఉద్యోగ అవకాశాలు తెలంగాణ బిడ్డలకు దక్కకుండా తెలంగాణేతరులు అక్రమంగా పొందారని అనేక ఉద్యమాలు వ్యక్తీకరించాయి. ప్రభుత్వం నియమించిన కమిటీలు ధ్రువపరిచాయి. ఉమ్మడి రాష్ట్రంలో ముల్కీ నిబంధనలు కొనసాగుతాయని పెద్ద మనుషుల ఒప్పందంలో అంగీకరించినా, ముల్కీ నిబంధనలను ఉల్లంఘించి, సడలించి, వక్రీకరించి తెలంగాణ ప్రాంతంలో వేలాది మంది స్థానికేతరులకు ప్రభుత్వ ఉద్యోగాలు ఇచ్చారు. 1968 నాటికే 26 వేల మంది స్థానికేతరులున్నారని జయభారత్‌రెడ్డి కమిటీ తెలిపింది.

1969లో తెలంగాణ ఉద్యమం, 1972లో జై ఆంధ్ర ఉద్యమం వెల్లువెత్తిన తర్వాత తెలంగాణ ప్రాంతానికి విలీనం సమయంలో ఇచ్చిన రక్షణలన్నింటినీ రద్దు చేస్తూ కేంద్ర ప్రభుత్వం కంటితుడుపు ప్రత్యామ్నాయ పథకాన్ని అల్లింది. 1973 సెప్టెంబర్ 23న ప్రకటించిన ఫార్ములాను ఆరు సూత్రాల పథకంగా పేర్కొంటున్నాం. ఈ ఫార్ములాను అమలుపరిచే క్రమంలో తీసుకున్న నిర్ణయాలే తెలంగాణ ప్రాంతానికి గొడ్డలిపెట్టు అయ్యాయి. ముల్కీ నిబంధనలు రద్దు, తెలంగాణ స్థానికతను పాఠశాల విద్యలో నాలుగు ఏళ్లు ఇక్కడ చదివితే చాలు. ఈ నియమం 'కొన నాలుకకు మందు వేస్తే ఉన్న నాలుక పోయిన' చందంగా ఉంది. అంతేగాక అక్రమాలకు సాధికారత కల్పించినట్లు అయింది. ఆరు సూత్రాల పథకానికి చట్టబద్ధత కల్పించే ఉద్దేశంతో 1973లో రాజ్యాంగాన్ని సవరించి 371వ అధికరణకు 371డి చేర్చారు. ఈ ఉత్తర్వును కూడ ఉల్లంఘించి తెలంగాణకు రావాల్సిన వేలాది ఉద్యోగాలు కొల్లగొట్టారు. ఉద్యోగులు, విద్యార్థులు ఆందోళన చేయడంతో ఎన్‌టిఆర్ ప్రభుత్వం 1985లో జి.ఒ. 610 జారీ చేసింది. ఈ జి.ఒ. జారీ చేసే నాటికి 60 వేలు అక్రమ నియామకాలు జరిగితే 2002 నాటికి ఈ అక్రమ నియామకాల సంఖ్య రెండు లక్షలు దాటిందని అంచనా. చివరికి అక్రమ నియామకాలను తేల్చడానికి ఒక ఏక సభ్య కమిటీ (గిర్‌గ్లాని) నియమించింది. ఆ కమిటీ నివేదిక కూడ అమలు కాలేదు. ఈ నేపథ్యంలో తెలంగాణ ఉద్యమం సాగి ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడింది. ఈ పూర్వరంగంలో 'ఫాస్ట్' పథకాన్ని, హైకోర్ట్ తీర్పును చూడాలి.

తెలంగాణ ప్రజల ఆకాంక్షలకు భిన్నంగా రాష్ట్ర విభజన చట్టంలోనే అనేక ఆంక్షలు విధించారు. ఉమ్మడి రాజధాని, రాజధానిపై గవర్నర్ అధికారాలు, పోలవరం ప్రాజెక్టుకు జాతీయ హోదా, భద్రాచలం డివిజన్‌లోని ఏడు మండలాలను పరిశేష ఆంధ్రప్రదేశ్‌లో కలుపడం, ఉమ్మడి హైకోర్టు, సెక్షన్ 95 ప్రకారం పదేళ్ల పాటు హైదరాబాద్‌లో గల ఉన్నత విద్యా సంస్థల్లోకి ఉమ్మడి ప్రవేశాలు కల్పించడం లాంటివి ఉన్నాయి. ఇవన్నీ తెలంగాణ ప్రభుత్వ సార్వభౌమాధికారానికి విఘాతం కల్గించేవే. మరో పది ఏళ్లు తెలంగాణ రాష్ట్ర ప్రజల మీద ఆధిపత్యం చెలాయించేవే. ఇక పునర్విభజన చట్టం సెక్షన్ 95 ప్రకారం ఉమ్మడి ప్రవేశాలు తెలంగాణ విద్యార్థులకు నష్టదాయకంగా పరిణమించాయి. అలాగే 371డి మరో పది సంవత్సరాలు తెలంగాణలో అమలులో ఉంటే తెలంగాణ యువతకు ఉద్యోగావకాశాలు కల్లె.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విభజన బిల్లులో లోపాలున్నాయనీ, వాటిని సవరించిన తర్వాతే పార్లమెంట్ ఆమోదించాలని ఆనాడు వాదించిన వారు నేడు చట్టాన్ని యథాతథంగా అమలు జరపాలని వాదిస్తున్నారు. బిల్లును యథాతథంగా తక్షణమే ఆమోదించాలని వాదించినవారు నేడు చట్టం సమాఖ్య స్ఫూర్తికి విఘాతం కలిగిస్తున్నదనీ, రాష్ట్ర అధికారాలకు తూట్లు పొడుస్తున్నదనీ వాదిస్తున్నారు. చట్టాన్ని యథాతథంగా అమలు జరిపితే పరిశేష ఆంధ్రప్రదేశ్‌కు ఎక్కువ మేలు జరుగుతుందని, తెలంగాణ ప్రజలకు ఎక్కువ నష్టమన్న భ్రమలను తెలంగాణ ప్రజలలో కల్పిస్తున్నారు. తమ తమ రాజకీయ ప్రయోజనాల కోసం ఇరు రాష్ట్ర ప్రజల మధ్యన వైమనస్యాలను ఎగదోసే పనిని ఇరువైపులా పాలకవర్గాలు సాగిస్తున్నాయి. ప్రజల ఆసక్తులు, అవసరాలు గుర్తించి చర్యలు తీసుకోకుండా మౌలిక సమస్యల నుండి ప్రజల దృష్టి మళ్లించే పనిలో రెండు రాష్ట్రాల ప్రభుత్వాలు నిమగ్నమయ్యాయి. ఉన్నత విద్యనభ్యసిస్తున్న విద్యార్థులకు నగదు ప్రోత్సాహకాలనిచ్చే దాదాపు 20 పథకాలను గత కేంద్ర ప్రభుత్వాలు (యుపిఎ) అమలు చేస్తూవస్తున్నాయి. వీటి కింద ఎస్‌సి, ఎస్‌టి విద్యార్థులకు ఫీజులు, హాస్టల్స్ ఖర్చులను ప్రభుత్వాలు చెల్లిస్తూ వచ్చేవి. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో గతంలో దీనికి అదనంగా బిసి విద్యార్థులకు కూడా కొంతమేరకు ప్రభుత్వం అందిస్తూ వచ్చింది. రాజశేఖరరెడ్డి ప్రభుత్వం ఈ నిధులన్నింటినీ కలిపి వృత్తి విద్యా కోర్సులలో ఫీజు రియింబర్స్‌మెంట్ పథకంగా కొత్తరూపం ఇచ్చింది. 2008 జనవరిలో ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో ప్రారంభమైన ఫీజు రియింబర్స్‌మెంట్ పథకం తల్లిదండ్రుల వార్షిక ఆదాయం రెండు లక్షల లోపు ఉన్న ఎస్.సి, ఎస్.టి విద్యార్థులకు, లక్ష రూపాయలు ఆదాయం కలిగిన బి.సి, ఇ.బి.సి, ఇతర విద్యార్థులకు లబ్ధి చేకూరేలా ఈ పథకానికి శ్రీకారం చుట్టారు.

అభివృద్ధి పథకాలకు నిధుల కొరత ఏర్పడిందన్న సాకుతో సంక్షేమ పథకాలకు కోత విధించాలని భావించిన గత యుపిఏ ప్రభుత్వం కేంద్ర నిధులతో నిర్వహించబడుతున్న వివిధ సంక్షేమ పథకాల సంఖ్యను తగ్గించాలని 2012లో ప్రతిపాదించింది. దాని కోసం ఒక కమిటీని నియమించింది. మొత్తం 176 సంక్షేమ పథకాలనూ 66కు కుదించాలని కమిటీ సూచించింది. విద్యా రంగానికి సంబంధించిన పథకాలు కూడా వీటిలో ఉన్నాయి. ప్రాథమిక, మాధ్యమిక విద్యకు సంబంధించి మొత్తం 17 పథకాలుండగా (ఖర్చు 37 వేల కోట్లు) 6 పథకాలకు తగ్గించాలని సూచించింది. వీటికి పెట్టబోయే ఖర్చును పేర్కొనలేదుగానీ ప్రాథమిక, మాధ్యమిక విద్య కొరకు ఆదాయపు పన్నుపై విధిస్తున్న సర్‌ఛార్జీ మేరకు (దాదాపు 25 వేల కోట్లు) పరిమితం చేయబోతున్నారు. ఉన్నత విద్యకు 2 పథకాలుండగా ఒక పథకానికి తగ్గించాలని సూచించారు. అది కూడా పాలిటెక్నిక్ కాలేజీల నిర్మాణానికి ఖర్చు చేస్తారు. ఆదివాసుల విద్యకున్న మూడు పథకాలను కలిపి ఒకే పథకంగా చేస్తారు.

కేంద్ర ప్రభుత్వం 2012 ఏప్రిల్‌లో నిర్వహించిన ముఖ్యమంత్రుల సమావేశాల్లో ముఖ్యమంత్రులందరూ కేంద్ర ప్రభుత్వ పథకాల సంఖ్యను కుదించాలని కోరడంతో పాటు, రాష్ట్రాల వాటాగా ఇవ్వవలసిన నిధులను భరించలేము గనుక కేంద్రమే మొత్తం భరించాలని కూడా అడిగారు. అంటే కేంద్రం కేటాయింపు మేరకే ఖర్చు చేస్తామని రాష్ట్రాలు చెప్పాయి. ఈ నేపథ్యంలోనే ఫీ రియింబర్స్‌మెంట్‌కు నిధులను తగ్గించే పనిని కిరణ్‌కుమార్‌రెడ్డి ఉమ్మడి రాష్ట్ర ప్రభుత్వం చేపట్టింది. కళాశాలలను అవి ఏర్పాటు చేసిన సౌకర్యాల ప్రాతిపదిక వర్గీకరించి 60 వేల నుండి లక్ష రూపాయల వరకూ ఫీజుగా నిర్ణయించింది. తాను మాత్రం 30 వేల రూపాయలు మాత్రమే చెల్లిస్తాననీ మిగిలినది విద్యార్థులే భరించాలని ప్రకటించింది. ఇప్పటి వరకూ ఈ పథకం ద్వారా ప్రైవేట్ కాలేజీలకు లాభాలు వచ్చేలా చేశారు. ఇప్పుడు ఈ పథకానికి ఖర్చును క్రమంగా తగ్గించే పనిలో భాగంగా కిరణ్‌కుమార్‌రెడ్డి ప్రభుత్వం టాస్క్‌ఫోర్స్‌లను నియమించి కళాశాలల వాస్తవ పరిస్థితిని సేకరించారు. ఇప్పుడు రెండు రాష్ట్ర ప్రభుత్వాలూ టాస్క్‌ఫోర్స్ అందించిన సమాచారం ఆధారంగా కళాశాలలు రద్దు చేసే పనిలో పడ్డాయి. తద్వార రియింబర్స్‌మెంట్ భారాన్ని తగ్గించుకోవాలని చూస్తున్నాయి.

మన రాష్ట్రంలో ఫీ రియింబర్స్‌మెంట్ బొక్కేందు కోసమా అన్నట్లు ఉన్నత విద్యాసంస్థలు పుట్టగొడుగుల్లా పుట్టుకొచ్చాయి. ప్రైవేట్ ఇంజనీరింగ్ కళాశాలలకు అడిగిన వెంటనే ఎన్‌సిటిఇ అనుమతులివ్వడంతో ఇంజనీరింగ్ కళాశాలలు తామరతంపరగా పుట్టుకొచ్చాయి. రాష్ట్రంలో 700లకు పైగా ఇంజనీరింగ్ కళాశాలలు వెలిశాయి. వీటిలో సగానికి పైగా రాజకీయ నాయకులకు చెందినవి కావడం విశేషం. ఇవి కనీస సౌకర్యాలూ, బోధనా సామగ్రి, ల్యాబ్‌లు, బోధనా సిబ్బంది లేకుండానే ఇవి కొనసాగుతున్నాయి. ఇంజనీరింగ్ విద్య ఎంతనాసి స్థాయికి దిగజారిందంటే, దేశంలో ఇంజనీరింగ్ పట్టా పొందిన వారిలో 19 శాతం మంది మాత్రమే ఒక ఉద్యోగాన్ని పొందగల నైపుణ్యం సంతరించుకోగలిగారని ఒక అనధికార సర్వే తెలిపింది. దీని ప్రకారం మన రాష్ట్రంలో ఉద్యోగం పొందే నైపుణ్యం పొందిన వారు 13 శాతంగానే ఉన్నారు. దీనితో ప్రైవేట్ కాలేజీలల్లో 3వ వంతు సీట్లు విద్యార్థులు చేరకుండా ఉండి పోతున్నాయి. కొన్ని కాలేజీల్లో ఒక్క విద్యార్థి కూడా చేరని స్థితి ఏర్పడింది. ప్రైవేట్ కళాశాలలు డొనేషన్లు, అధిక ఫీజులు వసూలు చేస్తున్నాయన్న సాకుతో ఫీ నిర్ణయించే పని ప్రభుత్వం చేపట్టింది. అత్యధిక కళాశాలలు పెట్టుబడిదారులవి, రాజకీయ నాయకులవే అయినందున రెండేళ్లకొకసారి ఫీ నిర్ణయించేందుకు (ఎఫ్ఆర్‌బి) కమిటీని నియమించింది. ప్రైవేట్ కళాశాలలు సమర్పించిన ఖర్చులను పరిశీలించి ఎంత ఫీ వసూలు చేయాలో ప్రభుత్వం నిర్ణయిస్తుంది. ఈ ఖర్చుల లెక్కలను చూసినప్పుడు, ఫీ రియింబర్స్‌మెంట్‌కు ఇంతవరకూ ఉమ్మడి రాష్ట్ర ప్రభుత్వం చేసిన ఖర్చుతో ప్రభుత్వమే ఇంజనీరింగ్ కాలేజీలను స్థాపించగలిగేది; అందరికీ ఉచిత నాణ్యమైన విద్యను అందించగలిగేదని స్పష్టమైంది. మరో మాటలో చెప్పాలంటే, ప్రైవేట్ కళాశాలలకు నష్టాలు రాకుండా చూసేందుకే ప్రభుత్వం ఫీరియింబర్స్‌మెంట్ పథకాన్ని ప్రవేశపెట్టింది.

ఐదేళ్లుగా ఈ పథకం కింద ప్రభుత్వం వెచ్చించిన మొత్తం లబ్ధిదారుల సంఖ్య ఇలా ఉంది.

**ఫీ రియింబర్స్‌మెంట్ కింద విడుదలైన మొత్తం**

| విద్యా సంవత్సరం | వ్యయం (కోట్లలో) | లబ్ధిపొందిన విద్యార్థుల సం |
|---|---|---|
| 2008-2009 | 1463 | 19,94,201 |
| 2009-2010 | 1567 | 23,91,736 |
| 2010-2011 | 2949 | 23,97,275 |
| 2011-2012 | 3569 | 23,98,386 |
| 2012-2013 | 4295 | 28,50,000 |
| 2013-2014 | 2238 | 28,34,999 |

ఒక్క తెలంగాణ ప్రాంతంలోనే 2011-12లో 1779 కోట్ల ఖర్చుతో 12.64 లక్షలు, 2012-13లో 2156 కోట్లతో 14.45 లక్షలు, 2013-2014లో 2091 కోట్ల ఖర్చుతో 14.32 లక్షల విద్యార్థులకు ఈ పథకం ద్వారా ప్రయోజనం కల్పించారు. అయితే తెలంగాణలో నాన్ లోకల్ కోటా కింది తెలంగాణేతరులు హైదరాబాద్‌లో ఉన్నత విద్యాసంస్థల్లో 39 వేల మంది ఉన్నారు. ఇందులో 23 వేల మంది ఇంజనీరింగ్‌లో, 10 వేల మంది ఇంటర్‌లో మిగిలిన 7 వేల మంది ఇతర కోర్సులల్లో చదువుతున్నారు.

ఆరున్నర దశాబ్దాలుగా తెలంగాణ ఉద్యమం దగా పడుతూ లేస్తూ నిరంతరాయంగా సాగింది. ఈ ఉద్యమం మా నీళ్లు, మా నిధులు, మా కొలువులు మాకేనని, రాజకీయ స్వేచ్ఛ కొరకేనన్నది మనందరికి తెలుసు. 2014 జూన్ 2న తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడినది. తెలంగాణలో టిఆర్ఎస్ పార్టీ అధికారంలోకి వచ్చింది. ప్రమాణాలు లేకుండా కేవలం డబ్బుల కొరకే నడుస్తున్న 174 ఇంజనీరింగ్ కళాశాలల గుర్తింపును రద్దు చేసింది. మరోవైపు రియింబర్స్‌మెంట్ పథకాన్ని కూడ రద్దు చేసింది. అయితే తెలంగాణ బిడ్డలకు మాత్రమే వర్తించే విధంగా 'ఫాస్ట్' పథకాన్ని అమలు చేస్తామంటూ, మార్గదర్శకాలను రూపొందించడానికి జూలై 30న జి.ఒ. 36 విడుదల చేస్తూ ఐదుగురు ఉన్నతాధికారులతో కూడిన ఒక ఉన్నతస్థాయి కమిటీని ఏర్పాటు చేసింది. ఆ కమిటీ సభ్యులుగా ఎస్.సి, పంచాయతీ రాజ్, సాధారణ పరిపాలన శాఖల ముఖ్య కార్యదర్శులు, ఉన్నత విద్య, న్యాయశాఖల కార్యదర్శులు సభ్యులుగా ఉన్నారు. ఈ ఉత్తర్వులను రద్దు చేయాలని కోరుతూ ఆంధ్ర ప్రాంతానికి చెందిన మాజీ మంత్రులు డొక్కా మాణిక్య వరప్రసాద్, పితాని సత్యనారాయణ (ప్రస్తుతం టిడిపి శాసన సభ్యులు) దాఖలు చేసిన పిటిషన్ విచారణ సందర్భంగా హైకోర్ట్ ధర్మాసనం 'ఫాస్ట్' మార్గదర్శకాలకు తుది రూపమివ్వవద్దని సెప్టెంబర్ 22న మౌఖికంగా ఆదేశించింది.

ఆంధ్రప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టంలోని సెక్షన్ 95కు, రాజ్యాంగంలోని ఆర్టికల్ 371(డి)కి 'ఫాస్ట్' వ్యతిరేకమన్నారు. కేవలం తెలంగాణ ప్రాంత విద్యార్థులకే ఫీజు చెల్లిస్తామనడం.. ఆంధ్ర ప్రాంత విద్యార్థులపై వివక్ష చూపడమేనన్నది పిటీషనర్ల వాదన. ఈ వాదనలను పరిగణలోకి తీసుకున్న హైకోర్ట్ ధర్మాసనం ఫాస్ట్ తీర్పు సందర్భంలో ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ కల్యాణ జ్యోతి సేన్ గుప్తా, జస్టిస్ పి.వి. సంజయ్‌కుమార్‌లు 'ఫాస్ట్' పథకం దేశ సమగ్రతకు, రాజ్యాంగ సమాఖ్య స్ఫూర్తికి విఘాతం కలిగిస్తుందని తీవ్రంగా మాట్లాడారు. ప్రధాన న్యాయమూర్తి 'మీకు ఆర్థిక ఇబ్బంది ఉంటే ఫీ రియింబర్స్‌మెంట్ పథకాన్ని రద్దు చేసుకునే అధికారం మీకుంది. రాజ్యాంగ విరుద్ధమైన ఆటంకాలు విధించే అధికారం మాత్రం లేదు. ఈ జి.ఒ.ను మేము అనుమతిస్తే అది విభజన వాదానికి, సమగ్రతా వ్యతిరేక చర్యలకు దారితీస్తుంది. దేశ సమగ్రతను కాపాడడానికి మనం కృషి చేయాలి. రాష్ట్రంలో అమలులో ఉన్న రాష్ట్రపతి ఉత్తర్వుల్లో ఉద్యోగాలు, విద్య విషయంలో పౌరుల స్థానికత నిర్ణయించడానికి ఇప్పటికే కొలబద్దలున్నాయి" అంటూ వ్యాఖ్యానించారు. ఈ సందర్భంగా ఎ.జి. జోక్యం చేసుకుంటూ.. ఫాస్ట్‌పై విధాన పరమైన నిర్ణయాన్ని తీసుకోవడానికే ఉన్నతస్థాయి కమిటీని ఏర్పాటు చేశామని.. ఆ జి.ఒ.ను సమర్థించుకోవడానికి తమ వద్ద తగిన ఆధారాలున్నాయన్నారు. ఈ వ్యవహారంలో పూర్తి వివరాలతో కౌంటర్ దాఖలు చేస్తామని, అందుకు గడువు కావాలని కోర్టును కోరారు. దీనికి అంగీకరించిన ధర్మాసనం.. రాష్ట్ర ప్రభుత్వం మూడు వారాల్లోగా కౌంటర్ దాఖలు చేయాలని, దీనిపై పిటిషనర్లు రెండు వారాల్లోగా రిప్లయి కౌంటర్‌లు దాఖలు చేయాలని ఆదేశిస్తూ తదుపరి విచారణను ఆరు వారాలకు వాయిదా వేసింది.

ప్రధాన న్యాయమూర్తి మాట్లాడుతూ కేంద్రం వసూలు చేసే పన్నుల నుండి రాష్ట్రాలకు వాటా ఇవ్వకుంటే ఎట్లా ఉంటుందని ప్రశ్నించారు. నిజానికి రాజ్యాంగం ప్రకారం కేంద్రానికి అత్యధిక అధికారాలను కేటాయించడం వల్ల రాష్ట్రాలు తమ స్వేచ్ఛను కోల్పోతున్నాయి. కేంద్ర, రాష్ట్ర అధికారాల మధ్య పునర్విభజన జరుగాలని రాష్ట్రాలకు స్వయం ప్రతిపత్తి కల్పించాలని చాలాకాలంగా చాలా రాష్ట్రాలు, ప్రతిపక్షాలు డిమాండ్ చేస్తున్నాయి. రాష్ట్రాలపై కేంద్రం తన ఆధిక్యతను చాటుకోవడానికి రాష్ట్రాలకు న్యాయంగా రావాల్సిన వాటా ఇవ్వడం లేదన్న ఆరోపణలు కోకొల్లలుగా ఉన్నాయి. కేంద్రం, రాష్ట్రాలపై పెత్తనం చెలాయించడం వల్ల కేంద్ర, రాష్ట్రాల మధ్య సమన్వయం లోపించి ఆర్థికపరమైన వివాదాలు తలెత్తుతున్నాయి. రాష్ట్రాలు తరచుగా తమకు ఎక్కువ అధికారాలు, వనరులు, స్వయం ప్రతిపత్తి కావాలని కేంద్రంతో పోరాడుతూనే ఉన్నాయి. కేంద్రంలో ఒక పార్టీ రాష్ట్రంలో మరో పార్టీ అధికారంలో ఉన్నప్పుడు వివక్షత స్పష్టంగా కనిపిస్తుంది. ఈ వివాదాలను పరిష్కరించడానికి కేంద్ర, రాష్ట్ర సంబంధాలను సమీక్షించడానికి కేంద్రం పలు కమిషన్‌లను వేసిన చరిత్ర కూడా మనదేశంలో ఉంది. అయితే మన న్యాయమూర్తులకు అధికారాల వికేంద్రీకరణ కంటే, కేంద్రీకరణే న్యాయసమ్మతంగా తోచినట్లుంది.

ఆంధ్రప్రదేశ్ టిడిపి ప్రభుత్వం ఫీజు రియింబర్స్‌మెంట్ పట్ల తన వైఖరేమిటో చెప్పకుండా టిఆర్ఎస్ మీద విరుచుకుపడడం సాగిస్తున్నది. తెలంగాణలో చదువుకుంటున్న ఆంధ్ర విద్యార్థులకు అన్యాయం చేస్తున్నాడంటూ కెసిఆర్‌పై దుమ్మెత్తి పోస్తున్నది. విభజన చట్టం ప్రకారం కాలేజీల్లో ప్రవేశాల హక్కు తనకి ఉందంటూ వివాదం రేపింది. దీనికి ప్రతిగా తెలంగాణ ఉన్నత విద్యా కౌన్సిల్‌ను ఏర్పరచి కెసిఆర్ తెలంగాణలో ప్రవేశాలు తామే చేసుకుంటామంటూ ఆజ్యం పోశాడు. చివరకు సుప్రీంకోర్టుకు చేరారు. విభజన చట్టం ప్రకారం ప్రవేశాలు జరుపమని సుప్రీంకోర్టు చెప్పడంతో ఇరువురూ కలిసి ప్రవేశాలు జరిపేందుకు పూనుకున్నారు. గత సంవత్సరం తెలంగాణ జిల్లాల్లో 1 లక్ష 20 వేల మంది విదార్థులు చేరగా, ఈ సంవత్సరం ఆ సంఖ్య 55 వేలకే పరిమితమైంది. ఫీ రియింబర్స్‌మెంట్ సమస్యను మాత్రం కోర్టూ తేల్చలేదు. ప్రవేశాలు జరిపే రెండు ప్రభుత్వాలూ ఫీ రియింబర్స్‌మెంట్‌పై తమ వైఖరి ఏమిటో మాత్రం చెప్పలేదు. చంద్రబాబు ఫీ భారాన్ని 52:48గా భరిద్దామని ఒక ప్రతిపాదన చేశారు. అయితే ఉన్నత విద్య చదివే తెలంగాణ వారు 48 శాతం లేరు. ఉమ్మడి ప్రవేశాలకు అవకాశం కల్పించినా ఫీ రియింబర్స్ చేయాలన్న నిబంధన ఏమిలేదు.

ఆంధ్రప్రదేశ్, తెలంగాణ రాష్ట్రాల మధ్య వివాదంగా మారిన ఈ అంశంపై హైకోర్టు వ్యాఖ్యలు, తదుపరి అనుసరించాల్సిన వ్యూహంపై సిఎం కెసిఆర్ అడ్వకేట్ జనరల్ రామకృష్ణారెడ్డి, న్యాయ శాఖ కార్యదర్శి సంతోష్‌రెడ్డి, ముఖ్య కార్యదర్శులు జె.రేమండ్ పీటర్, డాక్టర్ టి.రాధతో చర్చించారు. దీంతో పాటే 'ఫాస్ట్' మార్గదర్శకాలను ఖరారు చేయాలని ఆయన ఆదేశించారు. కోర్టు వ్యాఖ్యలు తీర్పు కాదని, కంగారు పడాల్సిన అవసరమే లేదని సీఎం వారికి భరోసా ఇచ్చినట్లు తెలుస్తుంది. న్యాయస్థానం వ్యాఖ్యలకు భయపడి, మార్గదర్శకాలు మార్చితే తెలంగాణలోని ఒక తరం విద్యార్థులు నష్టపోతారని, ఒక రాష్ట్ర విద్యార్థులకు ఫీజులు చెల్లించుకుంటూ పోతే, మున్ముందు పంజాబ్, తమిళనాడు, మహారాష్ట్ర, కర్ణాటక వారు కూడా ఫీజులు చెల్లించాలని కోరే ప్రమాదం ఉందని ప్రభుత్వం భావిస్తున్నది.

తెలంగాణలో గత ఆరున్నర దశాబ్దాలుగా లక్షలాది మంది తెలంగాణేతరులు చట్టానికి భిన్నంగా ఉద్యోగాలల్లో చేరారు. వారి బిడ్డలు హైదరాబాదులోనే విద్యాభ్యాసం చేశారు. రాష్ట్రపతి ఉత్తర్వులు, రాజ్యాంగంలోని 371డి ప్రకారం పాఠశాల విద్యలో నాలుగు సంవత్సరాలు హైదరాబాద్‌లో చదివితే స్థానికత అర్హత చేకూరుతుంది. గత ఐదున్నర దశాబ్దాలుగా హైదరాబాదులో స్థిరపడిన తెలంగాణేతర్ల సంతానం స్థానికతకు అర్హులవుతారు. రాష్ట్రం ఏర్పడిన తర్వాత రాష్ట్ర ప్రభుత్వం తమ ప్రాంత విద్యార్థులకు వర్తించే విధంగా 'ఫాస్ట్' పథకాన్ని అమలు చేయడం రాజ్యాంగ విరుద్ధం ఎట్లా అవుతుంది? అక్రమంగా ఉద్యోగాల్లో చేరిన వారిని బయటికి పంపడానికి బదులు వారి భారాన్ని, వారి పిల్లల భారాన్ని తెలంగాణ ప్రభుత్వమే భరించాలనడం సమంజసమేనా? దేశంలో ఏ రాష్ట్రంలోనైనా రాష్ట్రేతర ప్రజలకు తమ సంక్షేమ పథకాలను, ఉద్యోగాలను బయటి వారికి తమ పౌరులతో సమానంగా వర్తింపజేస్తున్నాయా? ఏ రాష్ట్రంలో లేని విధానం మన రాష్ట్రంలో ఎందుకు అమలు చేయాలి? తెలంగాణ యువత ఇంతకాలం అన్యాయం జరిగిందని ఉద్యమించినా ఫలితాలు దక్కకపోతే నైరాశ్యం చెందరా? న్యాయమూర్తులకు ఉద్యమ నేపథ్యం, ఉద్యమకారుల ప్రజాస్వామిక ఆకాంక్షలు పట్టవా? అన్యాయానికి, అక్రమాలకు చట్టబద్ధత కల్పించడమే న్యాయమా? ప్రధాన న్యాయమూర్తి చాలా తేలికగా, పూర్వపరాలు ఆలోచించకుండా విచక్షణ రహితంగా వ్యాఖ్యలు చేసినట్లు భావించాల్సి వస్తుంది. నిజానికి 'ఫాస్ట్' పథకం తెలంగాణ విద్యార్థుల సంక్షేమానికి సంబంధించినది. తెలంగాణ ప్రభుత్వం స్వేచ్ఛకు సంబంధించిన హక్కు.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమనాయకులు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)* వీ

# కెసిఆర్ సింగపూర్ పర్యటన

***చాలా సందర్భాల్లో రాజకీయ నాయకుల విదేశీ పర్యటనల అసలు ఉద్దేశాలు వేరే ఉంటాయని, దాంట్లో భాగంగానే కెసిఆర్ సింగపూర్ పర్యటన వెనుక ఉన్న అసలు ఉద్దేశాలను వెతకాలని అంటున్నారు*** **నర్సింహా**

ప్రధానమంత్రులతో, రాష్ట్రపతులతో కలిసి విదేశీ పర్యటనలకు వెళ్లిన ఒక ప్రముఖ ఆంగ్ల పత్రిక జర్నలిస్టు ప్రైవేట్ సంభాషణలో చెప్పిన విషయం ఏమిటంటే, కొన్ని సంవత్సరాల క్రితం అప్పటి రాష్ట్రపతి, 'దీపం ఉండగానే ప్రజల ధనంతో నా ఇళ్లు చక్కబెట్టుకోవాలి' అనే 'ఎన్నికల ప్రజాస్వామ్య' సూత్రం ప్రకారం, తన సంతానంలో ఒకరు స్థాపించిన స్వచ్ఛంద సేవా సంస్థకు తన అధికార పలుకుబడితో విదేశాల్లో భారీ నిధులు రాబట్టడానికి, ప్రజాధనంతో రాష్ట్రపతి ప్రత్యేక విమానంలో యూరప్ దేశాల పర్యటనకు వెళ్లారు. కోట్లాది రూపాయల నిధులు ప్రతి ఏటా ఆ సేవా సంస్థకు పేదరిక, నిరుద్యోగ నిర్మూలనల పేరు మీద ఇప్పటికీ వస్తూనే ఉన్నాయని ఆ విలేఖరి అన్నారు. ఈ స్వచ్ఛంద సేవా సంస్థలు ఎవరికి సేవ చేస్తున్నాయో కాని పేదరికం మాత్రం పెరుగుతూనే ఉంది.

ఆ విలేఖరే ఇంకా ఏమన్నాడంటే, 'ప్రపంచ వ్యాప్తంగా వివిధ దేశాల అధిపతుల విదేశీ పర్యటనల వెనుక ఉద్దేశాలు కొన్ని సందర్భాలలో మాత్రం కచ్చితంగా ప్రజలకు చెపుతున్న కారణాలకు భిన్నంగా ఉంటాయి. పెట్టుబడుల ఆకర్షణ కొరకు, ఒప్పందాల కొరకు, ద్వైపాక్షిక సంబంధాల మెరుగు కొరకు తమ విదేశీ పర్యటన అని ప్రజలకు చెప్పుతారు. ప్రజా ధనంతో ఈ విదేశీ పర్యటనలలో తమ వ్యక్తిగత పనులు చేసుకోవడం, నల్లధనాన్ని విదేశీ బ్యాంకులలో దాచుకోవడం, తమ విదేశీ ఆస్తుల బాగోగులు చూసుకోవడం, ఇతర దేశాలను చూసి రావడం, చివరికి 'చిలిపి' పనులు చేయడానికి అధికారిక విదేశీ పర్యటనలు చేసిన సందర్భాలు కోకొల్లలు. మన దేశ నాయకులు ఇలాంటి పర్యటనలు చేస్తారా లేదా అనేది మీ ఆలోచన శక్తికే వదిలేస్తున్నాను' అంటూ ముగించారు. నిజంగా వారు తాము చెప్పిన కారణాల కొరకే వెళ్లినా, ఆ విదేశీ పర్యటన వలన పాలక వర్గాలకే లాభం. ప్రజలకు నష్టమే తప్పించి లాభం ఏమీ లేదు.

ఒక పరిశోధనాత్మక విలేఖరికి ఆసక్తి కలిగించే అంశాలు ఎన్నో కెసిఆర్ సింగపూర్ పర్యటనలో ఉన్నాయి. 30 ఏళ్ల నుండి ప్రజా ప్రతినిధిగా ఉన్న కెసిఆర్ ఇంతవరకు విదేశాలకు వెళ్లలేదు. ముఖ్యమంత్రి అయిన తరువాత సింగపూర్ పర్యటన మొదటిది. ఇప్పుడే విదేశాలకు ఎందుకు వెళ్లారు? సింగపూరే ఎందుకు వెళ్లారు? తన ఆసక్తితో వెళ్లారా? ఎవరైనా పిలిచారా? పిలిస్తే ఎవరు పిలిచారు? ఆ పిలిచిన వారు కెసిఆర్‌నే ఎందుకు ఎన్నుకున్నారు? కొత్త రాష్ట్రానికి ముఖ్యమంత్రి అయినందుకు పిలిచారని అంటారా? అయితే, భారతదేశంలో కొత్త రాష్ట్రం ఏర్పడితే విదేశాల్లో ఉన్న వారికి ఏమి అవసరం?

రాజకీయ మాయాజాలంలో జరిగే అంతఃపుర రహస్యాలన్ని ఇంటర్నెట్‌లో దొరుకుతాయని నమ్మడం అత్యాశే అయినప్పటికీ, నా ముందు ఉన్న ఒకే ఒక మార్గం అదే కాబట్టి ఇంటర్నెట్‌లో వెతకడం మొదలుపెట్టాను.

మామూలుగా ప్రధానమంత్రులనూ, ముఖ్యమంత్రులనూ అక్కడి ప్రభుత్వాలు లేదా పారిశ్రామికవేత్తల సంఘాలు పిలుస్తాయి. కెసిఆర్‌ను పిలిచింది ఈ రెండూ కావు. ఎలాగూ అక్కడికి వెళ్లారు కాబట్టి అక్కడి ప్రధానమంత్రిని ఆయన కలిశారు కాని, నిజానికి ఆయనను పిలిచింది ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మేనేజ్‌మెంట్ (ఐఐఎం) పూర్వ విద్యార్థుల సంఘం. వాళ్లు ఏటా జరుపుకునే కార్యక్రమానికి ఆయనను ఆహ్వానించారు.

ఐఐఎంలను భారత ప్రజల పన్నుల నుండి ప్రభుత్వం నడుపుతున్నది. ఐఐఎం నుండి చదువుకున్న వారిలో మెజారిటీకి తమ చదువుకు కారణమైన అశేష భారత ప్రజలంటే ప్రేమ ఉండదు. ప్రేమే ఉండదు కాబట్టి కృతజ్ఞత అసలే ఉండదు. ఐఐఎంలో సీటు వచ్చిందని తెలిసిన రోజు నుండే వారు తమకు తాము దేవుళ్ల వలె ఊహించుకుంటారు. ఈ ప్రపంచాన్ని దోచుకుంటున్న సామ్రాజ్య వాదుల బహుళ జాతి కంపెనీలలో, వారితో పార్ట్‌నర్లుగా ఉన్న భారత పెట్టుబడిదారుల కార్పొరేట్ కంపెనీలలో కీలక నిర్ణయాలు తీసుకునే స్థానంలో కేవలం ఐఐఎం విద్యార్థులకే ఉద్యోగాలు ఇస్తారు కాబట్టి వారు తమ చదువులకు కారణమైన ప్రజలను అసలు మనుషులుగా పరిగణించరు. అందుకే ఐఐఎం విద్యార్థులను 'ఇంపీరియలిస్ట్స్ ఇండియన్ మీడియేటర్స్' అంటే 'సామ్రాజ్యవాదుల భారత దళారీలు' అని పిలువడం సమంజసం.

ఇలాంటి 'దేశభక్తులు' ప్రతి ఏటా విదేశాల్లో మాత్రమే జరుపుకునే తమ కార్యక్రమానికి కెసిఆర్‌ను ఆహ్వానించారు. ఐఐఎం పూర్వ విద్యార్థులు భారత ప్రజలను ఎంతగా ప్రేమిస్తారో అంతకంటే ఎక్కువగా కెసిఆర్ ప్రేమిస్తారు. కాబట్టి తన గురుతర బాధ్యతగా అక్కడికి వెళ్లారు. మొత్తం ప్రపంచంలోనే యూదు, మార్వాడీ వ్యాపారులు అత్యంత వ్యాపార మనస్తత్వం కల వారిగా పేరుగాంచారు. అలాంటి మనస్తత్వం కల వారే ఐఐఎం చదివిన విద్యార్థులు. ఒక వ్యక్తితో లాభం లేదనుకున్నప్పుడు మాట్లాడడం కాదు కనీసం కంటితో చూడడం కూడా వనరుల దుర్వినియోగంగా వారు భావిస్తారు. ఐఐఎం (కోల్‌కత్తా) లోని విద్యార్థుల మెస్ ప్రవేశ ద్వారంపై 'దేర్ ఈజ్ నథింగ్ కాల్డ్ ఫ్రీ లంచ్' (ఏదీ ఉచితంగా దొరకదు) అని రాసి ఉంటుంది. పూటకు తిండిలేని నిరుపేదల నుండి కూడా రకరకాల పన్నులను గుంజుతూ, ఆ పన్నుల నుండి నడుపుతున్న ఐఐఎం విద్యాసంస్థలలో దాదాపు ఉచితంగా చదువుకున్న వీరు చదువు అయిపోగానే 'ప్రజలకు ఏదీ ఉచితంగా ఇవ్వకూడదు' అనే లెక్చర్లు

ఇస్తారు. సబ్సిడీలు, ప్రజా ప్రయోజన పథకాలు దేశాన్ని నాశనం చేస్తున్నాయని అంటారు.

ఏ పని కూడా ఉచితంగా చేయడం కనీసం కలలో కూడా ఊహించుకోలేని ఈ 'దేశభక్తులు' కెసిఆర్‌ను ఉచితంగా సింగపూర్ పిలువడం అసంభవం. వారి గురించి తెలిసిన ఎవరు కూడా దీన్ని నమ్మరు. ఏదో జరిగింది. అదేమిటి?

ఐఐఎం పూర్వ విద్యార్థుల సంఘం ప్రతిఏటా సింగపూర్‌లో జరుపుకునే 'ఇంపాక్ట్' అనే కార్యక్రమం కొరకు వారు ఏర్పరుచుకున్న వెబ్‌సైట్‌ను ఎట్టకేలకు దొరకబట్టి దాని గత చరిత్ర ఏమిటో పరిశోధిస్తే, వారికి గతంలో ఎప్పుడు కూడా మనదేశ రాజకీయ నాయకులను ఆహ్వానించిన చరిత్ర లేదు. కేవలం కార్పొరేట్ రంగంలో పెద్దస్థాయి ఉద్యోగాలు చేసే వారిని మాత్రమే పిలుస్తారు. ఇతరులతో సంబంధాలు అభివృద్ధి చేసుకునే (నెట్ వర్కింగ్), నేర్చుకునే అవకాశంగా ఆ వేదికను వాడుకుంటున్నారు. కాబట్టి రాజకీయ నాయకుల అవసరం వారికిలేదు.

ఇలాంటి సంస్థల కార్యక్రమాలు (అది కూడా మూడు రోజులు) ఐదు లేదా ఏడు నక్షత్రాల హోటళ్లలో మాత్రమే జరుగుతాయి. తాము పిలిచిన ఉపన్యాసకుల విమాన ఖర్చులు, వారికి ఆ హోటల్‌లో వసతి, భోజనాలు, ఇతర ఖర్చులు చాలా పెద్దస్థాయిలో ఉంటాయి. ఈ ఖర్చులను ఆ సంస్థ సభ్యులు భరించరు. అందునా ఇది ఐఐఎం పూర్వ విద్యార్థుల సంఘం కాబట్టి వారు కలలో కూడా భరించరు. అందుకే, ఖర్చులను భరించగలిగే బడా కంపెనీలను పట్టుకుంటారు. అయితే సింగపూర్‌లో జరిగే కార్యక్రమానికి స్పాన్సర్ చేయడం వలన భారతదేశ కంపెనీకి ఏమీ లాభం లేదు. అందుకే ఈ కార్యక్రమ చరిత్రలో మొత్తంగా సింగపూర్ కంపెనీలే స్పాన్సర్లుగా ఉన్నాయి.

కాని కెసిఆర్‌ను పిలిచిన ఈ సారి మాత్రమే అనూహ్యంగా ఒకే ఒక భారత కంపెనీ ప్రీమియం స్పాన్సర్‌లలో ఒకటిగా ఉంది. అది హైదరాబాద్ కేంద్రంగా నడుస్తున్న కంపెనీ. అది సీమాంధ్ర పెట్టుబడిదారుని కంపెనీ. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే దాని పేరు ట్రాన్స్‌ట్రాయ్. దాని యజమాని రాయపాటి సాంబశివరావు.

'రాయపాటి, లగడపాటి, మేకపాటి వీరు తెలంగాణ శత్రువులు. వీరు తెలంగాణ రాకుండా అడ్డుకుంటున్నారు' అని తెలంగాణ ఉద్యమంలో విన్నమాటే. అలాంటి తెలంగాణ శత్రువు ప్రీమియం స్పాన్సర్‌గా ఉన్న, విదేశంలో జరుగుతున్న ఒక కార్యక్రమానికి తెలంగాణ స్వయంపాలనలో మొట్టమొదటి ముఖ్యమంత్రికి ఆహ్వానం రావడం యాదృచ్ఛికమా, క్విడ్-ప్రో-కో (పరస్పర లాభం) లో భాగమా? ఎన్నడూ భారతదేశం నుండి రాజకీయ నాయకులను పిలువని ఒక సంస్థ ఈ సారే ఆహ్వానించడమేమిటి? ఎన్నడూ విదేశాలకు వెళ్లని నాయకుడు ఈ సారే విదేశాలకు వెళ్లడమేమిటి? ఎన్నడూ విదేశాల్లో జరిగే సభలకు స్పాన్సర్‌గా ఉండని సంస్థ ఈ సారే ఉండడమేమిటి? ఇవన్ని ఒకేసారి జరగడమేమిటి?

ట్రాన్స్‌ట్రాయ్ కంపెనీకే పోలవరం కాంట్రాక్ట్ వచ్చింది. తెలంగాణ లోని ఏడు మండలాలను ఆంధ్రప్రదేశ్‌లో కలుపడం పైగానీ, మొత్తంగా పోలవరం ప్రాజెక్టు పైగానీ, తెలంగాణ ప్రభుత్వం సుప్రీం కోర్టుకు వెళ్లవచ్చు. ఆ ప్రాజెక్టును న్యాయ పోరాటం ద్వారా ఆపవచ్చు. కనీసంగా ఐదు, పది సంవత్సరాల వరకు కట్టకుండా నిలిపి వేయవచ్చు. ఇది ఏది చేయకుండా చేతులు దులుపుకున్న తెలంగాణ ప్రభుత్వాధిపతికి సింగపూర్ పర్యటనకు పోలవరం కాంట్రాక్టర్ స్పాన్సర్ చేశాడా?

హైదరాబాద్ చుట్టుపక్కల భారీస్థాయిలో రాయపాటికి ఆస్తులు ఉన్నాయి. అటు విలువలు ఇటు మానవ విలువలు ప్రజాస్వామిక అతిక్రమిస్తేనే భారీ ఆస్తులు సంపాదించగలుగుతారు. అలా సంపాదించడం వారి బలహీనత. వారిపై ప్రజలు తిరగబడకుండా రాజ్యం ద్వారా అక్రమ ఆస్తిపరులను, వారి ఆస్తిని రక్షించడమే తమ రాజ్యాంగ బాధ్యతగా ప్రజా ప్రతినిధులుగా చెప్పబడుతున్న వారు ప్రవర్తిస్తున్నారు. అది వారి బలహీనత. మొత్తంగా ఇది ఈ వ్యవస్థలో ఉన్న బలహీనత.

ట్రాయ్ అనే కథ ఒకటి గ్రీక్ పురాణాలలో ఉంది. దాంట్లో 'అకిలీజ్ హీల్' అనే ఒక వ్యక్తీకరణ ఉంది. దానర్థం ఒక వ్యక్తికి ఉండే బలహీనత. పాలక వర్గాలు తమలో ఒకరికి ఉండే బలహీనతలను ఇంకొకరు వాడుకుంటూ ప్రజలను దోచుకుంటున్నారు. అయితే, అదే ట్రాయ్ కథలో ట్రోజన్ హార్స్ అనే వ్యక్తీకరణ ఉంది. నష్టం కలిగించాలనే ఉద్దేశం లోపల ఉంచుకొని బయటకు మాత్రం తద్విరుద్ధంగా నటిస్తూ, అవకాశం కొరకు వేచి చూడడం అనేది క్లుప్తంగా దీనర్థం. దీని నుండే ట్రోజన్ అనే పదం సాఫ్ట్‌వేర్‌లో వాడుతున్నారు. మనకు పనికి వస్తుందని అనుకొని డౌన్‌లోడ్ చేసుకొని ఇన్‌స్టాల్ చేసిన తర్వాత మనకు నష్టం చేసే వైరస్‌ను ట్రోజన్ అంటారు.

పరస్పర లాభం కొరకు ప్రజలను దోచుకుంటూ పైకి మాత్రం తాము ప్రజలను ప్రేమిస్తున్నట్టుగా నటిస్తున్న పాలకవర్గమనే ట్రోజన్‌ల నుండి భారతదేశ ప్రజలు తమను తాము విముక్తి చేసుకోక తప్పని పరిస్థితులు వచ్చాయి.

*(రచయిత పరిశోధకులు)* వీ

**రాబోయే సంచికలలో...**

- **కార్పొరేట్ కంపెనీల సేవలో తరిస్తున్న బ్యాంకులు - డా. శ్రీనివాసరావు చొప్పర**
- **ప్రపంచీకరణలో భారతీయ వ్యవసాయ రంగం - పోలం సైదులు**
- **మిశ్రమ ప్రణాళికా సంఘం - పి.ఎస్.వి. ప్రసాద్‌బాబు**
- **భారతదేశానికి చరిత్ర లేదా? - డా. పట్టా వెంకటేశ్వర్లు**
- **స్వచ్ఛతలేని మోడీ రాజకీయ ప్రయాణం - వై.ఎచ్.కె. మోహన్‌రావు**

# తెలంగాణ వాదానికీ దూరమౌతున్న తెరాస పాలన

*తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ విధానాలలో, ఆచరణలో తెలంగాణవాదపు విలువలు కూడ కనుమరుగవుతున్నాయని విశ్లేషిస్తున్నారు* **ఎన్. వేణుగోపాల్**

**తె**లంగాణ రాష్ట్ర సమితి పాలన నాలుగు నెలలు తిరగకుండానే తన మౌలిక భూమిక అయిన తెలంగాణ వాదం నుంచి కూడ దూరమవుతున్నట్టు కనబడుతున్నది. తెరాస కూడ తెలంగాణ వాదాన్ని ఒక ప్రజాకర్షక, ప్రజామోద వాదంగా మాత్రమే ఎంచుకున్నదేమో, అధికారానికి వచ్చిన తర్వాత ఒక పాలక పార్టీగా పాలకవర్గ ప్రయోజనాలకు, అంటే ఆరు దశాబ్దాలుగా అమలులో ఉన్న ప్రయోజనాలకు అనుగుణంగానే పనిచేస్తున్నదేమో అనిపిస్తున్నది. అటువంటి అంచనాకు రావడానికి నాలుగు నెలల కాలం సరిపోదని అనుకునేవాళ్లు ఉండవచ్చు. కాని ఇప్పటి వరకూ ప్రభుత్వం చేపట్టిన పనులనూ, వాటి దిశనూ చూస్తే, భవిష్యత్తులో ఏవైనా గుణాత్మకమైన మార్పులు జరిగితే తప్ప, ఈ పాలన పాత పాలనల కొనసాగింపేనని, కొన్ని విషయాలలో పాతపాలనలను మించిపోతున్నదని చెప్పడానికి ఎన్నో ఆధారాలు కనబడుతున్నాయి.

తెలంగాణ వాదమంటే ఏమిటో కచ్చితంగా నిర్వచించుకుంటేగాని తెరాస ప్రభుత్వం దాన్ని ఎంతవరకు పాటిస్తున్నదో, ఎక్కడ దూరం జరిగిపోతున్నదో అర్థం కాదు. తెలంగాణ రాష్ట్ర సమితి ఏమనుకుంటే అదే తెలంగాణ వాదం అనుకోవడానికి వీలులేదు. ఎందుకంటే తెరాస పుట్టడానికి ఐదు దశాబ్దాల ముందునుంచే తెలంగాణ ప్రజలలో తెలంగాణ వాదం ఉంది. తెరాస పుట్టినది 2001లో కాగా. తెలంగాణ ప్రత్యేక అస్తిత్వ ఆలోచనలు 1954లో ఫజలలీ కమిషన్ ముందుకు వచ్చిన వాదనలతో మొదలయ్యాయి. అలా ప్రారంభమైన తెలంగాణ వాదం 1956 పెద్దమనుషుల ఒప్పందంలో, 1957-68 ప్రాంతీయ మండలి వాదనలలో, 1969-72 ప్రత్యేక తెలంగాణ ఉద్యమాలలో, 1996లో ప్రారంభమైన మలిదశ ఉద్యమంలో అనేకరకాలుగా వ్యక్తమయింది. ఆ వాదానికి పార్లమెంటరీ రాజకీయ వేదిక మీద ఒక వ్యక్తీకరణగా 2001లో తెరాస ఏర్పడింది. ఆ తర్వాత పదమూడు సంవత్సరాలలో కూడ తెరాసతో పాటు వేరువేరు ప్రజాసమూహాలు, రాజకీయపక్షాలు, ప్రజాసంఘాలు, మేధావులు తెలంగాణ వాదాన్ని ప్రకటిస్తూ, సవరిస్తూ, అభివృద్ధి చేస్తూ వచ్చారు. తాను పుట్టేనాటికే స్థిరపడి ఉన్న తెలంగాణ వాదానికి తెరాస పదమూడు సంవత్సరాల ఆచరణలో మార్పుచేర్పులు కూడ చేసి ఉండవచ్చు. మొత్తానికి ఈ ఐదు దశాబ్దాల చరిత్రలో తెలంగాణవాదం ఎన్ని వ్యక్తీకరణలు పొందినా, ఆ సూక్ష్మమైన తేడాలను పక్కనపెట్టి స్థూలంగా తెలంగాణ వాదం అని ఎవరైనా గుర్తించదగినదీ, అంగీకరించదగినదీ ఉంది. దాని ప్రకారం:

- తెలంగాణ వనరులు (భూమి, నీరు, ఖనిజాలు, అడవులు) మొదట తెలంగాణ ప్రజలకే దక్కాలి
- తెలంగాణ వనరులతో తెలంగాణ ప్రజలకు విద్యా, ఉద్యోగ, అభివృద్ధి అవకాశాలు, ప్రయోజనాలు దక్కాలి
- తెలంగాణ వనరులను తెలంగాణేతరులు దోచుకోవడానికి అవకాశం ఉండగూడదు
- తెలంగాణ ప్రజలకు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు కావాలి
- తెలంగాణ ప్రజల ఆత్మగౌరవాన్ని భంగపరచగూడదు
- తెలంగాణ ప్రజల సంస్కృతికి, చరిత్రకు, భాషకు, సాహిత్యానికి సముచిత గౌరవం దక్కాలి
- పైవన్నీ సాధించాలంటే తెలంగాణకు స్వీయ రాజకీయ అస్తిత్వం, స్వయంనిర్ణయాధికారం, స్వయం పాలన కావాలి

ఇదీ ప్రధానంగా తెలంగాణ వాదం. కాని తెలంగాణ అనేది ఒక ఏకశిలాసదృశమైన ముద్ద కాదు. తెలంగాణలో భిన్న కులాలకు, మతాలకు, వర్గాలకు, భాషలకు, ప్రాంతాలకు చెందిన, వేరువేరు వనరుల లభ్యత స్థితిలో ఉన్న ప్రజలు ఉన్నారు. అందువల్ల 'తెలంగాణ వాదం' అస్పష్టమైనదీ, అనిర్దిష్టమైనదీ అవుతుంది. ఆ వాదాన్ని మరింత అభివృద్ధి చేసి, మరింత నిశితంగా, సూక్ష్మస్థాయిలో నిర్వచించవలసి ఉంటుంది. 'తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం వస్తే మాకేమి వస్తుంది' అని భిన్న సామాజికవర్గాలు, కులాల, ప్రాంతాల, ఆదాయవర్గాల సమూహాలు ఉద్యమక్రమంలోనే ప్రశ్నలు లేవనెత్తడం మనకు తెలుసు. అప్పటి ఉద్యమ ఐక్యత అవసరాల దృష్ట్యా ఆ చర్చను తెలంగాణ వచ్చినతర్వాత చేయవచ్చునని వాయిదా వేయడం జరిగింది. తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం ఏర్పడిన తర్వాత, ఆ చర్చ విస్తృతంగా జరిగి, ప్రతి ప్రాంతానికీ, ప్రతి సామాజికవర్గానికీ, ప్రతి సమూహానికీ న్యాయమైన సమాధానం దొరికి ఉండవలసింది. ఆ పని ప్రారంభమే కాలేదు సరిగదా, అసలు ఆ అస్పష్ట, అనిర్దిష్ట తెలంగాణ వాదానికి కూడ భిన్నమైన, వ్యతిరేకమైన రాజకీయార్థిక పాలనా విధానాలు ప్రారంభమయ్యాయి.

స్థూలమైన తెలంగాణ వాదాన్ని వాస్తవికతలోకి అనువదిస్తే తెలంగాణలోని నీళ్లు, నిధులు, నియామకాలు తెలంగాణ భూమిపుత్రులకే దక్కాలని ఒక అర్థం చెప్పుకున్నాం. దాన్ని ఇంకా విస్తరించి తెలంగాణలోని భూమి తెలంగాణేతరులు కొల్లగొట్టగూడదని, ఆ భూమిని తెలంగాణ ప్రజల అభ్యున్నతి కోసమే వాడాలని, తెలంగాణ సహజ వనరులతో ఏర్పాటయ్యే పరిశ్రమలకు ప్రథమ ప్రాధాన్యత తెలంగాణ ప్రజల అవసరాలు తీర్చడమే కావాలని, తెలంగాణ పాలనా విధానాలు తెలంగాణ ప్రజల ప్రయోజనాలకు అనుగుణంగా ఉండాలని, అణచివేతకు, విస్మరణకు గురైన తెలంగాణ సంస్కృతికి సముచిత స్థానం దక్కాలని అర్థం చెప్పుకున్నాం. తెలంగాణకు న్యాయంగా దక్కవలసిన జలవనరుల వాటాను ఉమ్మడి రాష్ట్రంలో ఇతర ప్రాంతాలకు తరలించారని, ప్రత్యేక రాష్ట్రం ఏర్పడితే తెలంగాణ జలాలు తెలంగాణకే దక్కుతాయని, తద్వారా తెలంగాణ భూమి ఎక్కువగా సాగులోకి వచ్చి, తెలంగాణ రైతాంగ సమస్యలు తగ్గి, తెలంగాణ గ్రామీణ వికాసం

జరుగుతుందని అనుకున్నాం. ఉమ్మడిరాష్ట్రంలో తెలంగాణ సహజ వనరులను ఇతర ప్రాంతాలకు తరలించారని, ఇక్కడి వనరులను, ఖనిజాలను ఉపయోగించి ఇక్కడే పరిశ్రమలు పెట్టినప్పుడు కూడ ప్రాంతీయులకు ఉద్యోగాలు, ఉపాధి అవకాశాలు దక్కలేదని, తెలంగాణ ఏర్పడితే తెలంగాణ ప్రజలకు అనుకూలమైన పారిశ్రామిక విధానం అమలవుతుందని, ఇక్కడి వనరులతో మరొక ప్రాంతం వారు లాభపడడానికి అంగీకరించబోమని, ఇక్కడి పరిశ్రమలు ఇక్కడివారికే ఉద్యోగాలు ఇస్తాయని అనుకున్నాం. ఉమ్మడి రాష్ట్ర పాలనా విధానాలు తెలంగాణ ప్రాంతీయులకు అన్యాయం జరిగేలా తయారయ్యాయని, తెలంగాణ ఏర్పడితే పాలనా విధానాలు తెలంగాణ ప్రజల ప్రయోజనాల కోసమే తయారవుతాయని అనుకున్నాం.

ఇవన్నీ ఏవో కొన్ని సమూహాలు కన్న కలలు మాత్రమే కావు, ఇవాళ నిర్ణయాధికారం దక్కిన నాయకులలో ప్రతి ఒక్కరూ వందలాది సభలు, సమావేశాల్లో ఒకటికి పదిసార్లు చెప్పిన మాటలే. ఆ మాటలు చెప్పినవారికి అధికారం దక్కి నాలుగు నెలలు గడిచిపోయాయి. ఆరు దశాబ్దాల ఉమ్మడి రాష్ట్రపు వారసత్వంగా వచ్చిన సమస్యలు, ఆంధ్రప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టం 2014 లోని లొసుగులు, ఇవాళ్టికీ కాచుకుని కూచుని మోసగించడానికి ప్రయత్నిస్తున్న తెలంగాణ వ్యతిరేకశక్తులు తెలంగాణ వాదాన్ని అమలు చేయడానికి ఆటంకాలను కల్పిస్తుండడం కూడ నిజమే. కాని ఆ ఆటంకాలను అధిగమించడానికి ఏ ప్రయత్నాలు జరుగుతున్నాయని, ఆ ఆటంకాలను అధిగమించడానికి ప్రజలను భాగస్వాములను చేయడం జరుగుతున్నదా అని, ఆటంకాలు లేని చోట ఎటువంటి తెలంగాణ వాద విధానాలు అమలవుతున్నాయని ప్రశ్నించడానికి అవకాశం ఉంది.

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ లో ఆరు దశాబ్దాల పాటు తెలంగాణ ప్రజాప్రయోజనాలకు భంగకరమైన విధానాలు అమలయ్యాయని ఉద్యమక్రమంలో ఎన్నో సార్లు చెప్పిన పార్టీ అధికారానికి వచ్చినతర్వాత కనీసం పాత విధానాల సమీక్ష ప్రయత్నాలైనా మొదలుపెట్టలేదు. అనేకరంగాలలో పాత విధానాలనే యథాతథంగా కొనసాగిస్తున్నది. ప్రైవేటు రంగంలో, ప్రైవేటు వ్యక్తుల చేత, ప్రైవేటు పెట్టుబడులతో నడిచే పరిశ్రమలలో, సంస్థలలో, ప్రచార సాధనాలలో, వినోద సాధనాలలో తెలంగాణకు జరిగిన, జరుగుతున్న అన్యాయాన్ని సమీక్షించడం సాధ్యం కాకపోవచ్చు. కాని ప్రభుత్వరంగంలో ఆరుదశాబ్దాలలో జరిగిన కార్యక్రమాల సమీక్ష జరిపి ఉండవచ్చు. భూపంపిణీ, భూకేటాయింపులు, నీటి వనరుల కేటాయింపులు, పరిశ్రమలకు రాయితీలు, సౌకర్యాలు, ఉద్యోగకల్పన, ప్రభుత్వ నిధుల కేటాయింపులు, ప్రభుత్వ పక్షాన జరిగిన సాంస్కృతిక, భాషా, చరిత్ర, కార్యక్రమాలలో సాగిన వివక్ష వంటివైనా సమీక్షించి ఎక్కడెక్కడ సవరించవలసిన అవసరం ఉందో పరిశీలించవచ్చు. ఈ సమీక్ష జరపక పోవడం ఒక ఎత్తయితే, పాత విధానాలనే యథాతథంగా కొనసాగిస్తుండడం మరొక ఎత్తు.

తెలంగాణ వనరుల దోపిడీలో ప్రధానమైనవి భూకేటాయింపులు, భూముల ఆక్రమణలు. రాచరిక భూస్వామ్య రాజ్యంగా హైదరాబాద్ రాజ్యంలో భూయాజమాన్యంలో తీవ్రమైన అసమానతలు ఉండేవి. లక్షలాది, వేలాది ఎకరాల పిడికెడు మంది భూస్వాములు ఒకపక్కన, భూమిలేని లక్షలాది నిరుపేద వ్యవసాయ కుటుంబాలు మరొక పక్కన ఉండేవి. 1948లో జరిగిన సైనిక చర్య తర్వాత రాజుకు చెందిన సర్ఫ్ ఎ ఖాస్ భూములు, పాయెగాలు, ఉమ్రాలు, జాగీర్లు, దేశముఖ్‌లు, దేశపాండేలు, మక్తాదార్లు వంటి భూస్వాములలో కొందరి భూములు, ప్రధానంగా విదేశాలకు పారిపోయిన ముస్లిం ప్రభువర్గ సభ్యుల భూములు, వారసులు లేకుండా మిగిలిపోయాయి. వీటిలో కొన్ని చట్టబద్ధంగానే ప్రభుత్వాధీనంలోకి వచ్చాయి. కొన్ని వ్యక్తుల అక్రమ ఆక్రమణలోకి, కబ్జాలోకి వచ్చాయి. ప్రభుత్వాధీనంలోకి వచ్చినవి కూడ ఇష్టారాజ్యంగా అక్రమంగా కోస్తా, రాయలసీమ పెత్తందార్ల, రాజకీయ నాయకుల, వ్యాపారుల చేతుల్లోకి వెళ్లాయి. అందువల్ల, 1948 గీటురాయిగా భూవివరాలను పరిశీలించి తెలంగాణలో అన్యాక్రాంతమైన, అక్రమ ఆక్రమణలో ఉన్న భూమి లెక్క తేల్చవలసి ఉంటుంది. అందుకు, సర్ఫ్ ఎ ఖాస్ రద్దు చట్టం, జాగీర్ల, ఇనాంల రద్దు చట్టం, కౌలుదార్ల రక్షణ చట్టం, గరిష్ఠ భూపరిమితి చట్టం, పట్టణ భూగరిష్ఠ పరిమితి చట్టం వంటి అనేక చట్టాలను పరిగణనలోకి తీసుకోవలసి ఉంటుంది.

అలా లెక్క తేలిన మిగులు భూమినంతా తెలంగాణ భూమిపుత్రులలో భూమిలేని నిరుపేదలకు, గృహవసతి లేని పేదలకు పంచవలసి ఉంటుంది. ఆ పని జరగకపోతే తెలంగాణ వాదపు ఆకాంక్ష నెరవేరినట్టు కాదు. ఒక ఉజ్జాయింపు లెక్క ప్రకారం, తెలంగాణలోని మూడు కోట్ల ఎకరాల భూమిలో కనీసం యాభై లక్షల ఎకరాలు ఇటువంటి మిగులు భూమి ఉంటుంది. తెలంగాణలోని ఒక కోటి కుటుంబాలలో వ్యవసాయాధార కుటుంబాలు దాదాపు అరవై లక్షలు అనుకుంటే వారిలో భూమిలేని నిరుపేద కుటుంబాలు ఇరవై లక్షల లోపు ఉంటాయి. అంటే ప్రతి భూమిలేని కుటుంబానికీ రెండున్నర నుంచి మూడు ఎకరాల భూమి ఇవ్వడం సాధ్యమే, అది తెలంగాణ వాదంలో అంతర్భాగమే. అయితే ఆ పని జరగాలంటే మొట్టమొదట పాత విధానాల, పాత కేటాయింపుల సమీక్ష జరగాలి. అటువంటి పనిని తెరాస ప్రభుత్వం తలపెట్టినట్టు కూడ లేదు.

కాగా, దళిత కుటుంబాలకు మాత్రం మూడు ఎకరాల చొప్పున భూమి ఇస్తానని, అవసరమైతే కొని ఇస్తానని ప్రకటించిన తెరాస ప్రభుత్వం, ఆగస్ట్ 15న ప్రతీకాత్మకంగా ప్రారంభించి, అక్కడితో ఆపేసింది. జిల్లాల్లో భూములు ఎక్కడున్నాయో వెతకమని కలెక్టర్లను ఆదేశించింది. కలెక్టర్లు తమ తమ జిల్లాలలో వందా నూట యాభై ఎకరాలకు మించి ఎక్కడా లేదని నివేదికలు పంపారని వార్తలు వస్తున్నాయి. అంటే పాత అక్రమ కబ్జాలన్నిటినీ ఇప్పుడు ధ్రువీకరిస్తున్నారన్నమాట. ఇక భూమి కొని ఇవ్వడమంటే పాత చట్టాల ప్రకారం మిగులు భూములుగా తేలి, ప్రభుత్వానికి అప్పగించవలసిన భూములకు ప్రజాధనం నుంచి వెల చెల్లించడమన్నమాట. ఎప్పుడో వ్యవసాయం వదిలేసిన, వ్యవసాయేతర ఆదాయాలున్న వారికి, కేవలం తాతతండ్రుల ఆస్తిగా, అది కూడ గరిష్ఠ భూపరిమితి చట్టాల కింద ప్రభుత్వం ఎప్పుడో ఆక్రమించుకోవలసిన భూముల యజమానులకు ఇప్పుడు అదనపు సొమ్ము కట్టబెట్టడానికి ఈ భూపంపిణీ ఉపయోగ పడుతుందన్నమాట. ఇది ఇక తమ చేతికి రాదని దొరలు ఇంతకాలం అనుకున్న భూమిని అమ్మిపెట్టే, ప్రజాధనం నుంచి అదనపు లాభం చేకూర్చే పనే తప్ప తెలంగాణ వాదంలో భాగమైన పని మాత్రం కాదు.

ఇక పట్టణ భూముల్లో, ముఖ్యంగా హైదరాబాద్ లోనూ, చుట్టూరా రంగారెడ్డి, మహబూబ్ నగర్, మెదక్, నల్లగొండ జిల్లాల్లోనూ భూముల్లో 1948 నుంచి ఇప్పటివరకూ జరిగిన రిజిస్ట్రేషన్లను సమీక్షిస్తే ప్రపంచంలో

ఎక్కడా కనీవినీ ఎరగనంతటి కుంభకోణాలు బయటపడతాయి. గురుకుల్ ట్రస్ట్ – అయ్యప్ప సొసైటీ, ఎన్ కన్వెన్షన్ సెంటర్ భూముల మీద ఒక చిన్న ప్రతీకాత్మక ప్రయత్నం చేసిన తెరాస ప్రభుత్వం అంతకు మించిన భూబకాసురుల, తిమింగిలాల జోలికి పోనేలేదు. నిజానికి ఇటువంటి అక్రమ ఆక్రమణల మీద చర్యలు తీసుకోదలచుకుంటే మొట్టమొదట ఆక్రమణదారుమీద, ఆ ఆక్రమణదారుకు సహకరించిన ప్రభుత్వాధికారుల మీద చర్యలు తీసుకోవాలి. ఆ ఆక్రమణదారు తెలివిగా ఎప్పుడో అమ్మివేయగా, ఇప్పటికి మూడో నాలుగో చేతులు మారి, తెలిసో తెలియకో కొనుక్కున్న మధ్యతరగతి గృహస్తుల మీద దాడులు చేస్తే అది సంచలన వార్త కావచ్చుగాని తెలంగాణ వాదం మాత్రం కాదు. రామోజీరావు, మురళీమోహన్, రామానాయుడు, సాంఘి కుటుంబం, రామలింగరాజు కుటుంబం, అంజిరెడ్డి, నార్నె, జనహర్ష వంటి భూబకాసుర తిమింగిలాలు ఆక్రమించుకున్న భూముల గురించి తెలంగాణవాదం మాట్లాడింది. చంద్రబాబు నాయుడు, రాజశేఖరరెడ్డి పందారం చేసిన వందల, వేల ఎకరాల భూముల గురించి మాట్లాడింది. ప్రత్యేక ఆర్థిక మండలాలు, విమానాశ్రయం, పరిశ్రమలు, వ్యాపార సంస్థలు, సినిమారంగం వంటి పేర్లతో ఆక్రమించుకున్న, ప్రభుత్వం నుంచి ఉచితంగానో, కారుచౌకగానో కొల్లగొట్టిన భూముల గురించి మాట్లాడింది. విమానాశ్రయం పేరుతో ప్రపంచంలో ఏ విమానాశ్రయానికీ లేనంత విశాలమైన ఐదువేల ఎకరాలు ఆక్రమించి, అందులో వెయ్యి ఎకరాలు విమానాశ్రయానికి వాడుకుని, మిగతాది రియల్ ఎస్టేట్ చేస్తున్న జి ఎం ఆర్ వంటి బడా భూస్వాముల గురించి మాట్లాడింది. ఇవాళ తెరాస ప్రభుత్వం వీరిలో ఏ ఒక్కరినీ ముట్టుకోక పోవడం మాత్రమే కాదు, వారి ఆక్రమణలో ఉన్న భూములను వారికే చట్టబద్ధంగా కట్టబెట్టేందుకు ప్రయత్నాలు చేస్తున్నది. సరిగ్గా చంద్రబాబు నాయుడు, రాజశేఖరరెడ్డిల పద్ధతిలోనే 'మూడు లక్షల ఎకరాలు సిద్ధంగా ఉన్నాయి, రండి, రారండి' అని దేశదేశాల సంపన్నులను, బహుళజాతి సంస్థలను, దళారీలను ఎర్రతివాచీ పరిచి ఆహ్వానిస్తున్నది.

భూములు ఇవ్వకపోతే పరిశ్రమలు ఎలా వస్తాయి, పరిశ్రమలు రాకపోతే ఉద్యోగాలు ఎలా వస్తాయి అని ప్రశ్నించేవాళ్లు ఉంటారు. అయితే నూట యాభై సంవత్సరాల భారత పారిశ్రామికీకరణ చరిత్రలో కనీసం నూట ముప్పై సంవత్సరాల పాటు పారిశ్రామికవేత్తలకు ప్రభుత్వాలు భూమి ఇవ్వలేదు. పెట్టుబడిదారులు తమ లాభాల కోసమే పరిశ్రమలు పెడతారు గనుక వారికి ఉచితంగానో, చౌకగానో భూమి ఇవ్వనవసరం లేదనే ప్రభుత్వం భావించింది. పారిశ్రామికవేత్తలు తమకు వీలైన చోట్ల, అవసరమైన చోట్ల సొంతంగా భూమి కొనుక్కుని పరిశ్రమలు పెట్టుకున్నారు. అప్పటికన్న ఇప్పుడు కొత్తగా పరిశ్రమలు వస్తున్నదేమీ లేదు. ఒకవేళ తప్పనిసరి పరిస్థితుల్లో అలా భూమి ఇవ్వవలసి వచ్చినా, ఆ పరిశ్రమ వల్ల స్థానిక సమాజానికి ప్రయోజనం ఉంటే, అంటే స్థానికులకు ఉద్యోగాలు వస్తే, స్థానిక ప్రజల అవసరాలు తీర్చే సరుకులు తయారు చేస్తే, స్థానిక ఆర్థికవ్యవస్థకు పుష్టి చేకూరిస్తే అలా భూమి ఇవ్వవచ్చునని అనుకోవచ్చు. కాని ఇవాళ తెలంగాణ భూములు తీసుకోవడానికి ప్రయత్నిస్తున్న పరిశ్రమలు, తెరాస ప్రభుత్వం భూములు ఇవ్వజూపుతున్న పరిశ్రమలు చూస్తే అవన్నీ ఉన్నతస్థాయి సాంకేతిక పరిశ్రమలు, ఎక్కువ ఉద్యోగాలు కల్పించని పరిశ్రమలు. అవేవీ స్థానికులకు ఉద్యోగ కల్పన చేసేవి కావు, స్థానిక సమాజ అవసరాలు తీర్చే ఉత్పత్తులు చేసేవి కావు. ప్రభుత్వం ఇవ్వజూపుతున్న పన్ను రాయితీల వల్ల ప్రభుత్వ ఖజానాకు కూడ ఒరగబోయేదేమీ లేదు. ఇది చారానా దావత్ కు బారానా టాంగా కూడ కాదు, అసలు దావత్ కాదు, గంజినీళ్లు కూడ పోయదలచుకోని వాడికి జీహుజూర్ జోహుకుం అని సమాజ వనరులను అప్పనంగా అప్పగించడం.

మరి తెలంగాణ వాదంలో ప్రధానమైన అంశం తెలంగాణలో నిరుద్యోగాన్ని రూపుమాపడం, కనీసం తగ్గించడం. ఉమ్మడి రాష్ట్రంలో పన్నెండు లక్షల ప్రభుత్వోద్యోగాలలో, తెలంగాణ వాటాగా రావలసిన నాలుగున్నర లక్షల బదులు మూడు లక్షల మంది మాత్రమే ఉన్నారని, ఇక ప్రైవేటు పరిశ్రమల్లో, సంస్థల్లో కోస్తా, రాయలసీమ యజమానుల ఆధిపత్యం వల్ల లక్షలాది ఉద్యోగాలు స్థానికులకు దక్కకుండా పోయాయని, అందువల్లనే లక్షలాది మంది తెలంగాణ బిడ్డలు నిరుద్యోగులయ్యారని, ప్రత్యేక రాష్ట్రం ఏర్పడితే ఈ నిరుద్యోగ సమస్య పరిష్కారమవుతుందని ఉద్యమ క్రమంలో ఎందరో మాట్లాడారు. నిరుద్యోగ సమస్యను పరిష్కరించడం తెలంగాణ వాదంలో అతి ముఖ్యమైన అంశం. అందుకోసం ప్రభుత్వోద్యోగాలలో ఇంతకాలంగా తెలంగాణేతరులకు దక్కిన ఉద్యోగాలను తెలంగాణ బిడ్డలకు పునరుద్ధరించాలి. అందుకోసం తక్షణమే తెలంగాణ పబ్లిక్ సర్వీస్ కమిషన్ ఏర్పాటు చేసి, ఉద్యోగ కల్పనా చర్యలు తీసుకోవాలి. డి ఎస్ సి ఏర్పాటు చేసి ఉపాధ్యాయ ఉద్యోగాలు నింపాలి. తెలంగాణలో ప్రైవేటు రంగ సంస్థల మీద తెలంగాణ వారికి మాత్రమే ఉద్యోగాలు కల్పించాలనే నిబంధన విధించడానికి అవకాశం లేదు గనుక ప్రభుత్వ రంగ సంస్థలు విరివిగా ఏర్పాటు చేయాలి. ఉమ్మడి రాష్ట్రంలో ఉద్దేశపూర్వకంగా మూసివేతకు, పెట్టుబడుల ఉపసంహరణకు గురైన సంస్థలను పునరుద్ధరించాలి. తెలంగాణ సమాజం నుంచి ప్రతిపాదనలు వచ్చినప్పటికీ అప్పటి రాష్ట్ర ప్రభుత్వం తొక్కిపెట్టిన పరిశ్రమల స్థాపన అవకాశాలు అన్వేషించాలి. తెరాస ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తర్వాత జరిగి ఉండవలసిన ఈ పనుల్లో ఒక్కటీ ప్రారంభం కూడ కాలేదు. బహుళ జాతి సంస్థలకు, దేశవ్యాపిత బడా, దళారీ పెట్టుబడిదారీ సంస్థలకు ఆహ్వానాలు అందుతున్నాయి గాని నిరుద్యోగ సమస్యను పరిష్కరించే పనులు ప్రారంభం కాలేదు. మూతబడిన పరిశ్రమల పునరుద్ధరణ మాటలేదు. ప్రభుత్వ రంగ సంస్థలను ఏర్పాటు చేస్తామనే మాట లేదు. టిపిఎస్‌సి గురించి డిఎస్‌సి గురించి ప్రకటనలే తప్ప ముందడుగులు లేవు. రాయితీల విషయంలో కనీసం తెలంగాణ పెట్టుబడిదారులకు, తెలంగాణ ఎన్ఆర్ఐలకు ఆహ్వానాలు లేవు. అంటే పాత పారిశ్రామిక విధానానికి భిన్నమైన, తెలంగాణ వాదానికి అనుగుణమైన చర్యలు లేవు.

తెలంగాణవాదానికి అనుగుణంగా కాకపోయినా పరిశ్రమల ఏర్పాటు గురించి ఎంతో కొంత ఆర్భాటం జరుగుతున్నది గాని వ్యవసాయ రంగం గురించి ఆ మాత్రం కదలిక కూడ లేదు. తెలంగాణ వ్యవసాయ రంగానికి ఈ సంవత్సరం అదనపు కష్టంగా వర్షాభావ సమస్య ఏర్పడింది. పాత ప్రభుత్వాల వారసత్వంగా విద్యుచ్ఛక్తి సమస్య ఉండనే ఉంది. ఇటువంటి సమయంలో రైతాంగాన్ని, గ్రామీణ ప్రజానీకాన్ని ఆదుకోవడానికి, కనీసం ఆశ్వాసం ఇవ్వడానికి ప్రయత్నించవలసిన తెరాస ప్రభుత్వం కనీసం ఆ పని కూడ చేయడం లేదు. నాలుగునెలల్లో మూడు వందల మందికి పైగా రైతులు ఆత్మహత్యలే శరణ్యమని అనుకున్నారంటే, తెలంగాణ రాష్ట్రం ఏర్పడితే సమస్యల పరిష్కారానికి మార్గం సుగమమవుతుందని ఇంతకాలంగా చెపుతూ వచ్చిన మాటకు అర్థం లేదన్నమాట. రోజుకు

ఇద్దరు ముగ్గురుగా పిట్టల్లా రాలిపోతున్న తెలంగాణ రైతు బిడ్డలకు ఆత్మవిశ్వాసమైనా ఇవ్వలేని తెరాస ప్రభుత్వం పాత ప్రభుత్వాల లాగనే ఆత్మహత్యలకు ఇతర కారణాలు వెతకడానికి ప్రయత్నిస్తున్నది. తెలంగాణ బిడ్డల మరణాల పట్ల ఇంత మొరటు వైఖరి తెలంగాణ వాదంలో భాగమేనా?

తెలంగాణ ప్రధానంగా గ్రామీణ, వ్యావసాయిక సమాజం. హైదరాబాద్ పట్టణంగా ఎదిగినా గ్రామీణ మానవ సంబంధాలను పూర్తిగా వదులుకొని నగర సంస్కృతిని అలవరచుకున్నది కాదు. తెలంగాణ వాదం ప్రత్యక్షంగా ప్రకటించినా ప్రకటించకపోయినా ఈ గ్రామీణ నైసర్గిక సహజ మానవసంబంధాల సంస్కృతిని ఎత్తిపట్టింది. కాని తెరాస ప్రభుత్వం సరిగ్గా చంద్రబాబు నాయుడు లాగ భావజాల స్థాయిలోనే గ్రామీణ సంస్కృతి నుంచి దూరమైన పట్టణీకరణ గురించి మాట్లాడుతున్నది. నగరాలను, స్మార్ట్ నగరాలను సృష్టించడానికి వెంపరలాడుతున్నది. నగరాలలో దొరికే సౌకర్యాలతో సమానమైన సౌకర్యాలను అందించి గ్రామాలను అభివృద్ధి చేస్తామనే నమూనాను అవలంబించవలసిన చోట, గ్రామీణులందరినీ పట్టణాలకు తీసుకు వస్తామనే లేనిపోని ఊహలు ప్రకటిస్తున్నది. ఇది తెలంగాణ సమాజానికీ, తెలంగాణ వాదానికీ వ్యతిరేకమైన, విధ్వంసకరమైన ఆలోచన.

అలాగే ఉమ్మడిరాష్ట్రంలో విద్యారంగంలో తెలంగాణ కోల్పోయిన హక్కులను పునరుద్ధరించడం, అంటే శ్రీచైతన్య-నారాయణ నమూనా విద్యావ్యవస్థకు భిన్నమైన విద్యావ్యవస్థను అందించడం తెలంగాణవాద ఆకాంక్ష కాగా, తెరాస ప్రభుత్వం కొంత నేరుగానూ, కొంత దొడ్డిదారినా అదే మార్గంలో నడుస్తున్నది. ఉద్యమంలో పాల్గొన్న ప్రజలను, విద్యార్థులను, తెలంగాణ సమాజాన్ని ఆకర్షించడానికి కెజి నుంచి పిజి ఉచిత విద్య, కామన్‌స్కూల్ పద్ధతి వంటి ఆకర్షణీయమైన మాటలు కోటలు దాటుతున్నాయి గాని అడుగులు కార్పొరేట్ విద్యవైపే పడుతున్నాయి.

కీలకమైన ప్రభుత్వోద్యోగాలలో తెలంగాణ వారిని ఉద్దేశపూర్వకంగా నియమించడం లేదని, లేదా తెలంగాణ వ్యతిరేకులను ఉద్దేశపూర్వకంగా నియమిస్తున్నారని, ప్రభుత్వం ద్వారా జరిగే పనులను కోస్తా, రాయలసీమల సంపన్నులు, రాజకీయనాయకులు, పైరవీకారులు తన్నుకుపోతున్నారని ఉమ్మడి రాష్ట్రం రోజుల్లో తెలంగాణ ఉద్యమకారులందరమూ వాదించేవాళ్లం. ఇటువంటి పనులను ఖండించడమే, జరగనివ్వకపోవడమే తెలంగాణ వాదమని భావించాం. నాలుగు నెలల తెలంగాణ ప్రభుత్వ పాలనలో ఆ పాత పద్ధతులు రోజురోజుకూ పెరుగుతున్నాయే గాని తగ్గడం లేదు. తెలంగాణ ఉద్యమం మీద పనిగట్టుకుని దమనకాండ సాగించిన, తెలంగాణ పట్ల ద్వేషాన్ని బహిరంగంగా ప్రకటించిన పోలీసు అధికారులు ఆంధ్రప్రదేశ్ ఆప్షన్ కోరుకున్నప్పటికీ తెలంగాణకు కేటాయించబడి, ఇవాళ తెలంగాణ ప్రభుత్వానికి విశ్వసనీయ అధికారులుగా కనబడుతున్నారు. వారు ప్రవహింపజేసిన తెలంగాణ బిడ్డల నెత్తురు విలువ ఏమిటి? అవసరం లేకపోయినా పోలీసులకు వాహనాలు కొనాలని తెరాస ప్రభుత్వం తీసుకున్న నిర్ణయం ఆ జపనీస్ కంపెనీ కన్న ఎక్కువగా స్థానిక డీలర్, పచ్చి తెలంగాణ వ్యతిరేకి వెంకయ్య నాయుడు కొడుకుకే ప్రయోజనకరమని తెలిసినా ఆ నిర్ణయం తీసుకోవడం తెలంగాణ వాదంలో ఎలా భాగమవుతుంది? ఇతర రాష్ట్రాలలో ప్రజా ఉద్యమాల వల్ల స్థాపించలేకపోయిన కాలుష్యకారక, పర్యావరణ నష్టదాయక, ప్రమాదకర పరిశ్రమలను, సంస్థలను రారమ్మని పిలవడం తెలంగాణ సమాజానికి ఏమి మేలు చేయడానికి? అది తెలంగాణవాదంలో ఎలా భాగమవుతుంది?

తెలంగాణవాదం ఆరుదశాబ్దాల పాటు తన ప్రజాస్వామిక హక్కులను, రాజ్యాంగబద్ధ హక్కులను పోగొట్టుకుంది. తన హక్కులను సాధించుకోవడం కోసం పోరాడింది. అటువంటి ఉద్యమ పునాదుల మీద అధికారానికి వచ్చిన ప్రభుత్వం ప్రజల హక్కుల పట్ల ఎంత సున్నితంగా, సమన్వయ అవగాహనతో వ్యవహరించవలసి ఉంటుందో తెరాస ప్రభుత్వం అలా మాత్రం వ్యవహరించడం లేదు. అంటే అది తెలంగాణ వాదానికి, తెలంగాణవాదపు విలువలకు కచ్చితంగా దూరమవుతున్నట్టే. హక్కులను అణచిపెట్టడం ద్వారా ప్రశ్నలను రద్దుచేయడం సాధ్యం కాదని, అణచివేతవల్ల ఆ ప్రశ్నలు మరింత బలం సంతరించుకుంటాయని, చివరికి విస్ఫోటక శక్తిగా మారుతాయని తెలంగాణ ఉద్యమమే రుజువు చేసింది. బ్రహ్మానందరెడ్డి నుంచి కిరణ్ కుమార్ రెడ్డి దాకా ఎందరెందరు తెలంగాణ వ్యతిరేకులు ఎంత అణచివేత ప్రయోగించినప్పటికీ తెలంగాణవాదాన్ని రూపుమాపలేకపోయారు. ప్రజల ప్రశ్నలకు వారందరూ ఉపయోగించిన ఏకైక సమాధానం పోలీసు లాఠీ, తుపాకి, దమననీతి. ఆ దమననీతిని అనుభవించిన తెలంగాణ వాదం తనకు ఎదురైన ప్రశ్నల మీద అదే దమననీతిని ప్రయోగిస్తే అది తెలంగాణ వాదమే కాజాలదు. సంభాషణ, చర్చ, వాదన, సమన్వయం, మధ్యవర్తుల, పెద్దమనుషుల జోక్యం, ఇచ్చి పుచ్చుకోవడం, ప్రజాస్వామికంగా వ్యవహరించడం, రెండడుగులు ముందుకు వేయడానికి ఒక అడుగు వెనక్కి వేయడం తెలంగాణ వాదం నేర్పిన విలువలు. కాని తెరాస ప్రభుత్వం ఈ విలువలన్నిటినీ పక్కనపెట్టి పాత ఉమ్మడి రాష్ట్ర పాలకుల లాగనే ప్రతిదానికీ పోలీసు లాఠీని, దమననీతిని ఉపయోగిస్తున్నది, తుపాకిని ఉపయోగించే రోజు ఎక్కువ దూరంలో లేకపోవచ్చు. కాంట్రాక్టు ఉద్యోగుల క్రమబద్ధీకరణ న్యాయసమ్మతంగా జరగాలని, పాత అక్రమాలను ధ్రువపరచేదిగా, నిరుద్యోగాన్ని పెంచేదిగా జరగగూడదని అడిగిన విద్యార్థులకు, నిరుద్యోగులకు సమాధానం లాఠీ. విత్తనాలు కావాలని, ఎరువులు కావాలని, విద్యుత్తు కావాలని అడిగిన రైతులకు సమాధానం లాఠీ. ఎంతోకాలంగా అపరిష్కృతంగా ఉన్న కోరికలను నెరవేర్చమని అడిగిన జూనియర్ డాక్టర్ల మీద లాఠీ. ఊరేగింపుకూ, బహిరంగ సభకూ అనుమతి ఇవ్వకపోతే కనీసం హాలులో కూచుని మాట్లాడుకుంటామని అడిగితే హాలుకు అడ్డంగా లాఠీ. ప్రభుత్వాన్ని నడుపుతున్నది ఇవాళ అధికారానికి వచ్చిన, నిన్నటిదాకా ఉద్యమం నడిపిన రాజకీయ పక్షమా, లేక పోలీసులా? పోలీసులే అయినా, ప్రభుత్వమంటే పోలీసులే అని చెప్పదలచినా అది కచ్చితంగా తెలంగాణవాదం కాదు. ఒక ప్రజాసమూహం వేసిన, వేస్తున్న ప్రశ్నలన్నీ సమంజసమైనవే కాకపోవచ్చు, వాటిలో అంగీకారయోగ్యమైనవీ, కానివీ కూడ ఉండవచ్చు. అధికారంలో ఉన్నవారు ఆ ప్రశ్నలు వేసేవారితో ఓపికగా చర్చ జరిపి పరిష్కారానికి మార్గం సుగమం చేయవలసిందే తప్ప, లాఠీ ఝుళిపించి నోరు మూయిస్తామంటే, ఇవాళ మూతబడిన నోరు రేపు మరొక రూపంలో పేలుతుంది. తెలంగాణ ప్రతీకలలో కొన్నిటిని ఆడంబరంగా ఎత్తిపడుతూ, ఇంతకాలం విస్మరణకు గురైన బోనాలు, బతుకమ్మ, కొమురం భీం, కాళోజీ, యాదగిరిగుట్ట వంటి సాంస్కృతిక ప్రతీకలకు స్థానం దొరుకుతున్నదనే సంతోషం కలిగించినంత మాత్రాన తెలంగాణవాదపు మౌలిక ప్రశ్నలు మరుగున పడిపోవు.

ఇలా తెరాస ప్రభుత్వ చర్యలలో కొన్నయినా స్పష్టంగా తెలంగాణ

# జయలలిత(ల)కు శిక్షలు పడుతాయా?

*రాజకీయ పలుకుబడి కలిగిన అక్రమార్కులు రాజ్యాంగంలోని లొసుగులను ఆసరా చేసుకొని కేసులను సాగదీస్తూ శిక్షల నుంచి తప్పించుకుంటున్నారని అంటున్నారు* **బి.రామకృష్ణ**

**66** ఏళ్ల జయలలితకు బెంగళూరు సమీపంలోని ప్రత్యేక కోర్టు నాలుగేళ్ల సాధారణ జైలుశిక్ష, వందకోట్ల జరిమానా విధించింది. జయలలిత ముఖ్యమంత్రిగా పనిచేసిన కాలం (1991 జూలై 1-1996 ఏప్రిల్ 30 వరకు) లో కూడబెట్టిన అక్రమార్జనలను ప్రాసిక్యూషన్ రుజువు చేసిందని చెపుతూ 2014 సెప్టెంబర్ 27న న్యాయమూర్తులు జాన్ మైఖెల్ డికన్హ, జయలలిత, మరో ముగ్గురికి శిక్షలు ఖరారు చేస్తూ తీర్పు చెప్పారు. అనేకరకాలుగా, ఎన్నో కారణాలతో జయలలిత తరపు న్యాయవాదులు చట్టంలోని లొసుగులను, వెసులుబాట్లను, అవకాశాలను గరిష్ఠంగా ఉపయోగించి ఈ కేసును పద్దెనిమిదేళ్ల వరకు సాగదీయడానికి చేయవల్సినదంతా చేశారు. సుప్రీంకోర్టు సైతం ఈ సాగతీత విషయంలో అసహనాన్ని ప్రకటిస్తూ జయలలిత తీరును తప్పు పట్టింది.

సినీనటి అయిన జయలలిత ముఖ్యమంత్రిగా ఎలా ప్రస్థానం జరిగిందో ఒకసారి చూద్దాం. తమిళనాడులో బ్రాహ్మణేతర, బ్రాహ్మణీకానికి వ్యతిరేకంగా పెరియార్ నడిపిన ద్రవిడ ఉద్యమం స్ఫూర్తితో అన్నాదురై, ద్రవిడ మున్నేట్ర కజగం (డిఎంకె)ను స్థాపించి 1967లో తమిళనాడులో ముఖ్యమంత్రిగా అధికారంలోకొచ్చాడు. ఇందులో ఎం.జి. రాంచంద్రన్ (ఎంజిఆర్), కరుణానిధులు భాగమయ్యారు. వీరిద్దరు కూడా సినీ పరిశ్రమలో ఉన్నవారే. అన్నాదురై చనిపోయాక డిఎంకె పగ్గాలను కరుణానిధి చేపట్టారు. 1972లో డిఎంకెలో చీలిక వచ్చి అన్నా డిఎంకె (ఎడిఎంకె)ను ఎంజిఆర్ ఏర్పాటు చేశారు. 1977లో ఎంజిఆర్ ముఖ్యమంత్రి అయ్యాడు. 1977 నుండి 1987 వరకు ముఖ్యమంత్రిగా కొనసాగాడు. 1965 నుండి 1972ల కాలంలో ఎంజిఆర్, జయలలితలు జంటగా 28 సినిమాల్లో నటించారు. తర్వాత కాలంలో ఈ పరిచయం, సాన్నిహిత్యం, జయలలిత చురుకుదనం, మాట్లాడగలిగే సామర్థ్యం ఏమైతేనేమి 1982లో ఎడిఎంకె ప్రచార కార్యదర్శిగా ఎంజిఆర్ జయలలితను నియమించాడు. 1984లో ఆమెను రాజ్యసభకు ఎన్నిక చేశాడు. 24 డిసెంబర్ 1987లో ఎంజిఆర్ చనిపోవడంతో ఆయన భార్య జానకి రాంచంద్రన్ ముఖ్యమంత్రి అయ్యారు. ఆమెకు, జయలలితకు మధ్య విభేదాల కారణంగా ఆ ప్రభుత్వం మనుగడ సాగించలేక పోయింది. అప్పటి కేంద్రంలోని రాజీవ్‌గాంధీ ప్రభుత్వం జానకి రాంచంద్రన్ ప్రభుత్వాన్ని రద్దు చేసింది. తర్వాత డిఎంకె అధికారంలోకి వచ్చింది. డిఎంకె ప్రభుత్వంలో అసెంబ్లీలో ప్రతిపక్ష నేతగా ఉన్న జయలలితపై దాడి జరగడం, తర్వాత జరిగిన 1991 అసెంబ్లీ ఎన్నికల్లో జయలలిత నేతృత్వంలోని ఎఐఎడిఎంకె విజయం సాధించింది. 24 జూన్ 1991లో ఆమె ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేశారు. అప్పటి నుండి 13 మే 1996 వరకు ముఖ్యమంత్రిగా కొనసాగింది. 1996-2001 కాలంలో డిఎంకె, 2001-2006 కాలంలో ఎఐఎడిఎంకె, 2006-2010 కాలంలో డిఎంకె, 2011 నుండి నేటి వరకు ఎఐఎడిఎంకెలు ఒకదాని వెంట మరొకటి వరుసగా అధికారంలోకి వచ్చాయి. ఎఐఎడిఎంకె మూలాలు డిఎంకెలో ఉన్నాయి. పెరియార్ స్ఫూర్తితో బ్రాహ్మణేతర ఉద్యమంగా వచ్చిన పార్టీకి బ్రాహ్మణ న్యాయకత్వంతో రూపాంతరీకరణ జరిగి బ్రాహ్మణురాలు ముఖ్యమంత్రిగా అలాగే పార్టీకి తిరుగులేని నాయకులుగా జయలలిత ఎదగడం గమనించవచ్చు.

ప్రస్తుత కేసు విషయానికి వస్తే 1996 జూన్ 14న అప్పటి జనతాదళ్‌కు (ప్రస్తుత బిజెపి) చెందిన సుబ్రహ్మణ్యస్వామి జయలలితపై ఆమె ముఖ్యమంత్రిగా పని చేసినకాలం (1991-96) లో అధిక మొత్తంలో సంపదలు పోగేసుకున్నదన్న దానిపై ఫిర్యాదు చేశాడు. వెంటనే

---

వాదం నుంచి దూరమైనవిగా కనబడుతుండగా, వాటిని లేవనెత్తిన వారి మీద విరుచుకుపడే ఒక కొత్త 'తెలంగాణవాదుల' బృందం తయారయింది. తెలంగాణవాదపు ఐదు దశాబ్దాల చరిత్ర గాని, తెలంగాణ వాదపు విశాల ఆకాంక్షలు గాని, ప్రజాస్వామిక స్వభావం గాని తెలియని ఈ బృందం ప్రభుత్వ విధానాలను విమర్శించే వారందరినీ తెలంగాణ ద్రోహులని, ప్రతిపక్ష పార్టీల సమర్థకులని, కోస్తాంధ్రులకు అమ్ముడుపోయారని ఆరోపిస్తున్నది. తెలంగాణ వాదపు భూమిక నుంచే విమర్శించడానికి ఎన్నో అవకాశాలను ప్రభుత్వ విధానాలే, ఆచరణే ఇస్తున్నాయి. ఆ విధానాలను ఆచరణను విమర్శించడం తెలంగాణ ప్రజల ప్రయోజనాల కోసమే తప్ప తెలంగాణ ద్రోహం కాదు. ఈ తెలంగాణ వ్యతిరేక చర్యలను సమర్థిస్తున్నవారే తెలంగాణ ద్రోహులవుతారు. ఇక కాంగ్రెస్, తెలుగుదేశం, భారతీయ జనతాపార్టీ వంటి ప్రతిపక్షపార్టీలలో ఏ ఒక్కదానికీ తెరాసను విమర్శించే, తెలంగాణ ప్రజల పక్షాన నిలబడే నైతిక అర్హత లేదని కొత్తగా చెప్పనక్కరలేదు. ఇంతకాలం తెలంగాణను విమర్శించిన, ద్రోహం చేసిన, చివరికి పార్లమెంటులో, బిల్లు తయారీలో మోసం చేసిన ఆ ప్రతిపక్ష పార్టీలు ఇవాళ శవాలమీద పేలాలు ఏరుకోవడానికి ప్రయత్నిస్తుండవచ్చు. ప్రభుత్వ వ్యతిరేకంగా కనబడుతూ, ప్రజల ఇక్కట్ల పట్ల మొసలికన్నీరు కారుస్తుండవచ్చు. కాని ఇవాళ తెలంగాణ ప్రజల పక్షాన, తెలంగాణ వాదం పక్షాన తెరాస విధానాలను విమర్శించే వారికి ఆ ప్రతిపక్షాలతో గాని, కోస్తాంధ్ర, రాయలసీమ స్వార్థపరశక్తులతో గాని ఏ సంబంధం లేదు. అటువంటి తప్పుడు ఆరోపణలతో, నిందలతో అసలు వాస్తవాల్ని మసిపూసి మారేడుకాయ చేయడం సాధ్యం కాదు.

*(రచయిత వీక్షణం సంపాదకులు)* వీ

1996 జూన్ 18న అప్పటి డిఎంకె ప్రభుత్వం జయలలితకు వ్యతిరేకంగా ఎఫ్ఐఆర్ నమోదు చేసింది. 21 జూన్ 1996న ప్రిన్సిపల్ సెషన్స్‌కోర్టు ఆదేశాల మేరకు డిఎస్‌పి లతికాశరన్‌తో ఇన్వెస్టిగేషన్ మొదలుపెట్టారు. 1997 జూన్ 4న ఛార్జిషీట్ దాఖలు చేశారు. 1997 అక్టోబర్ 21న ప్రత్యేకకోర్టు జయలలిత, శశికళ నటరాజన్, సుధాకరన్, ఇలదరసిలపై ఛార్జిషీట్‌ను నమోదుచేసింది. 2001 మే 14న తిరిగి ఎఐఎడిఎంకె అధికారంలోకి వచ్చింది. 2003 ఫిబ్రవరి 28న డిఎంకె ప్రధాన కార్యదర్శి అంబజగన్, జయలలితపై విచారణను నిష్పాక్షికంగా జరపడం కొరకు తమిళనాడుకు అవతల నిర్వహించమని సుప్రీంకోర్టును అభ్యర్థించాడు. ఈ మేరకు సుప్రీంకోర్టు ఈ కేసు విచారణను తమిళనాడుకు ఆవల కర్నాటకలో బెంగళూర్ సమీపంలోని ప్రత్యేక కోర్టుకు 2003 నవంబర్ 18న బదిలీ చేసింది. అలా ఈ ప్రత్యేక కోర్టులో 2005 మార్చ్ నుండి ట్రయల్స్ మొదలై చివరకు 2014 సెప్టెంబర్ 27న తీర్పు వెలువడింది.

అవినీతి నిరోధక చట్టం (ప్రివెన్షన్ ఆఫ్ కరప్షన్ ఆక్ట్-పిసిఎ, 1998) 1998లోని 13(1)(ఇ),13(2) సెక్షన్‌ల ప్రకారం జయలలితకు 4 ఏళ్ల సాధారణ జైలుశిక్ష వందకోట్ల జరిమానా విధించింది. ఈ జరిమానా చెల్లించని పక్షంలో మరో సంవత్సరం జైలుశిక్ష పొడిగిస్తారు. అంటే సంవత్సరం జైలుశిక్షను వందకోట్లతో సమానం చేశారన్నమాట. వందకోట్లేమిటి మరెంతైనా వీరికో లెక్కకాదు. కాని రాజకీయ అధికారం రుచిమరిగిన వీరికి ఈ శిక్షలు అడ్డంకిగా మారతాయి. ప్రత్యర్థులకు ఆయుధాలవుతాయి. ఎన్నికల్లో ఆటంకంగా ఉంటాయి. పేరుకైనా, మాట వరసకైనా నైతిక పరాజయం అవుతుంది కాబట్టి శిక్షలనే లేకుండా, చాల ఖరీదైపోయిన న్యాయాన్ని ఎంత ఖర్చుకైనా వెనుదీయకుండా తిరిగి తమ చేతుల్లోకి తీసుకుంటారు. అలాగే నేరపూరిత కుట్రకు సంబంధించిన ఐపిసి 120-బి కింద శిక్షించదగిన నేరం పిసిఎలోని సెక్షన్ 13 (2)కు అనుగుణంగా ఆరు నెలల సాధారణ జైలుశిక్ష, ఒక లక్ష జరిమానా, జరిమానా చెల్లించని పక్షంలో ఒక నెల శిక్ష పొడిగిస్తారు. జయలలితకు ప్రత్యేక న్యాయస్థానం పిసిఎ, 1998లోని 13 (1) (ఇ), 13 (2) సెక్షన్లు, ఐపిసి 120-బి సెక్షన్ల ప్రకారం శిక్ష విధించారు. శశికళ నటరాజన్, వి.ఎన్. సుధాకరన్, జె. ఇలదరసిలకు నేర ప్రేరేపణకు సంబంధించిన ఐపిసి సెక్షన్ 109 కింద శిక్షించదగిన నేరానికి పిసిఎలోని సెక్షన్ 13 (2) కు అనుగుణంగా నాలుగేళ్ల సాధారణ జైలుశిక్షతో పాటుగా పదికోట్ల జరిమానా విధించింది. జరిమానా కట్టని పక్షంలో జైలుశిక్ష మరో సంవత్సరం పొడిగించబడుతుంది. అలాగే నేరపూరిత కుట్రకు సంబంధించిన ఐపిసి సెక్షన్ 120-బి కింద శిక్షింపదగిన నేరానికి పిసిఎలోని సెక్షన్ 13 (2) కు అనుగుణంగా ఆరు నెలల సాధారణ జైలుశిక్ష, పదివేల రూపాయల జరిమానా విధించారు. జరిమానా కట్టని పక్షంలో మరోనెల జైలుశిక్ష పొడిగించబడుతుంది. ఇలా ప్రత్యేక కోర్టు శశికల నటరాజన్, సుధాకరన్, ఇలదరసిలకు ఐపిసి 109, ఐపిసి 120-బి, పిసిఎ 13 (1) (ఇ), 13 (2) ల ప్రకారం శిక్షలు విధించింది. అలాగే ఈ కేసు విచారణ కోసం అయిన ఖర్చుకింద కర్నాటక రాష్ట్రానికి నిందితులు చెల్లించే జరిమానా నుండి ఐదు కోట్లు చెల్లించాలని కూడా ప్రత్యేక న్యాయస్థానం తెలిపింది.

జయలలిత ముఖ్యమంత్రిగా ఉన్న 1991-96లో జరిగిన అక్రమార్జనలను నిగ్గుతేల్చడానికి కోర్టులకు 18 ఏళ్లకాలం పట్టడం న్యాయవ్యవస్థ మందగమనానికి, పనితీరుకు సూచిక. ఇప్పుడు ఆమెను నేరస్తురాలిగా గుర్తిస్తే ఈ 18 ఏళ్లకాలంలో ఆమె రెండుసార్లు 2001 - 2006, 2011-2014 సెప్టెంబర్ 27 వరకు ముఖ్యమంత్రిగా పని చేశారు. అంటే నేరస్తురాలు రాజ్యమేలిందన్నమాట. ఇది మన ప్రజాస్వామ్య, న్యాయవ్యవస్థల డొల్లతనాన్ని చెప్పకనే చెపుతున్నాయి. పాలనా వ్యవస్థలను, కోర్టులను, రాజ్యాంగ వ్యవస్థలను తీవ్రంగా ప్రభావితం చేయగలిగేశక్తి జయలలిత వంటి మరెందరో పాలక వర్గ నాయకులకు, భూస్వామ్య, పెట్టుబడిదారులకు ఉన్నది కాబట్టే తమపై విచారణలను ఏళ్లకేళ్లు పొడిగించుకుంటూ పోయారు, పోతున్నారు. అనేక లొసుగులు, సాంకేతిక కారణాలు ఓవైపు అలాగే అధికారంలో ఉన్నారు కాబట్టి ఆ రాజకీయ అధికారాన్ని అడ్డం పెట్టుకుని అధికారులను మభ్యపెట్టో, ప్రలోభపెట్టో, లేక భయపెట్టో, సాక్షులను తారుమారు చేయడం, సాక్షులిచ్చిన వాఙ్మూలాలను వారిచేతనే తిరగేసి చెప్పిస్తూ అలా చేసే స్థాయిని సంపాయించుకోవడం కేసులను తప్పుదోవ పట్టించి ప్రజాస్వామ్య, న్యాయ వ్యవస్థలను తమ పాదాక్రాంతం చేసుకోవడం చూస్తుంటే ఈ దేశవాసులకు పట్టిన దుర్గతిపట్ల విచారం కలుగకమానదు.

2014 సెప్టెంబర్ 27న ప్రత్యేక న్యాయస్థానం తీర్పుపై స్టే కోరుతూ బెయిల్ కొరకు కర్నాటక హైకోర్టుకు వెళితే ఆ పిటిషన్‌ను తోసిపుచ్చింది. తర్వాత సుప్రీంకోర్టుకు వెళితే 2014 అక్టోబర్ 17న ప్రత్యేక కోర్టు తీర్పుపై స్టే విధిస్తూ బెయిల్ మంజూరు చేసింది. 2014 అక్టోబర్ 18న జయలలిత ఇతర ముగ్గురూ జైలు నుండి విడుదలయ్యారు. ఇంతకు ఇలాంటి కేసుల్లో లాలూప్రసాద్ యాదవ్, ఓం ప్రకాశ్ చౌతాలా, గాలి జనార్దన్‌రెడ్డి, ఎ. రాజా, కనిమొళి, జగన్మోహన్‌రెడ్డి వంటి వారు ఎవరు కూడా ఇంత త్వరగా జైలు గోడలు దాటి బయటకు రాలేదు.

జయలలిత బెయిల్‌కు సంబంధించి ప్రముఖ సుప్రీంకోర్టు న్యాయవాది ఫాలి ఎస్ నారిమన్ తన న్యాయశాస్త్ర పరిజ్ఞాన్నంతా వినియోగించి సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తిని మెప్పించగలిగారు. ఇలాంటి న్యాయవాదులు అతి ఖరీదైనవారు. వారి తెలివిని, పలుకుబడిని పెద్ద మొత్తాలకు అమ్ముకుంటారు. వారిని మామూలు జనం చేరుకోవడం ఎన్నడూ జరగని పని. మామూలు న్యాయవాదులు నారిమన్‌లాగా వాదించలేరు. ఒకవేళ వాదించినా జడ్జిలకు నారిమన్‌లపై ఉన్నంత గురి వీరిపై ఉండదు. కనుక తీర్పులు రావడం అనేది నిందితుల పలుకుబడి, వారి తరపున వకాల్తా పుచ్చుకునే సుప్రసిద్ధ ఖరీదైన న్యాయవాదులు, తీర్పునిచ్చే ధర్మాసనంలోని న్యాయమూర్తులపై ఆధార పడుతుందని ఈ నేపథ్యంలో మరోసారి బయట పడ్డట్లయింది.

అక్రమార్జనల కేసుపై కిందిస్థాయి కోర్టులో తీర్పు రావడానికి 18 ఏళ్లు పట్టింది. పోనీ ఇన్నేళ్లయినా సరే న్యాయం దొరికింది అని అనుకోవడానికి ఆస్కారం లేకుండా వెంటనే తీర్పును నిలుపుదల చేస్తూ బెయిలు రావడం, ఆ తర్వాత పై కోర్టులో అప్పీలు చేసుకోవడం అక్కడా తీర్పు వ్యతిరేకంగా వస్తే మరో పై కోర్టుకు అప్పీలుకు వెళ్లడం అనే పద్ధతిలోని వెసులుబాటును తమకు అనుకూలంగా తిప్పుకుని శిక్షలు పడకుండా తప్పుకోవడం జరుగుతున్నది. ఇలా చేయడానికేనా అతి ఖరీదైన లాయర్లు, కోర్టులు ఉన్నాయని అనిపిస్తే తప్పెవరిది. ఈ నేపథ్యంలో చూసినప్పుడు జయలలిత తదితరులకు శిక్షలు పడతాయా? అన్నది అనుమానమే! ప్రముఖ పౌర హక్కుల నేత కన్నబీరన్ తన '24 గంటలు' పుస్తకంలో కోర్టు తీర్పుల గురించి చెపుతూ కింది కోర్టు నుండి పై కోర్టుకు వెళ్లేకొద్దీ శిక్షల తీవ్రత తగ్గుతుందని, చాలా సందర్భాలలో కింది కోర్టులు వేసిన శిక్షలు సుప్రీంకోర్టుకు వెళ్లేసరికి వీగిపోతాయని తన అనుభవాన్ని చెప్పారు. సుప్రీంకోర్టుకు పోగలిగే స్తోమత చాలా

మందికి ఉండనే ఉండదు. అలా ఉన్న వారెవరు అంటే కోర్టు లావాదేవీలను చక్కబెట్టుకోగలిగే, ఖరీదైన లాయర్లను పెట్టుకోగలిగే బడా ధనికులు, రాజకీయ నాయకులు, పెట్టుబడి దారులు, భూస్వామ్య శక్తులే నన్నది సులభంగానే తెలుసుకోవచ్చు. కింది కోర్టుల్లోను తీర్పులను తమకు అనుకూలంగా మలుచుకోగలిగే ఈ శక్తులు ఒకవేళ సాధ్యపడని పక్షంలో సాగతీత మంత్రం ఉపయోగిస్తారు. సాగదీసి, సాగదీసి దొరలుగా చలామణి అవుతారు. రాజ్యాలు ఏలుతారు. మరింతగా ధనం, అధికారం, విలాసాలు అనుభవిస్తారు. ఇదంతా ప్రజాస్వామ్యం, న్యాయం, చట్టం, రాజ్యాంగం పేరు మీదే జరిగిపోతుంటాయి. ఇదంతా కూడా ఇంతకు ముందు ప్రస్తావించిన వారి విషయంలో మరీ ముఖ్యంగా జయలలిత విషయంలో రుజువైన, రుజువవుతున్న సత్యం.

జయలలితకు ఇలాంటి కేసు కొత్తదేమి కాదు. తమిళనాడు స్మాల్ ఇండస్ట్రీస్ కార్పొరేషన్ (టిఎఎస్ఎస్ఐ)కు చెందిన ప్రభుత్వ భూమిని జయ పబ్లికేషన్స్, శశి ఎంటర్‌ప్రైజెస్‌లకు తక్కువ ధరలకు అమ్మడంలో అధికార దుర్వినియోగం జరిగిందని, దీనివల్ల తమిళనాడు ప్రభుత్వానికి ఆర్థిక నష్టం జరిగిందని సిబి-సిఐడి 1996 నవంబర్ 15న, 1997 అక్టోబర్ 22న చార్జిషీట్ దాఖలు చేసింది. ఈ రెండింటి వ్యాపార లావాదేవిలలో జయలలిత, ఆమె స్నేహితురాలు శశికళా నటరాజన్‌లు భాగస్వాములు. ఇది జరిగినప్పుడు జయలలిత ముఖ్యమంత్రిగా అధికారంలో ఉన్నారు. ఈ రెండు కేసుల్లో 2000 అక్టోబర్ 9న ప్రత్యేక కోర్టు తీర్పునిస్తూ జయలలితకు 3 ఏళ్లు, 2 ఏళ్ల శిక్ష విధించింది. ఫలితంగా ప్రజా ప్రాతినిధ్య చట్టం, 1951 (ఆర్‌పిఎ, 1951)లోని సెక్షన్ 8 (3) ప్రకారం 2001లో జయలలిత అసెంబ్లీ ఎన్నికల్లో పోటీ చేసే అర్హత కోల్పోయింది. ఆర్‌పిఎ, 1951లోని సెక్షన్ 8 (1) (ఎం) ప్రకారం పిసిఎ కింద శిక్షలకు గురైనవారు శిక్షాకాలం ముగిశాక మరో 6 ఏళ్ల వరకు ఎన్నికల్లో పోటీచేసే అర్హత కోల్పోతారు. అయినా సరే తమిళనాడులోని నాలుగు చోట్ల నుండి ఎంఎల్‌ఎగా నామినేషన్ దాఖలు చేసింది. కాని అవి తిరస్కరించబడ్డాయి. ఈ తీర్పు విచారణ డిఎంకె అధికారంలో ఉన్నప్పుడు జరిగిందనేది గుర్తించదగ్గది. 2001లో జయలలిత నేతృత్వంలోని ఎఐఎడిఎంకె మెజారిటీ అసెంబ్లీ స్థానాలు గెలుచుకుని ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసింది. ఎంఎల్‌ఎ కాకున్నా సరే ఆరు నెలల వరకు ముఖ్యమంత్రి లేదా మంత్రయ్యే అవకాశాన్ని రాజ్యాంగంలోని ఆర్టికల్ 164 (1) ఇచ్చింది. దీన్ని అవకాశంగా తీసుకుని జయలలిత 2001 మే 16న ముఖ్యమంత్రి అయింది. అయితే సుప్రీంకోర్టు ఈ విషయంలో అప్పటి తమిళనాడు గవర్నర్ ఫాతిమాబీబీ నిర్ణయం సరికాదని జయలలిత ముఖ్యమంత్రిగా ఉండడం న్యాయ సమ్మతం కాదని 2001 సెప్టెంబర్ 21న తీర్పునిచ్చింది. దీంతో ఆమె ముఖ్యమంత్రి కుర్చీని వదులుకోక తప్పలేదు. అప్పుడు తన కీలుబొమ్మను ముఖ్యమంత్రి చేసింది. జయలలిత తాను ముఖ్యమంత్రిగా లేదా తన చెప్పుచేతల్లో, కనుసైగల్లో నడిచే ఎఐఎడిఎంకె అధికారంలో ఉండడం తనపై కేసును బలహీనం చేయడానికి అవసరంగా ఉండింది. ప్రత్యేక కోర్టు వేసిన శిక్షలపై జయలలిత మద్రాస్ హైకోర్టులో అప్పీల్‌కు వెళ్లింది. అక్కడ ప్రత్యేక కోర్టు తీర్పును కొట్టేస్తూ జయలలితను నిరపరాధిగా ప్రకటించింది. ప్రకటింపచేసుకుంది అంటే బాగుంటుందేమో. ఈ తీర్పు ఆమె నేతృత్వంలోని ఎఐఎడిఎంకె అధికారంలో ఉన్నప్పుడు వచ్చింది. ఆ తర్వాత ఎంఎల్‌ఎగా పోటీచేసి గెలిచింది. ఆ వెంటనే 2003 మార్చ్ 2న ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేసింది. 2006 వరకు ముఖ్యమంత్రిగా కొనసాగింది. కోర్టులను, చట్ట సభలను, ప్రభుత్వాలను జయలలిత తనకు అనుకూలంగా మలుచుకోవడంలో ఇష్టా రాజ్యంగా ఎలా వ్యవహరించిందో తెలిసిపోతోంది.

ఎఐఎడిఎంకెకు ప్రధాన రాజకీయ విరోధిగా ఉన్న డిఎంకె జయకు వ్యతిరేకంగా పట్టుదలతో ఉండడం, అలాగే ఏ రాజకీయ కారణాలైతేనేమి సుబ్రహ్మణ్యస్వామి తన ఫిర్యాదుకు కట్టుబడి నేటి దాకా నిలబడింది. ఈ ఇద్దరూ వెంట వెంటనే ఫాలో అవుతూ తగు చర్యలు సకాలంలో తీసుకోవడం, కోర్టుల్లో ఒత్తిడి తేవడం జరిగింది. మళ్లీ అధికారంలోకి రావడానికి, డిఎంకెకు ఎన్నికల్లో గెలవాలంటే జయపై పైచేయి సాధించడం డిఎంకెకు తప్పనిసరి రాజకీయ అవసరంగా ఉన్నది. 2006 ఎన్నికల్లో ఎఐఎడిఎంకె పరాజయం పాలైంది. డిఎంకె అధికారంలోకి వచ్చి 2011 వరకు కొనసాగింది. జయలలితను రాజకీయంగా దెబ్బ తీయడానికి, ఈ కేసును గట్టి పరచడానికి ప్రభుత్వ పరంగా తీసుకోవల్సిన జాగ్రత్తలు తీసుకోవడం వల్లే అనేది జయకు హాని తెచ్చిపెట్టింది.

జయలలిత అక్రమార్జనలను రు.66,65,20,395గా కోర్టు చూపెట్టింది. నిజానికి ఇది చిన్నమొత్తమే. కోల్‌గేట్, మైనింగ్, తదితర అనేక కుంభకోణాల్లో వేలకోట్ల ప్రజాధనం కొద్దిమంది చేతుల్లోకి పోతున్నాయి. జయలలిత 1987లో తన ఆస్తిని 7.5 లక్షలు, బ్యాంక్ బ్యాలెన్స్‌గా ఒక లక్ష రూపాయలు, మరికొంత బంగారం ఉన్నట్లు చూపించింది. 1 జులై 1991 వరకు తన, శశికళ పేరుమీద రు. 2,01,83,957 ఆస్తులున్నాయి. 1991 జులై 1 తర్వాత వీరిద్దరి పేర్ల మీదనే కాకుండా సుధాకరన్, ఇలదరసిలు భాగస్వాములుగా అనేక కంపెనీలు నడపబడ్డాయి. 1989-90 ఆర్థిక సంవత్సరంలో ఆస్తులు లేవని చూపెట్టిన జయలలిత 1990-91లో రు.1.89 కోట్లు, 1991-92లో రు. 2.60 కోట్లు, 1992-93లో రు. 5.82 కోట్లు, 1993-94లో రు. 91.33 కోట్లు, 1994-95లో 38.21 కోట్లు ఆదాయం చూపెట్టింది. అప్పుడు ఆమె ముఖ్యమంత్రిగా ఒక రూపాయి మాత్రమే జీతంగా తీసుకుంటున్నది. మొత్తంగా 1991-96 కాలంలో రు. 66,65,20,395 లకు సంబంధించి సరైన ఆధారాలను చూపెట్టలేక పోయారని ప్రత్యేక కోర్టు తన తీర్పులో పేర్కొన్నది. ఈ చిన్న మొత్తానికే కోర్టులో శిక్షకు గురైంది. కాని ఈ దేశంలో వేల, లక్షల కోట్లను స్వాహా చేస్తున్న, చేసిన వారిపై ఏ చర్యలు లేవు ఏ కొందరిపైనో ఇలాంటి కేసులు రాజకీయ ప్రత్యర్థుల, రాజకీయ అధికార కాంక్ష ప్రయోజనాల రీత్యా కొంత మేరకు కోర్టుల్లో నడుస్తుంటాయి. ఎందరో జయలలితలు ఉదాహరణకు లాలూ ప్రసాద్ యాదవ్, ఓం ప్రకాశ్ చౌతాలా, గాలి జనార్దన్‌రెడ్డి, ఎ. రాజా, కనిమొళి, జగన్మోహన్ రెడ్డిలు మొదలగు వారు కేసుల్లో పడుతుంటారు. కాలం గడిచే కొద్దీ సాగతీతలకు గురయ్యి ఏళ్లకేళ్లు కింది కోర్టుల నుండి సుప్రీంకోర్టుల దాకా నడిచి చివరకు ఏ శిక్షలు లేకుండానే బయట పడడం జరుగుతుంది. ఒకవేళ ఎక్కడో ఒకచోట శిక్షలు పడినా ఈలోగా వార్థక్యం వచ్చేస్తుంది. ముసలితనం, ఆరోగ్యాల పేరు మీద జాలి చూపమని కోర్టులను అభ్యర్థించి మినహాయింపులు పొందడం జరుగుతుంది. ఈలోగా తమ జీవిత కాలంలో అనుభవించాల్సిన అధికారం, పలుకుబడి, ఆస్తులు, సంపదలు, గౌరవం అన్ని పొందేస్తారు. ఒకవేళ చివరి దశలో శిక్షలు పడినా ఒరిగేదేమి ఉండదు. అయ్యో ముసలితనంలో ఈ శిక్షలెందుకు అని అనుకునే స్థితికి సమాజం నెట్టి వేయబడుతుంది. వీ

*(రచయిత ఉపాధ్యాయులు)*

# ఎన్‌కౌంటర్‌లపై విచారణ - సుప్రీంకోర్టు తీర్పు

*హక్కుల, ప్రజా ఉద్యమాల ఒత్తిడి మూలంగానే సుప్రీంకోర్టు ప్రగతిశీల తీర్పులు ఇస్తుందనీ, అవి అమలు అయ్యేవరకు ప్రజలు ఉద్యమించాలనీ అంటున్నారు* **ప్రొ. ఎస్. శేషయ్య**

ఎన్‌కౌంటర్ హత్యలకు సంబంధించి దర్యాప్తు ఏ విధంగా ఉండాలి, అనుసరించాల్సిన పద్ధతులు ఏమిటి? ఈ విషయంపై పి.యు.సి.ఎల్. వర్సెస్ స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర కేసులో సెప్టెంబర్ 23న సుప్రీంకోర్టు తీర్పిచ్చింది. ఎన్‌కౌంటర్ హత్యలు కొనసాగడం రాజ్యాంగ విలువలకు, చట్టబద్ధపాలనకు, జీవించే హక్కుకు వ్యతిరేకం అని అభిప్రాయపడింది. పోలీసులు సైనిక బలగాలు దేశంలో పెరుగుతున్న ఉగ్రవాదం, తీవ్రవాదం, మాఫియా గ్యాంగ్ వ్యవస్థీకృత నేరాలను నిరోధించడంలో తమ ప్రాణాలు బలిపెడుతున్నారనీ, కానీ వారు చట్టాన్నీ తమ చేతుల్లోకి తీసుకోరాదనీ ఈ తీర్పులో న్యాయమూర్తులు అభిప్రాయపడ్డారు. ఎన్‌కౌంటర్ హత్యలపై సమగ్రమైన దర్యాప్తు చేయడానికి సరైన మార్గదర్శకాలు లేనందున వాటిని రూపొందించాల్సిన అవసరం ఉందంటూ, 16 మార్గదర్శకాలను సూచించారు. ఈ తీర్పును రాజ్యాంగంలోని ఆర్టికల్ 141 ప్రకారం చట్టంగా భావించి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తప్పనిసరిగా అమలు చేయాలని కోర్టు ఆదేశించింది.

ప్రస్తుతం సుప్రీం కోర్టులో ఎన్‌కౌంటర్ హత్యలకు సంబంధించిన కేసులు కొన్ని విచారణలో, మరికొన్ని పెండింగ్‌లో ఉన్నాయి. ఉదాహరణకు పోలీసు ఆఫీసర్స్ అసోషియేషన్ వర్సెస్ ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం, పి.యు.సి.ఎల్ వర్సెస్ స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర కేసు వివరాలు పరిశీలిస్తే 1995-1997 మధ్యకాలంలో ముంబైలో పోలీసులు 135 మందిని విచ్చలవిడిగా బూటకపు ఎన్‌కౌంటర్లలో హతమార్చారు. ఈ సంఘటనలపై విచారణ జరిపించాలని, విచారణకు సంబంధించిన మార్గదర్శకాలను రూపొందించాలని పి.యు.సి.ఎల్. (పీపుల్స్ యూనియన్ ఫర్ సివిల్ లిబర్టీస్) 1997లో ముంబై హైకోర్టులో ప్రజా ప్రయోజన వాజ్యాన్ని వేసింది. 2008లో విచారణ పూర్తి చేసి ముంబై హైకోర్టు కొన్ని మార్గదర్శకాలను సూచిస్తూ తీర్పు ఇచ్చింది. ఈ తీర్పు అసమగ్రంగా అసంతృప్తికరంగా ఉందనీ, సవాలు చేస్తూ పి.యు.సి.ఎల్. 2008లో సుప్రీం కోర్టులో స్పెషల్ లివ్ పిటిషన్ దాఖలు చేసింది. సెప్టెంబర్ 23న విచారణ పూర్తిచేసి తుదితీర్పును ప్రకటించింది. మొత్తంగా ఈ కేసు విచారణకు 17 సంవత్సరాలు పట్టింది. సుప్రీం కోర్టు ప్రధాన న్యాయమూర్తి ఎల్.ఎన్. లోథా పదవి విరమణకు మూడు రోజుల ముందు ఈ తీర్పు ఇచ్చాడు.

ఈ తీర్పు సంచలనాత్మకమైందనీ, చారిత్రాత్మకమైందనీ మీడియాలో ప్రచారం జరిగింది. హక్కుల సంఘాలు కూడా స్వాగతించాయి. కేంద్ర ప్రభుత్వం గానీ, పోలీసులు గానీ ఈ తీర్పును పెద్దగా పట్టించుకోలేదు. బహుశా ఈ తీర్పు తమను ఎలాంటి ఇబ్బంది పెట్టదని భావిస్తున్నారా? 32 పేజీల తీర్పును నిశితంగా పరిశీలించినా, ప్రత్యేకంగా 33వ పేరాలోని మార్గదర్శకాలను పరీక్షించినా కొత్తగా సుప్రీంకోర్టు చెప్పిందీ ఏమీలేదు.

ఎన్‌కౌంటర్ హత్యలను నిరోధించడానికి పెద్దగా ఉపయోగపడదు. సుప్రీంకోర్టు వివిధ సందర్భాల్లో ఎన్‌కౌంటర్ హత్యల కేసుల్లో ఇచ్చిన తీర్పులను పునరుద్ఘాటించింది. గతంలో జాతీయ మానవ హక్కుల సంఘం సూచించిన మార్గదర్శకాలను, అంతర్జాతీయంగా పోలీసు అధికారులు అనుసరించాల్సిన క్రమశిక్షణ పద్ధతులను క్రోడీకరించి 16 మార్గదర్శకాలను రూపొందించింది, వాటిని పరిశీలిస్తే తీర్పు సారాంశం అర్థం అవుతుంది.

**మార్గదర్శకాలు**

1. ఏ ప్రాంతంలోనైనా నేరస్తుల కదలికల గురించి, నేరం జరుగుతుందనీ పోలీసులకు రహస్య సమాచారం అందితే, వారిని అడ్డుకోవడానికి చేసే ప్రయత్నంలో ఎదురు కాల్పులు జరిగి ఎవరైనా మరణిస్తే, సంఘటనకు సంబంధించిన వివరాలను పోలీసులు తప్పని సరిగా రాతపూర్వకంగా లేదా డిజిటల్ రూపంలో రికార్డు చేయాలి. ఎదురుకాల్పుల సంఘటనలో పాల్గొన్న పోలీసుల టీం, సంఘటనా స్థలి గురించిన వివరాలను నమోదు చేయాల్సిన అవసరం లేదు.

2. ఎన్‌కౌంటర్ హత్యకు సంబంధించి ప్రాథమిక సమాచార నివేదిక (ఎఫ్ఐఆర్) ను రిజిస్టర్ చేసి, సంబంధిత కోర్టుకు వెంటనే పంపాలి. నేర విచారణ స్మృతి (సిఆర్‌పిసి) నిర్దేశించిన ప్రకారం దర్యాప్తు మొదలుపెట్టాలి.

3. ఎన్‌కౌంటర్ హత్యలపై సిఐడి లేదా పక్క పోలీసు స్టేషన్‌కు చెందిన ఉన్నత అధికారితో దర్యాప్తు చేయించాలి. దర్యాప్తులో భాగంగా:

ఎ) మృతుని గుర్తింపుకు సంబంధించిన కలర్ ఫోటోలు తీసుకోవాలి.

బి) సంఘటనా స్థలంలో లభించే సాక్ష్యాధారాలు - మట్టిపై ఉన్న రక్తపు మరకలను, వెంట్రుకలను సేకరించాలి.

సి) సంఘటనకు సంబంధించి ఎవరైనా సాక్ష్యులు ఉంటే వారి స్టేట్‌మెంట్స్, ఫోన్‌నెంబర్లు తీసుకోవాలి. పోలీసుల స్టేట్‌మెంట్స్ కూడా నమోదు చేయాలి.

డి) మృతుని వేలు ముద్రలు, సంఘటనా స్థలంలో లభించే వేలిముద్రలను సేకరించి కెమికల్ పరీక్షకు పంపించాలి.

ఇ) సంఘటనా స్థలానికి సంబంధించిన స్కెచ్, కాల్పుల్లో మరణించిన సమయం రికార్డు చేయాలి.

ఎఫ్) జిల్లా ఆసుపత్రికి చెందిన ఇద్దరు వైద్యులతో శవ పరీక్ష చేయించాలి. ఇందులో ఒకరు ఆసుపత్రి ఇన్‌చార్జి లేదా హెడ్ అయి ఉండాలి. శవ పరీక్షను వీడియో తీయించాలి.

జి) సంఘటనా స్థలంలో లభించే తూటాలను, ఆయుధాలను సేకరించి భద్రపరచాలి.

ఎచ్) మరణానికి సంబంధించి కారణాలను తెలుసుకోవాలి. సహజ మరణమా, ప్రమాదవశాత్తు చనిపోయాడా లేదా ఆత్మహత్యనా అనే విషయాన్ని పరిశీలించాలి.

4. ఎదురు కాల్పుల సంఘటనలో ఎవరైన మరణిస్తే నేర విచారణ స్మృతి (సిఆర్‌పిసి) సెక్షన్ 176 ప్రకారం మేజిస్టేరియల్ విచారణ జరిపించాలి. విచారణ నివేదికను సెక్షన్ 190 ప్రకారం జుడిషీయల్ మేజిస్ట్రేట్‌కు పంపించాలి.

5. పోలీసుల దర్యాప్తు పూర్తిగా లోపభూయిష్ఠంగా ఉంటే తప్ప జాతీయ మానవ హక్కుల సంఘం జోక్యం చేసుకోకూడదు. కానీ, పోలీసు డిపార్ట్‌మెంట్ ఎన్‌కౌంటర్ హత్యలకు సంబంధించిన సమాచారాన్ని జాతీయ, రాష్ట్ర మానవ హక్కుల కమిషన్‌లకు వెంటనే పంపించాలి.

6. ఎదురు కాల్పుల్లో గాయపడిన వారికి వెంటనే వైద్య చికిత్సను అందజేయాలి. వారి వాఙ్మూలాన్ని నమోదు చేయాలి. (ఫిజికల్ ఫిట్‌నెస్ సర్టిఫికెట్ జత చేయాలి)

7. ప్రాథమిక సమాచార నివేదికను (ఎఫ్‌ఐఆర్), పంచనామాను, సంఘటనా స్థలి స్కెచ్‌లను వెంటనే సంబంధిత కోర్టుకు నివేదించాలి.

8. ఎన్‌కౌంటర్ హత్యల్లో పోలీసు దర్యాప్తు పూర్తైన వెంటనే నివేదికను సిఆర్‌పిసి సెక్షన్ 173 ప్రకారం కోర్టుకు అందజేయాలి. పోలీసులు చార్జిషీటు వేసిన తర్వాత వీలైనంత త్వరగా కోర్టు కేసు విచారణను పూర్తిచేయాలి.

9. ఎదురు కాల్పుల్లో మరణించిన పోలీసు, క్రిమినల్ కుటుంబానికి సమాచారం అందించాలి.

10. ఆరునెలల వ్యవధిలో రాష్ట్రంలో జరిగిన ఎన్‌కౌంటర్ హత్యల వివరాలను, జాతీయ మావనహక్కుల కమిషన్‌కు, రాష్ట్ర డిజిపికి పంపించాలి.

11. పోలీసులు జరిపిన కాల్పుల కారణంగానే ఎవరైన చనిపోతే, ఆ పోలీసులపై క్రమశిక్షణ చర్య తీసుకోవాలి. విచారణ సమయంలో అతన్ని సస్పెండ్ చేయాలి.

12. ఎన్‌కౌంటర్‌లో మృతి చెందిన బాధిత కుటుంబానికి నేరశిక్షా స్మృతి (ఐపిసి) సెక్షన్ 357ఎ కింద నష్టపరిహారం చెల్లించాలి.

13. ఎదురు కాల్పుల్లో పోలీసులు ఉపయోగించిన తుపాకులను, ఇతర ఆయుధ సామగ్రిని సరెండర్ చేసి బాలిస్టిక్ పరీక్షకు పంపించాలి. (రాజ్యాంగంలోని ఆర్టికల్ 20(3) లోబడి ఉండాలి. అంటే సరెండర్ చేసిన ఆయుధాలు సాక్ష్యంగా చెల్లదు).

14. ఎదురుకాల్పుల్లో పోలీసులు చనిపోతే అతని కుటుంబానికి సమాచారం ఇవ్వడంతోపాటు, వారు కోరితే న్యాయసహాయం అందించాలి.

15. ఎన్‌కౌంటర్ హత్య జరిపిన వెంటనే అందులో పాల్గొన్న పోలీసులకు శౌర్య పతకాలను, ఉద్యోగాల్లో ప్రమోషన్‌ను ఇవ్వకూడదు. ఒకవేళ ఎన్‌కౌంటర్ బూటకం కాదని, నిజం అని తేలితే ప్రోత్సహాకాలు కల్పించవచ్చు.

16. ఎన్‌కౌంటర్ హత్యల్లో పోలీసుల దర్యాప్తు సమగ్రంగా సముచితంగా లేదని బాధితుడి కుటుంబం భావిస్తే ఈ విషయంపై జిల్లా జడ్జీకి ఫిర్యాదు చేసే అవకాశం ఉంది. ఫిర్యాదును స్వీకరించిన జడ్జీ తప్పనిసరిగా విచారణ జరిపి వాస్తవాన్ని తెలుసుకోవాలి.

సుప్రీంకోర్టు మార్గదర్శకాలను పరిశీలించిన న్యాయ నిపుణులు, న్యాయవాదులు ఈ తీర్పువల్ల పెద్దగా ప్రయోజనం లేదని అభిప్రాయ పడ్డారు. గత 40 సంవత్సరాలుగా ఎన్‌కౌంటర్ హత్యలకు బాధ్యులైన పోలీసులపై సెక్షన్ 302 కింద హత్యానేరం నమోదు చేసి, కోర్టులో విచారణ జరిపి, శిక్షించాలని హక్కుల సంఘాలు డిమాండ్ చేస్తున్నాయి. పై డిమాండ్లతో ఎపిసిఎల్‌సి హైకోర్టులో వందల రిట్ పిటిషన్లు వేసింది.

పోలీసులు నమోదు చేసే ఎఫ్‌ఐఆర్‌లలో ఎన్‌కౌంటర్ హత్యలకు బాధ్యులైన పోలీసులపై ఐపిసి 302 కింద కేసు నమోదు చేయకుండా, చనిపోయిన వారిపై హత్యా ప్రయత్నం (సెక్షన్ 307) కేసు నమోదు చేయడం ఆ తర్వాత కేసు మూసివేయడాన్ని కోర్టులో ప్రశ్నించడం జరిగింది. ఈ పద్ధతికి స్వస్తిపలకాలని విజ్ఞప్తిచేసింది ఎపిసిఎల్‌సి. హైకోర్టు ఈ పద్ధతి తప్పని చెప్పింది. అయితే ఈ ఎదురు కాల్పుల్లో పాల్గొన్న పోలీసులను నిర్దిష్టంగా గుర్తించి, నిర్దిష్టంగా ఫిర్యాదు చేయండని ఉచిత సలహా ఇచ్చింది హైకోర్టు. కానీ, ఎన్‌కౌంటర్ హత్యలన్నీ రహస్యంగా, రహస్య పోలీసు యంత్రాంగం చేస్తుంది. సంఘటనలో పాల్గొన్న పోలీసుల పేర్లు బయటకు రావు అని హైకోర్టుకు చెపితే, సమాచారపు హక్కు కింద పిటిషన్ వేసి వివరాలు తీసుకొమ్మన్నది. జడ్జీల సలహా మేరకు ఆర్‌టిఐ కింద సమాచారం కోరగా పోలీసులు నిరాకరించారు. రహస్య సమాచారం కాబట్టి బహిరంగం చేయడం వీలుకాదన్నారు. చివరికి సీల్డు కవరులో హైకోర్టు జడ్జీలకు ఇచ్చారు. సుప్రీంకోర్టు మార్గదర్శకాల్లో ఎన్‌కౌంటర్ హత్యలకు సంబంధించిన వివరాలను సమోదు చేయా లంటూనే, పోలీసుల వివరాలను చెప్పాల్సిన అవసరం లేదు అంటుంది. ముద్దాయిల ఊరు, పేరు తెలియకుండా ఎవరి మీద 302 కింద కేసుపెట్టాలి?

ఎన్‌కౌంటర్ హత్యలకు సంబంధించిన కేసులను సిఐడి లేదా పక్క పోలీసు స్టేషన్ ఉన్నత అధికారితో దర్యాప్తు చేయించాలనే మార్గదర్శకం అమలు చేయడంలో అనేక ఇబ్బందులు ఉన్నాయి. మన రాష్ట్రంలో మెజిస్టీరియల్ విచారణకు హాజరైన సాక్షులను పోలీసులు బెదిరించడం, అక్రమంగా నిర్బంధించిన సంగతి తెలిసిందే. సిఐడి అయిన ఉన్నత పోలీసు అధికారైనా పోలీసుల పట్ల పక్షపాతంగా వ్యవహరిస్తాడే తప్ప నిజాయితిగా దర్యాప్తు జరగదని అనేక సంఘటనలు తెలియచేస్తున్నాయి. ఆజాద్ (రాజ్‌కుమార్), హేమచంద్రపాండేలను బూటకపు ఎన్‌కౌంటర్ హత్య చేశారు. ఈ సంఘటనపై సిబిఐ విచారణ జరిపింది. గొప్ప నిజాయితీ పరుడని పేరున్న సిబిఐ అధికారి లక్ష్మినారాయణ దర్యాప్తు చేసి రాజ్‌కుమార్, హేమచంద్రపాండేలది నిజమైనా ఎన్‌కౌంటరని నివేదిక ఇచ్చాడు. దీన్ని సుప్రీంకోర్టు ఆమోదించి కేసు విచారణను నిలిపివేసింది. అభ్యంతరాలుంటే కింది కోర్టులో ప్రైవేట్ కేసు వేసుకొమ్మని చెప్పింది. ఢిల్లీలో జరిగిన బాట్లా హౌస్ ఎన్‌కౌంటర్ సంచలనాన్ని రేపింది. జాతీయ మానవ హక్కుల కమిషన్ ఈ కేసును దర్యాప్తు చేసి పోలీసులకు క్లీన్‌చిట్ ఇచ్చింది. జామీయా టీచర్స్ అసోషియేషన్ 1995-2012లలో ఢిల్లీలో జరిగిన ఎన్‌కౌంటర్ హత్యలకు సంబంధించిన మెజిస్టీరియల్ విచారణ వివరాలను ఇవ్వాలని ఆర్‌టిఐ కింద అడిగింది. కేవలం రెండు సంఘటనలకు సంబంధించి వివరాలను ఇచ్చింది. ప్రస్తుతం ప్రభుత్వాలు మెజిస్టీరియల్ విచారణకు ఆదేశించడం లేదు.

ఎదురు కాల్పుల సంఘటనలో పోలీసులు ఉపయోగించిన తుపాకులను, ఇతర ఆయుధ సామగ్రిని సరెండర్ చేసి బాలిస్టిక్ పరీక్షకు పంపించాలని సుప్రీంకోర్టు సూచించింది. కానీ ఒక షరతును పెట్టింది. రాజ్యాంగంలోని ఆర్టికల్ 20(3)లో ముద్దాయికి ఇచ్చిన రక్షణకు లేదా హక్కుకు లోబడి ఉండాలి. అంటే ఆయుధాలను సాక్ష్యంగా ఉపయోగించడానికి వీలులేదు. ఈ మార్గదర్శకం వలన ఎటువంటి ప్రయోజనం లేదు.

బూటకపు ఎన్‌కౌంటర్లకు పాల్పడిన పోలీసులపై డిపార్టుమెంట్ పరంగా క్రమశిక్షణా చర్య తీసుకోవాలనీ, విచారణ సమయంలో సస్పెండ్ చేయాలనే సూచన ఆచరణలో చాలా అరుదుగా జరిగే విషయం. ఎదురు కాల్పుల ముసుగులో హత్యలు చేయడం మానవ హక్కుల ఉల్లంఘనే. పోలీసులపై మానవ హక్కుల ఉల్లంఘనకు సంబంధించిన ఫిర్యాదులను

సుప్రీంకోర్టు 2013లో నేషనల్ క్రైమ్ ప్రకటించిన గణాంకాలను ఉటంకించింది. పోలీసులకు వ్యతిరేకంగా మొత్తంగా 51120 ఫిర్యాదులు నమోదయ్యాయి. ఇందులో 26640 ఫిర్యాదులు నిరాధారమని తేల్చారు. 14,928 కేసుల్లో డిపార్ట్‌మెంటల్ విచారణ జరిగింది. కేవలం 3896 కేసుల్లో క్రమశిక్షణా చర్య తీసుకున్నారు. 799 కేసుల్లో కోర్టులో విచారణ జరగ్గా 53 మందికి శిక్ష పడింది. 544 మందిని ఉద్యోగాల నుండి తొలగించారు. ఇది వాస్తవ పరిస్థితి. మరో అంచనా ప్రకారం 2009-2010లో 103 మంది, 2010-11లో 129 మంది, 2011-2012లలో 197 మంది ఎదురుకాల్పుల సంఘటనల్లో చనిపోయారు. గత నాలుగు సంవత్సరాలలో 555 మంది పోలీసుల పైన క్రిమినల్ కేసులు నమోదు అయ్యాయి. ఎంత మందికి శిక్ష పడిందనే సమాచారం లేదు. ఈ తీర్పులో స్వాగతించేది ఎదురుకాల్పుల్లో పాల్గొన్న పోలీసులకు శౌర్యపతకాలను, రివార్డులను, ఆక్సిలరీ ప్రమోషన్లు ఇవ్వకూడదనీ మార్గదర్శకం. దీన్ని సునిశితంగా పరిశీలిస్తే ఎన్‌కౌంటర్ హత్య జరిగిన వెంటనే ఇవ్వకూడదు. కానీ, దర్యాప్తు పూర్తయి ఎన్‌కౌంటర్ నిజమని తేలితే రివార్డులు ఇవ్వచ్చని కోర్టు పరోక్షంగా ఎన్‌కౌంటర్ హత్యలను ప్రోత్సహించింది.

ఒక విషాదమైన పరిస్థితి ఏమంటే ఎన్‌కౌంటర్ పేరుతో హత్యలు చేసిన పోలీసులకు సమాజంలో ఆదరణ పెరగడం. ఎన్‌కౌంటర్ స్పెషలిస్టులుగా పేర్కొనడం. ప్రభుత్వ ప్రోత్సాహం, మీడియా ప్రచారం, సినిమా రంగం ఎన్‌కౌంటర్ హత్యలకు సామాజిక సమ్మతిని తయారు చేశాయి. వాస్తవానికి ముంబైలో ఒక పోలీసు అధికారి ఎంత మందిని చంపాడనే వివరాలు పరిశీలిస్తే భయం వేస్తుంది. ప్రదీప్ శర్మ (ఇన్‌స్పెక్టర్) 104 మందిని, దయనాయక్ (సబ్‌ఇన్‌స్పెక్టర్) 83 మందిని, ప్రఫుల్‌భోస్లే (ఇన్‌స్పెక్టర్) 77 మందిని, రవీంద్ర అంగ్రే (ఇన్‌స్పెక్టర్) 51 మందిని, సజన్‌వేజ్ (అసిస్టెంట్ ఇన్‌స్పెక్టర్) 63 మందిని, విజయ్ సలాస్కర్ (ఇన్‌స్పెక్టర్ 61 మందిని చంపారు. వీరిలో ప్రదీప్ శర్మ నిర్దోషిగా బయటపడ్డారు. విజయ్ సలాస్కర్ ఉద్యోగానికి రాజనామా చేసి శివసేన పార్టీలో చేరారు.

గుజరాత్‌లో పోలీసు అధికారి వంజారా 22 ఎన్‌కౌంటర్ హత్యలకు బాధ్యుడు. అతను ఇప్పుడు జైలులో ఉన్నాడు. ఎన్‌కౌంటర్ హత్యలు 'ప్రభుత్వ విధానంలో భాగం. మేము పాలకుల చేతుల్లో పావులం' అని చెపుతున్నాడు. రాజకీయ అసమ్మతిని, ప్రత్యర్థులను తొలగించు కోవడానికి పాలకులు ఎన్‌కౌంటర్ హత్యలను పాలనా విధానంలో భాగం చేశారు. ప్రత్యామ్నాయ రాజకీయ ఉద్యమ నాయకులను హతమార్చు తున్నారు. టెర్రరిస్టులని, అరాచకవాదులని, తీవ్రవాదులని ముద్రవేసి చంపుతున్నారు. ఇవాళ ఎన్‌కౌంటర్ హత్యలు దొంగలకు కిరాయి హంతకులకు విస్తరించాయి. అంతే కాకుండా పోలీసులు తమ ఆధిపత్యం చాటుకోవడానికి హత్యలు చేస్తున్నారు. పాట్నాలో 2002లో ముగ్గురు యువకులను రద్దీగా ఉన్న మార్కెట్‌లో బహిరంగంగా కాల్చి చంపారు. షాపు యజమానికి, యువకులకు మధ్య ఎస్‌టిడి బిల్లు చెల్లించడంలో ఘర్షణ జరిగింది. షాపు యజమాని పోలీసులను పిలిపించాడు. అంతే పోలీసులు యువకులను కాల్చి చంపారు. ఎదురుకాల్పుల కథ చెప్పారు. ఈ కేసులో 2014 జూన్ 25న పాట్నా కోర్టు పోలీసులకు శిక్ష వేసింది. 2009లో డెహరాడూన్‌లో ఇద్దరు ఎంబిఎ విద్యార్థులను పోలీసులు కాల్చిచంపారు. జిల్లా కోర్టు 17 మంది పోలీసులకు శిక్షవేసింది. ఢిల్లీలోని కన్నాట్‌ప్లేస్‌లో వ్యాపారస్తులను కాల్చి వేశారు. ఇష్రత్ జహాన్ ఎన్‌కౌంటర్ కేసు అందరికీ తెలిసిందే.

సుప్రీంకోర్టు సూచించిన మార్గదర్శకాల ప్రకారం జాతీయ మానవ హక్కుల కమిషన్ అధికారాలు కుదించబడ్డాయి. కేవలం ఎన్‌కౌంటర్ హత్యలకు సంబంధించి వివరాలను సేకరించే సంస్థగా ఉంటుంది. ఎందుకంటే పోలీసుల దర్యాప్తు పూర్తిగా లోపభూయిష్టమైన సందర్భంలోనే కమిషన్ జోక్యం చేసుకోవాలి. వాస్తవంలో జాతీయ మానవ హక్కుల కమిషన్ ఎన్‌కౌంటర్ హత్యలకు పాల్పడ్డ వారిపై చర్యలు తీసుకున్న సందర్భాలు చాలా తక్కువ. కేవలం లాకప్ హత్యల్లో నష్టపరిహారం చెల్లించాలనే ఆదేశాలు ఇచ్చింది. ఎపిసిఎల్‌సి చొరవతోనే 1997లో ఎన్‌కౌంటర్ హత్యలపై విచారణకు సంబంధించిన మార్గదర్శకాలను రూపొందించింది.

సెప్టెంబర్ 23న పియుసిఎల్ కేసులో సుప్రీంకోర్టు తీర్పు ప్రస్తుతం విచారణలో ఉన్న కేసులకు ఆటంకంగా మారింది. ఎపిసిఎల్‌సి సుప్రీంకోర్టులో లేవనెత్తిన చట్టపరమైన అంశాలకు, అభ్యంతరాలకు పియుసిఎల్ కేసులో తీర్పులో సమాధానం ఉందనీ, కేసును కొట్టివేయాలని కేంద్ర ప్రభుత్వం తరుపున న్యాయవాదులు వాదించారు. ఎపిసిఎల్‌సి తరపున న్యాయవాదులు తమ కేసు పరిధి విస్తృతమైందని, విచారణ కొనసాగించాలనే వాదనను సుప్రీంకోర్టు ఆమోదించింది.

2009 ఫిబ్రవరిలో ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ఐదుగురు జడ్జీల ధర్మాసనం ఎపిసిఎల్‌సికి అనుకూలంగా తీర్పు ఇచ్చింది. ఈ తీర్పులో ప్రధాన అంశాలు 1) ప్రతి ఎన్‌కౌంటర్ హత్యల సంఘటనలో తప్పని సరిగా ఎఫ్‌ఐఆర్‌ను నమోదు చేయాలి. 2) స్వతంత్రమైన సంస్థతో నిష్పాక్షికమైన విచారణ జరిగేటట్టు చూడాలి. 3) పోలీసులు తమ ఆత్మరక్షణలో భాగంగా ప్రత్యర్థులపై కాల్పులు చేయాల్సి వచ్చిందనే విషయాన్ని కోర్టు విచారణలో నిర్ధారణ కావాలి. అంతే తప్ప దర్యాప్తు క్రమంలో కాదు.

ఆంధ్రప్రదేశ్ హైకోర్టు తీర్పును కనీసం ప్రస్తావించలేదు. సుప్రీంకోర్టు ప్రతి ఎన్‌కౌంటర్ హత్యల్లో పోలీసులు వాదించే 'ఆత్మరక్షణ' గురించి ఎలాంటి చర్చలేదు. అందుకే పోలీసుల నుండి, ప్రభుత్వం నుండి ఎలాంటి వ్యతిరేకత లేదు. కేంద్రమంత్రి తీర్పు పూర్తి పాఠం చదివిన తర్వాత స్పందిస్తాం అన్నాడు.

గతంలో సుప్రీంకోర్టు ఎన్నో 'సంచలనాత్మక' తీర్పులిచ్చింది. డి.కె. బోసు వర్సెస్ స్టేట్ ఆఫ్ పశ్చిమ బెంగాల్ కేసులో లాకప్ హత్యలను నివారించడానికి, అక్రమ అరెస్టులను నియంత్రించడానికి 11 మార్గదర్శకాలను ఇచ్చింది. పోలీసు యంత్రాంగం మార్గదర్శకాలను పాటించడం లేదు. కోర్టు ధిక్కారం కింద కేసులు వేశారు. కాని సుప్రీంకోర్టు నుంచి 'తప్పనిసరిగా అమలు చేయాలని' జవాబు వస్తుంది తప్ప పోలీసులపై చర్యలు తీసుకున్న సందర్భాలు లేవు. కింది కోర్టులు ఎన్‌కౌంటర్ హత్యలకు బాధ్యులైన పోలీసులకు శిక్ష వేస్తే హైకోర్టులు, సుప్రీంకోర్టులు నిర్దోషులుగా విడుదల చేసిన సందర్భాలే ఎక్కువ. మన రాష్ట్రంలో ఎస్.పి సీతారామరాజు, సురేంద్రబాబులు చట్టం నుండి, కోర్టుల నుండి ఎలా తప్పించుకున్నారో తెలిసిందే.

సుప్రీంకోర్టు ప్రగతిశీలమైన తీర్పులు హక్కుల ఉద్యమం, ప్రజల ఒత్తిడి మూలంగానే వస్తాయి. ఎన్‌కౌంటర్ హత్యల్లో చట్టాన్ని అమలు చేయాలనీ, దర్యాప్తు నిష్పక్షపాతంగా ఉండాలనీ, 302 కింద హత్యానేరం మోపాలని, శవాలను భద్రపరచాలని, నిపుణులైన డాక్టర్‌లతో శవ పరీక్ష చేయించాలని ఎపిసిఎల్‌సి కోర్టులలోనూ, బయట పోరాడింది. న్యాయవ్యవస్థ కూడా తన విశ్వసనీయతను, ప్రజల నమ్మకాన్ని కాపాడుకోవడానికి ప్రజలకు అనుకూలమైన తీర్పులు ఇస్తుంది. ప్రజల చొరవ, ఒత్తిడి లేకుండా కోర్టుల చొరవ పెరగదు. అందుకే పియుసిఎల్ కేసులోని పరిమితులను ఎత్తి చూపుతూనే, ఎన్‌కౌంటర్ హత్యలకు వ్యతిరేకంగా పోరాడాల్సిన అవసరం ఇంకా ఉంది.

*(రచయిత పౌరహక్కుల సంఘం అధ్యక్షులు)* వీ

# ఆర్థిక సామ్రాజ్యానికి మోడీ ఆహ్వానం

***విదేశీ పారిశ్రామికవేత్తల, కార్పొరేట్ సంస్థల కోరికలు తీర్చడానికీ, వారు మన దేశంలోని సహజ వనరులను ఇంకా దోచుకోవడానికీ మోడీ అమెరికా పర్యటించి వారిని ఆహ్వానిస్తున్నారని అంటున్నారు* వి. హనుమంతరావు**

ప్రధాని అమెరికా వెళ్లేటప్పుడు మేక్ ఇన్ ఇండియా అంటూ ఆహ్వాన పత్రంతో వెళ్లారు. అదే ఆయన అమెరికా ప్రయాణం ప్రధాన లక్ష్యం. ఆ పని చేసుకుని వచ్చారు. ఒబామాతో చర్చలు రెండో లక్ష్యం అనే దాని కన్నా లాంఛనం అంటే వాస్తవానికి దగ్గరగా ఉంటుంది.

మొదటి లక్ష్యం నెరవేరుతుందా అని ప్రశ్నించుకోవాల్సిన అవసరం లేదు. ఎందుచేతనంటే ఇప్పటికే ఛప్పన్నారు బహుళ జాతి సంస్థలు విదేశీ పరిశ్రమలు (కాడ్‌బరీ చాకోలేట్ల నుంచి) కార్ల తయారీ సంస్థలు పని చేస్తున్నాయి. రాయల్టీ అనే చీపురుతో మనదేశ సహజ వనరులను రాయల్టీ లాభాల పేరుతో కోట్ల రూపాయలు వారి వారి దేశాలకు తరలించుక పోతున్నాయి. మరింతగా విస్తరిస్తున్నాయి. దేశంలో తయారీ రంగంలో పెద్దపీట కార్ల పరిశ్రమదే. తయారీ రంగంలో సింహభాగం విదేశీ కార్ల పరిశ్రమదే. మరిన్ని కొత్తరకాల కార్ల తయారు చేయబోతున్నామని ప్రకటనలు పత్రికల్లో చూస్తున్నాం. అయినా అమెరికా వెళ్లి ప్రత్యేకంగా ఆహ్వానం పలికి రావడమేంటి?

గవర్నమెంట్ హాస్ నో బిజినెస్ టు బి ఇన్ బిజినెస్ – (ప్రభుత్వం పరిపాలించడానికే పరిమితమవ్వాలి కాని వ్యాపారం చేయడమేమిటి?) అని కాంగ్రెస్ ప్రభుత్వ హయాంలోనే కార్పొరేట్ సంస్థలు ప్రభుత్వాన్ని ప్రశ్నిస్తూ వచ్చాయి. వారి ఒత్తిడికి తలవంచి కాంగ్రెస్ ప్రభుత్వం ప్రభుత్వ రంగ పరిశ్రమల్లో బ్యాంకింగ్, ఇన్సూరెన్స్ సంస్థల్లో ప్రభుత్వం వాటాను తగ్గించుకుంటూ వచ్చింది. మోడీ వచ్చి కొత్తగా చేసిందేమీ లేదు. మరింత ఎక్కువగా, వేగంగా పెట్టుబడులను తగ్గించడం ప్రారంభమైంది. కాంగ్రెస్ ప్రభుత్వ విధానాల కొనసాగింపే భారతీయ జనతా పార్టీ విధానం. ప్రధానులు మారారు. పాలక పార్టీలు మారాయి. కాని విధానాలు ఒకటే.

విదేశీ పారిశ్రామికవేత్తల, బహుళజాతి సంస్థల కోర్కె సరిగ్గా ఇదే. కాగా మేక్ ఇన్ ఇండియా అని అమెరికా వెళ్లి బొట్టుపెట్టి పిలిచి రావాలా? అసలు కిటుకు ఇక్కడే ఉంది. అమెరికా ప్రభుత్వానికి ఆ దేశంలో బహుళజాతి సంస్థలకు, కార్పొరేట్లకు బీరకాయ పీచు చుట్టరికం ఉంది. ఆ సంస్థలు పచ్చగా ఉంటేనే ఒబామా పదవిలో కొనసాగుతాడు. (ఇప్పటికే ఆయన సింహాసనం కదలడం ప్రారంభించింది. మూడోసారి పదవి ఆయన్ను వరిస్తుందా అనే పుకార్లు వినిపిస్తున్నాయి.) ఈ నేపథ్యంలో మోడీ అమెరికా వెళ్లి బొట్టుపెట్టి కార్పొరేట్ దిగ్గజాలను పిలిస్తే చాలదూ మోడీ ప్రభుత్వం పెట్టుబడులు పెట్టండి అని ప్రాధేయపడుతోంది. ఇదే అదునుగా ఆ దిగ్గజాలు మరిన్ని షరతులు విధించి, మరింతగా మనదేశాన్ని దోచుకునేటందుకు ఒబామా మీద ఒత్తిడిపెంచి మరిన్ని లాభాలు చేసుకోవచ్చు. వారు ఒబామా మీద రాజకీయ ఒత్తిడి తీసుకుని వస్తారని మన పాలకులుకు తెలుసు. అందుకనే మోడీ అమెరికా వెళ్లి ఒబామాను కలుసుకోవడంలో ఉభయ దేశాల మధ్య సహజంగా ఉండే సమస్యలను చర్చించడం కన్నా, మీ కార్పొరేట్లకు ఓ మాట చెప్పండి అని ఒబామాను అర్థించడమే ఒక పనిగా పెట్టుకుని మోడీ అమెరికా వెళ్లారు. ప్రత్యేకంగా వచ్చి అడుగుతున్నారు కదా అని ఆ దిగ్గజాలు మరి నెత్తికెక్కుతాయి. గొంతెమ్మ కోర్కెలు కోరుతాయి. ఆ డిమాండ్లకు మనదేశంలోని కార్పొరేట్లు వత్తాసుపలుకుతారు. వాళ్ల కోర్కెలు తీరుస్తే మాకెందుకు ఇవ్వరని ఒత్తిడి పెంచుతారు. దేశంలో సృష్టించే సంపద అంటే ఇంకా ఎక్కువగా వారి జేబుల్లోకి పోతుంది. సామాన్యులు మరింత దోపిడికి గురవుతారు. ప్రపంచబ్యాంకు ప్రకారం గణాంకాలు 2006లో అభివృద్ధి చెందుతున్న దేశాలన్నీ మొత్తం 50600 కోట్ల డాలర్లని గ్లోబల్ ఫైనాన్సియల్ ఇంటెలిజెన్స్ అనే సంస్థ వెల్లడించింది. విదేశీ బ్యాంకుల్లో ఉన్న నల్లధనాన్ని స్వదేశానికి తీసుకరావడానికి మోడీ ప్రభుత్వం నిర్ణయించి చర్యలు తీసుకుంటున్నదంటే దేశం నుంచి నిధులు అక్రమంగా తరలిపోతు న్నాయని అధికారికంగా అంగీకరించడమే కదా? అటు విదేశీ పెట్టుబడి దారులు వారి లాభాలు, డివిడెండ్ల పేరుతో తరలించుకపోతుంటే, ఇటు అక్రమంగా నల్లధనం కూడా విదేశాలకు తరలిపోతుందంటే, శ్రమించి రైతాంగం, కార్మికులు సృష్టించిన సంపద చిల్లుకుండలో నీరు పోసినట్లే కదా మోడీ గారూ? ఈ నేపథ్యంలో విదేశీ పెట్టుబడులను ఆహ్వానించడం అంటే మీరు వచ్చి మా దేశాన్ని దోచుకుని వెళ్లండి అని ఎర్ర తివాచి పరచడమే కదా ప్రధాని గారు?

మన దేశంలో గాని, అమెరికా నుంచి వచ్చే పారిశ్రామికవేత్తలు అడిగేదేమిటి? కార్మిక చట్టాలు సవరించాలి. కార్మికులను తొలగించే హక్కు, పన్నులు సవరించాలి. భూ సేకరణ మీరే చేయాలి. మా ఇష్టం వచ్చిన ధర ఇస్తాం. పరిపాలన వ్యవస్థ అంటే బురాక్రసీ సమస్య కారాదు. ఇలా ఉన్నాయి వారి గొంతెమ్మ కోర్కెలు. మన ప్రభుత్వం ఆ దిశగా ఇప్పుడే అడుగులు వేస్తోంది. పర్యావరణ అనుమతులు ఇవ్వడానికి ఓ 30 పరిశ్రమలకు కాంగ్రెస్ ప్రభుత్వం పెండింగ్‌లో పెట్టగా, మోడీ ప్రభుత్వం ఒక్క కలం పోటుతో పచ్చజెండా ఊపేసింది. రాజస్థాన్ ప్రభుత్వం కార్మిక చట్టాలను ఒక్క ఉదుటున కార్పొరేట్లకు అనుకూలంగా మార్చేసింది. (ఆ రాష్ట్ర ముఖ్యమంత్రిని ఏకంగా 47 శాఖలను తన వద్దనే ఉంచుకున్నది ఆ మహా తల్లి) హెచ్.ఎం.టి. వాచీలు, హిందుస్థాన్ కేబుల్, హెచ్.ఎం.టి. బేరింగ్స్ హిందూస్థాన్ ఫొటోఫిలిమ్స్, హిందుస్థాన్ కేబుల్స్, తుంగభద్ర స్టీల్స్ – ఈ ప్రభుత్వ రంగ సంస్థలన్నింటినీ అమ్మకానికి పెట్టింది. ఈ పరిశ్రమలన్నీ వద్దించిన విస్తరి. రాబోయే అమెరికా పెట్టుబడిదారులకో, దేశీయ కార్పొరేట్లకో ఇవి రెడీమేడ్

# మోడీ అమెరికా పర్యటన

***అమెరికా పర్యటనలో నరేంద్ర మోడీకి ఎదురైన అనుకూల, సానుకూల పరిస్థితులనూ, అమెరికాలో ఆయన చేసిన ఉపన్యాసంలోని అంశాలనూ వివరిస్తున్నారు బి.ఎస్.రాజు***

**మో**డీ ఇప్పుడు భారతదేశ ప్రధాని. మొన్నటివరకు గుజరాత్ రాష్ట్రానికి ముఖ్యమంత్రి. మూడు పర్యాయాలుగా గుజరాత్ అసెంబ్లీ ఎన్నికల్లో గెలుస్తూ వచ్చాడు. ఆ రాష్ట్రంలో తిరుగులేని నాయకునిగా ఎదిగాడు.

2002 గుజరాత్ మారణకాండలో ముస్లిం ప్రజారాశులకు జరిగిన ధన, మాన, ప్రాణ నష్టాలకు, ప్రేరేపిత హిందూమూకలు వారిపై జరిపిన పైశాచికత్వానికి ఇతనే తెరవెనుక సూత్రధారి అని సభ్యసమాజం నినదించింది. నిజానికి అన్ని మతాల ధార్మిక సూత్రాలు ఇటువంటి అత్యాచారాను శిక్షార్హమైన దుష్ట చర్యలుగా జమకడతాయి. ఈ అమానుష మారణకాండపై కింది నుండి పైవరకు కోర్టుల్లో కేసులు నడిచాయి. ప్రపంచ దేశాలు, మోడీని పరమత సహనం లేని కరుడుకట్టిన హిందూ మతతత్వవాదిగా ప్రకటించాయి. అమెరికా, బ్రిటన్ దేశాలు ఇటువంటి వ్యక్తి తమ దేశాల్లో అడుగు పెట్టడానికి అనర్హుడని, ఛీకొట్టి, వీసాలు ఇవ్వ నిరాకరించాయి. భారత ఎన్నికల రాజకీయ చదరంగంలో రుణాంశంగా చేరవలసిన చెడంతా మోడీ ఖాతాలో మెజారిటీ మతవాదపు మూటల మేటలుగా జమైంది. ఇది ధనాంశంగా మారి, కూలాల్సిన దుష్టశక్తి ప్రభంజనమై గెలిచింది. అప్పటివరకు గుజరాత్‌కే పరిమితమై ఉన్న ఈ దుష్టశక్తి యావత్ దేశ పాలనా అధికారాన్ని చేజిక్కించుకుంది. మోడీపై అభియోగాలను పరిశీలించిన కోర్టులు అతనికి ఏ మచ్చాలేదని, ఒకవేళ ఉంటే అది తమకు కనపడడం లేదని, 2014 ఎన్నికలకు ముందే తెల్చేశాయి. మొత్తానికి ఈ ఎన్నికల్లో జాతీయ, అంతర్జాతీయ వ్యాపార దిగ్గజాల దర్శకత్వంలో, కార్పొరేట్ మీడియా సృష్టించిన ప్రత్యేక ప్రచార ప్రభంజనంతో అతను భారత ప్రధానిగా ప్రతిష్ఠించబడ్డాడు. ప్రజల అసమ్మతిని, ప్రజాసమ్మతిగా మలవడంలోను; ప్రజాజీవనానికి కీడైనదంతా, మేలైన మేలిమి సరుకుగా సుందర శిల్పంగా చెక్కడంలోను, కార్పొరేట్ మీడియా ఘన విజయం సాధించింది.

మరి, భారత ప్రధాని అయిన వెంటనే అమెరికా పరిగెత్తడం మన పార్లమెంటరీ రాజకీయనీతి, ఆనవాయితీ కదా! భారతదేశానికి ప్రధానమంత్రైన వారెవరైనా చేసే పనే కదా అది! ఇందులో ప్రత్యేకత అంటూ ఏమీలేదు. నిజానికి, మోడీ అమెరికా పర్యటన గురించి రాయాల్సింది కూడా ఏమీలేదు. ఎందుకనంటే అతను అమెరికా ప్రభుత్వం నుంచి సాధించినదేమీ లేదు కాబట్టి. ఇదివరకు ప్రధానుల వలెనే, మన జబ్బులకు అమెరికా రాసిచ్చిన తేనెపూసిన విష గుళికల మందుల చీటీ చేతబట్టుకుని జీహుజూరని తలఊపి వెనుదిరిగి రావడమే అమెరికా పర్యటనలో మోడీ సాధించిన ఘన విజయం.

మహాకవి శ్రీశ్రీ అమెరికా పాలకముఠా గురించి 'రుణమిచ్చి రణం తెచ్చె పెంటగనుల తుంటరులు' అని ఒక్క ముక్కలో అద్భుతంగా చెప్పాడు. అటువంటి అమెరికాతో, భారత్‌కు ఎప్పటి నుండో రుణ బానిసత్వ బంధం ఏర్పడి ఉంది, ఈ బంధంతో ముడివడి ఉన్న రణ, అణుబంధ నీతి, భీతి కారణంగా భారత ప్రధానులు ప్రమాణ స్వీకారం అవడమే తరువాయి అమెరికాకు పయనమవుతారు. భారత్ – అమెరికా మైత్రిని మరింతగా మెరుగుపరచడానికి, ముందుకు తీసుకుపోవడానికి, అమెరికా వ్యాపారాధిపతులను ఇండియాలో పెట్టుబడులు పెట్టమని ఆహ్వానించడానికి; ప్రపంచదేశాల్లో శాంతి స్థాపనకై అమెరికా అధ్యక్షుని తోనూ, ఇంకా అమెరికా ప్రభుత్వశాఖ అధిపతులతోనూ చర్చించే నిమిత్తమూ అమెరికా పర్యటిస్తున్నట్లు చెపుతూ ఉంటారు. మోడీ కూడా అదే చెప్పాడు.

అయితే మేడిసన్ గార్డెన్ స్క్వేర్‌లో మోడీ ప్రసంగం గురించి, దానికి చప్పట్లతో, 'మోడీ – మోడీ' నామ జపంతో ఉగ్రూతలూగిన మానసిక వ్యాధిగ్రస్త ఎన్ఆర్ఐ గుంపు వేలంవెర్రి గురించి, దాని ప్రచార ఆర్భాటం గురించి చెప్పాల్సి ఉంది. అదే సమయంలో దీనికి సమాంతరంగా అదే చోట మోడీ దుష్టచరితను, అతని ఆశ్రిత పెట్టుబడిదారీ విధానాలను నిరసిస్తూ జరిగిన ప్రజా ప్రదర్శన గురించి చెప్పాలి. ఈ రెంటికీ ఉన్న వ్యత్యాసం గురించి చెప్పాలి. ఈ నిరసన ప్రదర్శనకు కార్పొరేట్ మీడియా ఎటువంటి ప్రచారం ఇవ్వక పోవడం గమనించాల్సిన అంశం. ఒక దేశ ప్రధాని పరదేశంలో నివసించే తన దేశపు ప్రవాస జనాభాను ఉద్దేశించి నాలుగు మంచి మాటలు మాట్లాడడం సాధారణంగా జరిగే వ్యవహారం. అలాకాక తన దేశంలో తను చేయబోయే అద్భుతాల గురించి

---

ఫలహారం పెడుతోంది. మోడీ ప్రభుత్వం 8 వేల ఎకరాల్లో ఈ పరిశ్రమలున్నాయి. రైతాంగం హెషియార్‌గా ఉండాలి. రాబోయే పరిశ్రమల స్థాపనకు భూములు కావాలి. మీ భూముల మీద వాళ్ల కన్ను పడిందో, అంతే సంగతులు పరిశ్రమలు వస్తే ఏమిటి; రాకపోతే ఏమిటనుకొని అనుకోకండి. అలాగే విద్యుచ్ఛక్తి కొరతను అధిగమించ డానికి అనేక విద్యుదుత్పాదక కేంద్రాలను ప్రభుత్వం మంజూరు చేసింది. లేదా నిర్మాణంలో ఉన్నాయి. మన కరెంట్ కష్టాలు ఇక తీరిపోతాయని అనుకుంటున్నారా? విదేశీ పెట్టుబడిదారులు వస్తే ఉత్పత్తి కాబోయే విద్యుచ్ఛక్తి వాళ్లే హాంఫట్?

ఈ సమస్యలన్నీ ఎందుకు వచ్చాయంటే దేశానికి పెట్టుబడులు కావాలి. అమెరికాలో వడ్డీరేట్లు చాలా తక్కువ, ఇండియాలో చాలా ఎక్కువ. కాబట్టి ప్రవాస భారతీయులు తమ సక్రమ, అక్రమ ఆదాయాలను మన బ్యాంకుల్లో భద్రపరుచుకున్నారు. మోడీకి జై అనే వారంతా తమ సొమ్మును పెట్టుబడిగా పెడితే, నల్లసొమ్ము దేశానికి తిరిగి తెస్తే విదేశీయుల కాళ్లు పట్టుకొనక్కర్లేదు. మోడీజీ ఆ పని చేస్తారా? వీ

*(రచయిత వీక్షణం వ్యవస్థాపక సంపాదకులు)*

అక్కడ బాకా ఊదుకోవడం ఏ రకమైన రాజనీతి? ఏ రకమైన సభ్యత? ఇటువంటి విన్యాసాలు ఏమి సూచిస్తున్నాయి? ఈ స్వోత్కర్షకు, డబ్బా కొట్టుడుకు ఉద్రూతలూగిపోయిన ఎన్ఆర్ఐ గుంపు ఎటువంటి మానసిక రుగ్మతతో నివసిస్తున్నారో వారి పూనకం తెలియచేసింది. చికాగో నగరంలో స్వామి వివేకానందుని మహోన్నత ప్రసంగంతో పోలుస్తూ మోడీ మేడిసన్ గార్డెన్ స్క్వేర్ ప్రసంగాన్ని ఆకాశానికి ఎత్తడాన్ని ఏమనాలి?

అమెరికా వెళ్లిన భారతీయులంతా అక్కడ అద్భుతాలు సృష్టించాలని వెళ్లలేదు. బతుకుతెరువుకు వెళ్లారు. డాలర్లు సంపాయించుకోవడానికి వెళ్లారు. కోస్తా ఆంధ్రులు హైదరాబాద్‌లో అద్భుతాలు సృష్టించడానికే వచ్చామని చెప్పుకోవడం లాంటిదే ఇది. మీరు విచ్చేయండి మహాశయులారా! ఇక్కడ మౌసులు నొక్కి (కంప్యూటర్ మౌసులు) అద్భుతాలు సృష్టించేవారు లేక చస్తున్నామని అమెరికా వాపోయి వీరిని ఆహ్వానించి తీసుకువెళ్ల లేదు. మౌసులు నొక్కే పనికి చవకగా పనివాళ్లు కావాలి కాబట్టి ఆ అవసరం తీర్చడానికి కావాల్సిన వాళ్లని పనుల్లోకి పెట్టుకున్నాయి అక్కడి కంపెనీలు.

ఇక్కడ నా అనుభవంలో ఉన్న కొన్ని సంఘటనలు చెప్పాలి. అమెరికా వెళ్లి, చుట్టం చూపుకు ఇండియా వచ్చిన కృష్ణా జిల్లా గ్రామానికి చెందిన యువకుడు, ఓ పెద్ద మనిషిని ఎలా ఉన్నావు తాతా అని పలకరించాడట. నేను కులాసానే గాని, నువ్వెక్కడున్నావు? ఏమి చేస్తున్నావ్? అని ఆ పెద్దాయన తిరిగి ప్రశ్నించాడట ఆ యువకుణ్ణి. నేను అమెరికాలో ఉంటున్నాను, కంప్యూటర్ ఇంజనీర్నని చెప్పాడట. అదే లేవోయి మీరంతా మా పొలాల్లో పనిచేసే పాలేర్ల లెక్కన్న మాట. వీళ్లు చదువురాని పాలేర్లయితే మీరు చదువుకున్న పాలేర్లు. వీళ్లు పొలం గట్ల మీద పనిచేస్తే మీరు ఎ.సి. గదుల్లో కంప్యూటర్ల మీటలు నొక్కుతారు అదేగా తేడా! మా మనవడు కూడా ఇప్పుడు అదేపని చేస్తున్నాళ్లే అని అన్నాడట ఆ మోతుబరి పెద్ద మనిషి.

ఇంకో ఉదారవాద ధనిక రైతు, ఇంజనీరింగ్ పాసై అమెరికా వెళ్తానన్న కొడుకుతో ఇలా అన్నాడట: పాలేరుతనం చేయడానికి అక్కడదాకా ఎందుకురా? అదేదో ఇక్కడే ఏడవొచ్చు కదా! అని. అక్కడతో ఆపకుండా, ఇంజనీరంటే పదిమందికీ ఉపయోగపడాలి, పదిమందికి బతుకుతెరువు చూపించాలి, అందుకే నిన్ను చదివించాను గాని, పాలేరుగా పొరుగు దేశాలకు పోవడానికి్కాదు, దాని బదులు మన పొలాల్లోనే ఏదో ఒకటినొల్లుకుంటూ బతకొచ్చు కదా అన్నాడట.

ధనిక, భూస్వామ్య కుటుంబాల నుండి వచ్చిన మా తరానికి వెనుక తరం కుటుంబ పెద్దల ఆలోచనా సరళిని ఈ పై సంఘటనలు తెలియ చేస్తున్నాయి. చదువులు, చదువులతో వచ్చిన మార్పులు, సమాజ అభ్యుదయ వికాసానికి తోడ్పడక వేతన బానిసత్వాన్ని ఎలా వ్యాపింప చేసాయో మనందరి అనుభవంలో ఉన్న విషయమే.

ఆ పెద్దల మాటలు పరుషంగా, భూస్వామ్య భావజాలంతో ఉన్నప్పటికీ, అందులో నిజం లేకపోలేదు. భారతదేశ ప్రజలకు ప్రావీణ్యతలు పెంచి వారిని ప్రపంచం నలుమూలలకు పాకిస్తానని మోడీ బహు ఆర్భాటంగా ప్రకటించు కుంటున్నాడంటే అర్థమేమిటి? అదే నోటితో మేక్ ఇన్ ఇండియా అంటూ, మా దేశానికి పెట్టుబడులు తెండి, మీకు ఏ ఆటంకాలు లేకుండా చేస్తాను, ప్రణాళికా సంఘాన్ని రద్దుచేస్తాను, కార్మిక చట్టాలను కాలరాచేస్తాను అని కూడా చెపుతున్నాడంటే అర్థం ఈ మేక్ ఇన్ ఇండియా స్కీం ఇక్కడి ప్రజారాశులకు కల్పించే ఉద్యోగ కల్పన ఎంతటి పల్చనిదో చెప్పకనే చెపుతున్నట్టు కాదా? ఇప్పటికే అతలాకుతలమవుతున్న గ్రామీణ జీవనాన్ని, పర్యావరణ సమతుల్యతను తుదముట్టించి స్మార్ట్ సిటీలు, సుందర నగరాల నిర్మాణ ప్రగల్భాలు ఎటు దారితీస్తాయో, ఎవరిని పెంచి పోషిస్తాయో, ఎవరిని విస్థాపితం చేస్తాయో, ఎవరి బతుకులు దుర్భరం చేస్తాయో మనమంతా చాలా తీవ్రంగా ఆలోచించవలసిన విషయం. ఇప్పటికే సాధారణ గ్రామీణ ప్రజలు వ్యవసాయం గిట్టుబాటు కాక ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. భుక్తిగడవక పొట్ట చేత పట్టుకుని గూడు చెదిరిన పక్షుల వలె చెల్లా చెదురైపోతున్నారు. పట్టణాల్లో, నగరాల్లో, గల్ఫ్ దేశాల్లో దుర్భర జీవితాలు గడుపుతున్నారు.

మనం ఎన్నుకుంటున్న ప్రభుత్వాలన్నీ కూడా చైనాతో పోటీపడే తపనతో మన కళ్లను మనమే పొడుచుకునే మార్గం వేస్తున్నాయి. ఈ రోజు లక్షలాది భారతీయులు అమెరికాలో ఏమి అద్భుతాలు సృష్టిస్తున్నారో తెలువని వారున్నారా? అమెరికాలో నివసించే గుజరాతీయులు గాని, తెలుగువారు గాని డాలర్లు సంపాదిస్తున్న మాట వాస్తవమే గాని, వారు ఏవో అద్భుతాలు సృష్టిస్తున్నారని చెప్పలేం. డాలర్లు సంపాదించడం అద్భుతాలు సృష్టించడం కాదు. భారత ప్రధానిగా ఎదిగిన మోడీకి ఈ మాత్రం తెలియకపోవడం ఎంతటి దౌర్భాగ్యం!

14 ఏళ్ల పాటు గుజరాత్ రాష్ట్రాన్ని పరిపాలించిన మోడీ ఏపాటి స్వచ్ఛ గుజరాతును సృష్టించింది లెక్కలు లేవా? అక్కడి ప్రజల నైపుణ్యతలను ఆయన ఎంతగా పెంచాడో లెక్కలు లేవా? అక్కడ లక్షలాది గ్రామీణ ప్రాంత పేద శ్రామికులు, ప్రాంతేతర ప్రవాస శ్రామికులు అతి తక్కువ జీతాలకు ఎటువంటి సౌకర్యాలు లేని నేత షెడ్లలోను, చిన్న పరిశ్రమల్లోను పనిచేస్తారో తెలియని విషయమా? అహ్మదాబాద్ విమానాశ్రయంలో దిగి, అమెరికాలో సంపాదించుకున్న డాలర్లతో ఇక్కడ కొనుక్కున్న ఆధునిక వసతులు గల తమ ఇళ్లకు ఎ.సి. కార్లలో తుర్రున దూరిపోయే వాళ్లకు మెరిసే గుజరాతే కనిపిస్తుంది కాని చీకటి గుజరాత్ కనిపిస్తుందా? వారసలు అటువంటి చీకటి గుజరాత్‌ను చూడడానికి ఇష్టపడతారా? వారిప్పుడు స్థిరపడి నివసిస్తున్న అమోఘ అమెరికాలో ఉన్న చీకటిని మనం వేలెత్తి చూపితే, అది చీకటి కాదు గొప్ప వెలుగని, మీకెందుకో చీకటిగా కనిపిస్తుందని దబాయిస్తారు. అమెరికా రక్తపిపాసి కదా అని మనమంటే, అది అగ్రరాజ్యపు ఔన్నత్య రాజనీతని కితాబిస్తారు. తమ డాలరు సంపాదనకు వత్తాసుగా వంట బట్టించుకున్న అస్పష్ట ఆలోచనలను, కావాలని పెంపొందించుకున్న దౌర్భాగ్యపు మానసిక స్థితిని సదా సమర్థించుకుంటారు. ఇటువంటి వారికి మోడీ అపర వివేకానందునిగా, భారతదేశ వికాస పురుషునిగా కనిపించడంలో ఆశ్చర్యం ఏమీలేదు.

ఈ తరహా భజన పరులకు భిన్నంగా ఆలోచించే ప్రవాస భారతీయులు, ఇతర ఆలోచనాపరులు ఉండరా? ఉంటారు. వారు వాస్తవాల ఆధారంగా స్పందిస్తారు. కాబట్టే వివిధ అమెరికా నగరాల నుండి వందలాది పౌరులు మోడీ హిందుత్వ భావజాలాన్ని, గుజరాత్ మారణహోమాన్ని, ఆశ్రిత పెట్టుబడిదారీ విధానాల పట్ల తమ నిరసనను తెలియచేయడానికి వీధిరా మాడిసన్ గార్డెన్ అవెన్యూలో గుమికూడారు. వివిధ జాతుల, మతాల, మానవతావాదుల సమ్మిళిత వైవిధ్య సమూహమిది. కేవలం భజన బాకాబాబుల బ్యాండ్ మేళం కాదిది. న్యాయంకోసం, జవాబుదారీతనం కోసం కలయిక (అలయన్స్ ఫర్ జస్టిస్ అండ్ ఎకౌంటబిలిటీ) అనే ఆలోచనాపరుల సంస్థ ఈ నిరసన ర్యాలీని నిర్వహించింది. (ఫ్రంట్‌లైన్ రెవల్యూషనరీ స్ట్రగుల్ వెబ్‌సైట్‌లో ఈ ప్రదర్శన వివరాలు, ప్రదర్శన చిత్రాలు చూడవచ్చు). అంతేగాక,

# కెజి టు పిజి ఉచిత విద్య - సాధ్యాసాధ్యాలు

***ప్రైవేట్ విద్యా వ్యవస్థను రద్దు చేయకుండా కెజి నుండి పిజి వరకు ఉచిత విద్యను అమలు చేయడం ప్రభుత్వానికి సాధ్యం కాదంటున్నారు* జి. వెంకటేశ్వర్లు**

అరవై ఏళ్ల సుదీర్ఘ పోరాటం తర్వాత అనేక ఆత్మత్యాగాల అనంతరం తెలంగాణ యావత్ సమాజం కుల, మత, వర్గ, ధనిక, పేద నిమ్నోన్నతాల భేదాలను ఏడునిలువుల లోతునే పాతరేసి ఒక్కటై నిలిచి ఆంధ్ర వలసవాద పెత్తందారీ పరిపాలనపై నిలువెత్తు నిరసన గళమై స్వతంత్ర పతాకనెగరేసిన తెలంగాణ సమాజంలో స్వతంత్ర తెలంగాణ సర్వతో ముఖాభివృద్ధికి కావాల్సిన విధానాలపై చర్చించు కోవడం ముదావహం.

ఈ మొత్తం పోరాటం విద్యా, ఉద్యోగ్య, ఉపాధి, నీళ్లు నిధుల నేపథ్యంలో సాగిందన్న విషయం గుర్తుంచుకోవాలి. ఒక ప్రాంత అభివృద్ధి ఆ ప్రాంత విద్యా విధానంపై ఆధారపడి ఉంటుంది. కాబట్టి ప్రస్తుతం నూతనంగా ఏర్పడిన తెలంగాణ రాష్ట్రంలో విద్య ఎలా ఉండాలి? ఎవరి ప్రయోజనాలకై రూపొందించబడాలి? అన్నదే ప్రధాన ప్రశ్న.

ఆరు దశాబ్దాల స్వతంత్ర భారతంలో విద్య ఇంకా అందరికీ అందని ద్రాక్షగానే మిగిలిపోవడం పెద్ద విషాదం. ప్రభుత్వాలు మారినప్పుడల్లా నూతన విద్యా విధానాలంటూ ప్రవేశపెట్టడం మామూలైపోయింది. అవి అమలులో ఏ మేరకు నోచుకుంటున్నాయో అందరికీ తెలుసు. 1980 నుండి సంస్కరణలు వేగవంతమైనా, 1990 తర్వాత ప్రపంచ బ్యాంకు విధానాలతో ప్రపంచీకరణ పేరుతో, విద్యా విధానంలో సంస్కరణలు శరవేగంతో ముందుకు వస్తున్నాయి. అందులో భాగమే 'ప్రభుత్వ - ప్రైవేట్ భాగస్వామ్య' విధానం వేళ్లూనుకుంది. అయినా ఏ విధానమూ అందరికీ విద్యను అందించలేక పోయింది. అందుకే విద్యాహక్కు కోసం అనేక మంది పోరాడిన తర్వాత ప్రభుత్వం 'విద్యాహక్కు చట్టం' తెచ్చింది. ఈ విద్యాహక్కు చట్టం కూడా విద్యలోని అంతరాన్ని రూపుమాపలేదు. సరికదా, విద్య పట్ల ప్రభుత్వాల పరిపూర్ణ బాధ్యతను నిర్వచించలేక పోయింది. ఈ నేపథ్యంలో తెలంగాణలో అధికారంలోనికి వచ్చిన ప్రభుత్వం ఏ మేధోమథనం చేసిందో కాని ఎన్నికల సమయంలో తెలంగాణ విద్యా రంగానికి ఒక అద్భుత వాగ్దానం చేసింది. అదే 'కామన్ స్కూల్ విధానం'. దీని ద్వారా కెజి టు పిజి వరకు ఉచిత విద్య అందిస్తామన్నది.

ఆ మేరకు ఇటీవల ప్రభుత్వం ప్రస్తుత విద్యారంగంలోని లోటు పాట్లు, ప్రమాణాలు, విద్యార్థుల సామర్థ్యాల పరిశీలన, పాఠశాలల మౌలిక వసతులు, ఉపాధ్యాయుల పని విధానం, నియామకాలు, సర్దుబాట్లపై కొత్తచూపును ప్రదర్శించాలని మొదలు పెట్టినట్లు కదలికలను బట్టి గ్రహించిన మేధావులు, విద్యారంగం పట్ల దార్శనికత గల విద్యావంతులు తెలంగాణ బలమైన విద్యారంగం కోసం కలలు కంటున్న వారందరిలో ఒక ఉద్విగ్నభరిత ఆంధోళనతో కీలక చర్చ జరుగుతోంది.

నిజానికి ప్రస్తుత తెలంగాణ ప్రభుత్వం కన్నా ముందు ఈ ఉచిత విద్య ఉందా? లేదా? అన్నట్లు అనిపించిందా? పాఠశాల విద్య ఎలా ఉంది. ఉన్నత విద్య ఎలా ఉంది? అది ఉచితమా? కాదా? ప్రభుత్వ విద్యా? ప్రైవేట్ విద్యా అన్నది తెలుసుకుంటే ప్రస్తుత కెజి టు పిజి ఉచిత విద్య ఏ మేరకు అమలు జరుగుతుందో, జరిగితే ఎలా ఉంటుందో ఊహించవచ్చు.

తెలంగాణలో ప్రస్తుత ప్రభుత్వరంగంలోని పాఠశాలలు భిన్న యజమాన్యాల కింద పని చేస్తున్నాయి. ప్రభుత్వ జిల్లా పరిషత్, సోషల్ వెల్ఫేర్, నవోదయ, కేంద్రీయ విద్యాలయ, కెజిబివి, మోడల్ స్కూల్, బ్రిడ్జిస్కూల్, రెసిడెన్సియల్, ఎయిడెడ్ తదితర యజమాన్యాల కింద పని చేస్తున్నాయి. అలాగే ప్రైవేట్‌రంగంలో రకరకాల పేర్లతో టెక్నో,

---

ఈ నిరసన కార్యక్రమానికి ముందుగానే అమెరికాలో నివసిస్తున్న గదర్ అలయన్స్ అనే భారతీయ ఆలోచనాపరుల బృందం 'కష్ట కాలానికి వేగ మార్గం– 100 రోజుల నరేంద్ర మోడీ–ఓ ప్రత్యర్థి నివేదిక' (ఫాస్ట్ ట్రాక్ టు ట్రబ్లింగ్ టైమ్స్ - 100 డేస్ ఆఫ్ నరేంద్రమోడీ - ఎ కౌంటర్ రిపోర్ట్) అనే 55 పేజీల డాక్యుమెంట్ తయారుచేసి ఇంటర్నెట్లో పెట్టి సర్కులేట్ చేశారు. 'మానవహక్కులను పాతిపెట్టి, చట్టబద్ధ పాలనను కాటికి పంపే ఆర్థిక అభివృద్ధి ఎప్పటికీ సరైన మార్గం కాజాలదు' అని ఈ నిరసనకారుల ప్రతినిధి ఒకరు తమ నిరసన సారాంశాన్ని తెలియచేశారు. ఇదే నిరసనలో పాల్గొన్న స్వాతి పి. షా అక్కడి ఘటనలపై 'మేడిసన్ స్క్వేర్లో మోడీని నిరసించడం' అనే వ్యాసం రాశారు. ఈ వ్యాసంలో మోడీతత్వాన్ని వివరించారు. వామపక్ష భావాలున్న వారేకాక ఇతరులంతా కూడా చదవాల్సిన వ్యాసమిది. భారతదేశాన్ని ఉద్ధరించే మహిమాన్వితుడుగాను, రక్షకుడుగాను తనకు తాను ప్రచారం చేసుకుంటున్న, నిత్య స్వోత్కర్ష కుపక్రమిస్తున్న మోడీ, నిజానికి అల్పబుద్ధితో కూడిన మితవాద రాజకీయాల ఎగసనకు, విస్తరణకు నాయకత్వం వహిస్తున్నాడు. బహు రకాల రుగ్మతలతో లుకలుక లాడుతున్న భారత రాజకీయార్థిక చిత్రపటం ఈ తరహా రాజకీయాలతో, ఏక వ్యక్తి స్వోత్కర్షలతో మారిపోతుందని అనుకోవడం దురహంకారపు ఫాసిజానికి దారితీస్తుంది. ఇప్పటికే ఒక పక్క ఆశ్రిత పెట్టుబడిదారీ విధానం, బహుళజాతి కంపెనీల భల్లూకపుపట్టు, ఇంకోపక్క సామ్రాజ్యవాద విషపూరిత కారుమేఘాలు ఈ దేశాన్ని ఆవరించి ఉన్నాయి. మితవాద హిందూమూకల అకృత్యాలు, అరాచకాలు వీటికి తోడైతే ఎటువంటి భయంకర పరిస్థితులు ఈ దేశ ప్రజలు ఎదుర్కోవాల్సి ఉంటుందో గత ప్రపంచ యుద్ధాల నుండి గుణపాఠాలు నేర్చుకోకపోతే, వాటిని సమైక్యంగా, దృఢంగా ఈ దేశ శ్రామిక ప్రజలు రాజకీయ - ఆర్థిక ప్రణాళికతో ఎదుర్కోకపోతే భారతదేశం మరింత అంధకారంలోకి వెళ్లడం ఖాయం.

*(రచయిత ఎడిటర్, శ్రామిక నేస్తం)* వీ

ఈ-టెక్నో, కాన్సెప్ట్, టాలెంట్, మోడల్, డిజిటల్, ఒలంపియాడ్ ఫౌండేషన్ పేర్లతో అనేకం ఉన్నాయి. ఇందులో ప్రభుత్వ విద్యారంగంలో ఉన్న పాఠశాలలకు అందులోనూ ప్రభుత్వ జిల్లా పరిషత్ డే స్కాలర్స్‌కు చాలీచాలని రెండు జతల బట్టలు, అందీఅందని పుస్తకాలు, మధ్యాహ్న భోజనం అని చెప్పే అసంతులిత ఆహారం, ఫీజులు లేని సగం మంది సిబ్బందితో ఉచిత విద్యనందిస్తోంది. పరీక్ష ఫీజులు వసూలు చేయడం మరచి పోరాదు. అదే ప్రభుత్వం సోషల్ వెల్ఫేర్ సంక్షేమ పాఠశాలల్లో సగం కన్నా తక్కువ నోటు బుక్స్, పుస్తకాలు. రెండు జతల దుస్తులు, రెండు దుప్పట్లు, ఒక పెట్టె సరిపోని కాస్మోటిక్ చార్జీలతో అరకొర వసతుల అద్దె వసతి గృహాలతో విద్య నందిస్తోంది. ప్రభుత్వ పాఠశాలల కన్నా రెసిడెన్సియల్, రెసిడెన్సియల్ కన్నా నవోదయ, నవోదయ కన్నా కేంద్రీయ విద్యాలయాల్లో విద్యా విధానంలో ఎంతటి తారతమ్యం ఉందో గ్రహించాలి. అదే ప్రభుత్వం పైన పేర్కొన్న అన్ని వసతులు అందిస్తూనే ప్రైవేట్ పాఠశాలల్లో చదివే వారికి ఫీ రియింబర్స్‌మెంట్ కూడా అదనంగా అందిస్తోంది. దీన్ని బట్టి ప్రభుత్వం ఉచితంగా ఇస్తుంది ప్రైవేట్‌కా? ప్రజలకా? ఆలోచించాలి. ఇప్పుడికి నిజమైన ఉచిత విద్య ఉన్నట్టా?

ఒకవైపు విద్యాహక్కు చట్టం 21(ఎ) సెక్షన్ ప్రకారం 6 నుండి 14 సంవత్సరాల పిల్లలకు మాత్రమే విద్యా హామీ ఇచ్చింది. 3-6 సంవత్సరాల పిల్లల పూర్వ ప్రాథమిక విద్యకు ఎలాంటి బాధ్యత వహించలేదు. పైగా విద్య జాబితాలో ఉన్నందున 65:35 శాతం చొప్పున కేంద్రం, రాష్ట్రం చెల్లించేటట్లుగా ప్రైవేట్‌రంగానికి మద్దతునిస్తూ 25 శాతం సీట్లు పేద పిల్లలకు ఇచ్చేటట్లు చూస్తామంది. దీనిలో ఆంతర్యమేమిటి? ఇది ప్రైవేట్‌కు చేయూతనివ్వడం కాదా? 25 శాతం విద్యార్థులు సకల సౌకర్యాలతో చదువుకుంటే 75 శాతం విద్యార్థులు చాలీచాలని మౌలిక వసతులతో విద్యనభ్యసించాల్సిందేనా? ఈ వివాదం మూలాలకెళ్లి పరిష్కరించకుండా ఉచిత సమాన విద్య ఎలా సాధ్యమో ప్రభుత్వమే చెప్పాలి.

ప్రపంచబ్యాంకు సలహాలు, సూచనలతో నడిపిస్తున్న ప్రభుత్వాలు, పాఠశాల విద్యకు తూట్లు పొడుస్తున్నాయన్నది సత్య దూరం కాదు. 2001లో జి.ఒ. నెం.29 ప్రకారం పాఠశాలల్లో విద్యార్థుల ప్రాతిపదికన ఉపాధ్యాయుల నియామకం చేపట్టారు. దీంతో కనీసం తరగతికో ఉపాధ్యాయుడు, తరగతికో గది లేక ప్రభుత్వ పాఠశాలలు ఏ స్థితిలో ఉన్నాయో అందరికీ తెలుసు. 2011 జనాభా లెక్కల ప్రకారం 65 శాతం అక్షరాస్యత కలిగిన రాష్ట్రంలో విద్యాభివృద్ధికి అటు కేంద్రంగాని ఇటు రాష్ట్రం గాని వరుసగా 6 శాతానికి, 30 శాతానికి బడ్జెట్ కేటాయించాల్సి ఉన్నా 2 శాతానికి, 13 శాతం మించి కేటాయింపులు జరుపలేదు. 2005 నుండి ఇప్పటికి ప్రధాన పరిపాలనా సంబంధమైన పోస్టులు నియామకం లేయలేదు. 95 శాతం పోస్టులు ఇంచార్జీలతోనే కొనసాగించడం జరుగుతోంది. ఉండీలేనట్టు ఇది ఉత్పాదక రంగం కాదన్నట్లు ప్రభుత్వాలు నిర్లక్ష్యం చేస్తున్న సందర్భంలో కెజి టు పిజి ఉచిత విద్య అనుమానాస్పదం కాక మరేమవుతుంది?

ప్రభుత్వమే ద్వంద్వ వైఖరులు అవలంభిస్తూ, ప్రభుత్వ పాఠశాలల నైపుణ్యాలు ప్రమాణాలు పడిపోయాయని ప్రచారం చేయడం పరిపాటి అయింది. ప్రవేశపెడుతున్న సిసిఇ కాని, నూతన విద్యా బోధనా విధానాలు గాని కేవలం ప్రభుత్వ పాఠశాలలకే అవసరమన్నట్టు వ్యవహరిస్తూ ప్రైవేట్‌లో ఎటువంటి విధానమైనా పర్వాలేదన్నట్లు వ్యవహరించడం మనం చూస్తున్నాం. అట్లా అవి ప్రభుత్వ పాఠశాలలకు సర్వ వసతులు సమకూర్చి పెడుతుందా అంటే అదీ లేదు. ఈ పరిస్థితుల్లో ప్రభుత్వాన్ని ఎట్లా అర్థం చేసుకోవాలి?

విద్య రాజ్యాన్ని నిర్దేశించలేదు. రాజ్యమే విద్యను నిర్దేశిస్తుంది. అందుకే ఈ ప్రభుత్వం కూడా ఒక ప్రయత్నం మొదలుపెట్టింది. దీన్ని మనం జాగ్రత్తగా గమనిస్తే ఇటీవల ప్రకటించిన నిబంధనల, పథకాల ప్రకారం ఈనాటి జిఒ నెం. 6 ప్రకారం 20 మంది కంటే తక్కువగా ఉన్న ప్రాథమిక పాఠశాలలను ఎత్తివేయడం. 75 మంది కన్నా తక్కువగా ఉన్న ఉన్నత పాఠశాలలను ఎత్తివేయడం వంటి సంస్కరణలు ఎటుదారి తీస్తాయో ఆలోచించాలి. ఆవాసానికో పాఠశాల అని ఆవులించిన ప్రభుత్వాలు, ప్రభుత్వాధికారులు అప్పుడే అభివృద్ధి సాధించినట్లు వాటి అవసరం లేనట్లు గుర్తించారా? దీని ప్రభావం దళిత, గిరిజన, ఆదివాసి ప్రాంతాల పిల్లల విద్యకు విఘాతం కలుగదా? ఇవేవి ఆలోచించకుండానే సంస్కరణల పేరిట చదువు దూరం చేసే ప్రయత్నం సమంజసమా? దీనివల్ల డ్రాపౌట్స్ పర్సంటేజీ పెరగదని చెప్పగలరా?

ప్రభుత్వమే కెజి టు పిజి ఉచిత విద్యను అందించదలిచినప్పుడు ఫాస్ట్ పథకం ఎందుకు? ప్రైవేట్‌కు దోచిపెట్టడానికి పాత విధానం అనుసరించడం కాకపోతే మరిదేనికి?

ప్రైవేట్ రంగాన్ని మొత్తం రద్దు చేయకుండా, ప్రభుత్వమే ఒకవైపు ఫీ రియింబర్స్ చేస్తూ ప్రభుత్వ అధీనంలో ఉచిత విద్య సమాన విద్య ఎట్లా అందిస్తారు. ప్రైవేట్ విద్యా వ్యవస్థలన్నింటిని వారి వారి విద్యా సామర్థ్యాలను బట్టి, వారికి తగిన ఆర్థిక పరిష్కారం చూపి పని చేస్తున్న సిబ్బంది అర్హతలను బట్టి ప్రభుత్వ సిబ్బందిగా గుర్తించాలి. మొత్తం విద్యా వ్యవస్థను ప్రభుత్వం చేతుల్లోకి తీసుకున్నప్పుడే ఇది సాధ్యం అవుతుంది. కాని విద్యాహక్కు చట్టం 21(1) సెక్షన్ అందుకు ఒప్పుకుంటుందా? దాని ఆసరగా ప్రైవేట్ యజమాన్యాలు అంగీకరిస్తాయా?

ఏది ఏమైనా ప్రభుత్వం తలపెట్టిన కార్యక్రమం 1965 నాటి 'కొఠారి కమిషన్ ప్రతిపాదనలు' నిజం చేయాలన్నా ప్రభుత్వం తలచుకుంటే అసాధ్యమేమీ కాదు. చిత్తశుద్ధి దీర్ఘకాలిక దృష్టి, అసమానవిద్యను అంతం చేసి అందరికీ సమానవిద్యను అందించాలన్న లక్ష్యశుద్ధి ఉంటే సాధ్యమే కాని దుస్సాధ్యం మాత్రం కాదు.

పైగా బంగారు తెలంగాణ సాధనలో అందురూ భాగస్వాములు కావాలన్న పిలుపు ప్రైవేట్ విద్యావ్యవస్థ కూడా అందిపుచ్చుకుంటే అది మరింత సత్వర సాధ్యమవుతుంది. అనివార్యంగా విద్య ప్రైవేట్ వృత్తిగా మారిన నేపథ్యంలో వారికి తగిన పరిష్కారం చూపించాలి. దాంతో పాటు పాఠశాలల్లో మౌలిక వసతులు, నాణ్యతతో కూడిన ఇంటి భోజనం వంటి భోజనం, సరైన బోధనా సిబ్బందిని అందిస్తూ డ్రాపౌట్లకు సామాజిక ఆర్థిక మూలాలు వెతకాలి.

సంస్కరణలు తాత్కాలిక ప్రాతిపదికన కాకుండా శాశ్వత ప్రయోజనాల దృష్ట్యా చేపట్టాలి. సంస్కరణ ఏదో ఒక బేస్‌లెవల్‌లో ప్రారంభం కావాలి. తెలంగాణలో విద్యాభ్యాసం ఒక ఉపాధిని అందిస్తుందన్న భరోసా ఇవ్వగలగాలి. నూటికి నూరు శాతం విద్య పూర్వ ప్రాథమిక దశ నుండి సాంకేతిక, వృత్తి విద్యాస్థాయి వరకు కేవలం ప్రభుత్వ అధీనంలోనే ఉండాలి. పశ్చిమ దేశాలలను ఉదాహరించడమే గాక అక్కడి ప్రభుత్వ విద్యను కూడా కాసింత ఆలోచించాలి. పాఠశాల విద్యంత ప్రభుత్వ అధీనంలోనే ఉందన్న విషయాన్ని గ్రహిస్తే మనం అనుకుంటున్న పిజి విద్య కూడా తెలంగాణలో ప్రభుత్వ అధీనంలో అందించబడుతుందంటే అప్పుడు పశ్చిమ దేశాలు కూడా తెలంగాణను ఉదాహరించుకునే అద్భుత దృశ్యం ఆవిష్కృత మవుతుంది. అప్పుడు మాత్రమే అందరికీ ప్రభుత్వ విద్య మీద విశ్వాసం, ప్రభుత్వం మీద నమ్మకం కలిగి కెజి టు పిజి ఉచిత విద్య సఫలీకృతం అవుతుందని ఆశించవచ్చు.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# 'అహింస' గురించి!

*గాంధీ ప్రవచించిన అహింస గురించి ప్రశంసిస్తూ మాట్లాడే మేధావులను ప్రశ్నిస్తూ హింసాహింసలను విశ్లేషిస్తున్నారు*

**నన్నూరి వేణుగోపాల్**

ఇది ప్రధాని మోడీ 'స్వచ్ఛ భారత్' గురించి చర్చ సందర్భంగా మాట్లాడిన ఎమ్మెల్సీ కె. నాగేశ్వర్ 'అహింస' గురించి. అంటే స్వచ్ఛ భారత్ గురించి మాట్లాడుకోవడానికి ఏమీలేదా అంటే ఉంది. గాంధీ పుట్టిన గుజరాత్‌లో 'హైందవం అంటే ఇది' అని అల్లర్లు సృష్టించినవారే, ఇప్పుడు భారత్‌ని శుభ్రంచేసే పనిలో గాంధీ జయంతిని వాడుకోవడంలో ఉన్న 'అవకాశవాద తాత్విక వైఖరి' గురించి మాట్లాడుకోవాల్సింది చాలానే ఉంది. కానీ దానికి ఆచరణాత్మక గడువు కూడా ఉంది. కాబట్టి దాని గురించి అప్పుడు మాట్లాడుకోవచ్చు.

కానీ గాంధీ 'అహింసా సిద్ధాంతాని'కి లేని నూతన అర్థాలను ప్రతిపాదించిన ప్రొఫెసర్ గారి టి.వి.విశ్లేషణ గురించి మాత్రం ఇప్పుడే మాట్లాడుకోవాలి. 'సమాజంలో జరిగే చాలా హింసలకు అహింసా సిద్ధాంతం ఒక జవాబు' అనే అర్థంలో మాట్లాడిన వారి మాటలను ఇప్పుడే చూడాలి.

గాంధీ ప్రధానంగా చెప్పింది ఆహారానికి సంబంధించిన అహింస. ఆనాటికి దానికి ఉన్న తాత్విక పరిధి అంతే. ఇంకా చెప్పాలంటే దాని ప్రారంభంలో గాంధీ మదిలో అదొాక 'తత్వచింతన'గా కూడా రూపు దిద్దుకోలేదు. మొదట్లో అందరిలాగే అడపా దడపా తానూ మాంసాహారం తినేవాడు. అమ్మకిచ్చిన మాటవల్ల కొంతా, తినిన తరువాత పొట్టలో మేకపిల్ల తిరుగుతున్నట్లనిపించే సైకలాజికల్ ఫీలింగ్ వల్ల కొంతా మాంసాహారానికి దూరమయ్యాడే తప్ప బుద్ధుని 'జీవహింస మహాపాపం' అనే భావనవల్ల కాదు. అప్పటికి తనకా 'బుద్ధ జ్ఞానం' కూడా లేదు. ఇంకా చెప్పాలంటే ఆహార విషయంలో అహింసా వాదిగా మారి 'శాకాహార మండలి'ని స్థాపించడానికి తనకి ప్రేరణ నిచ్చింది సాల్ట్ అనే ఆయన రాసిన 'శాకాహార సమర్థన' అనే పుస్తకం.

ఈ పుస్తకాన్ని చదివిన దగ్గర్నించీ కోడిగుడ్డు తినడం కూడా హింసగా భావించి దాన్ని కూడా ఆపేశాడు. అయితే 'తల్లిపాలు తప్ప శిశువుకి ఏ పశువు పాలు పట్టినా అది కూడా హింసే' అనేంత అతివాద ఆలోచన మాత్రం ఆ రచయితది కాదు. అది పూర్తిగా గాంధీ సొంతం. ఇంతకు మించి 'గాంధీ అహింస' కు ఆనాడు వేరే ఏ అర్థమూ లేదు. ఆ తరువాత 'కుడి చెంప ఛెళ్లుమనిపించిన వాడికి ఎడమ చెంపనుకూడా ఇచ్చెయ్' అనే 'భౌతిక హింస'కు సంబంధించిన సూత్రం ఒకటి గాంధీ 'అహింస' లోకి కొత్తగా వచ్చి చేరింది. ఇది బైబిలు చదివిన తరువాత వచ్చిన ఆలోచనే తప్ప బైబిలులో ఉండి కాదు. ఇది ఇంకొంచెం ముందుకెళ్లి 'రాజకీయ అహింస'గా కూడా రూపు దిద్దుకుంది.

గాంధీకి ముందు కూడా అహింస ఉంది. అయితే అది ఆరామాలకు మాత్రమే, అదికూడా పరిమిత అర్థాలతో ఉంది. రాజకీయాల్లోకి అహింసను తీసుకువచ్చింది మాత్రం గాంధీ ఒక్కరే. శ్వేతజాతి తన వలస లన్నిటిలోనూ 'హింసాత్మక పరిపాలన' చేస్తూ ఉంటే, గాంధీకి అది ఎన్నడూ హింసగా అనిపించలేదు. అది 'పరిపాలన'గా మాత్రమే అనిపించింది. ఆ పరిపాలనకు ఎదురు తిరిగిన ఘటనలు మాత్రం 'రాజకీయ హింస'గా అనిపించాయి. ఆ హింసను ఖండించడానికీ, అదుపు చేయడానికీ, అణచివేయడానికీ మాత్రమే 'అహింస' పుట్టింది.

ఇంతకు మించి వేరే ఏ అర్థమూ లేని గాంధీ 'అహింస'లోకి ఇప్పుడు నాగేశ్వర్ కొత్తగా–బలమైన దేశాలు బలహీనమైన దేశాల మీద జరిపే హింస, వర్గహింస, కులహింస, మతహింస, గృహహింస వంటి అన్ని వ్యవస్థిత హింసలనూ తీసుకువచ్చి వాటికి ఒక పరిష్కారంగా గాంధీ అహింసా సిద్ధాంతాన్ని చూపిండడం వింతగా ఉంది. దేశంలో ఎన్నో ఘర్షణల ఫలితంగా వెలుగులోకి వచ్చిన వివిధ తాత్విక ప్రశ్నలకు జవాబుగా దాన్ని చూపించడమూ, వీటన్నిటికీ 'ఉమ్మడి భూమిక'గా దాన్ని ఎంచడమూ గాంధీకి కూడా విస్మయం కలిగించే విశ్లేషణ ఇది.

సమాజంలో జరిగే వ్యవస్థిత హింసలకు గాంధీ 'అహింస'లో చోటు ఉందా అనే మాటనటుంచి, అసలు హింసకు సంబంధించి గాంధీకి ఆనాడు ఉన్న అవగాహన మీదే అనేక విమర్శలు ఉన్నాయి. అదొక్కటే కాదు' సమాజం గురించి, ప్రకృతి గురించి, చరిత్రా, సంస్కృతీ, వర్గం, వర్ణం, లింగం, కులమతాల గురించి గాంధీ పరిశోధన 'శాస్త్రీయత' మీద కాకుండా సనాతన ఛాందస దృక్పథంతోనే సాగింది.

నాగేశ్వర్ చెపుతున్నట్లుగా బలహీనులపైన జరిగే హింసకు గాంధీ అహింసలో చోటులేదు. ఇంకా చెప్పాలంటే హింసను జరిపే వారికి ఆ జాగా అందులో ఉంది. దానికొాక ఉదాహరణే బోయర్ల యుద్ధం. 1899 నుండి 1901 వరకూ జరిగిన ఆ యుద్ధంలో ఆయన ఎన్నడూ బోయర్ల వైపు నిలబడలేదు. యుద్ధంలో గాయపడ్డ బ్రిటిష్ సేనలకు వైద్య సేవలందించారు. పైగా దాన్ని 'రాజభక్తి' గా కూడా ప్రకటించుకున్నారు. ఒకవేళ బోయర్లు డచ్ నించీ వచ్చి నీగ్రోల భూముల్ని లాక్కొని స్థిరపడినవారు కాబట్టి వారికి సాయం చేయలేదు అనే అనుకుందాం. మరి, జులూల మాటేమిటి? వారు ఆదివాసులు. పన్నులు కట్టలేక నానా అవస్థలూ పడుతూ వసూలు చేయడానికి వచ్చిన సార్జంట్ మీద తిరగబడ్డారు. సార్జంట్ చనిపోయాడు. ఆ వంకతో దక్షిణాఫ్రికా శ్వేతజాతి ప్రభుత్వం వారిని ఊచకోత కోసింది. అప్పుడు కూడా గాంధీ బ్రిటిష్ సైన్యానికే సేవలందించారు. ఆయన దృష్టిలో బోయర్లూ, జులూలూ చేసింది హింస, బ్రిటిష్‌వారు చేసింది పరిపాలన.

మహా అయితే జులూల కోసం నిలబడలేక పోయినందుకు క్షమించమని భగవంతుణ్ణి ప్రార్థిస్తూ 'బ్రహ్మచర్యం' బూనారు. (గాంధీ

# విచ్ఛిన్నమవుతున్న తెలుగు మీడియా

*నలభై సంవత్సరాల క్రితం తెలుగు మీడియా రంగంలో ప్రారంభమైన మార్పు, చివరికి మీడియాను విచ్ఛిన్న స్థితికి చేర్చిందని అంటున్నారు* **టంకశాల అశోక్**

**1970**ల నుంచి కొత్త ఆవిష్కరణలు, అభివృద్ధి దశలోకి ప్రవేశించిన తెలుగు మీడియా 40 సంవత్సరాలు గడిచేసరికి తనను తాను విచ్ఛిన్నం చేసుకుంటున్న స్థితిలోకి ప్రవేశిస్తున్నది. క్షీణించడం కొంతకాలం క్రితమే మొదలైందిగదా, ఈ విచ్ఛిన్నత ఏమిటనే సందేహం కలగవచ్చు. క్షీణత మరింతగా పెరగడం, కొన్నింటి యాజమాన్యాలు సంప్రదాయక యజమానుల చేతి నుంచి పూర్తిగా పెట్టుబడిదారులు, లేదా రాజకీయ పార్టీల అధీనంలోకి వెళుతుండడం, సంప్రదాయక యాజమాన్యాలు ఉన్న సందర్భాలలోనూ బలహీనపడి నామమాత్రం కావడం, ఎడిటర్ వ్యవస్థలు ఎన్నడూ లేనంత దిష్టి బొమ్మలుగా మారాయి. అడ్వర్టయిజింగ్ – సర్క్యులేషన్ విభాగాలు అన్ని మొహమాటాలను పూర్తిగా వదిలి వేయడమన్నది పరాకాష్టకు చేరడం వంటి వివిధాంశాల ప్రస్తుత స్థితిని పరిగణనలోకి తీసుకుంటూ 'విచ్ఛిన్నత' అనే మాటను వాడవలసి వస్తున్నది.

1970లకు ముందు మనది సంప్రదాయకమైన మీడియా. స్వాతంత్రోద్యమ కాలపు లక్ష్యాలు యజమానులకు, ఒక మేరకు సంపాదకులకు 1947 తర్వాత మారినప్పటికీ దాని స్వరూప స్వభావాలు మౌలికంగా వెనుకటి మూసలోనే ఉన్నాయి. ఈనాడు దిన పత్రిక రాకతో కొత్త దశ మొదలైందని అందరూ గుర్తించిందే. యజమాని కొత్తతరం నుంచి వచ్చిన కొత్త ఆలోచనల మనిషి. పత్రికను కొత్త తరహా వస్తువు, కొత్త తరహా నిర్వహణ, కొత్త స్వరూపం, ఎడిటోరియల్ వ్యవస్థ ఏవిధంగా ఉండాలన్న విషయమై కొత్త సూత్రీకరణలు, ఆ విభాగంతో కొత్త తరహా సంబంధాలు, మరొక వైపు కొత్త టెక్నాలజీల క్రమ ప్రవేశం, సర్క్యులేషన్ అభివృద్ధిలో కొత్త మార్గాలు, కొత్త యాజమాన్య నైతికతలు మొదలైనవన్ని నెమ్మది నెమ్మదిగా వస్తూపోయాయి.

ఈ ఆధునికతల తాకిడికి వాతావరణం మారుతుండగా ఇతర పత్రికలు కూడా తమకు చేతనైన మేర, వీలైనంత వేగంతో మారక తప్పలేదు. మరికొంత కాలం గడిచే సరికి ఒకవైపు ఆర్థికాభివృద్ధి వేగం పుంజుకుని విస్తరించడం మొదలైంది. అనేక కొత్త శక్తులు రంగంలోకి వచ్చాయి. అందుకు సమాంతరంగా, కాంగ్రెస్‌కు అదనంగా పలు రాజకీయ పార్టీలు, వర్గాలు, సామాజిక వర్గాలు ఉనికిలోకి వచ్చాయి. ఈ కొత్త ఆర్థిక శక్తులు, రాజకీయ శక్తులు పరస్పర అనుబంధాలుగా మారసాగాయి. ఆర్థిక శక్తులకు రాజకీయం, రాజకీయ శక్తులకు ఆర్థిక అవసరంగా మారాయి. ఈ రెండు శక్తుల లక్ష్యాలు నెరవేరాలంటే సమాజంపై పలుకుబడి తప్పనిసరి గనుక, అందుకు మీడియా ఒక అనివార్య సాధనమైంది. మొదట పత్రికలు, తర్వాత ఛానళ్లు కలిసి మొత్తం మీద మీడియా వెల్లువగా మారింది.

---

జీవితంలో 'బ్రహ్మచర్యం' ఇలా వచ్చిందే). ఇవే కాదు ఇంకా ఉన్నాయి. పెషావర్లో కొంతమంది గాంధీ పిలుపు మేరకు సత్యాగ్రహం చేస్తున్నారు. 'వారిని కాల్చి పారేయమ'ని పైనించీ ఆదేశాలు. 'చంద్రసింగ్' అనే సేనాని ఆ పని చేయలేకపోయాడు. బ్రిటిష్ ప్రభుత్వం అతడినీ, అతని బృందాన్నీ శిక్షించింది. నిజానికి గాంధీ ప్రకారం 'కాల్పులు జరపకపోవడం' అనేది అహింసే కదా! 'వారిని శిక్షించవద్ద'ని గాంధీ వైశ్రాయ్‌తో ఒక మాట చెప్పవచ్చుకదా! కానీ గాంధీకి చంద్రసింగ్ చేసింది 'చక్రవర్తుల ఆజ్ఞలను శిరసావహించకపోవడం'గా అనిపించి 'మౌనవ్రతం' పాటించాడు.

భగత్‌సింగ్‌కీ అతని మిత్రులకూ మరణ శిక్షలు పడ్డప్పుడు కూడా గాంధీ ఇలాగే ప్రవర్తించారు. కాబట్టి హింసను అమలు పరిచేవారికి గాంధీ ఎన్నడూ అహింసను బోధించలేదు. హింసను అనుభవిస్తూ దాన్ని భరించలేని స్థితిలో ప్రతిఘటిస్తే ఆ ప్రతిఘటించే వారికి మాత్రమే అహింసను బోధించారు.

'పురుషాధిక్యతా సమాజంలో స్త్రీపై పురుషుడు చేసే గృహహింస'కు కూడా 'గాంధీ అహింస'లో నాగేశ్వర్ చోటిచ్చారు. జీవిత సహచరి కస్తూరిబా మీద గాంధీ చేసిందంతా గృహహింసే. ఇంటి చాకిరీలో కూడా ఆయన పాలుపంచుకుంది – స్త్రీ పురుషులు సమానులనే దృష్టితో కాదు. దక్షిణాఫ్రికాలో కాపురం పెట్టినప్పుడు గంపెడు సంతానంతో కస్తూరిబా పనిచేయలేని తప్పనిసరి పరిస్థితిలో మాత్రమే గాంధీ ఇంటి చాకిరీకి దిగవల్సివచ్చింది.

వర్ణధర్మాన్ని అంగీకరించిన గాంధీ అహింసా సిద్ధాంతంలో 'కుల హింస'కు కూడా చోటులేదు. 'రాజకీయ హింస'ను ఆయన ఏ దృష్టితో చూశారో కులహింసను కూడా అదే దృష్టితో చూస్తారు. 'వర్గ హింస' గురించి చెప్పాలంటే గాంధీ ఫిలాసఫీలో అసలు 'క్లాస్' అనే మాటకు అర్థమే లేదు. శ్రమదోపిడీని అంగీకరించినవారే ఆ దోపిడీని హింసగా చూడగలరు. శ్రమ దోపిడీని వివరించిన మార్క్సిజాన్ని పట్టుకుని దాన్ని 'ఎర్రభీభత్సం'గా వర్ణించిన 'గాంధీ అహింస'లో వర్గహింసకు ఎంత చోటు ఉంటుందో వేరే చెప్పనక్కర్లేదు.

సమాజంలోని 'వ్యవస్థిత హింస'ల మీద జరిగే పోరాటాలను చల్లార్చే గాంధీ అహింసా సిద్ధాంతాన్ని పట్టుకుని దానికి లేని తాత్విక అంశాలను చేర్చి, నాగేశ్వర్ చేసిన విశ్లేషణ అంతా నిరుపయోగంగా మిగిలిపోయింది. శతాబ్దాలుగా సమాజంలో హింసను అనుభవిస్తున్న అనేక ప్రజా సమూహాలను 'గాంధీ అహింసా సిద్ధాంతం' ద్వారా మళ్లీ ఆ హింసల్లోకి నెట్టివేసే విశ్లేషణ చేసిన నాగేశ్వర్ ఒక పునరాలోచన చేస్తే బాగుంటుంది.

*(రచయిత విశ్లేషకులు)* వీ

1970ల నుంచి ఆరంభమై, విస్తరిస్తూ సాగిన ఈ కొత్త దశలో మంచి చెడులు రెండూ ఉన్నాయి. ఉదాహరణకు పత్రికలలో విషయ విస్తరణ, రచనా శైలితో పాటు భాషలో ఆధునీకరణ, కొత్త టెక్నాలజీ, పత్రికలు అంతవరకు కాకులు కూడా దూరని కారడవులకు చేరడం, వేకువకల్లా చేరడం, జర్నలిస్టులతో పాటు రచయితలు పెరగడం, జరిగే ప్రతిది ఏదో రూపంలో ఏదో పత్రికలో ప్రపంచానికి వెల్లడి కావడం, సమాచార వితరణవల్ల, ఇది ఇతరత్ర తమ చైతన్యంతో కలిసి ప్రజలను సాధికారం చేయడం వల్ల రకరకాల మేలు జరగడం వంటివన్నీ మంచివయ్యాయి.

అనగా, ప్రకృతిలో నిహితమైన వనరులు, శక్తులు వినియోగంలోకి రావడం జరిగిన కొద్దీ, సంపదలు వృద్ధి చెంది ప్రజలకు ఉపయోగకరం అయినట్లు, పరిశ్రమలు, వ్యవసాయం, వ్యాపారం పెరిగి జీవన ప్రమాణాలు పై స్థాయికి పెరిగిన విధంగానే మీడియా రంగంలో కూడా జరిగిందన్నమాట. ఆ విధమైన పరిణామాలు ఆహ్వానించదగ్గవే.

అయితే, ఆ దశలో జరిగింది మొత్తం అదేకాదు. ఈ విధమైన కొత్త మార్పులు ఏ విధంగా ఉంటాయన్నది ఆ వనరులను, శక్తులను వినియోగంలోకి తెచ్చి నియంత్రించే వారెవరు, తమ లక్ష్యాలు ఏమిటన్నది కీలకమైన విషయం. ఆ వెల్లువ ఏవిధంగా రూపుతీసుకుంటుంది, అందులో మంచి చెడుల పాలెంత అన్నది దానిపై ఆధారపడి ఉంటుంది. పైన చెప్పుకున్నట్లు అట్లా వినియోగంలోకి తెచ్చి నియంత్రించిన శక్తులు గాని, వాటి లక్ష్యాలు గాని మౌలికంగా అనారోగ్యకరమైనవే తప్ప ఎల్లవేళలా సమాజ హితాన్ని కోరినవి కావు. వినియోగంలోకి తేవడం, నియంత్రించడం, నిర్వహించడం అన్నీ కూడా తమ స్వప్రయోజన లక్ష్యాల కోసమే జరిగాయి.

దానితో పైన పేర్కొన్న మంచిలో కొంత క్రమంగా బలహీనపడింది. కొంత మటుమాయమైంది. చెడు ముందుకు వచ్చి విశ్వరూపం దాల్చసాగింది. అదెంతగా జరిగిందంటే ఒక సమయం వచ్చేసరికి మనం ఆ మంచిని మరిచిపోవడం మొదలైంది. చెడుతప్ప మంచన్నదే జరగలేదన్నది నమ్మకంగా మారింది. అనగా చెడు అన్నది అంత విస్తారం, బలవత్తరం అయిందన్నమాట. సుమారు 1990లలో మొదలై దశాబ్దకాలం పాటు సాగిందిది. ఆ తర్వాత నుంచి, తొండ ముదిరి ఊసరవెల్లి అయినట్లు క్షీణత కాస్తా విచ్ఛిన్నతగా మారడం మొదలైంది. క్షీణత దశలో పైన పేర్కొన్న అవలక్షణాలన్నీ మొదలయ్యాయి. విచ్ఛిన్నత దశలో ఏమి జరుగుతున్నది?

స్వప్రయోజనపర పెట్టుబడి దారుల్లో, ప్రత్యక్షంగా-పరోక్షంగా రాజకీయ శక్తులో నియంత్రించని పత్రిక, ఛానల్ ఒక్కటైనా ఉందా అని వెతకవలసి వస్తున్నది. కేవలం క్షీణ దశలో అటువంటివి కానివి కూడా ఏదో ఒక మేరకు బతుకుతుండేవి. ఇపుడవి బతకగల అవకాశమూ లేకుండా పోతున్నది. మీడియాను బాహాటంగా, పచ్చిగా ఉపయోగించుకోవడం మాంసాన్ని తినడమే గాక ఎముకలను మెడలో వేసుకునే విధంగా మారింది. అందుకు చేస్తున్నదీ అదే గనుక ఎవరూ తమ పనికి సిగ్గుపడవలసిన అవసరం లేకుండా పోయింది. మరొక వైపు పాఠకుల దృష్టిలో విశ్వసనీయత అన్నది లుప్త స్థితికి చేరుకున్నది. ఎవరికి నచ్చిన పత్రికను, ఛానల్‌ను వారు 'నమ్మడం' మినహా సాధారణ రూప విశ్వసనీయత అడుగంటుతున్నది. నమ్మదగిన మంచి పత్రికల కోసం ప్రజల తహతహ గతంలో ఎన్నడూ లేనంతగా పెరిగిపోయింది.

ఈ విచ్ఛిన్నత వెనుక ఆర్థికపరమైన పోటీలకన్న ఎక్కువగా రాజకీయ స్పర్థలు, అధికారం కోసం పోటీలు పనిచేస్తున్నాయని ఒక స్థాయిలో తోస్తుంది. కాని రెండింటి మధ్య అవినాభావ సంబంధం ఏర్పడింది. బలమైన కులాలు, వాటిని ఆశ్రయించిన కొన్ని ఇతర కులాలు, వారి ఆర్థిక పోటీలు, అందుకు సాధనాలుగా అధికారం పోటీలు, రాజకీయ స్పర్థలు జమిలిగా కలిసిపోయాయి. వీటి మధ్య తేడాల కోసం వెతకడం వృథా ప్రయాసం. నిజానికి తేడాలు లేవు కూడా. మన ఆర్థికం - రాజకీయం - అధికారం - సామాజికం - మీడియా అన్నవి ఆ దశలో ప్రవేశించాయి. ఇటువంటి దశలో జరిగేది మీడియా విచ్ఛిన్నత మాత్రమే. రానున్న కాలంలో ఈ స్థితి మరింత హీనంగా మారడం మినహా బాగుపడే సూచనలు లేవు.

1970లలో తెలుగు మీడియా కొత్త పుంతలు తొక్కడానికి అంకురార్పణ చేసిన ఈనాడు ఇప్పుడు జాతీయ, అంతర్జాతీయ పెట్టుబడిదారుల, రుణ వ్యాపారుల అధీనంలోకి పోయింది. ఇతర ప్రధాన పత్రికల పరిస్థితి కూడా నెమ్మదిగా ఇంతే అవుతే ఆశ్చర్యపడదగింది ఉండదు. తమ అంతర్జాతీయ, జాతీయ ఆర్థిక - రాజకీయ అజెండాల కోసం మీడియాను సాధనంగా చేసుకొన జూస్తున్న శక్తులు ఢిల్లీ, ముంబాయిల నుంచి రాష్ట్ర రాజధానుల వరకు ప్రధాన మీడియాను హస్తగతం చేసుకోవడం మొదలైపోయింది. అనగా క్షీణత, విచ్ఛిన్నత ప్రక్రియ ఇంకా వేగవంతమవుతుందన్నమాట. ఆ దిశలో స్థానిక నాటకరంగ వేదికపై జరిగే దానికి ఇది అదనమని గ్రహించాలి. పాఠకులు, సమాజం, ప్రజాస్వామ్యం ఇప్పుడక్షరాలా అడకత్తెరలో పోక చెక్కలే. ఈ స్థితి మరింత హీనంగా మారడం తప్ప బాగుపడే సూచనలు లేవనడం అందువల్లనే.

బాగుపడే 'సూచనలు' కనిపించకపోవచ్చు గాని, 'అవకాశాలు' కూడా లేవా అన్నది అంతిమంగా సమాజం ముందుకు వస్తున్న ప్రశ్న. ప్రతి సమస్యకు పరిష్కారాన్ని సమాజం కనుగొనవలసిందే. సమస్యలోనే పరిష్కారాన్ని అన్వేషించాలన్నది ఎప్పటి నుంచో ఉన్నమాటే. కనుక మీడియాకు సంబంధించి కూడా ఉన్నదని.

మీడియా పట్ల ప్రజల విశ్వాస రాహిత్యాన్ని ఆధారం చేసుకుంటూ, దానిని మళ్లించి సంఘటితం చేసి ప్రత్యామ్నాయ మీడియాను సృష్టించుకోవడం ఒక్కటే సమాజానికి మిగిలిన మార్గం. దిన పత్రికలతో సహా కొత్త మీడియాను సృష్టించుకోవచ్చు. ఇది వట్టి ఊహాగానం కాదు, ఆచరణ రీత్యా సాధ్యమే. కాని అందుకు ఒకే ఒక షరతు ఇప్పుడున్న తరహా మీడియా పట్ల ప్రజలలో గణనీయంగా గల విశ్వాస రాహిత్యాన్ని ఆధారం చేసుకుని సంఘటిత పరచడమే. ఆ పని ఎట్లా చేయగలం, ఎంత త్వరగా, ఏ మేరకు చేయగలమన్నది మాత్రమే ప్రశ్న.

దానినట్లుంచితే, మీడియాలో పెట్టుబడిదారీ ప్రవేశం వల్ల ఆరంభంలో జరిగిన మేలును అట్లుంచితే, తర్వాత నెమ్మదిగా తలెత్తుతున్న సంక్షోభం, విచ్ఛిత్తి బహుముఖంగా సాగుతున్నది. అందులో పైన చెప్పుకున్నది ఒక చిన్న దృశ్యం మాత్రమే. మీడియా మేలుకోరేవారు, ప్రజాస్వామిక వాదులు, ప్రగతిశీలురు దీనినొక అవకాశంగా తీసుకుని మంచి మీడియాను తీర్చిదిద్దగలరా అన్నది ప్రశ్న.

వీ

*(రచయిత సీనియర్ జర్నలిస్టు)*

# ఆర్థిక అభివృద్ధిలో సహజ వనరుల పాత్ర

*దేశ ఆర్థికాభివృద్ధిలో సహజవనరుల పాత్ర తెలియజేస్తూ దేశ వ్యాప్తంగా ఉన్న నేలల రకాలు, ఆ నేలల్లో ఏయే పంటలు పండుతాయో, ఏయే ఖనిజాలు లభ్యమవుతాయో వివరిస్తున్నారు* **డా. తడికమళ్ల శేఖర్**

ఆర్థికాభివృద్ధి అనేది ప్రతి దేశం సాధించవలసిన ప్రక్రియగా చెప్పవచ్చు. ఆర్థిక వ్యవస్థను పరిపుష్టి చేయుటకు దేశంలో లభించే సహజ వనరులను వెలికితీసి ఉత్పత్తి ప్రక్రియలో వాటిని వినియోగించి నప్పుడే దేశ ఆర్థికాభివృద్ధి జరుగుతుందని 18వ శతాబ్దంలోనే ప్రకృతి ధర్మవాదులు వ్యాఖ్యానించారు. అందువల్ల వివిధ ఆర్థిక వేత్తలు సహజ వనరులను అభివృద్ధిని ప్రధాన వనరులుగా గుర్తించారు. సహజ వనరుల ప్రాధాన్యతను భారత ప్రణాళికా సంఘం కూడా గుర్తించింది. ప్రణాళికా సంఘం ప్రకారం అనుపయుక్తంగా ఉన్న సహజ, మానవ వనరులు గల దేశాలను గుర్తించి ఆ దేశాలలో గల వెనుకబాటుతనాన్ని తొలగించ డానికి ఈ వనరులను అభిలషణీయంగా వినియోగించి సత్వర అభివృద్ధిని సాధించుటకు తగిన ప్రణాళికలను రూపొందించాలి. అదే విధంగా వనరుల లభ్యత అనేది ఆర్థికాభివృద్ధి పరిమాణాన్ని నిర్దేశిస్తుందని ఆర్థర్ లూయిస్ అనే ఆర్థికవేత్త పేర్కొన్నాడు. ప్రాథమిక దశలో ఆర్థికాభివృద్ధి ఒక ప్రాంతంలో లభ్యమయ్యే సహజ వనరులకు పరిమితం అవుతుందని తద్వారా ప్రజల ఆదాయాలనూ, జీవన ప్రమాణాలనూ మెరుగు పరుస్తుందని తరువాత దశలో విదేశీ మారక ద్రవ్య సంపాదన మూలధన వస్తువుల కొనుగోలు ద్వారా ఆర్థికాభివృద్ధి పుంజుకుంటుందని ఆర్థికవేత్త ఫిషర్ వివరించారు. భూమి, నీరు, మత్స్యసంపద, అడవులు, ఖనిజాలు, వాతావరణం వర్షపాతం మొదలైన సహజ వనరులు ఉచితంగా లభించడం వల్ల వీటిని ప్రకృతి వనరులు అని కూడా అంటారు. సహజ వనరులను రెండు రకాలుగా వర్గీకరించవచ్చు.

1) వనరుల వినియోగం అవుతున్నప్పటికీ వాటి పరిమాణం తగ్గకుండా పునరుత్పన్నమయ్యే వనరులు (రెనువెబల్ రిసోర్స్) ఉదాహరణకు గాలి, నీరు, సూర్యరశ్మి, అటవీ సంపద, మత్స్యసంపద.

2) వనరులు వినియోగించడం వల్ల వాటి నిల్వలు తగ్గి అంతరించి పోయే వనరులు (ఎక్సస్టిబల్ రిసోర్స్) ఉదాహరణకు బొగ్గు, చమురు, భూమి, ఖనిజాలు. భూమి అంతర్భాగంలో లభించే ఈ వనరులు పునరుత్పన్నమవడానికి కొన్ని మిలియన్ సంవత్సరాలు పడుతుంది.

సహజవనరుల లభ్యత ఆర్థికాభివృద్ధిలో వాటి ప్రాముఖ్యతను గురించి ఆర్థికవేత్తలు వివిధ భావాలను వ్యక్తపరిచారు. అర్థ శాస్త్రంలో ప్రత్యేకమైన గుర్తింపు కలిగిన సాంప్రదాయ ఆర్థికవేత్తలు ఆర్థికాభివృద్ధి, వనరుల పరిమాణం మధ్య ధనాత్మక సంబంధాన్ని గుర్తించారు. ఆర్థికాభివృద్ధిలో క్షీణ ప్రతిఫల సిద్ధాంతాన్ని ప్రతిపాదించి వనరుల కొరత వల్ల ఆర్థిక ప్రగతి కుంటుపడుతుందని చెప్పారు. జౌమల్ అనే ఆర్థికవేత్త సహజ వనరులపైన ఆర్థర్ లూయిస్ చెప్పిన భావనతో ఏకీభవించి వనరుల పరిమితి అనేది ఆర్థికాభివృద్ధిని నిర్ణయిస్తుందని పేర్కొన్నాడు. అదే విధంగా హేరడ్ అనే ఆర్థికవేత్త ఆర్థికాభివృద్ధిలో సంప్రదాయ వాదులు ప్రతిపాదించిన క్షీణ ప్రతిఫల సూత్రాన్ని ఖండిస్తూ ఆర్థికాభివృద్ధిలో వనరుల లభ్యత ప్రధానాంశం కాదని వాదించాడు. వివిధ దేశాల పరిస్థితులు, కాలాన్ని బట్టి వనరుల ప్రాతినిధ్యం మారుతుందని భావించినప్పటికీ వెనుకబడిన ఆర్థిక వ్యవస్థలలో వనరుల లభ్యత, వాటి పరిమాణం అనేది ఉత్పత్తి కారకాలైన భూమి, శ్రమ ఉపయోగితను నిర్ణయిస్తుందని అందరికీ తెలిసిన అంశమే. అభివృద్ధి చెందిన దేశాలలో వనరులు ప్రముఖ పాత్ర పోషించక పోయినా పారిశ్రామిక విప్లవం ప్రాథమిక దశలో ఇంగ్లండ్ వంటి దేశాల ఆర్థికాభివృద్ధి అనేది వనరుల ఆధారంగానే జరిగిందని చెప్ప వచ్చు. జాతీయాదాయం అనేది ఒక ఉన్నత స్థాయికి చేరుకున్న తర్వాత ఆర్థికాభివృద్ధిలో వనరుల ప్రాధాన్యం తగ్గినప్పటికీ దేశాల స్థితిగతులను బట్టి నేటికి అనేక దేశాలలో ప్రజలు సహజ వనరులపై ఆధార పడుతున్నారు. విజ్ఞాన, శాస్త్ర సాంకేతికాభివృద్ధి వల్ల గుప్తంగా ఉన్న వనరులను కనుగొనే ప్రక్రియ నిరంతరం కొనసాగుతుంటుందని చెప్పవచ్చు.

సహజ వనరులన్నింటిలో కెల్లా భూమికి ప్రత్యేక స్థానం ఉంది. వ్యవసాయ, పారిశ్రామిక, సేవారంగ కార్యకలాపాలకు ప్రధాన ఉత్పాదితంగా భూమిని గుర్తించారు. అంతేకాకుండా అడవులు, గనులు, భవనాలు, రైలు, రోడ్డు మార్గాలకు మూలాధారం భూమి. ఒకదేశ ఆర్థికాభివృద్ధి అనేది భూమి పరిమాణం, సాంద్రత ఉపయోగిత సామర్థ్యంపై ఆధారపడి ఉంటుందని చెప్పవచ్చు. భారతదేశంలో 1981 – 2000 సంవత్సరాల మధ్యకాలంలో భూమి వినియోగాన్ని కింది పట్టిక ద్వారా తెలుసుకోవచ్చు.

| | వివరాలు | భూమి (1981) (మి.హె.) | వినియోగం (1991) (మి.హె.) | భూమి పరిమాణం (1999-2000) (మి.హె.) |
|---|---|---|---|---|
| 1 | సమాచారం అందుబాటులో ఉన్న భూ విస్తీర్ణం | 304 (100%) | 305 (100%) | 306 (100%) |
| 2 | వ్యవసాయానికి పనికిరాని బీడు భూములు | 40 (13%) | 41 (13%) | 42 (14%) |
| 3 | అడవులు | 67 (22%) | 68 (22%) | 69 (23%) |
| 4 | పశుమేతకు అందుబాటులో ఉన్న భూములు | 12 (4%) | 12 (4%) | 11 (3%) |
| 5 | వ్యవసాయ యోగ్యమై వృథా అవుతున్న భూమి | 19 (6%) | 19 (6%) | 18 (6%) |
| 6 | బీడు భూములు | 23 (8%) | 23 (8%) | 25 (6%) |
| 7 | సేద్యమవుతున్న భూమి | 143 (47%) | 142 (46%) | 141 (46%) |
| 8 | ఒక పర్యాయం కంటే ఎక్కువ సేద్యం అవుతున్న భూమి | 37 (12%) | 43 (14%) | 49 (16%) |
| 9 | మొత్తం పంట భూమి (7+8) | 180 (59%) | 185 (60%) | 190 (62%) |

భారతదేశ భూభాగం విస్తీర్ణం 329 కోట్ల హెక్టర్లు. గత మూడు దశాబ్దాలుగా మనదేశంలో భూమి వినియోగం తీరులో పెద్దగా మార్పులు లేవని చెప్పవచ్చు. పై పట్టికననుసరించి బీడు భూములు అటవీ ప్రాంతాలు 1 శాతం పెరిగి ఒక పర్యాయం కంటే ఎక్కువ మార్లు సేద్యం అవుతున్న భూమి 4 శాతం, మొత్తం పంట భూమి 3 శాతం మాత్రమే పెరిగింది. 1999 – 2000 సంవత్సరంలో భూమి వినియోగం 306 మిలియన్ హెక్టార్లుగా ఉంది. అందులో వ్యవసాయ భూమి 190 మిలియన్ హెక్టర్లు అనగా 62 శాతం గానూ, సేద్యపు భూమి 141 మిలియన్ హెక్టర్లు అనగా 46 శాతం గానూ, ఒక పర్యాయం కంటే ఎక్కువ సార్లు సాగుచేసిన భూమి 49 మిలియన్ హెక్టర్లుగా అనగా 19 శాతంగా ఉంది.

భారతదేశ భూ విస్తీర్ణంలో 69 మిలియన్ హెక్టర్లు అనగా 23 శాతం అటవీ ప్రాంతాలు, అడవులు ప్రభుత్వ అధీనంలో ఉన్నప్పటికీ కొన్ని అటవీ ప్రాంతాలు ప్రైవేట్ వ్యక్తుల అధీనంలో ఉన్నవి. 1952 అటవీ విధాన తీర్మానం ప్రైవేట్ వ్యక్తుల చేతుల్లో ఉన్న అడవులను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలని చెపుతున్నది. పశువుల మేతకు ఉపయోగిస్తున్న భూమి కేవలం 4 మిలియన్ హెక్టర్లుగా ఉంది. ఇది మొత్తం భూభాగంలో 3 శాతం సేద్యానికి ఉపయోగించకుండా అనుపయుక్తంగా ఉన్న భూమి 25 మిలియన్ హెక్టర్లుగా అనగా భూ విస్తీర్ణంలో 3 శాతంగా ఉన్నవి. ఇటువంటి భూములు ఒక సంవత్సరం నుండి 5 సంవత్సరాల వరకు సేద్యానికి దూరంగా ఉండడానికి కారణాలు నీటి వసతుల కొరత, ఉత్పాదకాల కొరత, రైతుల పేదరికం, లాభసాటి కాని వ్యవసాయమని చెప్పవచ్చు.

ప్రకృతిలోని జీవుల మనుగడకు మృత్తికలను ప్రధానమైన వనరుగా చెప్పవచ్చు. మనకు కావలసిన ఆహారం, బట్టలతో పాటు మరెన్నో దైనందిన అవసరాలను నేలలే తీరుస్తున్నాయి. క్రీ.శ. 1893లో ఓల్కర్, 1898లో లెడర్‌లు చేసిన పరిశీలన ఆధారంగా భారతదేశంలోని నేలలను నాలుగు రకాలుగా వర్గీకరించవచ్చు. అవి గంగా సింధు ఒండలి నేలలు, నల్లరేగడి నేలలు, ఎర్ర రేగడి నేలలు, లాటరైట్ నేలలు. ఈ నాలుగు రకాల నేలలతో కలుపుకొని భారత వ్యవసాయ పరిశోధనా మండలి భారతదేశంలో గల నేలలను ఎనిమిది రకాలుగా వర్గీకరించింది.

**1) ఒండలి నేలలు :** ఒండలి నేలలు భారతదేశంలో విస్తారంగా ఉన్నాయని చెప్పవచ్చు. ఇవి 7.7 లక్షల చదరపు కిలోమీటర్ల మేరకు విస్తరించి ఉన్నాయి. ఒండలి నేలల్లో డెల్టాయిక్ ఒండలి, కాల్కేరియస్ ఒండలి, తీరస్థమైన ఒండలి, తీర ప్రాంతాల్లో ఇసుక నేలలుగా ఉన్నాయి. ఈ నేలలు పంజాబ్ నుండి అసోం వరకు, మధ్యప్రదేశ్, గుజరాత్ రాష్ట్రాలలోని నర్మదా, తపతి నదీ లోయల్లోను, మధ్యప్రదేశ్, ఒరిస్సాలోని మహానది డెల్టాల్లోను, ఆంధ్రప్రదేశ్‌లోని గోదావరి, కృష్ణా, తమిళనాడులోని కావేరి డెల్టాలోను విస్తరించి ఉన్నాయి. ఒండలి నేలల లోతు, భూ ఉపరితలానికి కింద 600 మీటర్లకు మించి ఉంటుంది. ఈ నేలలు ముఖ్యంగా హిమాలయాల నుండి వచ్చిన విచ్ఛిన్నా శేషం నుండి లేదా టెథిస్ సముద్రం వదిలిపెట్టిన సిల్ట్ నుండి ఏర్పడ్డాయి.

ఒండలి నేలల్లో బాగా మెత్తగా ఉండే కొత్త ఒండలిని ఖాదర్ అంటారు. ఈ నేల నదీతలాల సమీపంలో ఉండి దీని పయనం జంబాలం నుంచి ఇసుక లోమ్ వరకు వివిధ రకాలుగా ఉంటుంది. సముద్ర మట్టానికి దాదాపుగా 3 మీటర్ల ఎత్తులో ఉండే నేలలను బంగర్ లేదా పాత ఒండలి అంటారు. ఒండలి నేలల్లో పొటాష్, ఫాస్ఫరిక్ ఆమ్లం, సున్నం పుష్కలంగా ఉన్నప్పటికీ వీటిలో హ్యూమస్ నత్రజని లోపించి ఉంటాయి. ఈ నేలలు వరి, గోదుమ, పప్పు ధాన్యాలు, చెరకు, జనుము, మొక్కజొన్న, నూనె గింజలు, పత్తి, అరటి, ఇతర రకాల పండ్లు, కూరగాయలు పండించడానికి అనువుగా ఉంటాయి.

**2) నల్లరేగడి నేలలు :** ఈ నేలలు ముదురు బూడిద రంగు నుంచి నలుపు రంగులో ఉంటాయి. వీటిని స్థానికంగా రేగర్, నల్లరేగడి నేలలని అంటారు. ఇవి పత్తి పంటకు అనుకూలంగా ఉండడం వల్ల వీటిని బ్లాక్ కాటన్ సాయిల్స్ అని కూడా పిలుస్తారు. ఈ నేలలకు దక్కన్ పీఠభూమి ప్రసిద్ధి. మహారాష్ట్ర, గుజరాత్, మధ్యప్రదేశ్, కర్ణాటక, ఆంధ్రప్రదేశ్, తమిళనాడు రాష్ట్రాలలోను, ఉత్తరప్రదేశ్, రాజస్థాన్ రాష్ట్రాలలో కొన్ని ప్రాంతాలలో ఈ నేలలు 5.18 లక్షల చదరపు మైళ్ల వరకూ విస్తరించి ఉన్నాయి. కొన్ని నల్లరేగడి నేలలను పూర్వపు సోవియట్ యూనియన్‌లోని చెర్నోజెమ్‌లతోనూ, అమెరికాలోని ప్రయరీలతోనూ పోల్చవచ్చు. ఈ నేలలకు తేమను నిలుపుకునే సామర్థ్యం ఉంటుంది. ఇనుము, కాల్షియం, మెగ్నీషియం, కార్బోనేట్, అల్యూమినియంలు పుష్కలంగా ఉంటాయి. పత్తి, వేరుశనగ, తృణధాన్యాలు, మొక్కజొన్న పప్పు ధాన్యాలు, జొన్న, పొగాకు, ఆముదం వంటి పంటలకు ఈ నేలలు అనువుగా ఉంటాయి.

**3) ఎర్ర నేలలు :** ఈ నేలలు ఎరుపు లేదా ఎర్రని గోధుమ రంగు రూపంలో ఉంటాయి. వీటిలో ఫెర్రో మెగ్నీషియం ఖనిజాలు పుష్కలంగా ఉంటాయి. ఈ నేలలు తమిళనాడు రాష్ట్రం అంతటా, కర్ణాటక ఈశాన్యం, అంధ్రప్రదేశ్, గోవా, ఉత్తరప్రదేశ్, చత్తీస్‌గఢ్, మధ్యప్రదేశ్ తూర్పు ప్రాంతం నుండి ఛోటా నాగపూర్, ఒడిశా వరకు, ఉత్తరప్రదేశ్, రాజస్థాన్‌లోని తూర్పు ప్రాంతం, అసోం, మేఘాలయ, నాగాలాండ్, మణిపూర్, త్రిపురలోని కొన్ని ప్రాంతాలలో విస్తరించి ఉన్నాయి. ఈ నేలలు 5 – 18 లక్షల చదరపు కిలోమీటర్ల వరకు విస్తరించి ఉన్నాయి.

**4) లాటరైట్ నేలలు :** 200 సె.మీ.కు పైగా భారీ వర్షపాతం గల ఉష్ణ మండల ప్రాంతాలలో ఈ నేలలు ఏర్పడతాయి. భారీ వర్షపాతం వల్ల నేల పై పొర నుంచి ద్రావణీయ పదార్థాలన్నీ కొట్టుకొని పోతాయి. దీనికి గాలి తగలడం వల్ల బాగా గట్టిగా మారుతుంది. అందువల్ల దీనిని నిర్మాణ సామాగ్రిగా ఉపయోగిస్తుంటారు. ఈ నేలల్లో కాల్షియం, మెగ్నీషియం, నత్రజని, జీవపదార్థం తక్కువగా ఉంటుంది. ఈ నేలలు మధ్యప్రదేశ్‌లోని వింధ్య, సాత్పురా పర్వతాలకు చెందిన బసాల్టిక్ పర్వత శిఖరాల మీద, పీఠభూముల మీద ఒరిస్సాలోని తూర్పు కనుమల ప్రాంతాల్లోనూ, దక్షిణ మహారాష్ట్ర, కర్ణాటక, కేరళ, పశ్చిమ బెంగాల్, అసోంలోని కొన్ని ప్రాంతాలలో, బీహార్ తూర్పు పర్వత ప్రాంతాలలో విస్తరించి ఉన్నాయి. తక్కువ ఎత్తులో ఉన్న లాటరైట్ నేలల్లో వరి, ఎక్కువ ఎత్తులో ఉన్న ఈ నేలల్లో తేయాకు, కాఫీ, రబ్బర్, పట్టు జీడి మామిడి వంటి పంటతోటలు పండుతాయి.

**5) శుష్క, ఎడారి నేలలు :** శుష్క, అర్ధ శుష్క పరిస్థితులలో ఆ నేలలు ఏర్పడతాయి. వాయవ్య భారతదేశంలో ఇవి 1.42 లక్షల చదరపు కిలోమీటర్లకుపైగా విస్తరించి ఉంటాయి. ఈ నేలల్లో ద్రావణీయ లవణాల శాతం ఎక్కువగా ఉంటుంది. కానీ, కాల్షియం కార్బోనేట్ శాతం మారుతూ ఉంటుంది. ఈ నేలలో జీవపదార్థం, నత్రజని తక్కువగా ఉంటాయి. రాజస్థాన్‌లోని ఆరావళి పర్వతశ్రేణికి పశ్చిమాన, హర్యానా పంజాబ్‌లకు దక్షిణాన, రాన్ ఆఫ్ కచ్‌కు ఉత్తరాన శుష్క ఎడారి నేలలున్నాయి. ఈ నేలల్లో ఫాస్ఫరస్ ఎక్కువగా ఉంటుంది. క్షారత్వాన్ని ఎక్కువగా తట్టుకోగలిగే బార్లీ, రేప్, సీడ్‌పత్తి వంటి పంటలు పండుతాయి.

# మహిళలకు భూమి హక్కు - ప్రభుత్వ సహకారం

***మహిళలకు కల్పించిన భూమి హక్కులను పరిగణనలోకి తీసుకొని వారికి వ్యవసాయానికి కావలసిన సదుపాయాలను, ఉత్పాదకాలను, సేవలను అందించాలని అంటున్నారు* ఆశాలత**

**అం**తర్జాతీయ గ్రామీణ మహిళా దినోత్సవం, ప్రపంచ ఆహార దినోత్సవం సందర్భంగా అక్టోబర్ 16న 'తెలంగాణ రాష్ట్రంలో మహిళలు భూమి హక్కులు, వ్యవసాయ – సమస్యలు సవాళ్లు పరిష్కారాలు, విధాన నిర్దేశాలు' అనే అంశంపై రాష్ట్ర స్థాయి సదస్సు జరిగింది. సెంటర్ ఫర్ ఎకనామిక్ అండ్ సోషల్ స్టడీస్, రైతు స్వరాజ్య వేదిక సుస్థిర వ్యవసాయ కేంద్రం, కేరింగ్ సిటిజన్స్ కలెక్టివ్, గ్రామ్య సంస్థలు కలిసి ఈ సదస్సును నిర్వహించాయి. ఈ సదస్సులో తెలంగాణలోని పలు జిల్లాల మహిళా రైతులు, రైతు ఆత్మహత్యల కుటుంబాల సభ్యులు, పరిశోధకులు, ఆర్థిక వేత్తలు, వ్యవసాయ శాస్త్రవేత్తలు, మహిళా ఉద్యమ నాయకులు, దళిత సంఘాల నాయకులు, హక్కుల సంఘాల నాయకులు, ప్రభుత్వ అధికారులు, వివిధ సంస్థల ప్రతినిధులు పాల్గొని సమస్యను క్షుణ్ణంగా చర్చించి స్పష్టమైన విధాన నిర్దేశాలను డిమాండ్ చేస్తూ ఈ కింది ప్రతిపాదనలను ప్రభుత్వం ముందుంచారు.

**మహిళలకు భూమి హక్కులు కల్పించడంలో డిమాండ్లు విధాన నిర్దేశాలు**

• వ్యవసాయంలో మహిళల పాత్ర పెరిగిన దృష్ట్యా మహిళలకు ఉత్పాదక వనరులపై అధికారం ఉండాలి అనేది సర్వత్రా వ్యక్తమవుతున్న అభిప్రాయం (మిలీనియం డెవలప్‌మెంట్‌లో కూడా ఇదే ప్రకటించ బడింది) వారికి సమాన భూమి హక్కులు లేనట్లయితే సమగ్ర అభివృద్ధి సాధ్యం కాదు. దీనిని మానవహక్కుల కోణం నుండి, సుస్థిర అభివృద్ధి కోణం నుండి అర్థం చేసుకోవాలి.

• మహిళల పేరు మీద భూమి పట్టాలు ఇస్తున్నారు కాని ఆ భూమిలో వ్యవసాయం చేయడానికి అనేక ఇబ్బందులు ఎదురవుతున్నాయి. భూమితో పాటు మహిళలకు అవసరమైన సదుపాయలు, ఉత్పాదకాలు, సేవలు అందించే విధంగా స్పష్టమైన మార్గదర్శకాలు జారీ చేయాలి.

• తెలంగాణలో మహత్తర పోరాట వారసత్వం ఉంది. భూపోరాటాల ఫలితంగా అద్భుతమైన చట్టాలు, జిఒలు వచ్చాయి. అయినప్పటికీ మహిళలకు న్యాయం జరగలేదు. ఇప్పటి వరకు అమలు జరిగిన భూమి లీజు, కొనుగోలు పథకాలను, ఉమ్మడి రాష్ట్రంలో అమలులో ఉన్న చట్టాలను పూర్తిగా సమీక్షించి తెలంగాణకు అనుకూలమైన కొత్త పథకాలను తీసుకురావాలి. భూ చట్టాలను తరిగి రాయాలి.

• మహిళలకు భూమి హక్కును కల్పించిన హిందూ వారసత్వ చట్టాన్ని రెవెన్యూ యంత్రాంగం కచ్చితంగా అమలు చేయాలి. రెవెన్యూ సిబ్బందికి జెండర్ స్పృహ కల్పించడం కోసం శిక్షణలు ఇవ్వాలి. రెవెన్యూ సిబ్బంది మహిళలకు భూమి హక్కుల సమాచారం అందించాలి. రెవెన్యూ శాఖలో కనీసం 50 శాతం మహిళా ఉద్యోగులను నియమించాలి.

• త్వరలోనే తెలంగాణలో భూముల రీ సర్వే జరగబోతున్నది. ఆ సమయంలో పహానిలో సాగు చేసే మహిళలను అనుభవదారులుగా గుర్తించి వారి పేర్లను నమోదు చేసుకోవచ్చు. సర్వే పత్రంలో భూమి యజమానుల లింగం తెలవడానికి ఒక కాలం (వరుస) ఉంచాలి. మహిళల భూమి హక్కుల ఎజెండాను ముందు పెట్టి మొత్తం భూ సంస్కరణలను అమలు చేసే అవకాశాన్ని తెలంగాణలో గట్టిగా ముందుకు తీసుకెళ్లాలి.

• తెలంగాణలో ఇటీవల ప్రభుత్వం భూమిలేని దళితులకు మూడు ఎకరాల భూమిని పంపిణి చేసే కార్యక్రమం ప్రారంభించింది. అయితే

---

**6) లవణీయ, క్షార మృత్తికలు :** ఉత్తరప్రదేశ్, బీహార్, రాజస్థాన్, పంజాబ్, మహారాష్ట్ర, గుజరాత్, కర్ణాటక రాష్ట్రాలలో శుష్క, అర్ధ శుష్క ప్రాంతాలలోని నేలల ఉపరితలంపై సోడియం, కాల్షియం, మెగ్నీషియంలతో కూడిన గట్టి పొరలుంటాయి. ఈ నేలలు నిస్సారమైనవి. వీటిని రే, కల్లర్ లేదా ఊసర నేలలని పిలుస్తారు. లవణీయ మృత్తికలలో సోడియం లోపించి ఉండగా క్షార మృత్తికలలో సోడియం క్లోరైడ్ నిక్షేపాలుంటాయి.

**7) అటవీ మృత్తికలు :** ఈ నేలల్లో హ్యూమస్ ఎక్కువగా ఉంటుంది. ఎక్కువ ఎత్తయిన ఈ ప్రాంతాలలో ఈ నేలలు ఆమ్ల రహితమైన పోడ్జోల్‌లుగా ఉంటాయి. తక్కువ ఎత్తయిన ప్రాంతాలలో సాధారణంగా బూడిద రంగు నేలలుంటాయి. వీటిలో ఆమ్లగుణం తక్కువగా ఉంటుంది. ఆ నేలల్లో పొటాష్, పాస్పరస్, సున్నం తక్కువగా ఉంటాయి. హిమాలయాల్లోని కొండవాలుల్లోనూ ఉత్తరాన ఉన్న ఇతర పర్వత శ్రేణుల్లోనూ, తూర్పు, పశ్చిమ కనుమల్లోని పర్వత శిఖరాలలో 7.94 శాతం విస్తీర్ణంలో ఈ అటవీ మృత్తికలు వ్యాపించి ఉన్నాయి. అటవీ మృత్తికలను తేయాకు, కాఫీ, సుగంధ ద్రవ్యాలు, పండ్ల మొదలైన తోట పంటలకు ఉపయోగిస్తారు. కొన్ని చోట్ల గోధుమ, బార్లీ పంటలను కూడా పండిస్తారు.

**8) పేట్, జీవ సంబంధ మృత్తికలు :** నేలల్లో జీవ సంబంధ పదార్థం ఎక్కువగా సంచయనం కావడం వల్ల ఆర్ద్ర ప్రాంతాలలో పేట్ మృత్తికలు ఏర్పడ్డాయి. ఈ నేలలు దాదాపు 150 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణంలో విస్తరించి ఉన్నాయి. కేరళలోని కొట్టాయమ్, అలెప్పీ జిల్లాలలో ఇలాంటి మృత్తికలున్నాయి. వీటిని స్థానికంగా 'కరి' నేలలని అంటారు. ఈ నేలలు నల్లగా జంబాల యుతంగా, ఎక్కువ ఆమ్లయుతంగా ఉంటాయి. ఒడిశా, పశ్చిమ బెంగాల్, తమిళనాడు తీర ప్రాంతాలలో, హిమాలయాల్లోని చిత్తడి టెరాయ్ ప్రాంతాల్లోనూ, ఉత్తర బీహార్‌లోని మధ్య భాగంలో హ్యూమస్ శాతం ఎక్కువగా గల చిత్తడి నేలలు ఉన్నాయి. ఈ నేలలు వ్యవసాయ యోగ్యమైనవి కావు.

*(రచయిత ఎకనామిక్స్ డిపార్ట్‌మెంట్,
యూనివర్సిటీ పి.జి కాలేజీ, ఖమ్మం)*

వీ

ఇందులో కూడా అసైన్డు భూమల విషయంలో లాగే అనేక సమస్యలు ఉన్నాయని మహిళా రైతుల అనుభవం నుండి తెలిసింది. వాటిని సరిదిద్దాలి. ఈ కార్యక్రమం కింద ఇచ్చిన భూమిని ప్రజా ప్రయోజనం పేరుతో తిరిగి తీసుకోకూడదు. దళితుల భూమి పంపిణీని కూడా ప్రజా ప్రయోజనంగా పరిగణించాలి.

• ఆదివాసి ప్రాంతాలలో భూ బదలాయింపు చట్టం ఉల్లఘించిన వారిపై ప్రభుత్వం కేసులు పెట్టాలి. గిరిజనులకు ప్రతికూలంగా తీర్పు వచ్చిన కేసులన్నీ తిరగదోడాలి. దీనికి సంబంధించి అన్ని వివరాలను పొందుపరచిన గిర్‌గ్లాని నివేదికను అమలు చేసి ఆదివాసి ప్రజలకు భూమి హక్కుల విషయంలో న్యాయం చేయాలి.

• అటవీ హక్కుల చట్టం అమలుకు సంబంధించి మహిళలకు తమ హక్కుల పట్ల అవగాహన లేనందువల్ల అటవీ హక్కుల కమిటీలలో, గ్రామ సభలలో మహిళల భాగస్వామ్యం పెరిగేటట్లు చర్యలు తీసుకోవాలి.

• తెలంగాణలో ఉమ్మడి భూముల ఆక్రమణ, ఇతర అవసరాలకు మళ్లింపు ఎక్కువగా జరిగింది. దీని వల్ల ఎక్కువగా నష్టపోతున్నది పేద మహిళలే. సుప్రీంకోర్టు, హైకోర్టు తీర్పులను అమలు చేసి ఉమ్మడి భూములను గ్రామ పంచాయితీలకు అప్ప చెప్పాలి. భూమి లేని పేదలు, మహిళలు ఉపయోగించుకునే వీలు కల్పించాలి.

• దేవాదాయ భూములను వేలం చేసే క్లాజును తొలగించి ఆ భూములను భూమి లేని మహిళలకు తక్కువ ధరలకు కౌలుకు ఇవ్వాలి అనే క్లాజును చేర్చాలి.

• తెలంగాణలో ఒక స్పష్టమైన భూ వినియోగ విధానం రూపొందించాలి. వ్యవసాయానికి, ఉమ్మడి అవసరాలకు, పరిశ్రమలకు ఇతర అవసరాలకు ఎంత భూమి అవసరమో నిర్వచించే ప్రక్రియ మొదలు పెట్టాలి.

• అన్ని గ్రామాలలో భూమి లేని మహిళలను గుర్తించి భూమి పంపిణి చేయాలి. లేదా కౌలుకి భూమి ఇవ్వాలి. కౌలు చేస్తున్న మహిళలను రైతులుగా గుర్తించి కౌలు రైతు గుర్తింపు కార్డులు ఇవ్వాలి.

**మహిళా రైతులకు వ్యవస్థాగత మద్దతు**

• గ్రామ స్థాయిలో మహిళా రైతులను సహకార సంఘాలలో సంఘటితం చేసి ఆ సంఘాల ద్వారా వారికి అవసరమైన విత్తనాలు, ఉత్పాదకాలు, పశు సంపద, రుణ సదుపాయాలు, సమాచారం, వ్యవసాయ పనిముట్లు, పరికరాలు, మార్కెటింగ్ సదుపాయాలు వంటివి అన్నీ ఒకే చోట అందచేయాలి.

• వ్యవసాయ పనులలో మహిళల శ్రమ తీవ్రతను తగ్గించే పరిజ్ఞానాలపై పరిశోధనలు నిర్వహించి ఆ పరిశోధనా ఫలాలను వారికి అందించే విధంగా, నిధులు కేటాయించి విస్తృతంగా అమల్లోకి తేవాలి.

• మహిళా రైతులు సమష్టిగా సాగు చేసుకుంటూ రసాయనాలు పురుగుమందులు లేకుండా వైవిధ్యమైన ఆహారపంటలు – గింజ ధాన్యాలు, పప్పుధాన్యాలు, నూనెగింజలు, కూరగాయలు వంటివి పర్యావరణానికి, మనుషులకు, పశువులకు ఆరోగ్యకరమైన విధంగా పండిస్తున్న మంచి ఉదాహరణలు మన రాష్ట్రంలోనే మన కళ్ల ముందు అమలు జరుగు తున్నాయి. అటువంటి పంటల సాగును, సుస్థిర పద్ధతులను ప్రభుత్వం పెద్ద ఎత్తున ప్రోత్సహించి వ్యవసాయరంగాన్ని సంక్షోభం నుండి బయట పడవేసే విధానాలకు నాంది పలకాలి.

• విత్తనాల నాణ్యత, ధరల విషయంలో మార్కెట్‌పై ప్రభుత్వం నియంత్రణ విధించే పాత్ర పోషించాలి. విత్తనాలు మహిళా రైతుల చేతిలో ఉండేటట్లు చర్యలు తీసుకోవాలి.

• కుటుంబ ఆహార భద్రతకు, రైతుల ఆహార సార్వభౌమత్వానికి దోహదపడే రకరకాల చిరుధాన్యాలు పప్పుదినుసుల సాగును ప్రోత్సహించాలి. మహిళలు సులభంగా సాగు చేసుకోగలిగిన జొన్న, రాగి, సజ్జ వంటి పంటలకు బ్యాంకు రుణాలు ఇవ్వాలి. మద్దతు ధరలు ప్రకటించాలి.

• వ్యవసాయశాఖ మహిళా రైతుల అవసరాల పట్ల స్పందించాలి. వారికి అవసరమైన సమాచారాన్ని అందించాలి. జెండర్ స్పృహ కలిగి పనిచేయాలి. కొత్త సమాచారం పరిజ్ఞానాలపై మహిళలకు శిక్షణలు ఇవ్వాలి.

• మహిళా రైతులకు ప్రయోజనం కలిగించే విధంగా జెండర్ బడ్జెటింగ్ (స్త్రీ పురుష అసమానతలను తొలగించే ఉద్దేశంతో తయారు చేసే బడ్జెట్) చేయాలి. వ్యవసాయ పథకాలు, పరిశోధనలు అన్నీ మహిళా రైతులకు ప్రయోజనం కలిగిస్తున్నాయో లేదో ఎప్పటికప్పుడు సమీక్షించాలి.

ఈ సదస్సులో సెంటర్ ఫర్ ఎకానామిక్ అండ్ సోషల్ స్టడీస్ (సెస్) సంస్థ డైరెక్టర్ ఎస్. గాలబ్ ప్రారంభ ఉపన్యాసం చేశారు. తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన నేపథ్యంలో మహిళా రైతులకు సమాన హక్కులు, అవకాశాలు, సులభంగా వ్యవసాయం చేసుకునే విధానాల గురించి ఆయన వివరించారు. ప్రారంభ సెషన్‌కు డా. రుక్మిణి రావు అధ్యక్షత వహించగా వ్యవసాయ శాస్త్రవేత్త డా. రామాంజనేయులు, ఆర్థికవేత్త డా. రేవతి ప్రసంగించారు. మహిళలు భూమి హక్కులు అనే అంశంపై జరిగిన రెండవ సెషన్‌కు స్వతంత్ర పరిశోధకురాలు డా. ఉషా సీతాలక్ష్మి అధ్యక్షత వహించగా గ్రామీణ అభివృద్ధి సంస్థ డైరెక్టర్ సునీల్ కుమార్ భూమి హక్కులు రికార్డులకు సంబంధించిన న్యాయపరమైన అంశాలను వివరించారు. వివిధ సమయాలలో అమలు జరిగిన ప్రభుత్వ భూ పంపిణీ, లీజు పథకాలలో భూమిని పొందిన మహిళలు, కౌలు రైతుల తమ అనుభవాలను పంచుకున్నారు. మహిళలు వ్యవసాయంలో సమస్యలు అనే అంశంపై జరిగిన మూడవ సెషన్‌కు రైతు స్వరాజ్య వేదిక రాష్ట్ర కన్వీనర్ ఆశాలత అధ్యక్షత వహించారు. ఈ సెషన్‌లో డిడీస్, మహిళా సమతా సొసైటీ, కేరింగ్ సిటిజన్స్ కలేక్టివే సంస్థలకు చెందిన మహిళా రైతులు తెలంగాణకు అనుకూలమైన ఆహార పంటలను పండించాల్సిన అవసరాన్ని సుస్థిర వ్యవసాయ పద్ధతుల ప్రాముఖ్యతను, వాటిని అవలంభించడంలో తమ అనుభవాలను, విజయాలను వివరించారు. ప్రజల భాగస్వామ్యంతో సుస్థిర వ్యవసాయం (సిఎంఎస్ఏ) కార్యక్రమాన్ని అమలు చేస్తున్న ప్రభుత్వ అధికారాలు, వ్యవసాయ పరిజ్ఞానాలపై శిక్షణలు ఇచ్చే (ఎటిఎంఎ) అధికారాలు ఆ కార్యక్రమాల అమలులో సాధక బాధకాలను వివరించారు. ముగింపు సెషన్‌కు ప్రొఫెసర్ రమా మెల్కోటే అధ్యక్షత వహించి మహిళా రైతుల పరిస్థితి మెరుగుపడాలంటే వ్యవసాయ విధానాలలో మార్పు రావాలి. మన వ్యవసాయ రంగంపై కార్పొరేట్ కంపెనీల ప్రపంచ వాణిజ్య సంస్థ నియంత్రణ తొలగాలి అని చెప్పారు.

మహిళలకు భూమి హక్కులు కల్పించడంలోనూ, వ్యవసాయంలో మహిళా రైతులకు సాధికారత నిర్ణాయక పాత్రా కల్పించడంలోనూ రాష్ట్రంలో సత్ఫలితాలను ఇచ్చిన ఉదాహరణలను ప్రభుత్వం పరిగణనలోకి తీసుకుని విస్తృత స్థాయిలో అమలు చేయాలని సదస్సులో అందరు అభిప్రాయపడ్డారు. ఈ సదస్సు ఆమోదించిన తీర్మానాలను తెలంగాణ ప్రభుత్వ దృష్టికి తీసుకెళ్లి విధాన పరమమైన మార్పుల కోసం, వాటి అమలుకోసం దీర్ఘకాలం పాటు నిరంతరం పనిచేయాలని నిర్ణయించారు.

*(రచయిత రైతు స్వరాజ్య వేదిక రాష్ట్ర కన్వీనర్)* వీ

# ఒడిశాలో పర్యావరణ మార్పు ప్రభావం

***ఒడిశా రాష్ట్ర భూభాగంలో ఒకప్పుడు సగంగా ఉండిన అడవులు ప్రస్తుతం ఆరో వంతుకు పడిపోవడానికి వ్యాపార, పర్యావరణ మార్పులే కారణం అని అంటున్నారు*** **చక్రాబిసోయి**

దేశానికి తూర్పు భాగాన ఉన్న ఒడిశాకు దక్షిణాన ఆంధ్రప్రదేశ్, పశ్చిమాన చత్తీస్‌గడ్, ఉత్తరాన జార్ఖండ్, పశ్చిమ బెంగాల్, తూర్పున బంగాళాఖాతం సరిహద్దులతో ఉన్నది. సుమారు 60119 చదరపు మైళ్ల (155707 చదరపు కిలోమీటర్లు) వైశాల్యంతో కూడి ఉన్నది. జన సంఖ్య సుమారు 9 కోట్ల 20 లక్షలు. ఒడిశా వాతావరణం ముఖ్యంగా తేమ, పొడితో కూడి ఉంటుంది. జనవరి నెల అతి శీతల నెలగా పేరు గాంచింది. ఈ నెలలో రాష్ట్రంలో కొన్ని ప్రదేశాలలో సున్నా డిగ్రీకి ఉష్ణోగ్రత పడిపోతున్నది. అధిక వేడి మే నెలలో ఉండును. 46 నుండి 47 డిగ్రీల వరకు ఉష్ణోగ్రత నమోదు అవుతున్నది. రాష్ట్ర సరాసరి వర్షపాతం 1500 మిల్లీ మీటర్లు ఉండును. వర్షపాతం నైరుతి పవనాల వల్ల కలుగును. జూన్ నుండి సెప్టెంబర్ నెల వరకు వర్షపాతం ఉండును. తూర్పు కనుమల ప్రాంతంలో ఎక్కువ వర్షపాతం కురుస్తున్నది. దక్షిణ ఒడిశాలోని చిలికా సరస్సు ప్రాంతంలో 1300 మిల్లీ మీటర్లు తక్కువ వర్ష ప్రాంతం నమోదు అవుతున్నది.

వాతావరణ మార్పుల వలన గత కొద్ది సంవత్సరాల నుండి కరువులు, కాటకాలు వంటి ప్రకృతి విపత్తులతో రాష్ట్ర ప్రజలు సతమతమవుతున్నారు. ధన ప్రాణ నష్టం జరుగుతోంది. రాష్ట్రంలోని పారిశ్రామిక ప్రాంతాలు అధిక ఉష్ణోగ్రతలకు అధిక తుఫాను ప్రభావిత ప్రాంతాలుగా మార్పుకు గురయ్యాయి. ఒడిశా తూర్పు ప్రాంతం అల్పపీడిన ప్రాంతంగా మారింది. దాని ఫలితమే ఈ ప్రాంత పర్యావరణంలోని మార్పులు. 1950లో రాష్ట్రంలో 3 జిల్లాలు మాత్రమే కరువు జిల్లాలుగా గుర్తించబడ్డాయి. 1980 వరకు పశ్చిమ ఒడిశా కరువు ప్రాంతంగా మారింది. ప్రస్తుతం రాష్ట్రంలోని 30 జిల్లాలకు 25 జిల్లాలు కరువుకు ప్రభావితమవుతున్నాయి. దీని వలన సుమారు 22 మిలియన్ల ప్రజలు కరువుకు గురవుతున్నారు. సుంధర్‌గఢ్, కేంద్రపడ కోస్తా ప్రాంతం కూడా కరువు పరిస్థితి ఎదుర్కొంటున్నది. కేవలం కరువే పర్యావరణ మార్పుల విపత్తులకు మూలం కాదు. గడిచిన ఐదు సంవత్సరాలలో వరదల వలన 300 మంది ప్రజలు చనిపోయారు. 25 జిల్లాలు ప్రభావితమై 25 మిలియన్ల ప్రజలు కరువు భారీన పడ్డారు. ఈ శతాబ్దంలోనే 2001 ప్రకృతి వైపరీత్యాల సంవత్సరంగా రికార్డుకెక్కింది. తుఫానుల, వరదల సంఖ్య పెరిగింది .1998-1999లలో రెండుసార్లు తుఫానులు సంభవించాయి. రెండవ తుఫాను మూడు దినాలు ఏకదాటిగా కురిసిన వర్షం వలన 14 జిల్లాలు ప్రభావితమై 15 మిలియన్ల ప్రజలు తుఫాను భారీన పడ్డారు. ఈ 14 జిల్లాలే కాకుండా కొత్త ప్రాంతాలు కూడా తుఫానుకు గురయ్యాయి. సముద్రతీర ప్రాంతంలోని మడఅడవుల నరకడం వలన తుఫాను తీవ్రత పెరుగుతున్నది. దీని ప్రత్యక్ష ప్రభావం వ్యవసాయం, ఆర్థిక రంగాల మీద పడింది. ఉష్ణోగ్రత, వర్షపాతం కూడా మార్పుకు గురవుతున్నవి. గడిచిన కొన్ని సంవత్సరాలుగా ఉష్ణోగ్రతలు సరాసరి కంటే పెరగడం, తరగడం జరుగుతున్నది. కరువు ప్రాంతాల్లో వర్షపాతం 10 శాతం. తీర ప్రాంతంలో 3 నుండి 12 శాతం. వర్షపాతం క్రమబద్ధత లేకుండా పెరుగుతున్నది. మానవ తప్పిదం ఒకటైతే ప్రకృతి వైపరీత్యాలు మరొక కారణం. ఈ విధంగా అడవులను అధికంగా నష్టపోవడం జరుగుతోంది. 1995 నుండి 2005 వరకు దేశం మొత్తంలో గనులకోసం లక్ష హెక్టార్ల అడవులు ధ్వంసం అయితే ఒడిశాలో వివిధ గనుల యజమానుల వలన 25 వేల హెక్టార్ల అడవి ధ్వంసమైంది.

స్వాతంత్ర్యానికి పూర్వం ఒడిశాలో అడవులు 47 శాతం. ప్రస్తుతం 15 శాతానికి పడిపోయాయి. 2001 నుండి 2012 వరకు ఒడిశా ప్రభుత్వం దేశీయ, విదేశీయ బహుళ జాతి కంపెనీలతో కలిపి 93 ఒప్పందాలు చేసుకొన్నది. మార్చ్ 2012 కల్లా 54 కంపెనీలకు మొత్తం 35783.498 ఎకరాల భూమికి అనుమతులు ఇచ్చింది. ఒడిశాకు 5 వేల మెగావాట్ల విద్యుత్ అవసరం 55 వేల మెగావాట్ల విద్యుత్ ఉత్పత్తి ఒప్పందాలు బహుళ జాతి కంపెనీలతో ఒప్పందం చేసుకొన్నది. అభివృద్ధి పేరుతో వివిధ బహుళ జాతి సంస్థలకు, వేదాంత, బిర్లా, టాటా, పోస్కో లాంటి కంపెనీలకు, గనుల రిఫైనరీలకు విచ్చలవిడిగా అనుమతులు ఇచ్చారు. అందువలన అడవులు ధ్వంసం అయి ఒడిశాలో పర్యావరణ మీద ప్రభావం పడి తుఫానుల తీవ్రత పెరుగుతుంది.

రాష్ట్రంలో దాదాపు 40 శాతం వరి పంట పండే తీర ప్రాంతం తుఫానుల వలన నష్టపోతుంది. భూమికోత, ఉప్పు నీటి ప్రవేశం, వరదల ప్రభావం వలన పంటలు పండే భూములు భూసారాన్ని కోల్పోతున్నాయి. గడిచిన 13 సంవత్సరాలలో రాష్ట్రంలో సాగు భూమి 7.7 శాతం తగ్గింది. వాతావరణ మార్పుల వలన తుఫానులు వచ్చి సముద్రమట్టం ఒక్క మీటరు పెరిగితే దాని వలన 70 హెక్టార్ల ప్రాంతం ముంపుకు గురై ఆర్థికంగా 360 కోట్లు నష్టపోతునని నిపుణుల అంచనా. గడిచిన పది సంవత్సరాలలో వ్యవసాయ ఉత్పత్తుల ఉత్పత్తి సామర్థ్యం తుఫానుల వలన తగ్గింది. ధాన్యం 6.8 శాతం, అపరాలు 56.4 శాతం, నూనె గింజలు 44 శాతం, ఆలు 20 శాతం. ఉల్లిగడ్డ 14.4 శాతం, కూరగాయల ఉత్పత్తి 24.8 శాతం తగ్గింది. 1999లో వచ్చిన తుఫాను వలన సుమారు 2 మిలియన్ టన్నుల ధాన్యం నష్టం జరిగింది.

పర్యావరణాన్ని సమతుల్యం కోసం అడవులను కాపాడే విధంగా ప్రజల్ని చైతన్యవంతం చేయాలి. అడవులను ధ్వంసం చేసే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల అభివృద్ధి నిరోధక విధానాలకు ప్రజలు ఉద్యమించి నప్పుడే రాష్ట్రంలో పర్యావరణ ప్రభావం తగ్గి తుఫానులు కరువులు తగ్గతాయి.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

# హాంకాంగ్ ఆక్యుపై సెంట్రల్ ఉద్యమం

***హాంకాంగ్‌లో ప్రభుత్వంపై పెట్టుబడిదారుల పెత్తనాన్ని వ్యతిరేకిస్తూ విద్యార్థులు చేపట్టిన 'ఆక్యుపై సెంట్రల్' ఉద్యమం తీరుతెన్నులను వివరిస్తున్నారు* ఎం.కె. కుమార్**

హాంకాంగ్‌లో జరుగుతున్న ఆక్యుపై సెంట్రల్ ఆందోళన చైనా పాలకులకు వణుకు పుట్టిస్తోంది. మరోవైపు చైనాకు పోటీ దేశాలైన పశ్చిమ దేశాలు హాంకాంగ్‌లోని తాజా పరిణామాలను తమ కనుగుణంగా మార్చుకోవడానికి కుయుక్తులు పన్నుతున్నాయి. హాంకాంగ్‌లోని ప్రభుత్వ భవనాల సముదాయం ముందున్న అతిపెద్ద ఖాళీ ప్రదేశాన్ని సెంట్రల్ మైదానంగా పిలుస్తారు. ఈ మైదానాన్నే ప్రస్తుతం ఆందోళనకారులు తమ వేదికగా చేసుకుని ఉద్యమాన్ని నడుపుతున్నారు. 1997లో హాంకాంగ్ బ్రిటన్ నుండి చైనా పాలనలోకి వచ్చిన దరిమిలా, చైనా కొన్ని వాగ్దానాలను చేసింది. ఆ వాగ్దానాలను చైనా నెరవేర్చకుండా దాటవేసే ధోరణిని అవలంభిస్తోందనేది ఆందోళనకారుల ప్రధాన ఆరోపణ. హాంకాంగ్‌లో ప్రజాస్వామ్యబద్ధ ఎన్నికలు జరగాలని వారు కోరుకుంటున్నారు. దీన్ని చైనా సమర్థిస్తూనే, 2017లో హాంకాంగ్‌లో జరగబోయే ఎన్నికల్లో పోటీచేసే అభ్యర్థులు తప్పనిసరిగా చైనా ఆమోదం పొందవలసి ఉంటుందని ఉద్ఘాటించింది. దీన్ని ఆందోళనకారులు వ్యతిరేకిస్తున్నారు.

50 సంవత్సరాల స్వతంత్ర ప్రతిపత్తి ఒప్పందాలను చైనా పట్టించుకోవడం లేదు. దీంతో యువత పెద్ద ఎత్తున ఆందోళనలో పాలుపంచుకుంటోంది. 1842లో బ్రిటన్ పరిపాలనలోకి వచ్చిన హాంకాంగ్ 1997లో చైనా అధీనంలోకి వచ్చింది. అప్పటికీ 155 సంవత్సరాలు ప్రజాస్వామ్య పరిపాలనను గావించామని బ్రిటన్ చెప్పుకున్నప్పటికీ, ఆచరణలో మాత్రం హాంకాంగ్ వనరులను పెద్ద ఎత్తున దోచుకుంది. చైనా ఏలుబడిలోకి వచ్చిన తదనంతరం మరో 50 ఏళ్లు (2047 వరకు) హాంకాంగ్‌కు స్వతంత్ర ప్రతిపత్తిని కొనసాగిస్తామని చైనా ప్రకటించింది. 2004లో హాంకాంగ్ ఎన్నికల చట్టాలకు చైనా మార్పులు చేసిందని, దానివల్ల, 2017లో హాంకాంగ్ సిఇఓ పదవికి ప్రత్యక్ష ఎన్నికల్లో తాము అనుమతించిన అభ్యర్థులే బరిలో వుండాలనే చైనా ప్రతిపాదనను హాంకాంగ్ యువత తిరస్కరిస్తోంది. చైనా కమ్యూనిస్టు తరహా పరిపాలనను హాంకాంగ్‌లో అందిస్తుందని హాంకాంగ్ ప్రజలు భావించినా, ఆచరణలో అది కనిపించకపోగా, పక్కా పెట్టుబడి తరహా పరిపాలనను వారు అనుభవిస్తున్నారు. గతంలో బ్రిటన్ ఏలుబడికి, ప్రస్తుత చైనా ఏలుబడికి పెద్ద తేడాలేదనేది వారి వాదన. హాంకాంగ్‌లో చైనా అవలంభిస్తున్న విధానాలపై కొన్ని ప్రజాస్వామిక బృందాలు అనధికార ప్రజాభిప్రాయ సేకరణను నిర్వహించాయి. నిరుద్యోగం, ఉపాధిలేమి, కొనుగోలు శక్తి తగ్గిపోవడం, అధిక ధరలు, ద్రవ్యోల్బణం పెరుగుదల తదితర కారణాలతో, అశాంతితో రగులుతున్న పౌరులు, యువత తమ ఆందోళనలను మొదలుపెట్టారు. సెప్టెంబర్ 22న వారం రోజులు పాటు విద్యార్థి సంఘాలు తరగతుల బహిష్కరణకు పిలుపునిచ్చాయి. ఈ నేపథ్యంలో శాంతియుతంగా నిరసనను తెలుపుతున్న విద్యార్థులపై, పోలీసులు బాష్పవాయువులను ప్రయోగించడంతో విద్యార్థులు, మధ్యతరగతి ప్రజలు పెద్ద ఎత్తున వీధి పోరాటాలకు దిగుతున్నారు. పశ్చిమ ప్రావిన్స్ షిన్‌జియంగ్‌లో అధికమవుతున్న ప్రభుత్వ వ్యతిరేకతతో చికాగుగా ఉన్న చైనాకు హాంకాంగ్ యువతాగ్రహం కొంత ఆందోళనను కలిగిస్తోంది.

ఆక్యుపై సెంట్రల్ ఉద్యమాన్ని చైనాలోని మీడియా తప్పుపడుతోంది. అసమంజసమైన డిమాండ్లను విద్యార్థులు ముందుకు తెచ్చారని, ఇది వారి ఉద్యమాన్ని నీరుగారుస్తుందని రాసింది. నిరసనలు తగ్గకపోగా అంతకంతకు పెరిగిపోతున్నాయి. హాంకాంగ్ సిఇఓ లుంగ్‌చున్ యింగ్ ఆందోళనకారులతో చర్చలకు సిద్ధమని ప్రకటించినా, బీజింగ్ తొత్తుగా వ్యవహరిస్తున్న అతనితో తాము చర్చలకు రామని విద్యార్థి సంఘాలు తెగేసి చెప్పాయి. చైనా నేత డెంగ్ బ్రిటన్‌తో ఒకే దేశం రెండు వ్యవస్థలు అన్న విధానాన్ని హాంకాంగ్‌లో అవలంభిస్తామని, అప్పటి బ్రిటన్ ప్రధాని మార్గరెట్ థాచర్‌తో ఒప్పందం కుదుర్చుకున్నారు. ఆ ఒప్పందం ప్రకారం హాంకాంగ్ ప్రత్యేక పరిపాలనా ప్రాంతానికి పరిపాలకుణ్ణి (సిఇఓ) ఎన్నికల ద్వారా లేదా కేంద్ర ప్రభుత్వం, ప్రాంతీయ నాయకులతో చర్చలు జరిపి ఎంపిక చేయాలి. సిఇఓను చైనా కమ్యూనిస్టు పార్టీనే ప్రతిపాదిస్తుందని, తద్వారా చైనా హాంకాంగ్‌లో కమ్యూనిస్టు తరహా పరిపాలనను సాగిస్తుందని డెంగ్ ఆశించారు. హాంకాంగ్ యువతలో చైనా నుండి వలస వచ్చినవారు అధికంగా వున్నారు. వీరిలో కొన్ని బృందాలు చైనాకు పూర్తి మద్దతునిస్తున్నాయి. తైవాన్ విద్యార్థులు జనవరిలో సన్‌ఫ్లవర్ ఉద్యమం చేపట్టారు. చైనాతో ఐదు భారీ ప్రాజెక్టుల ఒప్పందాలను కుదుర్చుకుని, చైనా దళారీగా తైవాన్ ప్రభుత్వం వ్యవహరిస్తోందని వారు ఆరోపించారు. తైవాన్ శాసనసభను సైతం ఆక్రమించి వారు తమ నిరసనను తెలిపారు. అభివృద్ధి వ్యతిరేకశక్తులుగా సన్‌ఫ్లవర్ ఉద్యమాన్ని చైనా మద్దతుదారులు ప్రచారం చేశారు. ఆ తలనొప్పి నుండి చైనా బయటపడక ముందే హాంకాంగ్ ఉద్యమం ఊపందుకుంది. తైవాన్‌లో 2016లో ఎన్నికలు జరుగబోతున్న తరుణంలో ఆక్యుపై సెంట్రల్ తీవ్ర ప్రభావాన్ని చూపించవచ్చని విశ్లేషకులు భావిస్తున్నారు. క్రిమియా తరహాలో ప్రజాభిప్రాయ సేకరణ పేరుతో హాంకాంగ్ ప్రజలు స్వంతంత్ర దేశంగా అవతరించే ప్రయత్నం చేస్తారేమోననే ఊహే చైనాను కలవరపెడుతోంది. మరోవైపు హాంకాంగ్ అశాంతి జ్వాలలు తైవాన్, టిబెట్, క్సింజియాంగ్, ఇన్నర్ మంగోలియా, మాకావుల ప్రాంతాలకు విస్తరించే అవకాశాలున్నాయని చైనా నిఘావర్గాలు భావిస్తున్నాయి. హాంకాంగ్ ఉద్యమానికి పాశ్చాత్య దేశాలు బాసటగా నిలుస్తున్నాయి. పాశ్చాత్య మీడియా చైనా వ్యతిరేక భావజాలాన్ని హాంకాంగ్‌లో నింపేందుకు పెద్దఎత్తున సోషల్ మీడియాను వాడుకుంటోందని చైనా వాదిస్తోంది. హాంకాంగ్‌లో కేర్ ఫర్ యూత్ గ్రూప్ అసోసియేషన్ పేరిట

చైనా కమ్యూనిస్టు పార్టీ తన అనుకూల సంఘాన్ని ఏర్పాటు చేసింది. దీన్ని బీజింగ్‌లోని యునైటెడ్ ఫ్రంట్ వర్క్ డిపార్ట్‌మెంట్ నడుపుతోంది.

చైనాలో సోషలిస్టు వ్యవస్థ నడుస్తోందని, చైనా పాలకులు ఢంకాలు వాయిస్తున్నప్పటికీ, నిజానికి అక్కడ పెట్టుబడీదారీ వ్యవస్థ, ఫక్తు మార్కెట్ ఆధిపత్యం నడుస్తోంది. అమెరికా, ఇయూ తరహా మార్కెట్ ఎకానమీ నడిపిస్తున్నందు వల్ల అంతర్జాతీయంగా అతిపెద్ద ఆర్థికవ్యవస్థగా చెలామణీ అవుతోంది. ఆర్థిక సంస్కరణలు 1997 తర్వాత చైనాలో ఎక్కువైనాయి. హాంకాంగ్ చైనా అధీనంలోకి వచ్చే క్రమంలో, హాంకాంగ్ – చైనాల మధ్య ఒక దేశంలో రెండు వ్యవస్థలు అనే విచిత్రమైన ఒప్పందాన్ని చేసుకున్నాయి. దీని ప్రకారం చైనాలో సోషలిస్టు వ్యవస్థ, హాంకాంగ్‌లో పెట్టుబడీదారీ వ్యవస్థ నడుస్తాయని అప్పటి చైనా నేత డెంగ్ జియావో పింగ్ సెలవిచ్చారు. ఇది ప్రాథమిక చట్టం (బేసిక్ లా) గా అమలులోకి వచ్చింది. ఈ ఒప్పందం ప్రకారమే చైనా 2017లో హాంకాంగ్‌లో జరగబోయే ఎన్నికల్లో అభ్యర్థులను చైనా ప్రభుత్వం ఆమోదించవలసి ఉంటుంది. హాంకాంగ్‌లో సార్వత్రిక ఓటు హక్కు అమలులో ఉండాలంటే, చైనా ఎన్నికల అభ్యర్థుల పేర్లను ఆమోదించ వలసిందే. ఈ నేపథ్యంలో హాంకాంగ్ యువత ఆందోళన ఎందుకు చెందుతోంది అనే ప్రశ్న ముందుకు వస్తుంది.

చైనా విధానాలు హాంకాంగ్‌ను అభివృద్ధి పథంవైపు నడిపించడం లేదు. చైనా పాలకులు ధనికవర్గానికి కొమ్ముకాస్తున్నందువల్ల, నిరుద్యోగత, అధికధరలు, ద్రవ్యోల్బణం అక్కడి ప్రజలను పీడిస్తున్నాయి. దీర్ఘకాలికంగా అసంతృప్తితో రగులుతున్న హాంకాంగ్ ప్రజలు తాజా ఉదంతంతో తమ ఆక్రోశాన్ని ఈ విధంగా వెళ్లగక్కారు. విలీనం తర్వాత చైనా నుండి హాంకాంగ్‌కు పెద్ద ఎత్తున వలసలు జరిగాయి. స్థానిక ఉద్యోగాలను వలస వచ్చిన ప్రజలు తన్నుకుపోయారని, వ్యాపారవర్గంలో వారు నాటుకునిపోయి అధిక లాభాలు గడిస్తున్నారని స్థానిక ప్రజలు బలంగా విశ్వసిస్తున్నారు. ఆర్థిక సమానత్వం లేకపోవడమే గాక, ఉద్యోగాలకు విపరీతమైన పోటీ వల్ల వేతనాలు పడిపోయాయి. ఆర్థిక అసంతృప్తి, రాజకీయ వైరుధ్యాలుగా ఆందోళనల రూపంలో పెల్లుబికాయి. అంతర్లీనంగా ఉన్న ఆర్థిక అసమానతలే, రాజకీయ డిమాండ్లగా ఉద్యమ రూపాన్ని సంతరించుకున్నాయి.

సార్వత్రిక ఓటుహక్కు హాంకాంగ్ ప్రజలకు ఇవ్వడానికి, ఎన్నికల్లోని అభ్యర్థుల పేర్లను చైనా ప్రభుత్వం ఆమోదించవలసిన అవసరం లేదని హాంకాంగ్ యువత వాదిస్తోంది. వారి డిమాండ్‌కు చైనా తలొగ్గినంత మాత్రాన చైనా నష్టపోయేదేమీలేదు. సార్వత్రిక ఓటు హక్కు వల్ల పెట్టుబడిదారీ శక్తులు సమర్థించే, మద్దతిచ్చే నాయకులే ప్రజాస్వామ్యంలో గెలుపొందగలరనే అక్షరసత్యాన్ని హాంకాంగ్ ప్రజలు గ్రహించినట్టులేదు. చైనా నామినేట్ పద్ధతిని తన అధీనంలో ఉంచుకోవడం వల్ల, చైనా పెట్టుబడీదారులు హాంకాంగ్‌పై పెత్తనం చెలాయించే అవకాశం ఉంటుంది. హాంకాంగ్ ప్రజల డిమాండ్‌కు చైనా తలొగ్గితే, హాంకాంగ్ పెట్టుబడిదారులు ఆధిపత్యం చెలాయించవచ్చు. ఉద్యమం ముందుకు తీసుకువస్తున్న డిమాండ్, ధనికవర్గాలకు పూర్తి మద్దతిచ్చే విధంగానే ఉంది.

హాంకాంగ్‌లోని స్థానిక పెట్టుబడిదారులు, బ్రిటన్‌కు సానుకూలంగా మొదటినుండి ఉంటున్నారు. ఇదే చైనాను ఇరకాటంలో పడవేస్తూ, హాంకాంగ్ ఉద్యమం ముందుకు తీసుకు వచ్చిన డిమాండ్లకు అంగీకరించడానికి తటపటాయింప జేస్తోంది. పశ్చిమ దేశాలకు, చైనాకు జరుగుతున్న మార్కెట్ ఆధిపత్య పోరాటంలో భాగంగానే, ప్రస్తుత ఆక్యుపై సెంట్రల్ ఉద్యమాన్ని విశ్లేషించవలసి ఉంది. హాంకాంగ్ మార్కెట్‌పై ఆధిపత్యానికి ఇరు శిబిరాలు పోటీ పడుతున్నాయి.

అంతర్జాతీయ వాణిజ్య కేంద్రంగా హాంకాంగ్ విలసిల్లడానికి బ్రిటన్ కృషి ఉంది. బ్రిటన్ లాభపడడానికి హాంకాంగ్‌ను పెట్టుబడి కేంద్రంగా విస్తరింపజేయాల్సిన అవసరం దానికుంది. హాంకాంగ్ పెట్టుబడిదారు లను సంతృప్తి పర్చడానికి, ప్రత్యేక పాలనా వ్యవస్థలను అక్కడ ఏర్పాటు చేస్తామని, 50 ఏళ్ల తర్వాతే హాంకాంగ్‌ను చైనాలో విలీనం చేస్తామని చైనా వాగ్దానం చేసింది. పోర్చుగల్ అధీనం నుండి మకావు బయటకి వచ్చినప్పుడు, అక్కడ ఇదే సిద్ధాంతాన్ని చైనా అవలంభించింది. బ్రిటన్ పరిపాలనలో ఉన్న 156 సంవత్సరాలలోను ఎన్నికలు హాంకాంగ్‌లో జరగలేదు. ప్రజాస్వామ్య వ్యవస్థను స్థాపించడానికి హాంకాంగ్ పౌరులకు సార్వత్రిక ఓటు హక్కును కల్పించామని చైనా చెపుతోంది. చైనా రాజులు హాంకాంగ్‌ను 99 ఏళ్ల పాటు బ్రిటన్‌కు కౌలికిచ్చారు. కౌలు గడువు 1997కి తీరిపోయింది. పోయేముందర అక్కడ పౌరులకు ఓటు హక్కును కల్పిస్తూ, చైనాలో విలీనానికి వ్యతిరేకబృందాలను తయారుచేసింది. చైనాలో కమ్యూనిస్టుశక్తులు రాజ్యాధికారానికి వచ్చిన తర్వాత, ధనిక భూస్వామ్య వర్గాలు హాంకాంగ్ పారిపోయాయి. ప్రసుత్తం చైనా పాలకులను ప్రధానంగా వ్యతిరేకిస్తున్న వారిలో ఈ వర్గం ముందు వరుసలో ఉంది. ప్రస్తుత హాంకాంగ్ ఆందోళనలకు 48 శాతం ప్రజల మద్దతు మాత్రమే ఉందని చైనా మీడియా పేర్కొంటోంది. హాంకాంగ్‌లో పెట్టుబడిదారులు అధిక పన్నురాయితీలను, సబ్సిడీలను పొందుతున్నారు. చైనాలో విలీనం అయితే వారిపై పన్నుల భారం అధికంగా ఉంటుంది. అందుకే ప్రత్యేక హోదా రద్దును వీరు వ్యతిరేకిస్తున్నారు. మరోవైపు అధిక ప్రజానీకం హాంకాంగ్‌కు స్వతంత్ర ప్రతిపత్తి కావాలని ఆకాంక్షిస్తున్నారు.

70 లక్షల జనాభా ఉన్న హాంకాంగ్, ఆసియాలోనే అధిక బిలినీయర్లున్న ప్రాంతంగా ఖ్యాతి గడిరచింది. 10 లక్షల మంది ప్రజలు ప్రస్తుత ఉద్యమంలో పాలుపంచుకుంటున్నారు. నల్లమందు యుద్ధంలో చైనా ఓడిపోయిన తర్వాత, బ్రిటిష్ వలస కాలంలో తనకంటూ ప్రత్యేకమైన రాజకీయ, సాంస్కృతిక వాతావరణానికి అలవాటుపడింది. పెట్టుబడిదారీ విధానాలు బలంగా అమలవుతున్నందు వల్ల రక్షణ, విదేశీ వ్యవహారాలలో మినహా, మిగిలిన ఏ అంశాలలోను చైనా పెత్తనం తమ మీద ఉండకూడదని హాంకాంగ్ వ్యాపారవర్గం కోరుకుంది. చైనాలో పెట్టుబడిదో సంస్కరణలను అమలుపర్చిన ఘనుడు జియాపింగ్, వారికి తగ్గట్టుగానే ఒకేదేశం–రెండు విధానాలనే సిద్ధాంతాన్ని అవలంభించాడు. చైనా పట్టు క్రమంగా తగ్గుతుండడంతో ఆగస్టు 31న ప్రత్యేక చట్టాన్ని ఆమోదిస్తూ, సిఈఓ స్థానానికి ఇద్దరు వ్యక్తులే బరిలో వుంటారని, వారిని చైనా ఆమోదించాల్సి వస్తుందని, వారినే హాంకాంగ్ ప్రజలు ఎన్నుకోవాలని మెలిక పెట్టింది. హాంకాంగ్ ప్రస్తుత సిఇఒ లాంగ్ చున్ ఇంగ్ రాజీనామాని ఉద్యమకారులు కోరుతున్నారు. హాంకాంగ్ ఉద్యమం చైనాలోని విభిన్న ప్రాంతాలకు విస్తరించబోతోంది. హాంకాంగ్ పెట్టుబడి కేంద్రాన్ని విచ్ఛిన్నం చేస్తే, పెట్టుబడిదారీ శక్తులు వేరే దేశాలకు వలసవెళ్లే ప్రమాదముంది. ఇప్పటికే గూగుల్ చైనా నుండి హాంకాంగ్‌కు పారిపోయింది. చైనా కమ్యూనిస్టు పాలకులు హాంకాంగ్ ఉద్యమానికి ప్రజాస్వామబద్ధ ముగింపును మార్కెట్ ఎత్తుగడతో ఎలా ఇస్తారో అంతర్జాతీయ సమాజం వేచి చూస్తోంది.

*(రచయిత పౌరహక్కుల కార్యకర్త)* వీ

# గదర్ విప్లవానికి వందేళ్లు

*భారత స్వాతంత్ర్య సమరంలో వీరోచితంగా పోరాడిన గదర్ విప్లవకారుల త్యాగాలను విస్మరించిన పాలకులు ఎవరి పక్షమో తెలిసిందని అంటున్నారు* **కందిమళ్ల ప్రతాపరెడ్డి**

**భా**రత స్వాతంత్ర్య సంగ్రామంలో గదర్ విప్లవం సాటిలేనిది. గదర్ వీరులు త్యాగాలు అసమానమైనవి. ఎందరో వీరులు మాతృదేశ విముక్తి కోసం ఉరికొయ్యలపై ఒరిగిపోయారు. తుపాకి గుళ్లకు గుండెలొడ్డారు. వేలాది మంది కటకటాల వెనుక మగ్గారు. నరకయాతనలు అనుభవించారు. ఆకలి, అనారోగ్యం, అవినీతి, ఆర్థిక అసమానతలు దోపిడి, దౌర్జన్యం, నిరుద్యోగం, దారిద్ర్యం లేని స్వాతంత్ర్య భారతం నిర్మించాలని సకల జనులకు సుఖశాంతులు అనందమయ జీవితాన్నిచ్చే సమ సమాజం నిర్మించాలని, దానికోసం తమ ప్రాణాలను ఫణంగా పెట్టి పోరాడారు. పోరులో వీరగాథలు సృష్టించారు. గదర్ విప్లవానికి ఇప్పుడు వందేళ్లు. ఆ సంగతి ప్రభుత్వాలు విస్మరిస్తున్నాయి. వీరుల త్యాగాలను ప్రజలు మరిచిపోతున్నారు. ఇది మనదేశ దౌర్భాగ్యం. మన వ్యవస్థ పతనానికి నిదర్శనం.

'స్వరాజ్యం నా జన్మ హక్కు. నాకు స్వరాజ్యం కావాలి. దాన్ని నేను సాధించాలి. దాని కోసం నేనెంతటి త్యాగానికైనా సిద్ధమే. అవసరమైతే ప్రాణమిస్తానన్నాడు' బాలగంగాధర తిలక్. ఆ పిలుపు జాతిని మేల్కొలిపింది. ఆంగ్లేయుల పాలకులను తరిమికొట్టాలని ఆవేశం గల యువత బాంబులు వేసింది. కత్తులు దూసింది. ముజఫర్‌పూర్, అలీపూర్, సతారా, గ్వాలియర్, ఆగ్రా, హజీరా, ఢాకా, పూనా, కాన్పూరు, బొంబాయి కుట్రకేసులో ఎంతోమంది ఉరికంబాలకు ఎరయ్యారు.

1909 జూలై 1న ఇంగ్లండ్‌లో క్రూరుడు కర్జన్‌ను హతమార్చి నందుకు లండన్ జైల్లో ఉరి కంబానికి నడుస్తూ: 'నా దేశం కోసం జీవితాన్ని అర్పించే అవకాశం దక్కినందుకు గర్వపడుతున్నా'నని వీరుడుగా అమరుడయ్యాడు మదన్‌లాల్ డీంగ్రా.

సిపాయిల తిరుగుబాటుతో ప్రారంభమైన భారత స్వాతంత్ర్య సంగ్రామానికి తర్వాత కాలంలో విదేశాల్లోని ప్రవాస భారతీయులే గట్టి పునాదులు వేశారనడంలో అతిశయోక్తి లేదు. లండన్‌లో శ్యామ్‌జీ కృష్ణ వర్మ, వినాయక్ సావర్కర్, ఎం.పి.టి. ఆచార్య, జర్మనీలో వీరేంద్రనాథ్ చటోపాధ్యాయ (సరోజినీ నాయుడు సోదరుడు), భూపేంద్రదత్తా (వివేకానందుని సోదరుడు) శంకరన్ పిళ్లే, ప్యారిస్‌లో – మేడమ్ బకాజీకామా, సర్దార్‌సింగ్ రాణా, అమెరికాలో – హరిదయాల్, వి.ఎన్. చటర్జీ, తారకనాథ్‌దాస్, టోక్యోలో – రస్ బిహారీ బోస్, కాబూల్‌లో – రాజామహేంద్ర ప్రతాప్, మౌల్వీ బర్కతుల్లా మొదలైనవారు అక్కడ భారత స్వాతంత్రోద్యమ కేంద్రాలను నిర్మించారు. దేశభక్తిని రగిలించారు.

అప్పటికి స్వదేశంలో దుర్భర దారిద్ర్యం, నిరుద్యోగం వలన పాలకుల నిర్బంధాలను తట్టుకోలేక వేలాది మంది విదేశాలకు వలస పోయారు. మలేషియా, సింగపూర్, హాంగ్‌కాంగ్, ఆస్ట్రేలియా, కెనడా, అమెరికా, ఇంగ్లండ్ దేశాలకు వెళ్లినవారి సంఖ్య లక్షలకు చేరింది. పంజాబ్ నుండి కెనడాకు వెళ్లిన వారి సంఖ్య 1910 నాటికి 30,000లకు దాటింది.

అదే సమయానికి మొదటి ప్రపంచయుద్ధానికి సామ్రాజ్యవాద దేశాలు సన్నద్ధమవుతున్నాయి. ఇంగ్లండ్ తన రాజ్యాలను నిలబెట్టు కోవడానికి, నూతన రాజ్యాలను జయించడానికి సైనిక బలగాలను పెంచుతోంది. ఎక్కువమంది సైనికులను సమకూర్చగల దేశం భారతదేశం, అందుకే భారత ప్రజలకు వాగ్దానాలు ప్రకటిస్తూ, యువకులను సైనికులుగా చేర్చుకోవడానికి పూనుకున్నది.

ఆ నేపథ్యంలో 1913 మార్చ్ 13న కాలిఫోర్నియాలోని భారతీయ ప్రతినిధులు ఆస్టోరియాలో సోహన్‌సింగ్ అధ్యక్షతన సమావేశమయ్యారు.

మాతృదేశాన్ని విదేశీ పాలకులకు అప్పగించి పరాయి దేశంలో బానిసలుగా బతకడమెందుకు? మాతృభూమిని విముక్తి చేసుకోవాలని, అందుకు ఎంతటి త్యాగానికైనా సిద్ధం కావాలని నిశ్చయించుకున్నారు. వివిధదేశాల్లో ఉన్న ప్రవాస భారతీయులతో సంబంధాలు పెంచుకున్నారు.

1913 నవంబర్ 1న సన్‌ఫ్రాన్సిస్కోలో ప్రవాస భారతీయ ప్రతినిధుల సభ జరిగింది. అందులో కాలిఫోర్నియా – బర్కలీ యూనివర్సిటీ విద్యార్థులు 30 మంది ఉన్నారు. వారిలో జితేంద్రనాథ్ లాహిరి (బెంగాల్), కర్తార్‌సింగ్ (పంజాబ్), సి.జి. పింగళే (మహారాష్ట్ర), దర్శి చెంచయ్య, బి.ఎన్. శర్మ (ఆంధ్ర), పి.జె. వెంకటయ్య (హైదరాబాద్) ఉన్నారు. గదర్ పార్టీ స్థాపించారు. బాబాసోహన్‌సింగ్ బాక్నా అధ్యక్షుడిగా, జ్వాలాసింగ్, కేసర్‌సింగ్ ఉపాధ్యక్షులుగా, షరిరయాత్ కర్తార్‌సింగ్, హర్నాంసింగ్ కార్యదర్శులుగా, జగత్‌రాం కోశాధికారిగా – మిగతా 17 మందిని కార్యవర్గ సభ్యులుగా ఎన్నుకున్నారు.

'ఈ రోజు మన విప్లవం విదేశాల్లో ప్రారంభమవుతున్నది. కానీ, మన భాషల్లో చెప్పాలంటే మన మాతృదేశంలోని బ్రిటిష్ పాలకులపై యుద్ధం ప్రకటిస్తున్నాం.

మన పేరు గదర్. మన కార్యక్రమం గదర్. మన రణక్షేత్రం భారతదేశం. త్వరలోనే పెన్ను గన్నుగా, రక్తం ఇంకుగా మారబోతున్నది' అని ప్రకటించారు. భారత ప్రజలకు విజ్ఞప్తి చేశారు గదర్ ఆర్మీ నిర్మాణానికి పిలుపునిచ్చారు.

'కావాలి! మన భారతదేశంలో విప్లవాలు నడిపేందుకు వీర జవానులు కవాలి! బహుమానం – అమరత్వం, పెన్షన్ – స్వాతంత్యం, పని చేయు ప్రదేశం – భారతదేశం' అని గదర్ పత్రికల్లో ప్రకటనలు చేశారు. గదర్ సందేశాన్ని, మేడమ్ కామా ప్యారిస్ నుండి ప్రచురించే 'తల్వార్'లో–

'భారతదేశ బిడ్డలారా! / మీరు మోసగించబడుతున్నారు. / యుద్ధంలో భాగస్వాములు కావద్దు / మీరు యుద్ధంలో పోరాడడానికి, చావడానికి సిద్ధమవుతున్నారు. / అది భారతదేశం కాదు / బ్రిటిష్ వాళ్ల కోసం బ్రిటిష్ వాళ్లు మీ భారత మాత / చేతులకు సంకెళ్లు వేశారు. / ఆ సంకెళ్లు ఎలా తొలగించాలో ఆలోచించు / మీరు బ్రిటిష్ పాలకులకు

సహాయపడితే / భారతమాత సంకెళ్లు – మరింత బిగుసుకుంటాయి' అని హెచ్చరించింది.

గదర్ పార్టీ భారత ప్రజానీకానికి చేసిన విజ్ఞప్తిలో, 'పరాక్రమశాలురైన భారతీయుల్లారా! నిద్రలేవండి! మన కష్టాలకు, కన్నీళ్లకు కారణమైన బ్రిటిష్ పాలనను అంతం చేద్దాం. ఎంతకాలం బానిసలుగా బతుకుదాం? ఇంకెంత కాలం ఉపేక్షిద్దాం? యుద్ధానికి సమయం ఆసన్నమైంది. హిందువులు – ముస్లింలు – భారతీయులందరూ ఒకటిగా సాగుదాం! కరవాలంతో కదులుతాం. భారతదేశ విప్లవానికి సైన్యాన్ని సమకూర్చుకుందాం. సోదరులారా! కదలండి మీరు సంపాదించిన డాలర్లు మాతృదేశ విముక్తికోసం వినియోగించండి. ఓడలనెక్కండి. మాతృదేశానికి తరలండి, విప్లవ కేతనం ఎగరేద్దాం వీరులుగా, కదులుదాం' ఈ ప్రకటన రక్తంతో రాయబడింది.

ఇదే విధంగా మన స్వాతంత్ర్య లక్ష్యాన్ని మన రక్తంతో పాటు మన శత్రువులైన బ్రిటిష్ వాళ్ల రక్తంతో లిఖిద్దాం. ప్రతిజ్ఞ – ఈ పిలుపు 'యుగందర్' ఆశ్రమం నుండి మీకందిస్తున్నాం. ఇది పత్రిక కాదు – ఇది యుద్ధభేరి ఆలస్యం చేయొద్దు. సర్వస్వం వదులుకొని సాగిరా! దేశం కోసం పోరాడిన వాడే పరాక్రమ శీలి! తన శరీరాన్ని ముక్కలు ముక్కలుగా నరికినా ప్రాణం ఉన్నంత వరకు యుద్ధ రంగం నుండి నిష్క్రమించని వాడే వీరుడు, కదలిరా!

ఆ పిలుపునందుకొని దేశ భక్తులైన గదర్‌వీరులు తమ ఆస్తిపాస్తులన్నీ అమ్మి గదర్ పార్టీకి అప్పగించారు. సైనికులుగా ఆయుధాలు చేపట్టారు.

వీర జవానులనుద్దేశించి గదర్ పార్టీ 'ఓ హిందూ – ముస్లిం సిక్కు సిపాయిల్లారా! యుద్ధ భూమిలోని వీర జవానుల్లారా! ఒక్కసారి మన మాతృదేశాన్ని చూడండి! ఫిరంగీయులచే ఎలా పీల్చి పిప్పి చేయబడుతుందో! వాళ్లపై మనమిప్పుడు యుద్ధం ప్రకటించాలి. బ్రిటిష్ కీచకులను తరిమేయాలి. భారతదేశం పేరును ప్రకాశింపజేయాలి. విప్లవజ్యోతి వెలిగించాలి. ప్లేగు వ్యాధిని నిరోధించాలి. మాతృదేశాన్ని రక్షించాలి. బతికుంటే మనదేశాన్ని పాలిస్తాం! మరణిస్తే విశ్వమంతా అమరగీతికలు ఆలపిస్తుంది అన్నది.

1914 మే 23న 400 మంది గదర్ వీరులతో 'కామగటమారు' ఓడ కెనడా నుండి బయల్దేరింది. సెప్టెంబర్ 27న ఓడ కలకత్తా హుగ్లీతీరం చేరింది. అప్పటికే గూఢాచారుల ద్వారా రహస్యాలను రాబట్టుకున్న బ్రిటిష్ పాలకులు ఓడను చుట్టేశారు.

గదర్ వీరులు పోరాటం సాగించారు. 18 మంది వీరులు మరణించారు. 31 మంది పట్టుబడ్డారు. మిగతావాళ్లు తప్పించుకున్నారు. ఆ తర్వాత 1914 చివరి నాటికి – అనేక ఓడల్లో విప్లవకారులు భారతదేశానికి కదిలారు. మార్గ మధ్యలోనే కొందరు పట్టుబడ్డారు. అయినా ఏదో రకంగా 8000 మందికి పైగా భారతదేశం చేరుకున్నారు. 15000 మంది ప్రయాణానికి సిద్ధంగున్నారు. భారతదేశం చేరిన విప్లవకారులు ఉత్తర భారతంలో విప్లవాగ్ని రగిలించారు. గదర్ సందేశం వినిపించారు. కర్తార్‌సింగ్, పింగళే, కాన్షిరాం, గురుముఖ్‌సింగ్, పృథ్వీసింగ్, జగత్‌సింగ్ మొదలైన వారు దేశంలోని విప్లవ సంస్థలు, వ్యక్తులతో సంబంధాలు కలుపుకున్నారు. సిపాయిల శిబిరాలలో రహస్య సమావేశాలు నిర్వహించారు. తిరుగుబాటుకు సన్నద్ధం చేశారు. బయట గెరిల్లా దళాలను నిర్మించారు. బ్రిటిష్ సైనికులు, అధికారులు – ఎక్కువ మంది విదేశాల్లో యుద్ధరంగంలో ఉన్నందున, తిరుగుబాటుకు సరైన సమయమనుకున్నారు.

26 పంజాబీ, 7 రాజ్‌పుత్, 12 కావెలరీ, 23 కావెలరీ, 128 పైనీర్సు, వలయాగైడ్స్, 23 వకాంటెన్ బ్యాటరీ, 24 జ్యూట్ బ్యాటరీ, 15 కాన్సర్స్, 22 వకంటెన్ బ్యాటరీ, 130 బెలూన్, 21 పంజాబీ రెజిమెంట్లు సిపాయిలు తిరుగుబాటుకు సిద్ధమయ్యారు. బయట బాంబుల తయారీ కేంద్రాలు ఏర్పాటు వేశారు. స్వాతంత్ర్య భారత ప్రభుత్వం పతకం రూపొందించుకున్నారు.

1915 ఫిబ్రవరి 21 అర్ధరాత్రి తిరుగుబాటుకు ముహూర్తం నిర్ణయించారు. అన్ని కేంద్రాల నుండి ఒకేసారి తిరుగుబాటు జరగాలనీ, టెలిఫోన్, టెలిగ్రాఫ్ తీగలను తెంచేయాలని, ఆంగ్లేయ అధికారులు, సైనికులను బధించి పంజాబును విముక్తి చేసి సేవలు ఢిల్లీని ముట్టడించాలని వ్యూహరచన చేశారు.

అదే సమయంలో బర్మా, సింగపూర్, ఇతర దేశాల్లోని భారత సిపాయిలు తిరుగుబాటు చేయాలని వర్తమానం పంపారు. తిరుగుబాటు జరగబోతుందని ప్రభుత్వం పసిగట్టింది. అంతకుముందే సింగపూర్‌లో తిగుగుబాటు జరిగింది.

వలసపాలకులు అదనపు బలగాలను యుద్ధరంగం నుండి రప్పించారు. సిపాయిల కేంద్రాలను ముట్టడించారు. విప్లవకారులను పట్టుకోవడానికి గాయింపు జరిపారు. గదర్ పార్టీ అధ్యక్షుడు సోహన్‌సింగ్ బక్నా, కార్యదర్శి విద్యార్థి నాయకుడు కర్తార్‌సింగ్ సారాబాతో పాటు 67 మంది పట్టుబడ్డారు. వారిపై లాహోరు కుట్ర కేసు పెట్టారు. 'గౌరవనీయ చక్రవర్తిపై యుద్ధం ప్రకటించి, సైనికశక్తితో ప్రభుత్వాన్ని కూలదోయడానికి కుట్ర చేశారు. భారతదేశం నుండి యూరోపియన్లను పారదోలి, స్వతంత్ర స్వదేశ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడానికి ప్రయత్నించారు. భారతీయ సిపాయిల్లో చీలకదెచ్చి తిరుగుబాటుకు పురికొల్పారు. ఫలితంగా ఫరోజ్‌పూర్, హంగ్‌కాంగ్, సైనికుల్లో కొందరు తిరుగుబాటు చేశారు. అంబాలలోని 9వ రెజిమెంట్ ఆశ్వికదళం, మీరట్‌లోని 12వ రెజిమెంట్‌లోని కొందరు కుట్రలో చేరారు. హత్యలు చేశారు. అరాచకం సృష్టించారు' అని ప్రభుత్వ న్యాయవాది ప్రత్యేక ట్రిబ్యూనల్ న్యాయస్థానంలో కేసును ప్రవేశపెట్టారు.

లాహోరు సెంట్రల్ జైలు – బ్యారక్ 16 ట్రిబ్యూనల్ న్యాయస్థానంగా మారింది. ఎ.ఎ. ఇర్విన్, జె.పి. ఎల్లీస్, శివనారాయణ్ ట్రిబ్యూనల్ జడ్జీలుగా నియమితులయ్యారు. కొంతమంది ముద్దాయిల తరపున రఘునాథరాయ్, హుకుమయ్‌రాయ్ న్యాయవాదులుగా నిలిచారు. కర్తార్‌సింగ్, గణేష్‌పింగళే, తమకు న్యాయవాదుల అవసరం లేదన్నారు. ముద్దాయిల తరపున కర్తార్‌సింగ్.

'మీ ఆరోపణ తప్పు – మేము కుట్ర చేయలేదు. యుద్ధం ప్రకటించింది నిజం. మా దేశంలో మీ పాలనపై బహిరంగంగానే సవాల్ చేశాం. అందుకు గర్వపడుతున్నాం' అన్నాడు.

విచారణ తతంగం పూర్తయ్యింది. 1915 సెప్టెంబర్ 13న ట్రిబ్యూనల్ తీర్పు చెప్పింది.

24 మందికి ఉరిశిక్ష – 26 యావజ్జీవ శిక్ష, ఆరుగురికి ఇతర శిక్షలు – 9 మంది నిర్దోషులు – 17 మంది పట్టుబడనందుకు శిక్షలు ప్రకటించలేదు. శిక్షలను వినిపించగానే విప్లవకారులు 'మాతృదేశం కోసం ప్రాణమివ్వడం కంటే గర్వకారణం మరేముంటుంది' అన్నారు. ఉరికంబాలనెక్కడానికి సిద్ధమయ్యారు. సెంట్రల్ జైలులోని ఉరిశిక్ష విధించబడిన వారిని ఉద్దేశించిన గదుల్లో 24 మందిని మిగతా వారిని వేరే గదుల్లో బంధించారు. ఒకే కేసులో 24 మందికి ఉరిశిక్షలు విధించడం ప్రపంచ చరిత్రలోనే అరుదైన తీర్పు. వైస్రాయ్ లార్డ్‌హర్డింగ్

# పీడనకు గురౌతున్న పరాధీన గొత్తి కోయలు

***గొత్తికోయలు మావోయిస్టులతో సంబంధాలు పెట్టుకొని, వారికి ఆశ్రయం ఇస్తున్నారనే నెపంతో పోలీసులు వారి ఇండ్లపై దాడులు చేసి, ఇండ్లను తగులపెడుతున్నారని అంటున్నారు ఎస్. ఆర్కే***

**త**రాలుగా కాగితాలకే పరిమితమై అభివృద్ధి పథకాలు, నిరాదరణకు తోడు మావోయిస్టులపై పాలక ప్రభుత్వాలు చేస్తున్న ఆధిపత్య పోరుకు గూడు చెదిరి, ఉపాధి చూపే భూములు, గొర్రెలు, మేకలు ఒకటేమిటి సంస్కృతితో సహా సర్వం కోల్పోయి, మనుగడ ప్రశ్నార్థకమై, మనుగడ సాగించలేక, రాజ్యహింసలో మనలేక, వేధింపులకు తాళలేక, అస్తిత్వ రక్షణకు నేడు అనాథలుగా మిగిలి, ప్రాణాలను అరచేతిలో పెట్టుకుని పొరుగునే ఉన్న ఖమ్మం, వరంగల్ జిల్లాల సరిహద్దు గోదావరి లోయలో మెతుకు వేటను సాగిస్తున్నారు. వేలాది మంది గొత్తికోయలు ప్రాణాలను అరచేతిలో పెట్టుకుని అక్కడి అటవీ శివారు గ్రామాల్లో బిక్కుబిక్కు మంటూ తలదాచుకుంటున్నారు. 2005 సంవత్సరానికి ముందు జీవనభృతి కోసమే వచ్చే గొత్తికోయల సంఖ్య అటు తర్వాత ప్రారంభమైన సల్వాజుడుం, గ్రీన్‌హంట్, ఎస్‌పిఒల దాడుల నేపథ్యంలో నానాటికి పెరిగి నేడు లక్ష పై చీలుకు చేరుకున్నారు. చేరుకుంటూనే ఉన్నారు.

చత్తీస్‌గడ్, మధ్యప్రదేశ్ రాష్ట్రాల్లోని గొండుల్లో ఒక తెగకు చెందిన వారే ఈ గొత్తికోయలు. ఆయా రాష్ట్రాల్లో వారిని మోరియాలు అని పిలుస్తుండగా తెలంగాణ రాష్ట్రంలో గొత్తికోయలుగా పిలుస్తున్నారు. దేశంలో ఆదిమ పురాతన ఆదివాసుల్లో ఒక తెగ కావడం గమనార్హం. వారి భాష సైతం గొండి. నేటికి మగవాళ్లు చొక్కలు వేసుకోరు. టవల్, లుంగీలను మాత్రమే ధరిస్తారు. స్త్రీలు కొందరు జాకెట్ వేసుకుని లుంగీలు ధరిస్తారు. మరికొందరు చీరనే శరీరం చుట్టూ మొత్తం చుట్టుకుంటారు.

ఆయా రాష్ట్రాల్లోని ప్రభుత్వాలు, కేంద్రం వారి అభివృద్ధిని పట్టించుకోకపోవడం, ప్రభుత్వానికి, మావోయిస్టుల గ్రూపులకు మధ్య సాగుతున్న ఘర్షణతో వారు నిలువ నీడలేక రాష్ట్రంలోని వరంగల్, ఖమ్మం జిల్లాలోని గోదావరి సరిహద్దు ప్రాంతాల్లో నేడు వారు దుర్భర పరిస్థితులను అనుభవిస్తున్నారు. మావోయిస్టులకు ఆశ్రయమిస్తున్నారని, అన్నం పెడుతున్నారనే నెపంతో పోలీసులు విచ్చలవిడిగా వారిపై దాడులకు తెగబడి వారి మేకలను ఎత్తుకుపోవడం, గుడిసెలను తగులబెట్టడం, వారిని గాయపర్చడం చేస్తుండడంతో భయ భ్రాంతులకు గురై తప్పని సరి పరిస్థితుల్లో స్వరాష్ట్రాన్ని, సొంత భూములను, ఇళ్లను వదులుకొని ప్రస్తుతం పరాధీనులై జీవనం సాగిస్తున్నారు. వారంతా ప్రధానంగా దంతెవాడ, కుంట, బీజాపూర్, బైరంగడ్, గేదమ్, ఊసుర్, బ్లాకుల నుంచి వచ్చినవాళ్లే. సల్వాజుడుం, ఎస్‌పిఒల దాడుల్లో వందలాది ఊళ్లు దహనమైంది సైతం ఈ ఊళ్లే కావడం ఇక్కడ గమనార్హం.

వరంగల్ జిల్లాలో ప్రధానంగా గొత్తికోయలు ఏటూరునాగారం,

---

కూడా తీర్పువిని ఆశ్చర్య పోయాడు. ఉరిశిక్ష అమలును అనుమతించ నన్నాడు. 17 మంది ఉరిశిక్షలు యావజ్జీవ శిక్షలుగా మార్చి ఏడుగురికి ఉరిశిక్ష అమలుకు ఆర్డరు వేశాడు.

1. కర్తార్‌సింగ్ సారాబా 2. విష్ణుగణేష్ పింగళే 3. జగత్‌సింగ్ సూర్‌సింగ్ 4. హర్నాంసింగ్ (సియూల్‌కోల్), 5. బక్లేష్‌సింగ్ గిల్‌వాలీ 6, సూరాయణ్‌సింగ్ (గిర్‌వాలీ -1), 7. సూరాయణ్ (గిర్‌వాలీ -2),

1915 నవంబర్ 16 సూర్యోదయానికి ముందు లాహోరు సెంట్రల్ జైలు ఉరికంబం మీద వందేమాతరం అంటూ ఒరిగిపోయారు.

ఉరికంబానికి నడుస్తూ కర్తార్‌సింగ్ 'ఈ జన్మనే కాదు, ఒకవేళ మరో జన్మ ఉంటే ఎన్ని జన్మలెత్తినా ప్రతి జన్మనూ నా దేశానికే అర్పిస్తా'నన్నాడు. గదర్ విప్లవంలో అసువులు బాసినవారి సంఖ్య సమగ్రంగా లభ్యం కాకపోయినా, ప్రభుత్వం ప్రకటించిన దాని ప్రకారం 1914 ఫిబ్రవరి 23న సింగపూర్‌లో కోర్ట్‌మార్షల్ పేరుతో 47 మందిని, 1815 ఫిబ్రవరి 15న 38 మందిని బహిరంగంగా కాల్చి చంపారు. 60 మందిని ఉరితీశారు. 40 మంది పోరాటంలో చనిపోయారు.

1915 లాహోర్ రెండవ కుట్ర కేసులో -12, 1916 లాహోర్ మూడవ కేసు - ఐదుగురు, 1916 పథారీ కేసు - ఐదుగురు, 1916 బర్మా కేసు - ఎనిమిది మంది, 1916 ఫిరోజ్‌షా కేసు - పన్నెండు మంది, 1916 అమృత్‌సర్ కేసు ఏడుగురు, అంబాలా జైలులో పదిహేడు మంది ఉరితీయబడ్డారు.

1915 కామగటమారు పోరాటంలో 18 మంది చనిపోయారు. అండమాన్, లాహోరు, ఇతర జైళ్లలో పోరాడుతూ అనారోగ్యంతో 25 మంది మరణించారు. మలేషియా, బర్మా, ఇతర ప్రాంతాల్లో ఎంతో మంది ప్రాణాలర్పించారు. యావజ్జీవ కారాగార శిక్షలు విధించారు.

వేలాది మంది చిత్రహింసలకు గురయ్యారు. ఆస్తిపాస్తులు పోగొట్టు కున్నారు. జైలు జీవితం గడిపిన వారు అసంఖ్యాకంగా ఉన్నారు. గదర్ విప్లవంలో ఎక్కువ మంది పంజాబీ సిక్కులే ఉండడం గమనార్హం. దానికి కారణం - 1857 సిపాయిల పేరుతో సాగిన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో పంజాబ్‌కు చెందిన సిపాయిలు పాల్గొనలేదు. రాజభక్తి సిపాయిలుగా ప్రభుత్వానికి విధేయులుగా ఉండాలని ఆనాడు వారి భావన. అందుకే బ్రిటిష్ పాలకులకు అండగా నిలిచారు. కానీ, ఆ తర్వాత అనుభవం ద్వారా బ్రిటిష్ పాలకుల దమననీతిని, దుష్టపాలనను అర్థం చేసుకున్నారు. ప్రతీకార వాంఛ పెంచుకున్నారు. త్యాగాలకు సిద్ధమయ్యారు. గదర్ విప్లవంలో ముందున్నారు. గదర్ పోరాటం విజయం పొందకపోయినా దేశ ప్రజల్లో చైతన్యం కలిగించింది. విప్లవోద్యమానికి పునాదులు వేసింది సోషలిజం, భావజాలాన్ని దేశంలో ప్రవేశపెట్టింది.

భగత్‌సింగ్, చంద్రశేఖర ఆజాద్, రాజగురు, సుఖ్‌దేవ్ మొదలైన విప్లవకారులకు ఆదర్శమయ్యింది. స్వాతంత్రోద్యమాన్ని మలుపుతిప్పింది. ఆ మహత్తర పోరాటాన్ని వందలాది మంది గదర్ వీరుల ఆత్మబలిదానాన్ని త్యాగాలను దేశం విస్మరించడం శోచనీయం.

*(రచయిత స్వాతంత్ర్య సమరయోధులు)* వీ

తాడ్వాయి, మంగపేట మండలాల పరిధిలో సుమారు 50 గూడాల్లో ఆవాసాలను ఏర్పరచుకుని జీవనం సాగిస్తున్నారు. వారి ఆవాసాలన్నీ ఆయా గ్రామాల అటవీ శివారుల్లో నెలకొల్పుకోవడం గమనార్హం. ఏటూరునాగారం పరిధిలోని చింతలపాడు, ఎలిశెట్టిపల్లి గ్రామ శివారు గుండెం గవాయి గూడెం, తాడ్వాయి మండలం జలగలకంచ, బయ్యక్కపేట తదితర సుమారు 50 గ్రామాల పరిధిలో జీవనం కొనసాగిస్తున్నారు. స్థానికంగా అటవీ శాఖ అధికారుల దాడులకు, బెదిరింపులకు, భయాందోళనలకు గురై వారు ములుగు సర్వాయిపురం, వెంకటాపురం, గుండ్లపహాడ్ వంటి ప్రాంతాల దాక విస్తరించారు. జిల్లాలో సుమారు 5000 మంది దాకా గొత్తికోయలు నివసిస్తున్నట్లు అంచనా. ఖమ్మం జిల్లాలో ఈ సంఖ్య సుమారు 80 వేల మంది వరకు నివసిస్తున్నట్లు అంచనా.

ఆయా రాష్ట్రాల నుంచి వచ్చిన గొత్తికోయలు అటవీ శివారుల్లో సమీప వాగులు, తోగుల ఉన్న చిన్న చిన్న వెదురు తడికలతో గుడిసెలు వేసుకుని దుర్భర పరిస్థితుల్లో జీవనం సాగిస్తున్నారు. వారికి కావాల్సిన నిత్యవసర సరుకుల్ని అక్కడి సమీప ప్రాంతాల్లో సాగే వారాంతపు సంతల్లో కొనుగోలు చేసుకుంటూ జీవిస్తున్నారు. ఆవాసాలు నిర్మించుకున్న చోటే ఎంతో కొంత పోగు చేసుకుని వరి, జొన్న, రాగులు సాగుచేస్తున్నారు. కూరగాయలు పండిస్తూ, ఇప్పపువ్వు, పరక, చీపురు, గడ్డి తునికాకు, తునికి పండ్లు, చింతపండు లాంటివి అటవీ ఉత్పత్తులను సేకరిస్తూ కాలం వెళ్లదీస్తున్నారు. వీరిలో అత్యధికులు స్థానికంగా వ్యవసాయ, ఇతర కూలి పనులకు సైతం వెలుతూ పొట్టపోసుకుంటూ కనీసం ఒక రోజు భోజనం చేయలేని దుర్భర పరిస్థితుల్లో మగ్గుతున్నారు.

పదేళ్లుగా గొత్తికోయలు స్థానికంగా నివాసముంటున్నా అధికారులు, ప్రభుత్వాలు వారికి కనీస గుర్తింపునివ్వడం లేదు. ఓటరు కార్డులను, రేషన్ కార్డులను మంజూరు చేయడం లేదు. దీంతో వారు అనేక ప్రభుత్వ సంక్షేమ కార్యక్రమాలకు నోచుకోలేక పోతున్నారు. ప్రభుత్వం ప్రతిష్ఠాత్మకంగా నిర్వహిస్తున్న ఉపాధి హామీ పథకానికి సైతం వారు దూరం అవుతున్నారు. ఇటీవలే ఏటూరునాగారంలో మానస సేవా ఆధ్వర్యంలో చింతలపాడుకు చెందిన గొత్తికోయల కుటుంబాలకు సర్పంచ్ ఝాన్సీరాణి ఓటరు నమోదు పత్రాలను అందించారు.

ఏజెన్సీలో వారం పొడవునా ఎక్కడో ఒకచోట సంతలు జరుగుతూనే ఉంటాయి. అటవీ నుంచి సేకరించిన ఉత్పత్తులను వీరు విక్రయించి తమకు కావాల్సిన ఉప్పు, కారం, ఇతర నిత్యావసర సరుకులను కొనుగోలు చేస్తుంటారు. తూకం పద్ధతులు అసలే తెలియని గొత్తికోయలను స్థానిక వ్యాపారులు మోసగిస్తున్నారు. వచ్చిరాని తెలుగు భాషతో, అమాయకత్వంతో దళారీల చేతిలో గొత్తికోయలు అనేక విధాలుగా దోపిడికి గురవుతున్నారు. నాణ్యత లేని వస్తువులను అధిక ధరలకు అమ్ముతూ సొమ్ము చేసుకుంటున్నారు. కూలీ పని చేయించుకున్న కొందరు స్థానికులు వారికి అందుకు డబ్బులను చెల్లించకుండా రోజుల తరబడి తిప్పుకుంటూ ఇబ్బందులకు గురిచేస్తున్నారు.

**అటవీ శాఖ అధికారుల దాడులు**

అటవీని ధ్వంసం చేస్తున్నారనే నెపంతో అటవీ శాఖ అధికారులు గొత్తికోయల ఆవాసాలపై దాడులకు తెగబడుతున్నారు. వారి గుడిసెలను నిర్దాక్షిణ్యంగా తగలబెట్టి కట్టుబట్టలతో గెంటేస్తున్నారు. అటవీ భూములను విడిచి వెళ్లిపోవాలంటూ బెదిరింపులకు దిగుతున్నారు. ఆర్టికల్ 42, ఆర్టికల్ 21 ప్రకారం రాజ్యాంగం కల్పించిన జీవించే హక్కును కాలరాస్తున్నారు. ఏటూరునాగారం మండలం ఎలిశెట్టిపల్లి పరిధి గుండెంగవాయిలో నివసిస్తున్న 36 గొత్తికోయ కుటుంబాలపై దాడులకు పాల్పడి వారిపై చేయిచేసుకున్న సంఘటనలూ ఉన్నాయి. అంతేకాక ఇళ్లలో ఉన్న గొడ్డళ్లు, కత్తులు, వేటసామగ్రి, కోడి పుంజులను స్వాధీనం చేసుకున్నారు. సర్వాయి సమీపంలోని అటవీ ప్రాంతంలో గొత్తికోయలు నివాసం కోసం నిర్మించుకుంటున్న గుడిసెలను అడ్డుకుని దహనం చేశారు. దీంతో గొత్తికోయలు గుడిసెలను తగులపెట్టొద్దని తాము మరోచోటుకి వెళ్తామని వేడుకున్నారు. తడ్వాయి మండలం బయ్యక్కపేట సమీప అటవీ ప్రాంతానికి వలస వచ్చిన గొత్తికోయల గుడిసెలకు అధికారులు నిప్పంటించారు. మళ్లీ గుడిసెలు వేసుకుంటే జెసిబితో కులగొట్టారు. ఏటూరునాగారం, తడ్వాయి, మంగపేట పరిధిలో అటవీ అధికారుల దాడులకు బెదిరిపోయిన గొత్తికోయలు మరో ప్రాంతానికి వలస వెళుతున్నారు. అలా ఇటీవల మండలంలోని నారాయణపురం గ్రామ శివారులోని అటవీ ప్రాంతమైన బండ్లపహాడ్ ఫారెస్ట్ భూమిలో గొత్తికోయలు గుడిసెలు నిర్మించుకున్నారు. అక్కడికెళ్లినా చెల్పూర్ డిప్యూటీ రేంజ్ ఆఫీసర్ అశోక్ ఆధ్వర్యంలో సిబ్బంది వారిపై దాడులు నిర్వహించి గుడిసెలను తొలగించడంతో పాటు వాటికి నిప్పంటించారు. గొత్తికోయలను, వారి సామగ్రిని ట్రాక్టర్‌లో తీసుకొని వెళ్లి భూపాలపల్లి ప్రాంతంలో దిక్కులేని వారిగా వదిలేశారు. 'ఎక్కడి నుంచి వచ్చారో అక్కడికి వెళ్లిపోవాలి' అంటూ డిప్యూటీ రేంజ్ స్థాయి అధికారులు హుకూం జారీ చేయడం గమనార్హం.

గొత్తికోయల ఆవాసాలపై అటవీ అధికారులు చేస్తున్న దాడులను పట్టించుకునే వారు కరువయ్యారు. తమ ఆవాసాలపై అధికారులు దాడులు చేస్తున్నారని ఐటిడిఎ, అటవీ శాఖ కార్యాలయం వద్ద గొత్తికోయలు ధర్నాకు దిగిన సంఘటనలూ ఉన్నాయి. అధికారుల దాడుల నుంచి తమను రక్షించాలని అధికారులను వేడుకున్నా అది అరణ్యరోదనగానే మిగిలిపోతుంది. ప్రస్తుతం ఇన్‌చార్జి పిఒ సంజీవయ్యను సైతం కలిసి తమ ఇళ్లపై దాడులు చేస్తూ కోళ్లు, మేకలను ఎత్తుకెళ్తున్నారని, తమకు గుడిసెలు వేసుకునేందుకు అనుమతివ్వాలని, జీవించే హక్కును కల్పించాలని, భూములకు హక్కు పత్రాలివ్వాలని తమ గోడు వెళ్లబోసుకున్నారు. అడవిని నరకవద్దని సూచించిన ఆయన మిగతా విషయాలపై దృష్టిని పెట్టకపోవడం విచారకరం. మరోవైపు దుర్భర పరిసరాలు, కలుషిత నీరు తాగి అనారోగ్యాల పాలవుతూ, మూఢనమ్మకాలతో ఆకుపసర్లను ఆశ్రయిస్తూ గొత్తికోయలు మృత్యువాత పడుతున్నారు. ఇటీవల మండలంలోని చెల్పాక సమీప చింతలపాడులో గొత్తికోయ మహిళ మాడి జోగమ్మ జ్వరంతో వారం రోజులు బాధపడిన ఆమె భర్త బందు మాత్రం తమ పెద్ద మనుషులు వైద్యుల వద్దకు వద్దంటున్నారని చెట్ల పసర్లు, మంత్రాలు తంత్రాలతో తగ్గిపోతుందని వైద్యులను సంప్రదించ లేదు. గూడేన్ని సందర్శించిన ఒఎన్ఎం పరిస్థితి విషమించిందని గుర్తించి ప్రాథమిక చికిత్స అందించి ఆసుపత్రికి తరలించాలని సూచించగా ప్రభుత్వ వైద్యశాలకు తరలించారు. ఆమెను పరీక్షించిన వైద్యులు ఎంజిఎం తీసుకుపోవాలని సూచించారు. ఆర్థిక ఇబ్బందుల దృష్ట్యా ఆమె భర్త స్థానికంగా చికిత్స అందించినా ఫలితం లేకుండా పోయింది. జ్వరం మితిమీరి ఆమె మృతి చెందింది.

**అడుగడుగునా ఉల్లంఘనలే**

ఇలా అటవీ అధికారులు, ప్రభుత్వాలు గొత్తికోయలపై దాడులు చేస్తూ అడుగడుగునా చట్టాన్ని ఉల్లంఘిస్తున్నారు. 5, 6 షెడ్యూల్డ్

# మోడీ మేక్ ఇన్ ఇండియా - మేడ్ ఇన్ ఇండియా

***జర్మనీలో హిట్లర్ అధికారంలోకి రావడానికి ప్రచార సాధనాలు సహాయపడినట్లుగానే మీడియా, కార్పొరేట్ సంస్థలు మోడీని గెలిపించి తమ లాభాల కోసం అనుకూలమైన విధానాలను రూపొందించుకుంటున్నాయని అంటున్నారు షేక్ కరీముల్లా***

గతంలో 'భారత్ వెలిగిపోతుంది', 'ఇండియా ఈజ్ షైన్', 'ఫీల్‌గుడ్' అని ఊదరగొట్టిన బిజెపి 2004 ఎన్నికల్లో చతికిలపడింది. గుణపాఠాలు నేర్వక మరల ఇదే ధోరణి ఈ పార్టీ విధానాలలో పొడచూపుతున్నాయి. నరేంద్రమోడీ తలపెట్టిన ప్రతిష్ఠాత్మక 'మేక్ ఇన్ ఇండియా–మేడ్ ఇన్ ఇండియా' కార్యక్రమానికి దేశ, విదేశాల నుంచి బహుళజాతి కార్పొరేట్ సంస్థలకు చెందిన 500 మందికి పైగా టాప్ సిఇఒస్ హాజరైనారు. దేశీయ కార్పొరేట్ దిగ్గజాలైన రిలయన్స్ అధినేత ముఖేష్ అంబానీ, టాటా గ్రూప్ ఛైర్మన్ సైరస్ మిస్త్రీ, మహేంద్రా గ్రూప్ సిఎండి ఆనంద్ మహేంద్రా, ఎయిర్ బస్, వొడాఫోన్, హోండా, సామ్‌సంగ్ వంటి బడా కంపెనీల ప్రతినిధులు హాజరైనారు. ఈ సందర్భంగా 'ప్రపంచ మంతా ఆసియా వైపు చూస్తుంది. నేను ఇక సమయాన్ని వృథా చేయదలచుకోలేదు. వారికి చిరునామా ఇవ్వాలనుకుంటున్నా, వాస్కోడిగామాలు క్యూ కడతారు. ప్రపంచం మనదేశాన్ని వెతుకుతుంది. ప్రపంచంలోని ప్రతి వీధిలోనూ వాస్కోడిగామాలు పుడతారు, అన్వేషిస్తూ భారత్‌కు క్యూ కడతారు.' అంటూ ప్రధాని నరేంద్రమోడీ 'మేక్ ఇన్ ఇండియా' కార్యక్రమ ప్రారంభోత్సవంలో అన్నాడు. నిజమే వాస్కోడి గామాలు (పోర్చుగీసు), డచ్చి వారు, ఫ్రెంచి వారు, ఆంగ్లేయులు లాంటి వలస వాదులు ఈ దేశానికి ఎందుకు వచ్చారు అని ప్రశ్నిస్తే పిల్లలు కూడా ఈ దేశ వనరులను, సంపదను దోచుకోవడానికి వచ్చారు అని టక్కున సమాధానం చెపుతారు. మరి ఈ సంగతి ఈ అపర దేశభక్తునికి, సంఘ్‌పరివార్ దేశభక్తులకు తెలియదా? తెలుసు వీరిదంతా మాటల్లో దేశభక్తి జపం, చేతల్లో విదేశీ జపం అని తేలిపోతుంది.

చాలా దూకుడుగా మోడీ ప్రభుత్వం ప్రపంచీకరణ విధానాల అమలుకు ఊవ్విళ్లూరుతుంది. ముందెన్నడు లేని విధంగా స్వదేశీ, విదేశీ కార్పొరేట్ బహుళజాతి సంస్థలతో చాలా బాహాటంగా కలిసి వారికి ఎర్రతివాచి పరిచి పెట్టుబడులు పెట్టండని ప్రాధేయపడుతుంది. 'మా దేశంలో వనరులున్నాయి. శ్రామికులున్నారు. పరిశ్రమలు పెట్టండి ఇక్కడ ఉత్పత్తి చేసి ఎగుమతి చేసుకోండని పిలుపునిస్తుంది. తద్వారా ఈ దేశ వనరులు, సంపద, ఇక్కడ చవకగా లభించే శ్రామికుల శ్రమని దోచుకోమని మాట్లాడడమంటే ఎంత సిగ్గుచేటు. మనదేశం అభివృద్ధి చెందడానికి వనరులు లేవా? డబ్బు, సంపదలు లేవా? పుష్కలంగా ఉన్నాయి. ఒక విదేశీ అర్థ శాస్త్రవేత్త అన్నట్లు 'భారతదేశం పేదదేశం కాదు. కాని తీరని దారిద్ర్యం అనుభవిస్తున్న పేద ప్రజల దేశం.' అపారమైన సహజ వనరులు, సంపద, జీవ నదులకు పుట్టినిల్లు. 125 కోట్ల జనాభాతో మంచి మానవ వనరులు గల మనదేశం ఎందుకు వెనకపడింది? స్వాతంత్ర్యం సిద్ధించి 68 సంవత్సరాలైన 29 శాతం ప్రజలు ఇంకను దారిద్ర్య రేఖకు దిగువున ఎందుకు జీవిస్తున్నారు? ఇటీవల ఐక్యరాజ్య సమితి విడుదల చేసిన ప్రపంచ మానవాభివృద్ధి నివేదిక 2014లో మొత్తం 187 దేశాలలో భారత్ 135వ స్థానంలో నిలిచింది. ఇది శోచనీయం. 'అంగట్లో అన్నీ ఉన్న అల్లుడి నోట్లో శని' అన్న సామెత చందంగా ఉంది ఈ పరిస్థితి. ఈ దివాళాకోరు ఆర్థిక విధానాల మూలంగానే ఈ పరిస్థితి దాపురించింది. మరీ ముఖ్యంగా 1990 దశకం నుంచి పి.వి. నరసింహారావు హయాం నుంచి మొదలైన ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ, సరళీకరణ విధానాలు యుపిఎ, ఎన్‌డిఎలు తూచ తప్పక అమలు చేశాయి. నేడు ఎన్‌డిఎ మోడీ నాయకత్వంలో దూకుడుగా ఈ విధానాల కొనసాగింపులో భాగమే ఈ 'మేక్ ఇన్ ఇండియా–మేడ్ ఇన్ ఇండియా'.

ఒక్కసారి గతాన్ని తెరిచి చూస్తే ఈస్టిండియా కంపెనీ పాలన మొదలు నేటి వరకు భారత్ వలస దేశంగా ఉంది. విదేశీ వలసవాదులు ఈ దేశ సంపదను కొల్లగొడుతూనే ఉన్నారు. ఈ విషయాన్ని మొదటి సారిగా వాదాబాయి నౌరోజీ, 1757 తర్వాత నుండి భారతదేశ సంపద బ్రిటన్‌కు ఎలా తరలించబడినదో 'డ్రైయిన్ సిద్ధాంతం' ద్వారా అప్పుడే వివరించారు. బ్రిటిష్ ప్రభుత్వం మన ఆర్థిక వ్యవస్థను తమ దేశ సౌభాగ్యాన్ని పెంపొందించుకోవడానికి ఎలా ఉపయోగించుకుందో వివరించారు. ఇక దేశీయ బడా కార్పొరేట్ సంస్థల పెట్టుబడులు ఇక్కడి వనరులు, సంపద, శ్రమలను దోచుకుని కోట్లకు పడగలెత్తిన అనుభవం మనకుంది. దీనికి ఉదాహరణగా కృష్ణా బేసిన్‌లో బయట పడిన సహజ వనరైన గ్యాస్‌ను రిలయన్స్ సంస్థ బయటికి తీసి గుజరాత్‌కు తరలించుకుపోయి అధిక ధరకు విక్రయించి లాభాలు దండు కుంటోంది. వాస్తవానికి ఈ వనరు ఈ రాష్ట్ర, దేశ ప్రజలకు చెందాలి. ప్రభుత్వ రంగ సంస్థ అయిన ఒఎన్‌జిసి సంస్థ ద్వారా గ్యాస్ బయటకు తీసి ప్రభుత్వం ప్రజలకు ఇవ్వగలిగితే గ్యాస్ బండ 100 రూపాయలకే

---

ప్రాంతాల్లో నివసించే గిరిజనుడు ఎక్కడైనా గిరిజనుడని ఆర్టికల్ 18 చెపుతున్నా అటవీ అధికారులు పట్టించుకోవడం లేదు. అదీ కాక రిజర్వ్ ఫారెస్ట్ చట్టాన్ని అతిక్రమించి అందులో నివసించే గొత్తికోయలపై దాడులకు తెగబడుతున్నారు. అధికారులపై కేసులు నమోదు చేయాల్సిన ప్రభుత్వం పట్టనట్లుగా వ్యవహరిస్తోంది. ఆదివాసుల జీవన హక్కును కాలరాస్తోంది. ఏజెన్సీకి వచ్చిన అనేక మంది గొత్తికోయల్లోని పిల్లలు విద్యకు దూరంగా ఉంటున్నారు. పౌష్టికాహార లోపంతో బాధపడు తున్నారు. కొన్ని సందర్భాల్లో చనిపోయిన సంఘటనలూ ఉన్నాయి. ఇప్పటికైనా కేంద్రం, తెలంగాణ ప్రభుత్వం గొత్తికోయలకు గుర్తింపునివ్వాలి. దుర్భర పరిస్థితుల నుంచి వారిని అభివృద్ధి బాట పట్టించాలి. మేధావులు, సామాజిక బాధ్యత తెలిసినవారు మూలవాసులైన ఆదివాసులకు అండగా నిలవాలి. ప్రభుత్వాల నిర్లక్ష్యాన్ని, అటవీ అధికారులు సాగిస్తున్న దమనకాండని ఖండించాలి.

*(రచయిత పాత్రికేయులు)* వీ

ఇవ్వవచ్చు, తద్వారా ప్రజలకు మేలు చేయవచ్చు. ఇలా చేయని ప్రభుత్వాలు కార్పొరేట్ శక్తులకు పెద్దపీట వేయడంతో ఆ శక్తులు మరింత బలోపేతమైనాయి. సంపదంతా వీరి వద్ద కేంద్రీకృతమైనది. అత్యంత సంపన్నుడైన భారతీయుడుగా రిలయన్స్ అధినేత ముఖేష్ అంబానీ దాదాపు 1.41 లక్షల కోట్లతో టాప్‌లో నిలిచాడు. ఆ తర్వాత స్థానాలలో టాటా సంస్థల అధినేత సైరస్ మిస్త్రీ, విప్రో ఛైర్మన్ అజిం ప్రేమ్‌జీలు ఉన్నారు. ఇలా దేశ సంపద మొత్తం కొంతమంది చేతుల్లోనే ఉంటే అభివృద్ధి ఎలా జరుగుతుంది? సమాజంలో ఆర్థిక అసమానతలు లేనప్పుడే అభివృద్ధి సాధ్యమవుతుందని అర్థశాస్త్రం తెలియని సామాన్యులకు కూడా తెలిసిన విషయమే.

మరి పురోగామి విధానం ఏది అంటే ప్రైవేట్ రంగ స్వదేశీ, విదేశీ పెట్టుబడులు కాదు. లాభాపేక్షలేని పబ్లిక్‌రంగ విస్తరణ. ప్రజల సంక్షేమం ప్రభుత్వ రంగ నిర్ణయాలు సమిష్టి సామాజిక అభివృద్ధి లక్ష్యంగా సాగాలి. తద్వారా మానవులందరూ లాభం పొందాలి. ఇది అభివృద్ధి విధానానికి పునాది. అంతేకాని ఆర్థికాభివృద్ధిని వ్యక్తిగత ఆదాయాలను గరిష్ఠంగా పెంచుకోవడం కాదు. అందుకే రాజ్యాంగంలో సంక్షేమానికి పెద్దపీట వేశారు. దేశ సమగ్రత, సార్వభౌమత్వాలను కాపాడుతూ, సామాజిక, ఆర్థిక, రాజకీయ, న్యాయ ప్రాతిపదికన సామాజిక వ్యవస్థను నిర్మించాలి. సమసమాజాన్ని స్థాపించాలని రాజ్యాంగంలో రాసుకున్నాం. ఈ రాజ్యాంగం మీద ప్రమాణం చేసి పదవీ భాధ్యతలు చేపట్టే పాలకులు రాజ్యాంగ లక్ష్యాలను, ఆశయాలను పూర్తిగా తుంగలో తొక్కి సంక్షేమం బాధ్యత మాకు లేదని ప్రభుత్వాలు నేడు స్పష్టంగా అంటున్నాయి. కానీ వాళ్లకు ఆ బాధ్యత ఉంది అని ప్రజలు భావిస్తున్నారు. ప్రజా ఉద్యమాలు భావిస్తున్నాయి. ఇవేమి పట్టని నిన్నటి ప్రభుత్వాలు, నేటి మోడీ ప్రభుత్వం 'మేక్ ఇన్ ఇండియా–మేడ్ ఇన్ ఇండియా' అంటూ దేశ, విదేశ పెట్టుబడులను బాహాటంగా ఆహ్వానిస్తుంది.

మోడీకి ఈ ప్రైవేట్, కార్పొరేట్, బహుళజాతి సంస్థల మీద అంత ప్రేమ ఎందుకు అనేది ప్రశ్న. ముందెన్నడూ లేని విధంగా ఈసారి జరిగిన 16వ సార్వత్రిక ఎన్నికలలో ఒక కొత్త పరిణామం చోటు చేసుకుంది. పార్టీల విధానాలు ప్రధానంగా ప్రచారం చేయకుండా వ్యక్తిగా మోడీని ఆకాశానికి ఎత్తి ప్రచారం చేశారు. ఇది భారత పార్లమెంటరీ రాజకీయాలలో ప్రమాదకర ధోరణి. జర్మనీలో హిట్లర్ అధికారానికి వచ్చిన తరుణంలో కూడా ఇలాగే అతనిని (హిట్లర్) ఆకాశానికి ఎత్తి ప్రచారం సాగింది. దీనికి కారణం గత కాంగ్రెస్ సంకీర్ణ ప్రభుత్వం. కార్పొరేట్ శక్తులు కోరుకున్న విధంగా వేగంగా ప్రపంచీకరణ విధానాలను మరింత ధైర్యంగా అమలు చేయలేకపోయింది. కార్పొరేట్ శక్తులన్నీ బహుళజాతి కంపెనీలను సంతృప్తి పరచలేకపోయింది.

ఈలోగా యుపిఎ కూటమి వరుసగా రెండుసార్లు అధికారంలోకి వచ్చి, అవినీతిమయమై, అనేక కుంభకోణాలలో చిక్కుకుని తిరిగి అధికారానికి వచ్చే అవకాశాలు కోల్పోయింది. ఈ పరిణామాన్ని కార్పొరేట్ శక్తులు గమనించి రెండవ ప్రత్యామ్నాయమైన ఎన్‌డిఎ కూటమి వైపు మొగ్గు చూపాయి. అప్పటికి ప్రపంచీకరణ విధానాలను గట్టిగా వంటపట్టించుకున్న వ్యక్తి మోడీ. గుజరాత్‌లో గత 12 సంవత్సరాలుగా ఈ విధానాన్ని అమలు చేస్తూ వస్తున్నాడు. 'వైబ్రెంట్ గుజరాత్' పేరిట కార్పొరేట్ శక్తులకు, బహుళజాతి కంపెనీలకు ఎర్ర తివాచి పరిచి ఆహ్వానాలు పలికాడు. పేద ప్రజలకు దక్కాల్సిన లక్షల, కోట్ల విలువ చేసే వేల ఎకరాల భూముల్ని కారు చౌకగా ఆదానీ, టాటా, బిర్లా, అంబానీ వగైరా కార్పొరేట్ కంపెనీలకు అప్పనంగా పందేరం చేశాడు.

మోడీ అభివృద్ధి నమూనాను చూసి బిజెపి మేనిఫెస్టోలో ఉన్న వాగ్దానాలు చూసి ప్రజలు బిజెపి కూటమికి ఓట్లు వేశారంటే పొరపాటే. మోడీ ప్రభుత్వంలో పోల్చి చూసినప్పుడు 'అభివృద్ధి' విషయానికొస్తే నితీష్ కుమార్ నాయకత్వంలోని బీహార్ ప్రభుత్వం, డిఎంకె నాయకత్వంలోని తమిళనాడు ప్రభుత్వాలు ఎంతో ముందంజలో ఉన్నాయి. చివరికి మధ్యప్రదేశ్‌లోని బిజెపి ప్రభుత్వం కూడా గుజరాత్ కంటే ముందున్నది. బిజెపి తన మేనిఫెస్టోను ఎన్నికలు ప్రారంభమైన రోజే విడుదల చేసింది. ఇది గమనించవలసిన అంశం.

కార్పొరేట్ శక్తులు బిజెపికి ముఖ్యంగా నరేంద్రమోడీకి అన్ని రకాలుగా తోడ్పడ్డాయి. బిజెపికి ఎన్నికల్లో ప్రచారం, ఖర్చుల నిమిత్తం సుమారు 10 వేల కోట్లు ఖర్చు చేసినట్లు ప్రచారం జరిగింది. ఈ విధంగా కార్పొరేట్ శక్తులు బిజెపిని బలపరచడం మొదలు కాగానే మీడియా అత్యధికంగా బిజెపికి, మోడీకి అనుకూలంగా భజన చేయడం మొదలు పెట్టాయి. మోడీ దగ్గిన, తుమ్మిన అదొక బ్రహ్మాండమైన వార్తగా మీడియా ప్రచారం గావించింది. ఫలితంగా ఎన్నికల్లో ఏనాడులేని భారీ విజయం సాధించింది. దీనికి కారణం ప్రజలు కాంగ్రెస్ విధానాన్ని తిరస్కరించి బిజెపి విధానాల్ని నెత్తికెత్తుకోవడం ఎంత మాత్రం కాదు. అది యుపిఎ ప్రభుత్వ అసమర్థ పాలనకు, అవినీతికి, కుంభకోణాలకు, అసంతృప్తి చెందిన ప్రజలు వేసిన నెగెటివ్ ఓటు మాత్రమే. బిజెపి, మోడీలు సాధించిన విజయం. 'కార్పొరేట్ శక్తులు సాధించుకున్న విజయం మాత్రమే'.

దీనికి కృతజ్ఞతగానే మోడీ వచ్చీ రాగానే 'జీ హుజూర్' అంటూ వారికి సేవా చేసే పనిలో పడ్డారు. దీనికి అడ్డుగా ఉన్న ప్రణాళికా సంఘాన్ని రద్దు చేస్తున్నాడు. పనిలో పనిగా ఇదే వేదికపై ఉన్న మంత్రి నిర్మల సీతారామన్ ఎఫ్‌డిఐలు స్వేచ్ఛగా ప్రవేశించడానికి అడ్డుగా ఉన్నా కార్మిక చట్టాలను సవరిస్తామని, కార్మికుల పని గంటలు, నియంత్రనలు, లైసెన్సులు, సరళీకరణ చేయడం తమ లక్ష్యమని చావు కబురు చల్లగా చెప్పినది. కార్మికులు పోరాడి సాధించుకున్న హక్కులను ఒక్క కలం పోటుతో రద్దు కానున్నాయి.

ఇక వచ్చే ఎఫ్‌డిఐలు అత్యాధునిక సాంకేతిక పరిజ్ఞానంతో వస్తాయి. దీంతో ఇప్పుడున్న ఉపాధి అవకాశాలు తగ్గిపోతాయి. ఉద్యోగులు రోడ్డునపడతారు. ప్రజల కొనుగోలు శక్తి తగ్గుతుంది. ఈ ఉపాధి రహిత విధానాలు ఆర్థిక సంక్షోభానికి దారితీస్తాయని ప్రపంచ చరిత్ర ఆర్థిక సంక్షోభాలు చెపుతున్న నిజాన్ని కాదనగలమా? ఈ స్థితి భారత్‌కు కూడా రావచ్చు. సామ్రాజ్యవాదులకు లాభాలే ప్రధానం. అందుకు సహజ వనరులు, మానవశక్తి, విశాల మార్కెట్‌ను కొల్లగొట్టడం దాని ధ్యేయం. ప్రపంచీకరణ విధానాలు సంక్షోభాన్ని పెంచుతున్నాయి. ఒక దేశం తర్వాత మరోదేశం సంక్షోభంలో కూరుకుపోతున్నాయి. 1995లో మెక్సికో, 1997లో తూర్పు ఆసియా దేశాలు, 1998లో బ్రెజిల్, తూర్పు యూరప్ దేశాలు, 2002లో అర్జెంటీనా తీవ్రమైన ఆర్థిక సంక్షోభాన్ని ఎదుర్కొన్నాయి. చివరికి 2008లో అమెరికా కూడా పెద్ద ఆర్థిక సంక్షోభానికి లోనయింది. ఈ చరిత్రను ఎవరు మరుగు పరచగలరు? చివరికి మోడీ 'మేక్ ఇన్ ఇండియా–మేడ్ ఇన్ ఇండియా' పాలసీ భారతదేశాన్ని కూడా ఈ విషవలయంలో చిక్కుకునేటట్లు చేస్తుందనడంలో సందేహం అక్కర్లేదు. కాబట్టి మోడీ ఈ ప్రపంచీకరణ ఆర్థిక విధానాలను వ్యతిరేకిస్తూ ప్రజలు ఉద్యమించక తప్పదు. ఉద్యమాల ద్వారా ప్రజలకవసరమైన ప్రజాతంత్ర జీవితానికి గ్యారంటీ ఇచ్చే మానవీయ సామాజిక వ్యవస్థను నిర్మించుకోక తప్పదు. ఈ పరిస్థితి ఆసన్నమయ్యే రోజు ఎంతో దూరంలో లేదు.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# స్టీల్ సిటీ వెలుగుల కింద చీకటి బతుకులు

***అభివృద్ధి పేరుతో పిడికెడు మంది జేబుల్ని నింపే లాభాల కోసం మూలవాసులైన ఆదివాసుల బతుకుల్ని ప్రభుత్వాలు ఛిద్రం చేస్తున్నాయని రౌర్కెలా ఉదాహరణతో చూపుతున్నారు* నటాషా**

**ఒ**డిశా రాష్ట్రంలో స్టీల్‌సిటీగా పిలువబడే రావుర్కెల (రూర్కెల) పట్టణం సుందర్‌గడ్ జిల్లాలో ఉంది. సుందర్‌గడ్ జిల్లాకు పారిశ్రామిక జిల్లాగా కూడా పేరుంది. సున్నపు రాళ్లు, ఇనుము, విద్యుత్, బొగ్గు, స్టీల్, అల్యూమినియం మొదలగు చిన్నా, పెద్ద పరిశ్రమలు వందకు పైగా ఉన్నాయి. 1947లో అధికార మార్పిడి జరిగాక నెహ్రూ ప్రధానిగా ఏర్పడిన తొలి భారత ప్రభుత్వం తన మొదటి పంచవర్ష ప్రణాళికలో భాగంగా భారీ నీటి పారుదల ప్రాజెక్టులతో పాటు పబ్లిక్ సెక్టార్లో భారీ పరిశ్రమల నిర్మాణానికి కూడా పూనుకుంది. అందులో ఒకటే రావుర్కెల స్టీల్ ప్లాంట్ (ఆర్ఎస్‌పి). ఇప్పటి వరకు లాభాల బాటలో సాగుతూ ఇటీవల మరో ఆధునిక యూనిట్ నిర్మాణమై ఇదే జూలై మాసంలో ప్రధానమంత్రి నరేంద్రమోడీ చేతుల మీదుగా ప్రారంభోత్సవం జరుపుకోబోతున్నట్లుగా ఆర్ఎస్‌పి సిఇఒ సి.ఎస్. వర్మ ప్రకటించాడు. ఈ సందర్భంగా స్టీల్ సిటీ వెదజల్లుతున్న వెలుగుల్ని గాకుండా దాని కింద నలిగిపోయిన చీకటి బతుకుల్లోకి తొంగి చూడడం అవసరం. పిడికెడు మంది జేబుల్ని నింపే లాభాల్ని కాదు చూడాల్సింది. లాభాల ఉక్కుపాదాల కింద ఛిద్రమైన మూలవాసుల బతుకుల్ని పరిశీలించడం న్యాయసమ్మతంగా ఉంటుంది. సరైన నష్టపరిహారం చెల్లిస్తే సరిపోతుంది కదా మొత్తంగానే వాటికి అడ్డుపడితే అభివృద్ధి ఎలా సాధ్యం?అని తెలిసీ ఉద్దేశపూర్వకంగా తమ అభివృద్ధినే (దళారీ పెట్టుబడిదారులు, బడా భూస్వాములు, బహు రాష్ట్రీయ కంపెనీలు) దేశ అభివృద్ధిగా ప్రజల్ని మభ్యపెట్టే పాలకవర్గాలు, వాటి ప్రచార హోరులో కొట్టుకపోయి పాలకుల మెదడుతో మెదడు కలిపి, గొంతులో గొంతు కలిపి అవును నిజమే కదా అని ఆలోచించే మధ్యతరగతి ఆలోచనల్ని చర్చించుకోవడం అవసరమే. సరైన నష్టపరిహారం అంటే ఏమిటో కూడా సరిగ్గా నిర్వచించుకోవాలి. సమస్యను మన మధ్యతరగతి బుర్రల్లోంచే కాకుండా మూలవాసుల కోణం లోంచి కూడా చూడడం మరింత అవసరం.

1953 లో కేంద్ర ప్రభుత్వ నిర్ణయం ప్రకారం జర్మనీ కొలాబరేషన్ తో రావుర్కెల స్టీల్ ప్లాంట్ నిర్మాణమైంది. దీని కింద 33 గ్రామాలకు చెందిన 14,824 ఎకరాల సాగు భూమి పోయింది. 2,465 కుటుంబాలు నిర్వాసితులయ్యాయి. ఇదేగాక 4, 898 ఎకరాల ప్రభుత్వ భూమి కూడా దీని కింద పోయింది. ఆర్ఎస్‌పి కింద ఇండ్లు, భూములు కోల్పోయిన ప్రజలనుద్దేశించి అప్పటి ప్రధాని నెహ్రూ హీరాకుడ్ నిర్వాసితులకు ఇచ్చిన ఉపదేశమే ఇచ్చాడు. దేశ ప్రగతి కోసం మీరు ఇండ్లు, భూములు వదులుకోక తప్పదనీ ఇలాంటి త్యాగాలు లేకుండా దేశ అభివృద్ధిని ఊహించలేమని 'గొప్ప ఉపన్యాసం' ఇచ్చాడు. దాంతో పాటు ఇండ్లు, భూములు కోల్పోయిన ప్రజలకోసం కొన్ని ముఖ్యమైన వాగ్దానాలు కూడా చేశాడు. ఆర్ఎస్‌పి కింద భూములు కోల్పోయిన వాళ్లకు భూమికి బదులు మరో చోట సమాన స్థాయి భూమి, ఇంటికి బదులు ఇల్లు, ఇంటికొకరికి ఆర్ఎస్‌పిలో ఉద్యోగం, ప్రాథమిక సౌకర్యాలన్నింటితో కూడిన పునరావాస కాలనీలు, పిల్లలందరికీ పదవ తరగతి వరకు ఉచిత విద్య, నిర్వాసితులందరికీ ఉచిత వైద్య సౌకర్యం అందిస్తామనీ ప్రజల్ని తేనె బూసిన కత్తిలా నమ్మించారు. ప్రభుత్వం తరపున వకాల్తా పుచ్చుకుని గంగాపూర్, బణేయి రాజ కుటుంబీకులు, కుంవర్ ముండా జమీందార్ నాయకత్వంలో భూములు స్వాధీనం చేసుకుని ఆర్ఎస్‌పి నిర్మాణం పూర్తి చేశారు.

గత 60 ఏండ్లలో ఆర్ఎస్‌పి బంగారు బాతు గుడ్డులా కలిగినోల్ల జేబులు నింపుతుండగా దాని కింద నిర్వాసితులైన ప్రజల పరిస్థితి మాత్రం దీపపు చిమ్మె కింది అందకారంలా కడు దయనీయంగా ఉంది. చేసిన వాగ్దానాలన్నీ తుంగలో తొక్కి నిర్వాసితుల్ని వంద కిలోమీటర్ల దూరంలోని రాళ్లూ రప్పలూ గల సాగుకు యోగ్యంగాని భూముల్లో వదిలేశారు. ఇప్పటి వరకు రెండుతరాలు శ్రమించినా ఆ భూములు సాగుకు యోగ్యంగా తయారు కాలేదు. ఆర్ఎస్‌పి లో రోజు కూలైనా చేసుకుని పొట్టగడుపుదామనుకుంటే వంద కిలో మీటర్ల దూరం నుంచి పోయి రావడం సాధ్యం కాదు. పునరావాస కాలనీల్లో కూడా కొంతమందికే ఇండ్లు దొరికాయి. అవి కూడా అగ్గిపెట్టె లాంటి ఇరుకైన నాసిరకం ఇండ్లు. ఆర్ఎస్‌పిలో ఉద్యోగాలు కూడా కొద్దిమందికే దొరికాయి. అవి కూడా కిందిస్థాయి ఉద్యోగాలు. నామమాత్రపు నష్టపరిహారమైనా నిర్వాసితులైన వాళ్లందరికి దొరక లేదు.

'సన్నాసి-గోసి' కథలో లాగా ఎలుకల బాధకు పిల్లిని పెంచుకుంటే పిల్లిని సాదడానికి బర్రెను పెంచాల్సి వచ్చింది. బర్రెను సాదడానికి భార్యను తెచ్చుకోవాల్సి వచ్చి చివరికి సన్నాసి సంసారిగా మారి పోయినట్లుగా ఆర్ఎస్‌పి లాంటి భారీ పరిశ్రమ నిర్మాణం చేశాక దానికి నీటిని, కరెంట్‌ను సప్లై చేయడానికి మందిరా ప్రాజెక్టు నిర్మించాల్సి వచ్చింది. 1956-57 లో మందిరా డ్యాం నిర్మాణం జరిగింది. దీని కింద మరో 31 గ్రామాలు, 941 కుటుంబాలు నిర్వాసితులయ్యారు. 11,923 ఎకరాల భూమి ముంపుకు గురైంది. వీరి కన్నీటిగాథ కూడా అలాంటిదే. హీరాకుడ్ , బాక్రానంగల్ నుండి మొదలుకొని నిన్న మొన్నటి లోయర్ సుక్తేల్ వరకు విస్తాపితులందరిదీ ఒకే రకమైన పరిస్థితి. ఎక్కడా ప్రభుత్వం ప్రకటించిన మేరకైనా నామ మాత్రపు నష్టపరిహారం కూడా అందరికీ ఇచ్చింది లేదు. అంతటా మోసం దగాయే. ఓడ దాటేదాక

ఓడ మల్లన్న ఓడ దాటాక బోడ మల్లన్న అన్న చందంగానే ఉన్నది. ఇన్ని అనుభవాలు, కన్నీటి గాథలు కళ్ల ముందుండగా తాజాగా పోలవరం ప్రాజెక్టు నిర్మాణం చేస్తూ సుమారు 3 లక్షల మంది ప్రజల్ని నిర్వాసితుల్ని చేయనున్నారు. తగిన నష్టపరిహారం చెల్లించాకే ప్రాజెక్టు నిర్మిస్తామని కేంద్ర , రాష్ట్ర ప్రభుత్వాలు చేసే బూటకపు ప్రచారానికి తలొగ్గుతూ' మేక కసాయి వాడిని నమ్మినట్టుగా' నమ్ముతున్న మధ్యతరగతి ఆలోచనా పరులు తమ' మేక బుద్ధి'ని వదులుకుని గత కాలపు చేదు అనుభవాలన్నింటిని నెమరు వేసుకుని తమ కర్తవ్యాన్ని సరిగ్గా నిర్దేశించుకోవాల్సిన అవసరం ఉంది.

చరిత్ర పొడవునా కడుపు కాలిన వాడెప్పుడూ తనకు తోచిన పద్ధతుల్లో పోరాడుతూనే వచ్చాడు, పోరాడుతూనే ఉన్నాడు. కాస్తో కూస్తో కడుపు నిండా తిండి తినే మధ్యతరగతి ఏ పక్షం వహిస్తుందనే విషయం కూడా ప్రతీ సందర్భంలోనూ కీలకమైనదే. నేడు ముప్పైకోట్లకు పైగా మధ్య తరగతి జనాభా కలిగిన మనలాంటి దేశంలో ఈ విషయం మరింత ప్రాధాన్యత సంతరించుకుంటుంది. ప్రస్తుతం దేశంలో కొనసాగుతున్న సామ్రాజ్యవాద అనుకూల ఎల్.పి.జి. ఆర్థిక విధానాల మూలంగా విస్థాపితుల సమస్య ముఖ్యమైన సమస్యలలో ఒకటిగా మారి అనేక చోట్ల నిర్వాసితులు పోరాడుతున్న సందర్భంలో కేవలం ఈ సమస్యను నష్టపరిహారాల చెల్లింపుల సమస్యగానే కుదించి చూడకుండా అభివృద్ధి నమూనాకు సంబంధించిన మౌలిక సమస్యలలో ఒకటిగా కూడా దీన్ని చర్చించాల్సిన అవసరం ఉంది.

భారీ సంఖ్యలో ప్రజల్ని నిర్వాసితుల్ని చేసి సాగు భూముల్ని , ప్రజల నివాసాల్ని. పచ్చని అడవుల్ని ముంపుకు గురి చేసి, పర్యావరణానికి పెద్దఎత్తున నష్టాన్ని కలుగ జేసి భవిష్యత్‌లో భూకంపాలకు దారితీసే కాలం చెల్లిన ఈ అభివృద్ధి నమూనా పట్ల ప్రతీ ఒక్కరు తమ వైఖరి ప్రకటించాల్సిన అవసరం ఉంది. ఇప్పటికే చాలా చోట్ల ఆదివాసి ప్రజానీకం స్పష్టంగా ఈ అభివృద్ధి నమూనాను తిరస్కరించి ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా దృష్టికోణంతో పోరాడుతున్నారు. మధ్యతరగతి ప్రజానీకం తాము ఇందులో ఏ పక్షం వహించాలో నిర్ణయించుకోవాల్సిన అవసరం ఉంది. నిష్క్రియగా ఉండడం లేదా ప్రేక్షక పాత్ర వహించడం కూడా ఆధిపత్య అభివృద్ధి నిరోధక నమూనాకు దోహదం చేయడమే అవుతుంది.

ఇక ఈ వ్యాసంలో సరైన నష్టపరిహారం అంటే ఏమిటి? అనే దానికి పరిమితమయి చర్చిద్దాం.

ఒక గ్రామం ముంపుకు గురికావడమంటే కేవలం కొంత మంది ప్రజలు ఇండ్లు భూములు కోల్పోయి మరో చోట నివాసం ఏర్పర్చుకోవడం అనేంత సింపుల్ సమస్య కాదు. పూర్తిగా ఒక జీవన విధానాన్నే శాశ్వతంగా కోల్పోవడానికి సంబంధించిన సమస్య. గ్రామం అన్నప్పుడు కేవలం పట్టా భూములు గల రైతులతోనే కూడి ఉండదు. భూమి మొత్తంగానే లేకుండా భూములు గల రైతుల పొలాల్లో వ్యవసాయ కూలీ పనులు చేసి పొట్టపోసుకునే కుటుంబాలు కూడా చెప్పుకోదగిన సంఖ్యలోనే ఉంటాయి. అటవీ ప్రాంతాల్లోనయితే తరతరాలుగా పోడు వ్యవసాయం మీద ఆధారపడి బతికే ఆదివాసులకు భూములకు పట్టాలు ఉండవు. తాత ముత్తాతల నుండి ఆ భూముల్లో శ్రమ చేయడమే వాళ్ల భూమి అనడానికి కొలమానం. వాళ్లకు సర్కారు ఇచ్చే పట్టాలతో ఏమి మతలబు ఉండదు. అలాగే గ్రామంలో భూములు లేకుండా చేతి వృత్తుల మీదనే ఆధారపడి వాళ్లు తయారు చేసిన సరుకుల్ని వ్యవసాయదారులకు ఇచ్చి ప్రతిగా రైతులిచ్చే ధాన్యంతో బతికే వాళ్లు, సాంస్కృతిక కులాలకు చెంది కాలక్షేపానికి కథలు చెపుతూ రైతులిచ్చే ధాన్యంపై ఆధారపడి బతికే కుటుంబాలు ఇలా సబ్బండ జాతులు పరస్పర ఆధారంతో బతికే జీవన విధానం. ఇందులో కేవలం ప్రభుత్వం ఇచ్చిన పట్టా భూములు ఉన్న వాళ్లకే నామమాత్రపు నష్ట పరిహారమైనా కొంతమేర దొరుకుతున్నది. మిగతా కుటుంబాల జీవితాలన్నీ నిలువునా నీళ్లల్లో ముంచినట్లే. నిర్వాసితుడైన ఓ రైతుతో మాట్లాడాక నాకు మా ఇల్లు పకం వచ్చింది. మా ఇంటి ముందట మా ముత్తాత పెట్టినవి రెండు వేప చెట్లు, రెండు చింత చెట్లు, ఒక రేగు చెట్టు ఉండేవి. అనేక తరాల వరకు పేస్టులు బ్రష్‌లు కొనాల్సిన అవసరమే లేకుండా సహజ సిద్ధమైన పండ్లపుల్లలు దొరికేవి. మా చుట్టుపక్కల ఇండ్లవాళ్లు కూడా పండ్లపుల్లలు ఇరుసుకునే వాళ్లు. చింత చెట్లయితే సంవత్సరానికి సరిపడేంత చింత పులుసుకు , పచ్చడికి, మాకే కాకుండా మా చుట్టాలందరికి మా అమ్మమ్మ ఉచితంగా పంచిపెట్టేది. చింత చెట్ల నీడ వాడ కట్టు పిల్లలకూ పెద్దలకూ, కథలు చెప్పడానికి, పంచాదులు చెప్పడానికి అన్నింటికి అనుకూలంగా ఉండేది. మా ఇంటి పేరుతో పిలిచే ఆ చింత చెట్లు మా ఉనికిని తెలియజేస్తూ మా చిరునామాగా పని చేసేవి. ఇలా ప్రతీ కుటుంబానికి ఎన్నో ఉంటాయి కదా ఉన్న పళంగా ఇవన్నీ నీళ్లల్లో ముంచేసి కృత్రిమమైన కాలనీల్లో అగ్గి పెట్టెల్లాంటి ఇండ్లలోకి మార్చి తెల్లారి లేసి పండ్లు తోముకోవడంతో మొదలుపెట్టి చింత పండు వరకు ప్రతిదీ కొనుక్కుతినే బతుకులుగా మార్చేసి ఎకరానికి పదివేల చొప్పున ముష్టి డబ్బులు మొకాన కొడితే అది నష్ట పరిహారం అవుతుందా?అసలు ఒక జీవన విధానానికి ఖరీదు కట్టగలమా? అనిపించింది. ఇప్పటిదాకా ఆచరణలో అమలులో ఉన్న ఏ ఒక్క పద్ధతి కూడా సరైన నష్టపరిహారం అనో, న్యాయమైన నష్ట పరిహారం అనో అనడానికి సరి తూగవు. కాబట్టి ఈ నష్టాన్ని వెలకట్టలేం. వెలకట్టలేని నష్టానికి దారి తీసే భారీ ప్రాజెక్టుల నిర్మాణానికి వ్యతిరేకంగా గొంతు విప్పాల్సిన అవసరం ఉంది. నిర్వాసితులు జరుపుతున్న పోరాటాలకు మధ్యతరగతి ప్రజానీకం గట్టి సంఘీభావాన్ని ప్రకటించడమే గాక క్రియాశీలంగా పోరాటంలో పాల్గొనాల్సిన అవసరం ఉంది. దేశంలో నయా హిట్లర్ రాష్ట్రంలో నయా నిజాంల పాలన కొనసాగుతున్న నేపథ్యంలో ప్రేక్షక పాత్ర ఏమాత్రం బావ్యమైంది కాదు.

వాళ్లు మావోయిస్టుల్ని అరెస్టు చేయడానికి వచ్చారు. నేనేమీ మాట్లాడలేదు నేను మావోయిస్టును కాదు గనుక. వాళ్లు మావోయిస్టు సానుభూతిపరుల్ని అరెస్టు చేయడానికి వచ్చారు. నేనేమీ మాట్లాడలేదు నేను మావోయిస్టు సానుభూతిపరున్ని కాదు గనుక. వాళ్లు అసమ్మతి ప్రకటించినందుకు అసమ్మతి వాదుల్ని అరెస్టు చేయడానికి వచ్చారు. అప్పుడూ నేనేమీ మాట్లాడ లేదు నేను పాలకులపై ఎలాంటి అసమ్మతి ప్రకటించ లేదు గనుక, చివరికి వాళ్లు నన్ను అరెస్టు చేయడానికి వచ్చారు. నేను లబోదిబోఅన్నాను ఇది అన్యాయం నన్ను రక్షించండి మహా ప్రభో అని గావు కేకలు పెట్టాను కానీ అప్పటికే నా అరుపులు వినడానికి ఎవరూ మిగిలి లేరు. ఇలాంటి పరిస్థితి రానివ్వద్దు. తస్మాత్ జాగ్రత్త.

*(రచయిత ఫ్రీలాన్స్ జర్నలిస్టు)* వీ

# పరిపక్వమైన సంక్షోభం - 2

*రష్యాలో 1917 ఫిబ్రవరి విప్లవం తర్వాత అక్టోబర్ విప్లవానికి సమయం ఎలా పరిపక్వమైందో వివరిస్తూ లెనిన్ రాసిన వ్యాసాన్ని పరిచయం చేస్తున్నారు* **ఎన్.వి.ఎస్. నాగభూషణ్**

*(గత సంచిక తరువాయి)*

**మూడవ భాగం**

ఒక రైతాంగ దేశంలో, ప్రజాతంత్ర రిపబ్లిక్ ఏర్పడి ఏడు నెలలు అయినాకా, పరిస్థితి ఒక రైతాంగ తిరుగుబాటు దాకా వచ్చిందంటే, ఆ విప్లవం (ఫిబ్రవరిలో జరిగిన బూర్జువా విప్లవం) తీవ్ర సంక్షోభంలో చిక్కుకుని కూలిపోయే స్థితిలో ఉందనీ, ప్రతీఘాత శక్తులు అంతిమ హద్దుని చేరుకున్నాయనీ నిర్ద్వంద్వంగా నిరూపితమవుతుందని లెనిన్ చెప్పాడు. అయితే రైతాంగ తిరుగుబాటు వంటి వాస్తవం దృష్ట్యా, దేశ వ్యాపిత సంక్షోభానికి విరుద్ధంగా కొన్ని రాజకీయ పరిణామాలున్నా కూడా, వాటికే విలువ ఉండదు. కానీ అందుకు భిన్నంగా, అన్ని పరిణామాలూ ఆ సంక్షోభ పరిణతినే సూచిస్తున్నాయని ఆయన విశ్లేషిస్తాడు.

అందుకు కొన్ని ఉదాహరణలు కూడా ఇస్తాడాయన. రష్యాలో దేశ వ్యాప్తంగా రైతాంగ తిరుగుబాటును అణచివేస్తున్న ప్రభుత్వం, ఫిన్‌లాండ్‌లో ఫిన్నిష్ బూర్జువా వర్గాన్ని బలపరిచేందుకు గాను అక్కడి నుంచి విప్లవ సైనికుల్ని ఉపసంహరిస్తోంది. ఇక యుద్ధకాలంలో రాజ్య వ్యవహారాలన్నింటిలోనూ అసాధారణమైన ప్రాముఖ్యం ఉండే సైన్యం సంగతే తీసుకుంటే, ఫిన్‌లాండ్‌లోని సైన్యమూ, బాల్టిక్ నౌకా దళమూ ప్రభుత్వంతో పూర్తి తెగతెంపులు చేసుకున్నాయి. సైనికులు ఆందోళన స్థితిలో ఉన్నారని, భద్రత సాగించే విషయంలో (అంటే రైతాంగ తిరుగుబాటు అణచివేతలో సైనికుల భాగస్వామ్యం) హామీ ఇవ్వడం దుస్సాధ్యమని పేర్కొనే ప్రభుత్వ నివేదికలున్నాయి. చివరగా మాస్కో సైనిక సోవియట్ ఎన్నికల్లో మొత్తం 17000 మందికి గాను 14000 మంది బోల్షివిక్కులకు ఓటేసిన సంఘటన నుంచి 82000కి పెరిగాయి. ఈ మాస్కో ఓటింగ్‌కు గొప్ప ప్రాముఖ్యత ఉంది. జాతీయ మానసిక ధోరణిలో వచ్చిన మార్పుకి ఇది ప్రస్ఫుట సూచన. పెట్రోగ్రాడ్ (ఇక్కడ మందే బోల్షివిక్కులు అత్యధిక మెజారిటీ సాధించారు) కంటే, మాస్కో మరింత పెటీబూర్జువా నగరమని జనాభిప్రాయం. ఎందుకంటే మాస్కో శ్రామికవర్గానికి గ్రామీణ ప్రాంతంతో ఎక్కువ సంబంధాలుండి, రైతాంగం పట్ల ఎక్కువ సానుభూతి ఉంటుందనడం, రైతుల మానసిక అనుభూతులకి అది మరింత సన్నిహితమైందనడం సత్యం.

వాస్తవిక ప్రాముఖ్యం గల మరో సూచన ఏమిటంటే, రైల్వే, పోస్టల్ కార్మిక వర్గాలు ప్రభుత్వంతో తీవ్ర ఘర్షణలో ఉన్నాయి. చివరికి మెన్షివిక్కులు కూడా తమ మంత్రి నికేతిన్ పట్ల అసంతృప్తితో ఉండగా, ఎస్.ఆర్.లు కేరెన్స్కీ ప్రభృతులను 'స్తొలీపిన్ అనుచరులు' అంటున్నారు! మరి ప్రభుత్వానికి ఈ పార్టీ నుండి తోడ్పాటు ప్రతికూలంగానే ఉందనడం స్పష్టం అంటూ పరిస్థితుల్ని బేరీజు వేస్తాడాయన.

(ఇక్కడ నాలుగో భాగం మొదలైందన్నట్లుగా అంకె వేయబడింది గానీ, విషయం ఏమీ లేకుండా, లెనిన్ సంకలిత రచనలు ఐదవ సంపుటంలో ఖాళీగా ఉంచబడింది)

**ఐదవ భాగం**

ఇక సోవియట్ల కేంద్ర కార్యవర్గ నాయకులు బూర్జువా, భూస్వామ్యుల్ని సమర్థించే ఎత్తుగడల్ని అనుసరిస్తున్నారని లెనిన్ ఆరోపించడంతో ఐదవ భాగం మొదలైంది. అలాగే బోల్షివిక్కుల్ని రాజ్యాంగబద్ధ భ్రమల్లో, సోవియట్ల మహాసభ (రెండో కాంగ్రెస్), రాజ్యాంగ నిర్ణయసభ (దీనికి ఎన్నికలే జరగలేదు. అక్టోబర్ విప్లవానంతరమే ఎన్నికలు జరగడం, అనంతరం ఈ సభ సోషలిస్టు ప్రభుత్వాన్ని గుర్తించడానికి నిరాకరించడం, ఆ వెంటనే దాన్ని సోవియట్ ప్రభుత్వం రద్దుచేయడం జరిగాయి.) వగైరా జాలంలో ఇరికించడాన్ని అనుమతిస్తే, వారంతా శ్రామికవర్గ లక్ష్యానికి ద్రోహులే అవుతారని లెనిన్ నొక్కి చెపుతాడు. అంతేగాక, వాళ్లు నౌకాదళంలో తిరుగుబాటు మొదలు పెట్టిన జర్మన్ విప్లవ కార్మికుల లక్ష్యానికి కూడా చేసిన వాళ్లవుతారని, అంతేగాక, అంతర్జాతీయ వాదానికి, ప్రపంచ సోషలిస్టు లక్ష్యాని కూడా ద్రోహం చేసినట్లేనని ఆయన ఉద్ఘాటిస్తాడు. ఎందుకంటే ఆ లక్ష్యాలకోసం చేసే కృషి అంతర్జాతీయవాద పదాలతోనో, ప్రకటనల తోనో, తీర్మానాలతోనో గాక, చేతులతోనే కూడి ఉంటుందని ఆయన స్పష్టం చేస్తాడు.

అంతేగాక అప్పుడు బోల్షివిక్కులు రైతులకు కూడా ద్రోహం చేసిన వాళ్లయ్యేవారనీ, ఎందుకంటే, 'దేలోనరోద' పత్రిక సైతం (స్తొలీపిన్ అనుచరులుగా పోల్చే ప్రభుత్వం చేత రైతాంగ తిరుగుబాటు అణచివేతను సహించడాన్ని మొత్తం విప్లవాన్నే శాశ్వతంగా నాశనం చేయడం గానే పరిగణించాలని ఆయన విశ్లేషించాడు. అయితే అరాచకత్వం గురించీ, ప్రజల్లో ఉదాసీనత పెరగడం గురించీ కొందరు గోల చేస్తున్నారు గానీ, రైతులు తిరుగుబాటు చేయక గత్యంతరం లేని స్థితికి నెట్టబడ్డప్పుడు, సైనిక ప్రయోగంతో ఆ తిరుగుబాటు అణచివేతను 'రివల్యూషనరీ డెమోక్రట్లు' అనబడే వాళ్లు కూడా సహిస్తున్నప్పుడు, ప్రజలు ఎన్నికల పట్ల ఉదాసీనంగా ఉండక ఏం చేస్తారని ప్రశ్నిస్తాడు.

ఇంకా బోల్షివిక్కులు 'స్వేచ్ఛ'కి కూడా ద్రోహం చేసిన వాళ్లయి ఉండే వారని ఆయన అంటాడు. ఎందుకంటే, రైతాంగ తిరుగుబాటు అణచివేతను సహించడమంటే అర్థం. 'ప్రజాస్వామిక సదస్సు'నూ, ఫ్రీ పార్లమెంట్'నూ బలహీనం చేసినట్లే. ఇంకా చెప్పాలంటే, మరింత అధ్వాన్నంగా రాజ్యాంగ నిర్ణయ సభ ఎన్నికలనూ బలహీనం చేయడమే నని ఆక్షేపిస్తాడు.

పైన చెప్పబడిన విషమ పరిస్థితుల దృష్ట్యా, సంక్షోభం పరిణత మైందన్న నిర్ధారణకు వచ్చిన ఆయన, రష్యన్ విప్లవ భవిష్యత్తు ప్రమాదంలో ఉన్నదనీ, బోల్షివిక్ ప్రతిష్ఠకి పరీక్ష వచ్చిందనీ, సోషలిజం కోసం జరిగే అంతర్జాతీయ కార్మిక విప్లవపు సమస్త భవితవ్యమూ

ప్రమాదంలో ఉందనీ ఆయన పునరుద్ఘాటిస్తూ, ఇక్కడ ఒక ముఖ్యమైన అంశాన్ని చెపుతాడు. ఇంతవరకూ గల వ్యాస భాగాన్ని పత్రికల్లో ప్రచురించ వచ్చుననీ, మిగిలిన భాగం మాత్రం కేవలం పార్టీ కేంద్ర కమిటీ, పెట్రోగ్రాడ్ కమిటీ, మాస్కో కమిటీ, సోవియట్ల సభ్యులకు పంచాలన్న పరిమితిని విధించి రాశాడు. దీన్ని బట్టి ఆరవ భాగంలో తాను రాసిన విషయాలు కింది స్థాయి సభ్యులకు తెలియకూడదని ఆయన భావించినట్లు స్పష్టం.

**ఆరవ భాగం**

మరి, సంక్షోభం పరిణతమైతే ఏం చేయాలని? ఈ ప్రశ్నను సంధించిన లెనినే, సమాధానం కూడా చెపుతాడు. అప్పుడు మనం వాస్తవాలను చెప్పాలంటాడు. తమ కేంద్ర కమిటీలో, పార్టీ నాయకుల్లో సోవియట్ల రెండో కాంగ్రెస్ కోసం నిరీక్షించడానికి అనుకూలమైన, వెంటనే అధికారాన్ని చేపట్టడానికి ప్రతికూలమైన, తక్షణ తిరుగుబాటుకి ప్రతికూలమైన ఒక ధోరణి ఉందని ఆయన చూపుతూ, అది సరికాదని, దాన్ని అధిగమించాలని ఆయన స్పష్టం చేస్తాడు.

అలా అధిగమించకపోతే, బోల్షివిక్కులు శాశ్వత అప్రతిష్ఠ పాలవడమే గాక, తమని తాము ఒక పార్టీగా కూడా నాశనం చేసుకుంటారని ఆయన హెచ్చరిస్తాడు. ఇలాంటి తరుణాన్ని దాట వేసుకుని, సోవియట్ల కాంగ్రెస్ నిరీక్షించిచడం అంటే శుద్ధ మూర్ఖత్వమో లేదా పరమ ద్రోహమో అవుతుందని, అంతేగాక అది జర్మన్ కార్మికులకు కూడా ద్రోహమవుతుందని, వారి విప్లవం మొదలయ్యే దాకా మనం వేచి ఉండకూడదని, అలా గనుక జరిగితే ప్రతి దగుల్బాజీ ఆ ద్రోహానికి సహాయపడతాడని అంటూ, అయితే కేరెన్స్కీ, కిష్కిన్ ప్రభృతులు అధికారంలో ఉన్నంత కాలం అది మొదలు కాదని ఉపశమనంగా చెపుతాడు.

అయితే అది రైతుల పట్ల కూడా పరమ ద్రోహమని చెపుతూ, రెండు రాజధానులు (పెట్రోగ్రాడ్, మాస్కో) సోవియట్లు మన అజమాయిషీలో ఉన్నప్పుడు, రైతాంగ తిరుగుబాటుని అణచనివ్వడమంటే, రైతుల విశ్వాసాన్ని పూర్తిగా కోల్పోవడమేననీ, తద్వారా రైతుల దృష్టిలో మన స్థాయి ఆ దగుల్బాజీ స్థాయి (లీబెర్, దాన్‌లనే మెన్షివిక్కుల్ని లెనిన్ ఉదాహరిస్తాడు) కి దిగజార్చుకోవడమేనని ఆయన సూచిస్తాడు.

అలాగే సోవియట్ల కాంగ్రెస్ కోసం నిరీక్షించడం కూడా శుద్ధ మూర్ఖత్వమేనని ఆయన చెపుతాడు. ఎందుకంటే, వారాలు, చివరికి రోజులు కూడా సమస్తాన్నీ నిర్ణయించే తరుణంలో, ఆ పని చేయడం వారాల్ని చేజార్చుకోవడమేనని అంటాడు. అలాగే అది భయంతో అధికారాన్ని త్యాగం చేయడం అవుతుందని, ఎందుకంటే సోవియట్ల కాంగ్రెస్ అక్టోబర్ 20–29 ల మధ్య జరుగుతుంది. గనుక (నిజానికి ఈ రెండో కాంగ్రెస్ అక్టోబర్ మొదటి పక్షంలోనే జరగాలి. కానీ దాన్ని రెండో పక్షానికి వాయిదా వేశారు.) ఆ కాంగ్రెస్ తీర్మానం ప్రకారం ఒకవేళ నవంబర్ 1–2 తేదీల్లో అధికారాన్ని హస్తగతం చేసుకోవాలనుకుంటే, అప్పటికి ప్రభుత్వ విధేయ కొసక్కు సైన్యం సమీకృతం అవుతుంది. గనుక అది అసాధ్యమంటాడు లెనిన్.

కనుక సోవియట్ల కాంగ్రెస్ నిరీక్షించడం మూర్ఖత్వమంటాడు. అందువల్ల మొదటి కేరెన్స్కీని ఓడించాలనీ, ఆ తర్వాత మహాసభను సమావేశ పరచమని డిమాండ్ చేస్తాడు. తిరుగుబాటు విజయానికి ఇప్పుడు హామీ ఉందని అంటూ, ఆ హామీకి గల కారణాలను ఈ కింది విధంగా తెలియచేస్తాడు.

1. మనం మూడు కేంద్రాల నుంచి – పెట్రోగ్రాడ్, మాస్కో, బాల్టిక్ నౌకా దళం నుంచి ఆకస్మిక దాడి మొదలెట్ట గలం.

2. మనకి తోడ్పాటుకి హామీనిచ్చే 'భూస్వాములకి వ్యతిరేకంగా రైతులు చేసే తిరుగుబాటును అణచివేసే ప్రభుత్వం నశించాలి' వంటి నినాదాలు మనకి ఉన్నాయి.

3. దేశంలో మనకి మెజారిటీ ఉంది.

4. మనం సాంకేతికంగా మాస్కోలో అధికారం చేపట్టగలిగే స్థితిలో ఉన్నాం.

5. మెన్షివిక్కుల్లోనూ, ఎస్.ఆర్.లలోనూ పూర్తి చీలికలు ఉన్నాయి.

6. వ్యూహాత్మక స్థానాలైన వింటర్ వాలెస్, టెలిఫోన్ ఎక్స్ఛేంజ్, పెద్ద ప్రింటింగ్ ప్రెస్సుల్ని వెంటనే ఆక్రమించుకో గల వేలాది సాయుధ కార్మికులూ, సైనికులూ పెట్రోగ్రాడ్‌లో మనకి ఉన్నారు.

కనుక వెనువెంటనే పైన చెప్పిన మూడు కేంద్రాల నుంచి దాడి చేస్తే విజయం పొందే అవకాశం నూటికి 99 వంతులు ఉంది. పెట్రోగ్రాడ్‌లో ఇప్పటికే కేరెన్స్కీకి విధేయ ఆశ్విక దళం వగైరాలు ఉన్నప్పటికీ, మనం రెండు పక్కల నుండీ దాడి చేస్తే అతడు లొంగిపోక తప్పదు. ఎందుకంటే మనకి సైన్యపు సానుభూతి ఉంది. కనుక ఇప్పుడు ఇన్ని అవకాశాలున్నప్పుడు మనం అధికారాన్ని చేపట్టకపోతే, సోవియట్లకి అధికారాన్ని బదిలీ చేయాలన్న మన మాటలు అబద్ధమవు తాయని లెనిన్ హెచ్చరించాడు.

కనుక ఇప్పుడు అధికారాన్ని చేపట్టకుండా వెనక్కి తగ్గడం, నిరీక్షించడం (సోవియట్ల) కేంద్ర కార్యనిర్వాహక వర్గంతో సంభాషణలకి పూనుకోవడం, (సోవియట్ల) కేంద్ర పత్రిక కోసం పోరాడేందుకూ, కాంగ్రెస్ కోసం పోరాడేందుకు మనల్ని మనం పరిమితం చేసుకోవడమంటే, విప్లవాన్ని వైఫల్యానికి గురి చేయడమేనంటూ ఘాటుగా విమర్శిస్తాడు.

ఇంతవరకూ కేంద్ర కమిటీ సభ్యులు కొందరు చేసిన వాదనల్లోని అసంగత్వాన్ని ఎత్తిచూపిన లెనిన్, ఆ పై పార్టీ తన సూచనల్నీ, సలహాల్నీ పట్టించుకోకుండా, పై పెచ్చు అందుకు విరుద్ధంగా వ్యవహరించడమే గాకుండా, తన పట్ల వ్యక్తిగతంగా కూడా ఎంత అగౌరవంగా ప్రవర్తించిందీ, ఏయే దిగజారుడు చర్యలకి ఉపక్రమించిందీ ఈ కింది విధంగా తెలుపుతాడు.

ప్రజాస్వామిక సమావేశం (డెమోక్రటిక్ కాన్ఫరెన్స్) మొదలైన నాటి నుండీ అలాంటి విధానం కోసం (సాయుధ పోరాటం కోసం?) పత్రిక ప్రీ పార్లమెంటులో పాల్గొనాలన్న సిగ్గుమాలిన నిర్ణయం చేసిందనీ, అలాగే సోవియట్ ప్రెసీడియంలోకి (ఏ సోవియట్ ప్రెసీడియమో వివరం లేదు. మాస్కోనా, లేక పెట్రోగ్రాడా? బహుశా అర్ధమెన్షివిక్ కామెనెవ్ ప్రాబల్యం వహించిన మాస్కో సోవియట్‌లో కావచ్చు) మెన్షివిక్కుల్ని చేర్చుకున్నదనీ, ఇలాంటి బోల్షివిక్కుల ముఖ్యమైన పొరపాట్లను ఎత్తిచూపిస్తూ తాను రాసిన అంశాలను తన వ్యాసాల నుంచి కొట్టివేస్తోందనీ, ఈ సమస్యను తను ఎత్తి చూపించినా, దాన్ని పరిశీలించేందుకు, ఇంకా కేంద్ర కమిటీ అయిష్టంగా ఉందనేందుకు దీన్నే, ఒక సున్నిత సూచనగా, అలాగే తాను నోరుమూసుకు ఉండాలనేందుకు, ఇంకా చెప్పాలంటే తాను రిటైరవ్వాలనేందుకు కూడా ఒక ప్రతిపాదనగా తాను పరిగణించవలసి వస్తోందనీ, అందువల్ల తాను కేంద్ర కమిటీ నుంచి రాజీనామా చేయక తప్పని స్థితి కల్పించిందనీ, కనుక పార్టీ సాధారణ సభ్యుల మధ్య, పార్టీ మహాసభ లోనూ ప్రచారం చేసుకునే హక్కును తనకు నిలుపుకుంటూ, రాజీనామా చేస్తున్నానని ఆయన పేర్కొన్నాడు.

ఇదంతా ఎందుకంటే సోవియట్ల మహాసభ కోసం మనం నిరీక్షించి, ప్రస్తుత తరుణాన్ని జారవిడిచినట్లైతే, విప్లవాన్ని మనం నాశనం చేస్తామన్న

ఉద్దేశంతో తుది హెచ్చరిక చేస్తూ, సంతకం చేసి, ఆయన తన రాజీనామా లేఖను ముగించాడు.

లేఖ ముగిసిశాఖ, ష.రా.లో, శాంతి కోసం నిలబడే ప్రభుత్వాన్ని కొసక్కు సైన్యాలు సైతం వ్యతిరేకించవనేందుకు అన్ని ప్రశ్నార్థకాలతో ముగిస్తూ వ్యాసాన్ని, దాంతో పాటు ష.రా. నీ కూడా ముగిస్తాడు.

లెనిన్ రాజీనామా ఉదంతంపై వ్యాసంలో తప్ప, తెలుగులో మరెక్కడా కనిపించదు. అంతెందుకు, వివిధ ఆర్గనైజేషన్లలో పని చేసే పలువురు వృద్ధతరం కమ్యూనిస్టుల్ని ఈ విషయమై కదిలిస్తే, వారంతా ఈ ఉదంతాన్ని నమ్మలేకపోయారు. ఒకరిద్దరు మాత్రం ఆంగ్లంలో ట్రాట్స్కీ వంటి వారి రచనల్లో చూశామని చెప్పారు. దీన్నిబట్టి అర్థం చేసుకోవాల్సిందేమంటే, రష్యాలో అనంతరం కాలంలో చోటు చేసుకున్న పరిణామాల్లో, లెనిన్ రాజీనామా ఉదంతం సెన్సార్‌షిప్‌కు గురైందనీ, తెలుగులోకి వచ్చిన లెనిన్‌పై రచనలన్నీ ఆ కాలానికి చెంది, ఆదేశాల నుంచి వచ్చిందే గనుక, వాటిలో ఆ ఉదంతం లేదనీ, అయితే ఈ వ్యాసంలో అది అలాగే ఉండడం ఎలా కుదిరిందంటే, ఎప్పటికప్పుడు ఆయన రచనలు విదేశీ భాషల్లోకి అనువదించబడుతున్నందువల్లనో లేదా అప్పటికే ఈ ఉదంతం ప్రసిద్ధికెక్కి ఉన్నందువల్లనో అయి ఉండవచ్చు, ఏమైనా ఆయన వ్యాస సంపుటిని అందరు పాఠకులూ అంత శ్రద్ధగా చదివే అవకాశం లేదు కదా! అందువల్ల తెలుగు మేధావి లోకంలో చాలామంది ఈ విషయాన్ని గమనించి ఉండరు.

ఏమైనా లెనిన్ రాజీనామా దాకా వెళ్లాడంటే అది ఒక పెద్ద సంచలనమే. ఎందుకంటే పార్టీని స్థాపించిందీ, దానికి పెద్ద దిక్కుగా ఉన్నదీ, దానికి సిద్ధాంతకర్తగా ఉన్నదీ, దానికి మార్గదర్శిగా ఉన్నదీ ఆయనే. అదీగాక ఆయన అప్పుడు కూడా పార్టీ ప్రధాన బాధ్యుడుగా ఉన్నాడు. పార్టీలో ఇతర మేధావులు కూడా కొందరు ఉండి ఉండవచ్చు. కానీ ప్రజల్లోనూ, కిందిస్థాయి కార్యకర్తల్లోనూ గుర్తింపు ఉన్నవాడు ఆయనే. పార్టీ అంటే ఆయనేనని వారందరి అభిప్రాయం. అంతేగాక పార్టీ చేత ప్రతి అడుగు వేయించిన వాడు ఆయనే. అడుగడుగునూ ఆయన రాసిన వ్యాసమో, కరపత్రమో, గ్రంథమో గమనిస్తూ మార్గదర్శకత్వం వహించింది. అలాంటి ఆయనకే రాజీనామా చేయాల్సిన పరిస్థితి వచ్చిందంటే, ఇక ఇతరుల సంగతి ఏమిటి.

అయితే కమ్యూనిస్టు పార్టీల్లో ఇది కొత్త కాదనే చెప్పాలి. అంతెందుకు తొలి రష్యన్ మార్క్సిస్టు అయిన ప్లెహానోవ్‌కే లెనిన్ పాఠాలు నేర్పించాడు కదా! విప్లవ పార్టీల్లో ఇది మామూలు సంగతే. ఆ క్షణాన పార్టీలోని మెజారిటీని ఎవరు ముందుండి నడిపిస్తారో, వారికే అగ్రాసనం. కానీ బోల్షివిక్ పార్టీలో కామెనెవ్, జినోవ్ యేవ్ ప్రభృతులు, మధ్యలో వచ్చిన ట్రాట్స్కీ ప్రభృతులు పార్టీని ముందుండి నడిపించినవారు కారు. పార్టీని తప్పుదోవలో నడిపించబోయి భంగపడి చెంపదెబ్బలు వేసుకున్నవారు, వేయించుకున్నవారు. లెనిన్ సమక్షంలో వారి ఆటలు ఎప్పుడూ సాగలేదు. ఆయన దూరంగా ఉన్నప్పుడే వారు తోక జాడించడానికి సాహసించారు. పార్టీలో లెనిన్‌కి ఎప్పుడూ పట్టుంది. అయినప్పటికీ ఆయన ప్రతిపాదించిన తీర్మానాలు కూడా సి.సి. (సెంట్రల్ కమిటీ) లో ఎల్లప్పుడూ నల్లేరు మీద బండి నడకలా సాఫీగా ఆమోదం పొందలేదు. దానికి కారణం మార్క్సిజం ఒక అవగాహనమైన శాస్త్రం కావడం. ఎప్పటికప్పుడు వస్తుగత పరిస్థితులకు ఆసుపత్రులను అన్వయించు కోవడంలో తికమకపడే అవకాశాలుండడం! అయితే లెనినే ఎల్లప్పుడూ సరైన మార్గంలో నడిచాడని చరిత్ర సాక్ష్యం చెపుతోంది. పార్టీ సమావేశాల్లో లెనిన్ ప్రతిపాదనల పరిస్థితి ఏమిటో ప్రసిద్ధ అమెరికన్ విలేఖరి ఆల్బర్ట్‌రీస్ విలియమ్స్ తన 'లెనిన్ వ్యక్తీ, అతని కృషీ' గ్రంథంలో తెలిపాడు. 'పరిస్థితిపై తన విశ్లేషణను ఆధారంగా కలిగినట్టి నిర్దిష్ట ప్రతిపాదనలు మా పార్టీ సమావేశాల్లో లెనిన్ తరచుగా చేసేవాడు. వాటిని మేం తిరగొట్టేసే వాళ్లం. తరువాత తేలిపోయేది – లెనిన్‌దే ఒప్పు అనీ, మాదే తప్పు' అని అంటూ పార్టీ సభ్యుడు పేటర్స్ చెప్పిన విషయాల్ని ఆయన ఉదాహరించాడు. ఎత్తుగడల ప్రశ్నపై లెనిన్‌కీ ఇతర సభ్యులకీ పార్టీలో హోరాహోరీ పోరాటాలు జరిగాయని ఆయన చెప్పాడు.

ఏమైనా లెనిన్ రాజీనామా ఎందుకు చేయాల్సి వచ్చిందన్న ప్రశ్నకు, తనే కారణాలు కూడా చెప్పాడు. తన వ్యాసాల్లోని అంశాల్ని మార్చి, తొలగించి ప్రచురించడం అంతకు పూర్వం కూడా జరిగింది. ఏప్రిల్‌లో ఆయన రష్యారాక ముందు, ప్రవాసం నుంచి రాసిన 'దూరం నుండి లేఖల' విషయంలో పార్టీ పత్రిక ప్రార్ధకు సంపాదక వర్గ సభ్యుడిగా ఉన్న కామెనెవ్, మొత్తం లేఖల్లో నాలుగింటిని దాచేసి, మొదటి దానిలో తొలగించి, వక్రీకరించి తన భావాలకు అనుగుణమైన భాగాల్ని ఉంచి మాత్రమే ప్రచురించాడు. ఇదిప్పుడూ తిరిగి జరగడం. అలాగే తన ప్రతిపాదనకు సి.సి. జవాబివ్వకపోవడం, డెమోక్రటిక్ కాన్ఫరెన్స్‌లో పాల్గొనడం ఆయనకు కోపాన్ని కలిగించింది. అయితే పోరాటంలో విజయం పొందుతామన్న నమ్మకం కామెనెవ్ ప్రభృతులలో ఏ కోశానా లేదు. అందువల్ల సి.సి. జవాబివ్వడంలో తపపటాయించింది. దాంతో సి.సి. మీద ఒత్తిడి చేసేందుకే ఆయన రాజీనామా చేశాడని దరిమిలా సంఘటన ద్వారా చెప్పవచ్చు. ఆయన ఒత్తిడి ఫలించడం వల్లనే, ఆయన్ని పార్టీ కలాపాల్ని దగ్గరుండి పర్యవేక్షించమని సి.సి. ఆయన్ని పెట్రోగ్రాడ్‌కి ఆహ్వానించింది. దాంతో ఆయన మారు వేషంలో అక్టోబర్ 7న పెట్రోగ్రాడ్ వచ్చి, ఆ నగర శివార్లలోని కార్మికపేటల్లో ఒక దాంట్లో 'పెర్ద్‌బోల్‌స్కయా' వీథిలో, వృద్ధురాలైన కామ్రేడ్ 'పోషనోవా' ఇంట్లో రహస్యంగా ఉంటూ, అక్కడి నుంచి స్మోల్ని ఇన్‌స్టిట్యూట్‌లో అక్టోబర్ 10న జరిగిన సి.సి. సమావేశానికి మారువేషంలో హాజరైన, తీర్మానాన్ని స్వయంగా ప్రవేశపెట్టగా, కామెనెవ్ జినొవ్‌యెవ్‌లు తీర్మానాన్ని వ్యతిరేకించగా, ట్రాట్స్కీ సవరణ తీర్మానం ప్రవేశపెట్టాడు. లెనిన్ రెంటినీ సమర్థంగా ఖండిచడంతో తీర్మానం 10–2 వోట్లతో ఆమోదించబడింది. సాయుధ పోరాటాన్ని ప్రారంభిచాల్సిన 24వ తేదీన కూడా నిర్ణీత సమయానికి పోరాటాన్ని విప్లవ సైనిక కమిటీ ప్రారంభించక టపటపాయిస్తూండే సరికి, లెనిన్ తిరిగి స్వయంగా తిరిగి మారువేషంలో స్మోల్నికి వెళ్లి, పోరాట సారథ్య బాధ్యతల్ని స్వయంగా చేపట్టి, విజయం సాధించి, ప్రపంచంలోనే తొలి సోషలిస్టు రాజ్యాన్ని స్థాపించడం చరిత్ర. (ఈ విషయాల్ని సాకల్యంగా తెలుసు కోవాలనే ఆసక్తి గల వారు, వాస్తవిక సంఘటనలతో కూడిన నా కథలు1. తీర్మానం – విశాలాంధ్ర, ఆదివారం మేగజైన్‌లో ఒకటవ భాగం; 2014 మే 25న రెండవ భాగం; 2014 జూన్ 1న; అలాగే 2. 'స్వీకారం' కథ ప్రజాసాహితి', ఏప్రిల్ 2014 సంచికలు చూడండి)

ఏమైనా లెనిన్ ఈ వ్యాసం రాసి, రాజీనామా చేయడం ఈ కథంతా ఇలా సాఫీగా నడిచి, సోవియట్ల రెండో కాంగ్రెస్‌లో ఎస్.ఆర్.ల మెన్షివిక్కుల ఆగడాలు అరికట్టబడ్డాయి. పోరాటం ఒక రోజు అలస్యమైన, రెండో కాంగ్రెస్ రసాభాస కావడం, బోల్షివిక్కుల్లోనే కామెనెవ్ వర్గం తిరుగుబాటు చేయడం ఖాయంగా జరిగేవని చెప్పవచ్చు. అలాగే జరిగితే మరి సోవియట్ దేశం ఏర్పడేదా, ప్రపంచ విప్లవాలకూ, సామాజిక విప్లవాలకూ ప్రేరణగా నిలిచేదా, అనుమానమే. ఈ రీత్యా ఈ వ్యాసం చరిత్రనే మార్చి వేసిందని చెప్పవచ్చు.

*(అయిపోయింది)*

*(రచయిత రిటైర్డ్ లెక్చరర్)*

వీ

# శ్రీలంక తమిళులపై దురాగతాలు - 2

*అంతర్జాతీయ వేదికలపై ఎన్ని తీర్మానాలు చేసినా శ్రీలంకలో నివసిస్తున్న తమిళులపై అక్కడి పాలకులు క్రూరమైన అణచివేతలకు పాల్పడుతున్నారని అంటున్నారు* **తోళర్ తియాగు**

*(గత సంచిక తరువాయి)*

**డిమాండ్ల మధ్య అంతస్సంబంధం**

స్వతంత్ర అంతర్జాతీయ దర్యాప్తు, అంతర్జాతీయ రక్షణ యంత్రాంగం, తమిళ ప్రజాభిప్రాయ సేకరణ అనే ఈ మూడు ప్రధాన మైన డిమాండ్ల మధ్యనున్న అంతస్సంబంధాన్ని అర్థం చేసుకోవాలి. ఇందులో ఏ ఒక్క డిమాండ్ విషయంలోనైనా చిన్న ముందడుగు పడితే అది తమిళుల పోరాటం మొత్తం మీద సానుకూల ప్రభావాన్ని వేస్తుంది. ఈ అంతస్సంబంధాన్ని అర్థం చేసుకోకపోతే ఈ డిమాండ్లే పరస్పరం ఒకదానితో ఒకటి వైరుధ్యం కలవిగా కనిపిస్తాయి.

న్యాయశోధన (జూడిషియల్ ఎంక్వరీ), దర్యాప్తు (ఇన్‌వెస్ట్‌గేషన్), విచారణ (ట్రైయల్) పరస్పరం భిన్నమైనవి. దర్యాప్తు చట్టబద్ధమైన ప్రక్రియకు సంబంధించిన మూడు భిన్నమైన దశలుగా వీటిని చెప్పవచ్చును. త్రిసభ్య కమిటీ ఒక విధమైన న్యాయశోధనను చేసింది. దీని తరువాత జరగవలసింది దర్యాప్తు. దర్యాప్తు పూర్తయిన తరువాత, భద్రతా మండలి సిఫారసు చేస్తే, ఈ కేసును అంతర్జాతీయ న్యాయస్థానంలో గాని, ఇందు కోసమే ఏర్పాటు చేయబడిన ప్రత్యేక ట్రిబ్యునల్‌లో గాని విచారిస్తారు. ఆ క్రమంలో తీర్పు వస్తుంది.

**నేర న్యాయం – రాజకీయ న్యాయం**

దర్యాప్తు ఈ చట్టబద్ధమైన ప్రక్రియ అంతా క్రమంగా, సాఫీగా జరుగుతుందనే నమ్మకం లేదు. చట్టబద్ధమైన మార్గం కోసం తమిళులు చేసిన ప్రయత్నానికి ఇది ఒక సూచన. సింహళవాదాన్ని ఏకాకిని చేయడానికి, తమిళులను ప్రోత్సహించడానికి, తమిళుల నైతిక శక్తిని రాజకీయ శక్తిగా మార్చడానికి ఈ ప్రక్రియ దోహదపడడంలోనే తమిళులకు ఆసక్తి ఉంది. నేర న్యాయం కొరకు పోరాటం చేయడం ద్వారా రాజకీయ న్యాయ పోరాటాన్ని ముందుకు తీసుకుపోవడమే తమిళుల ఉద్దేశం.

నేరం జరిగిన ప్రదేశాన్ని చూడకుండానే న్యాయశోధనను జరపవచ్చును. కాని దర్యాప్తును ఆ విధంగా చేయలేం. దర్యాప్తు బృందాన్ని శ్రీలంక అనుమతిస్తుందా? ఒకవేళ అనుమతించినా సైనిక ఆధిపత్యం ఉన్న ప్రాంతంలో ప్రజలు మాట్లాడానికి ముందుకు వస్తారా? సరైన దర్యాప్తు జరగడానికి సైన్యం సహకరిస్తుందా? ఈ ప్రశ్నలకు సమాధానంగా, సింహళ సైన్యాన్ని ఆ ప్రాంతం నుండి బయటకు పంపడం, లేదా కనీసం తన శిబిరాలకు పరిమితమై ఉండేలా చూడడం, ఆ ప్రాంతంలో ఒక అంతర్జాతీయ రక్షణ యంత్రాంగాన్ని ఏర్పాటు చేయడం జరగాలి. అంతర్జాతీయ రక్షణ యంత్రాంగం అక్కడ శాశ్వతంగా ఉండదు. కాబట్టి, దర్యాప్తు ముగిసిన తరువాత తమిళ ఈలం భవిష్యత్తు మీద ప్రజాభిప్రాయసేకరణ చేయాలనే డిమాండ్ ఊపందుకుంటుంది. ఇదంతా అప్రయత్నంగా జరగదు. తమిళులు జాగరూకతతో ఉండి, ఈ ప్రక్రియను ముందుకు తీసుకుపోవడానికి, అడుగడుగునా పోరాటం చేయాలి.

ఈ ఆలోచనతోనే తమిళులు ఐరాస మానవహక్కుల సంఘం సమావేశం వైపు చూశారు. భారతదేశం తనంతట తాను గాని, కొన్ని ఇతర దేశాలతో కలిసి గాని, ఒక తీర్మానాన్ని ప్రతిపాదించాలని డిమాండ్ చేశారు. ఆ తీర్మానంలో స్వతంత్ర అంతర్జాతీయ దర్యాప్తు, ప్రజాభిప్రాయ సేకరణ డిమాండ్లు ఉండాలన్నారు. లేదా ఇతర దేశాలు ప్రతిపాదించిన తీర్మానంలో తగిన సవరణలను భారతదేశం ప్రతి పాదించాలి. భారతదేశం ఈ విధంగా చేయదని అర్థమైన తరువాత, అమెరికా ప్రతిపాదించిన తీర్మానం మీద దృష్టి కేంద్రీకరణ జరిగింది.

అమెరికా బ్రిటన్, మెకడోనియా, మోంటెనెగ్రో దేశాలు ప్రతిపాదించ బోయే తీర్మానం ముసాయిదా అంతర్జాలంలో కనిపించగానే మేం దాన్ని చదివి, చర్చించాం. తమిళజాతి సమస్యను పరిష్కరించే విషయాన్ని అలా ఉంచి, అసలు ఆ సమస్య ఉందనే విషయాన్ని ఈ ముసాయిదా గుర్తించలేదు. ఐక్య శ్రీలంకలో అధికార వికేంద్రకరణ అని భారతదేశం 13వ సవరణ ద్వారా ప్రతిపాదించిన మోసపూరిత మైన పరిష్కారాన్నే ఇది బలపరిచింది. ఎల్ఎల్ఆర్‌సి సిఫారసులను అమలు చేయాలనే విజ్ఞప్తి కూడా ఇందులో ఉంది. జవాబుదారీ తనంతో న్యాయాన్ని పాదుకొల్పాలనే ఈ సిఫారసులు ఇప్పటికీ అమలు కాకుండా పోయాయి. మానవ హక్కుల ఉల్లంఘనలకు చెందిన ఆరోపణల మీద శ్రీలంక ప్రభుత్వమే ఒక విశ్వసనీయమైన దర్యాప్తును జరపాలని కూడా ఈ ముసాయిదాలో ఉంది.

2012, 2013 తీర్మానాల వలె ఈ ముసాయిదా తీర్మానం కూడా నిరాశ పరిచేదిగానే ఉంది. అయినా పరిహార న్యాయం కొరకు జరుగుతున్న పోరాటంలో ఒక సాధనంగా ఉపయోగించుకోవడానికి పనికి వచ్చే కొన్ని అంశాలు కూడా ఈ ముసాయిదాలో ఉన్నాయి. ఈ ముసాయిదా ఆచరణాత్మక భాగంలోని 8వ పేరాలో మానవ హక్కుల కమిషనర్‌కు ఇచ్చిన సూచన వాటిలో ముఖ్యమైనది.

**8వ పేరా**

మానవహక్కుల ఉల్లంఘనలకు చెందిన ఆరోపణల మీద విశ్వసనీయమైన అంతర్గత జవాబుదారీ ప్రక్రియను ఏర్పాటు చేయడంలో శ్రీలంక ప్రభుత్వం విఫలమైనందు వలన ఒక స్వతంత్ర అంతర్జాతీయ దర్యాప్తును జరపాలని ఐరాస మానవహక్కుల కమిషనర్ చేసిన

సిఫారసును 8వ పేరా స్వాగతించింది. శ్రీలంకలో రెండు వైపుల నుండి జరిగిన ఉల్లంఘనల మీద, వాటికి సంబంధించిన నేరాల మీద మానవహక్కుల కమిషనర్ దర్యాప్తు జరపాలని ఈ పేరా కోరింది. కమిషనర్ తన దర్యాప్తులో కనుగొన్న విషయాలను ఐరాస మానవహక్కుల సంఘం 25వ సమావేశానికి మౌఖికంగా, 26వ సమావేశానికి లిఖిత పూర్వకంగా నివేదించాలి.

స్వతంత్ర అంతర్జాతీయ దర్యాప్తు గురించి తీర్మానం స్పష్టంగా చెప్పలేదు. కాని అది అంతర్గత దర్యాప్తు మాత్రం కాజాలదు. ఐరాస నిపుణుల సహాయంతో, ప్రత్యేకాధికారాలు కలిగిన వారి సహాయంతో కమిషనర్ జరిపే దర్యాప్తు స్వతంత్రమైనదీ, స్వభావం రీత్యా అంతర్జాతీయమైనదీ అవుతుంది.

మానవహక్కుల సంఘమే ఒక అంతర్జాతీయ దర్యాప్తు సంస్థను నియమించాలని కమిషనర్ నవనీతం పిళ్లై డిమాండ్ చేసింది. సారాంశంలో ఇది స్వతంత్ర అంతర్జాతీయ దర్యాప్తుకు దారి తీస్తుంది. 2012, 2013 తీర్మానాలను తీవ్రంగా విమర్శించిన ఫ్రాన్సిస్‌బోలె 'ఏది లేకపోవడం కంటే కొద్దిగా ఉండడమైనా మేలు' అని ఈ తీర్మానం మీద వ్యాఖ్యానించారు. ఈ కొద్దిగా ఉండడమనేది చిన్నదే కావచ్చు. కాని అవి పెద్ద ప్రభావాలను తనలో కలిగి ఉందని అనుకుంటున్నాం.

**తుది ముసాయిదా**

అంతకు ముందటి ముసాయిదాలతో పోలిస్తే తుది ముసాయిదా బాగా నీరుగార్చివేయబడింది. అంతకు ముందటి ముసాయిదాలో ఉన్న పేరా 8 తుది ముసాయిదాలో పేరా 10 అయింది. అంతకు ముందటి ముసాయిదాలో కమిషనర్ నివేదికను స్వాగతించగా తుది ముసాయిదాలో దాని ప్రస్తావన మాత్రమే ఉంది. ఐరాస నిపుణుల సహాయంతో కమిషనర్ దర్యాప్తు జరపాలని, దర్యాప్తు నివేదికను మానవహక్కుల సంఘానికి సమర్పించాలని అనడంలో మాత్రం మార్పులేదు.

ఏ నేరాల మీద దర్యాప్తు జరుగుతుంది? ఊచకోత, యుద్ధ నేరాలు, అమానవీయ నేరాల గురించి తీర్మానంలో నిర్దిష్టమైన ప్రస్తావన లేదు. 'సంబంధింత నేరాల' గురించిన సాధారణ ప్రస్తావన మాత్రం ఉంది. అందువలన ఊచకోతతో పాటు అన్ని నేరాల మీద దర్యాప్తు జరపాలని అడగవచ్చును. ఎల్‌ఎల్‌ఆర్‌సి సందర్భంగా జరిగిననట్లుగానే పరిమిత కాల వ్యవధిలో జరిగిన నేరాలను మాత్రమే దర్యాప్తు చేయాలని ఉండడం మాత్రం ఒక లోపమే. అయితే తమిళ ఈలం ప్రజల సంకల్ప బలం సానుకూల ప్రభావంతో, సింహళ ఆధిక్యతావాదపు తలబిరుసు తనం వ్యతిరేక ప్రభావంతో తీర్మానంలోని పరిమిత కాల వ్యవధికి సంబంధించిన సమస్యను గాని, ఇతర సమస్యలను గాని అధిగమించ వచ్చును. ఆ పరిమిత కాల వ్యవధిలోనే ఏం జరిగిందో సాక్ష్యాలతో నిరూపించగలిగితే, యుద్ధనేరాలు, అమానవీయ నేరాలు ఏ ఉద్దేశంతో జరిగాయో అర్థం చేయించవచ్చును. తద్వారా ఊచకోతకు సంబంధించిన నేరాన్ని నిరూపించవచ్చును.

**విజయం**

తమిళజాతి, అణచివేత సమస్యను పరిష్కరించడానికి ఈ తీర్మానం ఉపయోగపడేది కాకపోయినప్పటికి, స్వతంత్ర అంతర్జాతీయ దర్యాప్తు జరగడానికి ఇది నెమ్మదిగా దారి తీస్తుందనే ఉద్దేశంతో దీన్ని స్వాగతించాం. అయితే భారతదేశం దీన్ని ఎక్కడ దెబ్బ తీస్తుందోనని ఆందోళన చెందాం.

ఏదో ఒక విధంగా ఈ తీర్మానం విజయవంతంగా ఆమోదాన్ని పొందింది. ఇది సింహళిజానికే కాకుండా ఇండియానిజానికి కూడా పరాజయం. అంతర్జాతీయ దర్యాప్తుకు దారితీసే 10వ పేరాను తీర్మానం నుండి తొలగింపజేయడానికి భారతదేశం పాకిస్థాన్‌తో కలిసి విఫల ప్రయత్నం చేసి, చివరకు వోటింగ్‌లో పాల్గొనకుండా పారి పోయింది. భారతదేశం వోటింగ్‌లో పాల్గొనక పోవడానికి అనేక కారణాలు చెప్పబడుతున్నప్పటికి, ప్రధాన కారణం గత తీర్మానాల కన్నా ఈ తీర్మానం శక్తివంతమైనది కావడమే. ఇప్పుడు సింహళ ప్రభుత్వంతో పాటు భారత ప్రభుత్వం కూడా బోనులో నిలబడింది.

**దర్యాప్తు – సింహళీయుల ప్రతిస్పందన**

అంతర్జాతీయ దర్యాప్తుకు సంబంధించిన ప్రక్రియ మొదలైంది. ఈ దర్యాప్తును అంగీకరించనని రాజపక్సే అంటున్నాడు. శ్రీలంక మీద ప్రపంచదేశాలు ఆంక్షలు విధించాలని యాస్మిక సూకా హెచ్చరిస్తున్నారు. ముందు ముందు విధించబోయే ఐరాస ఆంక్షలకు చైనా వంటి దేశాలు అడ్డు పడవచ్చును. అయినప్పటికి ఉత్తర అమెరికా, ఐరోపా దేశాల ఆంక్షలను అవి అడ్డుకోలేవు శ్రీలంకను బహిష్కరించాలనే ఉద్యమం అంతర్జాతీయ పరిధిని చేరుకుంటుంది. ప్రయత్నం చేస్తే భారతదేశంలో కూడా ఈ ఉద్యమాన్ని, శక్తివంతంగా నడపవచ్చును.

అంతర్జాతీయ దర్యాప్తుకు మార్గాన్ని సుగమం చేయడంలో పడిన ముందడుగు ఎంత ముఖ్యమైందో తమిళుల శత్రువైన శ్రీలంక ప్రతిస్పందన నుండి గ్రహించవచ్చును. శ్రీలంక బయట ఉన్న తమిళ సంస్థలను శ్రీలంక ప్రభుత్వం వెంటనే నిషేధించింది. కొంతమంది తమిళ నాయకులను టెర్రరిస్టులుగా ప్రకటించింది. ఎల్‌టిటిఇని పునరుద్ధరించడాన్ని అడ్డుకుంటున్నారనే సాకుతో ముగ్గురు తమిళ యువకులను కాల్చి చంపింది. ఉత్తర శ్రీలంకలో అణచివేతను తీవ్రతరం చేసింది. అయితే ప్రపంచ వ్యాప్తంగా తమిళులుగాని, అంతర్జాతీయ సమాజంగాని ఈ బెదిరింపులకు భయపడవలసిన పని లేదు. శ్రీలంక తమిళులను ప్రపంచ వ్యాప్తంగా ఉన్న తమిళుల నుండి వేరు చేయడానికి శ్రీలంక ప్రభుత్వం చేస్తున్న కుట్ర విఫలమవుతుంది.

సింహళ సైనిక బలగాలు చేసిన నేరాలకు సంబంధించిన సాక్ష్యాలను సేకరించే పని మొదలైంది. తమిళ ఈలం అంతర్జాతీయ ప్రభుత్వం ఊచకోతకు పాల్పడిన యుద్ధ నేరస్తుల మొదటి జాబితాను విడుదల చేసింది. తమిళనాడులో ఉన్న తమిళులమైన మనం ఏం చేయబోతున్నాం? శ్రీలంకలో జరిగిన తమిళుల ఊచకోతను ఆపలేక పోయామనే అపరాధ భావన మనలో ఉంటే, ఇప్పటికైనా మనశక్తినంతా కూడదీసుకుని, ఈలం తమిళులు న్యాయం కోసం చేస్తున్న పోరాటంలో శ్రీలంకను ఏకాకిగా చేద్దాం. మనకు వచ్చిన చెడ్డపేరును ఇప్పటికైనా తుడిచివేసుకుందాం. తమిళనాడులోని తమిళ ఉద్యమాలు తమ మధ్యనున్న విభేదాలను పక్కనపెట్టి, తమిళ ప్రజలను కదిలించి, ఒక ఐక్య పోరాటాన్ని నిర్మించాలి. తమిళ ప్రజల ఆ సాహసోపేత పోరాటాన్ని చూచి సింహళ ఆధిక్యతా వాదం భారత సామ్రాజ్యవాదం వణికిపోనివ్వండి.

*(అయిపోయింది)*

*(అనువాదం : ఎం. గంగాధర్, డిటిఎఫ్ నాయకులు, విశ్రాంత ఉపాధ్యాయులు)* వీ

## గ్రీన్‌హంట్ సదస్సు భగ్నం

తిరుపతిలోని సిపిఐ కార్యాలయంలో సెప్టెంబర్ 28న పౌరహక్కుల సంఘంతో పాటు వివిధ ప్రజా సంఘాల ఆధ్వర్యంలో 'గ్రీన్‌హంట్ వ్యతిరేక సభ'ను జరుపుతుండగా పోలీసులు సభ జరిగే ప్రాంతాన్ని, హాలును తమ అధీనంలోకి తీసుకొని సభను భగ్నం చేశారు. సభకు వచ్చే వారిని ముందుగానే అరెస్టు చేశారు. పౌరహక్కుల సంఘం అధ్యక్షులు ప్రొ. శేషయ్య, కార్యదర్శి చిలుకా చంద్రశేఖర్‌లతో పాటు మరికొంత మందిని గృహ నిర్బంధం చేశారు. అలాగే విశాఖపట్నంలోని అంబేద్కర్ భవన్‌లో గ్రీన్‌హంట్ వ్యతిరేక వేదిక ఆధ్వర్యంలో అక్టోబర్ 12న జరిగే 'గ్రీన్‌హంట్ వ్యతిరేక సభ'కు ఆటంకాలు సృష్టించవద్దని సభకు ఒక రోజు ముందు ప్రెస్‌మీట్ పెట్టుకుంటే దానిని పోలీసులు అడ్డుకొని ప్రజా సంఘాల నాయకులను అరెస్టు చేశారు.

## పైడి తెరేశ్ బాబు మృతి

ప్రముఖ కవి పైడి తెరేశ్ బాబు (51) కాలేయ వ్యాధితో బాధపడుతూ హైదరాబాద్‌లోని సోమాజిగూడ యశోద హాస్పిటల్‌లో సెప్టెంబర్ 29న చనిపోయారు. ఆయన 1965లో ప్రకాశం జిల్లా, ఒంగోల్ మండలం, గద్దలకుంట గ్రామంలో జన్మించారు. ఆయన ఆల్ ఇండియా రేడియోలో ప్రోగ్రామర్‌గా పని చేశారు. విధి, సంఘర్షణ, శ్రీకారం, తూర్పు - పడమ వంటి సీరియల్స్ రాశారు. తెలంగాణ ఉద్యమానికి మద్దతుగా 'కావడి కుండలు' అనే కవిత సంకలనం తీసుకొచ్చారు. హిందూ మహాసముద్రం, అల్పపీడనం వంటి కవితలు రచించారు

## 11వ ప్రపంచ మెట్రో పొలిస్ సదస్సు

ఆసియా ఖండంలో మొదటిసారిగా 11వ ప్రపంచ మెట్రో పొలిస్ సదస్సు హైదరాబాద్‌లోని ఎచ్‌ఐసిసిలో అక్టోబర్ 6 నుంచి 9 వరకు జరిగింది. ఈ సదస్సులో పాల్గొన్న ప్రతినిధులు ప్రపంచంలోని వివిధ పట్టణాలలో నివసిస్తున్న ప్రజల జీవన విధానం గురించి, పట్టణాలు ఎదుర్కొంటున్న సమస్యల గురించి, భవిష్యత్తులో పట్టణాల విస్తరణ, అభివృద్ధిల గురించి మాట్లాడారు. ఈ సదస్సులో మాజీ రాష్ట్రపతి డా. అబ్దుల్ కలాం, గవర్నర్ నరసింహన్, కేంద్ర పట్టణాభివృద్ధి శాఖమంత్రి ఎం. వెంకయ్యనాయుడు, రాష్ట్రపతి ప్రణబ్‌ముఖర్జీ, తెలంగాణ ముఖ్యమంత్రి కె. చంద్రశేఖర్‌రావులతో పాటు వివిధ దేశాల శాస్త్రవేత్తలు, ప్రతినిధులు, నగర మేయర్లు పాల్గొన్నారు.

## విజయకుమార్ మృతి

ప్రముఖ సంపాదకులు, రచయిత, తొలితరం విరసం సభ్యులు విజయకుమార్ (65) (భాగ్యనగర్ విజయకుమార్) చాలా కాలం నుంచి పార్కిన్సన్ వ్యాధితో బాధపడుతూ అక్టోబర్ 11న కరీంనగర్‌లోని ఒక ప్రైవేట్ హాస్పిటల్‌లో చికిత్స పొందుతూ చనిపోయారు. ఆయనది కరీంనగర్ జిల్లా, ఓదెల మండలం, కొలనూర్ గ్రామం. ఆయన విద్యుల్లత, జీవగడ్డ పత్రికలకు సంపాదకులుగా ఉన్నారు.

## హుదూద్ తుఫాన్

శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం, తూర్పుగోదావరి జిల్లాల్లో అక్టోబర్ 12, 13 తేదీలలో వచ్చిన హుదూద్ తుఫాన్ 44 మండలాలలో తీవ్ర నష్టాన్ని కలిగించింది. ఈ తుఫాన్ వలన 40 మంది చనిపోయారు. ఈ తుఫాన్ వల్ల సుమారు 70 వేల కోట్ల రూపాయల నష్టం జరిగిందని ప్రభుత్వ అధికారులు తెలియజేశారు. విద్యుత్, రవాణా, కమ్యూనికేషన్ సౌకర్యాలు పూర్తిగా ధ్వంసమైనాయి. వేలాది ప్రభుత్వ, ప్రైవేట్ విద్యాసంస్థలు కూలిపోయాయి. వేలాది ఎకరాల పంటనష్టం జరిగింది. 6700 ఇండ్లు కూలిపోయాయి.

## 'రాజకీయ స్వేచ్ఛ' సదస్సు

హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో అక్టోబర్ 7న పౌరహక్కుల సంఘం, మానవ హక్కుల వేదిక, ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ సంస్థల ఆధ్వర్యంలో 'తెలంగాణ - ఆంధ్రా రాష్ట్రాలు - రాజకీయ స్వేచ్ఛ' అనే అంశం మీద సదస్సు జరిగింది. ఈ సదస్సులో పాల్గొన్న వక్తలు తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలలో ప్రజా సంఘాలపై, నాయకులపై అమలు చేస్తున్న నిర్బంధానికి వ్యతిరేకంగా మాట్లాడారు. ఈ సదస్సులో బొజ్జా తారకం, మానవ హక్కుల వేదిక అధ్యక్షులు జీవన్‌కుమార్, ఒపిడిఆర్ సభ్యులు నర్సింహారెడ్డి, పౌరహక్కుల నాయకులు లక్ష్మణ్, సురేశ్, చిలుకా చంద్రశేఖర్‌లతో పాటు అనేక మంది ప్రజలు హాజరయ్యారు.

## రచయిత్రి తురగా జానకీ రాణి మృతి

ప్రముఖ రచయిత్రి, రేడియో వ్యాఖ్యాత తురగా జానకీ రాణి (78) అక్టోబర్ 15న గుండె నొప్పితో హైదరాబాద్‌లోని ఒక ప్రైవేట్ హాస్పిటల్‌లో చికిత్స పొందుతూ చనిపోయారు. ఆమె 1936 ఆగస్టు 31 కృష్ణా జిల్లా, మచిలీపట్నంలో జన్మించారు. సాహిత్యం, నృత్యం, రేడియో వంటి రంగాల్లో కృషి చేశారు. 27 పుస్తకాలు రాశారు. ఆమె రాసిన కథలు ఇంగ్లిష్, హిందీ, బెంగాలీ, కన్నడం, ఒరియా, మరాఠీ, తమిళ భాషల్లోకి అనువాదం అయ్యాయి.

## తెలంగాణ గ్రామీణ బ్యాంక్ ఏర్పాటు

దక్కన్ గ్రామీణ బ్యాంక్ పేరును తెలంగాణ గ్రామీణ బ్యాంక్‌గా మార్చుతూ కేంద్ర ప్రభుత్వం అక్టోబర్ 20న ఉత్తర్వులు జారీ చేసింది. అలాగే ఆంధ్రప్రదేశ్ గ్రామీణ వికాస్ బ్యాంక్ పరిధిలో ఉన్న ఐదు తెలంగాణ జిల్లాలను తెలంగాణ గ్రామీణ బ్యాంక్ పరిధిలోకి తీసుకొచ్చారు. దీంతో తెలంగాణ రాష్ట్రంలోని మొత్తం పది జిల్లాలతో ఈ బ్యాంక్ ఏర్పడింది.

## బాణసంచా పేలి 18 మంది మృతి

తూర్పుగోదావరి జిల్లా, యు.కొత్తపలి మండలం, వాకతిప్పలోని ఎస్‌సి కాలనీలో అక్టోబర్ 20న మణికంఠ ఫైర్ వర్క్‌లో బాణసంచా పేలి 18 మంది చనిపోయారు. ఇద్దరు తీవ్రంగా గాయపడ్డారు. ఈ ప్రమాదం షార్టుసర్క్యూట్ వల్ల జరిగిందని అధికారులు తెలిపారు. చనిపోయిన వారిలో 11 మంది మహిళలు ఉన్నారు. ఈ షాప్ ప్రభుత్వం నుంచి ఎటువంటి అనుమతి లేకుండానే బాణాసంచాలను తయారు చేస్తుందని అగ్నిమాపక శాఖ అధికారులు తెలిపారు.

## 313 మంది రైతుల ఆత్మహత్య

తెలంగాణ జిల్లాల్లో జూన్ 2 నుంచి అక్టోబర్ 25 వరకు 313 మంది రైతులు అప్పుల బాధతో ఆత్మహత్య చేసుకున్నారు. వరంగల్ - 72, మెదక్-63, ఆదిలాబాద్-38, నల్గొండ-39, కరీంనగర్ - 36, మహబూబ్‌నగర్-25, నిజామాబాద్-14, రంగారెడ్డి-16, ఖమ్మం - 10. చనిపోయిన వారిలో ఎక్కువగా పత్తి రైతులే ఉన్నారు. వీ

## గోరఖ్‌పూర్ వద్ద రైలు ప్రమాదం

ఉత్తరప్రదేశ్‌లోని గోరఖ్‌పూర్ సమీపంలో అక్టోబర్ 1 రాత్రి మదువాదీ నుంచి లక్నో వెళుతున్న కృషక్ ఎక్స్‌ప్రెస్ ప్రమాదానికి గురయింది. గోరఖ్‌పూర్‌కు సమీపంలోని నందనగర్ క్రాసింగ్ వద్ద రెడ్ సిగ్నల్‌ను దాటుకుంటూ వెళ్లి లూప్‌లైన్ దాటుతున్న లక్నో - బరౌణీ ఎక్స్‌ప్రెస్‌ను పక్కనుంచి ఢీకొట్టింది. ఈ ఘటనలో 13 మంది మరణించగా, 47 మంది గాయపడ్డారు. ఈ ప్రమాదంపై ప్రభుత్వం రైల్వే భద్రతా కమిషనర్ పికె బాజ్‌పాయ్ నేతృత్వంలో విచారణకు ఆదేశించింది.

## భారత్ - పాకిస్తాన్ సరిహద్దుల్లో కాల్పులు

జమ్ములోని అంతర్జాతీయ సరిహద్దు వెంట అక్టోబర్ 8 నుంచి పాకిస్తాన్ దళాలు కాల్పులు, మోర్టారు దాడులు చేశాయి. ఈ దాడిలో ఇప్పటివరకు ఏడుగురు మృతి చెందగా, పదిహేను మంది గాయపడ్డారు. మృతుల్లో ఒకే కుటుంబానికి చెందిన ఇద్దరు ఉన్నారు. పాకిస్తాన్ క్యాంపుపై బిఎస్ఎఫ్ దళాలు జరిపిన దాడుల్లో 35 మంది చనిపోయారని పాకిస్తాన్ మీడియా వెల్లడించింది.

## జర్నలిస్ట్ ఎం.వి. కామత్ మృతి

ప్రముఖ సీనియర్ జర్నలిస్ట్, ప్రసార భారతి మాజీ ఛైర్మన్ మాదవ్ విఠల్ కామత్ (98) అక్టోబర్ 9న మృతి చెందారు. ఆయనకు ఛాతిలో నొప్పితో మణిపాల్‌లోని కస్తూర్బా ఆసుపత్రిలో చికిత్స పొందుతూ మరణించారు. కామత్ 1921, సెప్టెంబర్ 7న కర్నాటకలోని ఉడిపిలో జన్మించారు. ఆయన 1946లో ముంబైలో 'ద ఫ్రీ ప్రెస్ జర్నల్'లో పాత్రికేయ జీవితం ప్రారంభించి, పిటిఐ, ఇల్లస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా, భారత జ్యోతి పత్రికకు ఎడిటర్‌గా, టైమ్స్ ఆఫ్ ఇండియా పత్రికకు యూరప్, అమెరికాల్లో కరస్పాండెంట్‌గా పనిచేశారు. ఆయన దాదాపు యాభై పుస్తకాలు రాశారు. ఆయన 'పద్మభూషణ్' అవార్డు పొందారు.

## మావోయిస్టుల అణచివేతకు ప్రభుత్వ వ్యూహం

మావోయిస్టులను ఎదుర్కోవడానికి కేంద్ర ప్రభుత్వం ద్విముఖ వ్యూహం అవలంభిస్తోంది. మావోయిస్టుల అణచివేతకు కఠినంగా వ్యవహరిస్తూనే, వారి ప్రాబల్య ప్రాంతాల్లో అభివృద్ధి కార్యక్రమాలపై దృష్టి సారించింది. ఈ విధానంలో భాగంగా 250 పోలీస్ స్టేషన్‌ల బలోపేతానికి నిధులు కేటాయించనుంది. మావోయిస్టు ప్రభావిత ప్రాంతాల్లో బలగాలను భారీగా పెంచాలని నిర్ణయించింది. వారికి అత్యాధునిక ఆయుధాలను అందజేయనుంది. ఇప్పటికే తొమ్మిది రాష్ట్రాల లో ఉన్న 90 వేల మందికి అదనంగా మరికొన్ని వేల పారా మిలిటరీ బలగాలను మోహరించనుంది. దేశంలోని 23 జిల్లాలను గుర్తించి, ఒక్కో జిల్లాలో నాలుగు నుంచి ఐదు బ్లాకుల్లో పాఠశాలలు, ఆసుపత్రులు, అత్యాధునిక సమాచార వ్యవస్థ, భద్రతా సామగ్రి ఏర్పాటు చేయడంతో పాటు అభివృద్ధి కార్యక్రమాలను ముమ్మరం చేయాలని నిశ్చయించింది.

## భారతీయులందరూ హిందువులే - ఆర్ఎస్ఎస్

భారతదేశంలో ఉన్న వారందరిని ఆర్ఎస్ఎస్ హిందువులుగానే చూస్తోందని కులం, మతం ఆధారంగా వివక్ష చూపదని ఆ సంస్థ ప్రచార విభాగం బాధ్యుడు మన్మోహన్ వైద్య లక్నోలో అక్టోబర్ 16న విలేకరుల సమావేశంలో ప్రకటించారు. ఆర్ఎస్ఎస్‌తో ప్రజల అనుబంధం పెరుగుతోందనీ, 2012లో ప్రతినెలా సగటున వెయ్యిమంది దరఖాస్తులను స్వీకరిస్తే, ప్రస్తుతం ఆ సంఖ్య ఏడు వేలకు పెరిగిందన్నారు. మైనారిటీల నుంచి ఎన్నో దరఖాస్తులు వస్తున్నాయని విలేకరులు ప్రశ్నించగా, మా దృష్టిలో మైనారిటీలు ఎవరు లేరు, భారత దేశంలో నివసిస్తున్న వారందరూ హిందువులేనని నా అభిప్రాయం అని అన్నారు.

## జయలలితకు జైలు - బెయిల్

తమిళనాడు మాజీ ముఖ్యమంత్రి జయలలితకు ఆదాయానికి మించిన ఆస్తులు కలిగి ఉన్న కేసులో సెప్టెంబర్ 27న బెంగళూరులోని ప్రత్యేక కోర్టు నాలుగు సంవత్సరాల జైలు శిక్ష, వంద కోట్ల రూపాయల జరిమానా విధించింది. ఆమెతో పాటు శశికళ, వివిఎన్ సుధాకరన్, ఇళవరసిలకు కూడా నాలుగు సంవత్సరాల శిక్ష, రు. 10 కోట్ల జరిమానా పడింది. ఈ కేసు 18 సంవత్సరాల సుదీర్ఘకాలం నడిచింది. తీర్పు నేపథ్యంలో శాసనసభకు అనర్హురాలు కావడంతో జయలలిత ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేశారు. ఆమెకు అత్యంత నమ్మకస్తుడు అయిన పన్నీర్ సెల్వన్ ముఖ్యమంత్రి పదవి చేపట్టారు. తీర్పు తరువాత ఆమెను బెంగళూరు పరప్పణ అగ్రహార జైలుకు తరలించారు. పలుమార్లు బెయిలు పిటిషన్ రద్దయినా చివరకు అక్టోబర్ 17న సుప్రీంకోర్టు జయలలితకు షరతులతో కూడిన బెయిల్‌ను మంజూరు చేసింది. ఆమెతో పాటు శిక్షపడిన ముగ్గురికీ బెయిల్ లభించింది. దీంతో జయలలిత అక్టోబర్ 18న జైలు నుంచి విడదలయ్యారు.

## మహారాష్ట్ర, హర్యానా అసెంబ్లీ ఎన్నికలు

మహారాష్ట్ర, హర్యానా శాసనసభలకు జరిగిన ఎన్నికల ఫలితాలను కేంద్ర ప్రభుత్వం అక్టోబర్ 19న ప్రకటించింది. మహారాష్ట్రలోని మొత్తం 288 స్థానాలకు గాను బిజెపి-122, కాంగ్రెస్-42, శివసేన-63, ఎన్‌సిపి-41, ఇతరులు-20 స్థానాల్లో గెలుపొందారు. అత్యధిక స్థానాల్లో గెలుపొందిన బిజెపి, ఎన్‌సిపి, ఎంఎన్ఎస్‌ల మద్దతుతో ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడానికి ముందుకు వచ్చింది. హర్యానాలోని మొత్తం 90 స్థానాలకు జరిగిన ఎన్నికల్లో బిజెపి-47, కాంగ్రెస్-15, ఐఎన్ఎల్‌డి-19, ఇతరులు-9 స్థానాల్లో విజయం సాధించారు. బిజెపి అత్యధిక మెజారిటీతో ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయనుంది.

## మహారాష్ట్రలో దళిత కుటుంబం హత్య

మహారాష్ట్రలోని అహ్మద్‌నగర్ జిల్లాలోని జవఖడే గ్రామానికి చెందిన సంజయ్ జాదవ్, అతని భార్య జయశ్రీ, వారి కుమారుడు సునీల్‌లు హత్యకు గురయ్యారు. వీరు గ్రామానికి దూరంగా ఉన్న తమ ఎకరం పొలంలో జీవనం సాగిస్తున్నారు. అక్టోబర్ 21న వారి జాడ తెలియకపోవడం గమనించిన గ్రామస్తులు జాదవ్ బంధువు దిలీప్ జాధవ్‌కు సమాచారం అందించారు. అందరు వెళ్లి ఇంట్లో చూసేసరికి రక్తపు మరకలు కనిపించాయి. వారి కోసం వెతుకుతున్న క్రమంలో ఊరికి అరకిలోమీటర్ దూరంలో ఉన్న చెరువులో వారి శరీర భాగాలు తేలుతూ కనిపించాయి. ఇవి పరువు హత్యలుగా అనుమానాలు వ్యక్తమవుతున్నాయి. గతంలో కూడా ఈ గ్రామంలో దళితులపై అణచివేత, హత్యలు జరిగాయి.

## జమ్మూ కశ్మీర్, జార్ఖండ్‌లలో ఎన్నికలు

జమ్మూ కశ్మీర్, జార్ఖండ్ రాష్ట్రాల అసెంబ్లీలకు ఐదుదశల్లో ఎన్నికలు నిర్వహించనున్నట్లు కేంద్ర ఎన్నికల సంఘం అక్టోబర్ 25న తెలిపింది. నవంబర్ 25న ప్రారంభమై, డిసెంబర్ 20న ముగుస్తాయని చీఫ్ ఎలక్షన్ కమిషనర్ వి.ఎస్. సంపత్ తెలిరాపు. రెండు రాష్ట్రాలు సున్నితమైనవనీ, కాబట్టి ఎన్నికల నిర్వహణకు నెల రోజుల షెడ్యూల్‌ను నిర్ణయించామనీ, డిసెంబర్ 23న ఓట్ల లెక్కింపు జరుగుతుందనీ తెలిపారు. వీ

## ఆక్యుపై సెంట్రల్

హాంకాంగ్‌లో ప్రభుత్వానికి వ్యతిరేకంగా విద్యార్థులు 'ఆక్యుపై సెంట్రల్' పేరుతో సెప్టెంబర్ నెలాఖరు నుంచి ఆందోళన చేపట్టారు. 2017లో జరుగనున్న ఎన్నికలలో అందరికీ ఓటింగ్ హక్కును ఇస్తున్న ప్రభుత్వం పోటీ చేసే అభ్యర్థులను ఒక కమిటీ నిర్ధారించాల్సి ఉంటుందని చేసిన చట్టాన్ని విద్యార్థులు వ్యతిరేకిస్తున్నారు. హాంకాంగ్ చీఫ్ ఎగ్జిక్యూటివ్ లియుంగ్ చున్ ఇంగ్‌తో పాటు ప్రభుత్వ ఉన్నతాధికారులు తమ పదవులకు రాజీనామా చేయాలని డిమాండ్ చేశారు. హాంకాంగ్‌లోని క్వీన్స్‌వే, హార్కోర్ట్ రోడ్, జాక్సన్‌రోడ్, ఆర్సెనల్ స్ట్రీట్ వంటి ప్రాంతాల్లో విద్యార్థులు బ్యారికేడ్లు పెట్టి నిరసన ప్రదర్శనలు చేశారు. ఎన్నికల్లో అందరికీ ఓటింగ్ హక్కు కల్పించినప్పుడు ఎవరైనా పోటీ చేసేందుకు ఎలాంటి ఆంక్షలు లేని పద్ధతుల్లో అవకాశం ఇవ్వాలని విద్యార్థులు కోరుతున్నారు.

## పశ్చిమాఫ్రికాలో ప్రబలుతున్న ఎబోలా వైరస్

పశ్చిమ ఆఫ్రికాలో ఎబోలా వైరస్ రోజు రోజుకూ తీవ్ర రూపం దాలుస్తోంది. సియెర్రా లియోన్‌లో సెప్టెంబర్ 5న ఒక్కరోజే ఎబోలా బారిన పడి 121 మంది మరణించారు. తొలుత మార్చి నెలలో గినియాలో వెలుగు చూసిన ఈ వ్యాధి నెమ్మదిగా పొరుగు దేశాలకు విస్తరించింది. ఇప్పటి వరకు పశ్చిమ ఆఫ్రికాలో దాదాపు 9,500 మంది ఈ వ్యాధి బారిన పడినవారిలో 4,555 మంది వరకు మరణించారు.

## యెమెన్‌లో బాంబు పేలుళ్లు

యెమెన్ రాజధాని సనాలో అక్టోబర్ 9న జరిగిన రెండు బాంబు దాడులతో దద్దరిల్లింది. సనాలోని తాహిర్ స్క్వేర్‌లో శక్తిమంతమైన పేలుడు పదార్థాలు అమర్చుకున్న ఓ మానవబాంబు ఆత్మాహుతి దాడికి పాల్పడడంతో కనీసం యాభై మంది మరణించారు. వందలాది మంది గాయపడ్డారు. చనిపోయిన వారిలో నలుగురు చిన్నారులు ఉన్నారు. మరో ఘటనలో ఆగ్నేయ యెమెన్ ముకల్ల శివారుల్లోని సైనిక తనిఖీ కేంద్రం వద్ద జరిగిన కారు బాంబు పేలుడులో ఇరవై మంది సైనికులు చనిపోయారు.

## బొలీవియాలో మళ్లీ మొరాలెస్

బొలీవియా అధ్యక్షుడిగా ఎవో మొరాలెస్ వరుసగా మూడవసారి ఎన్నికయ్యారు. అక్టోబర్ 12న జరిగిన ఎన్నికలలో ఐదు పార్టీలు పోటీలో నిలబడ్డాయి. మొరాలెస్ నలుగురు ప్రత్యర్థులను ఓడించి 60 శాతం ఓట్లతో విజయం సాధించారు. బొలీవియా మొదటి దేశీయ అధ్యక్షుడు అయిన మొరేల్స్ ప్రజాకర్షణ కలిగిన వామపక్షవాది. ఈ విజయంతో మొరేల్స్ 2020 వరకు బొలీవియా అధ్యక్షుడిగా కొనసాగుతారు.

## జాఫ్నా - కొలంబో రైలు ప్రారంభం

శ్రీలంకలో 24 ఏళ్ల తరువాత జాఫ్నా – కొలంబో మధ్య రైలు సర్వీసు తిరిగి ప్రారంభించారు. గతంలో వార్‌జోన్‌గా ఉన్న ఈ ప్రాంతంలో ఎల్‌టిటిఇ దాడులతో 1990లో రైల్వే సర్వీసులను నిలిపివేశారు. అక్టోబర్ 13న శ్రీలంక అధ్యక్షుడు మహింద్రా రాజపక్సే రైల్వే లైన్‌ను ప్రారంభించారు. జాఫ్నా – కొలంబోల మధ్య 400 కిలోమీటర్ల పొడవైన రైల్వే లైను ఇది. ఈ రైల్వేలైన్‌ను తిరిగి నిర్మించడంలో భారత ప్రభుత్వం సాయం అందించింది.

## సిరియాలో కొనసాగుతున్న యుద్ధం

సిరియాలో ఇస్లామిక్ స్టేట్ గ్రూప్ ఇరాక్ అండ్ సిరియా (ఐఎస్‌ఐఎస్)కు అమెరికా నేతృత్వంలోని కుర్దు దళాలకు తీవ్ర పోరు నడుస్తోంది. ఐఎస్‌ఐఎస్ ఆధీనంలో ఉన్న కొబానీ నగరాన్ని తిరిగి చేజిక్కించుకునేందుకు కుర్దు దళాలు అమెరికా సహాయంతో తీవ్రంగా దాడులు చేస్తున్నాయి. అయినప్పటికీ అమెరికా, దాని మిత్రదేశమైన సిరియా దళాలకు అది సాధ్యపడడంలేదు. కొబానీని స్వాధీనం చేసుకోవడంతో ఐఎస్‌ఐఎస్ వర్గాలకు సిరియా సరిహద్దు నగరాలపై గట్టి పట్టుదొరికింది.

## వెనిజులాకు ఐరాసలో సభ్యత్వం

వెనిజులాకు ఐక్యరాజ్యసమితి భద్రతా మండలిలో మరోసారి సభ్యత్వం లభించింది. వీటో హక్కులేని నాన్ పర్మినెంట్ సభ్య దేశంగా వెనిజులా రెండు సంవత్సరాల పాటు కొనసాగుతుంది. భద్రతా మండలి మొత్తం 193 సభ్యదేశాలలో 183 దేశాలు వెనిజులాకు మద్దతు తెలిపాయి. ప్రస్తుతం ఐరాస భద్రతా మండలిలో 15 దేశాలకు సభ్యత్వం ఉండగా అందులో ఐదు దేశాలు (అమెరికా, రష్యా, చైనా, బ్రిటన్, ఫ్రాన్స్) వీటో హక్కు కలిగిన శాశ్వత సభ్యత్వం ఉండగా, మిగిలిన పది దేశాలు రెండేళ్లకోసారి ఎన్నికవుతుంటాయి.

## 2014 నోబెల్ పురస్కారాలు

2014 సంవత్సరం నోబెల్ విజేతలను ప్రకటించారు. వైద్యరంగంలో ఈ ఏడాది ముగ్గురికి నోబెల్ లభించనుంది. మెదడులోని అంతర్గత దిక్సూచి వ్యవస్థ (ఇన్నర్ గ్లోబల్ పొజిషనింగ్ సిస్టమ్–జిపిఎస్)ను కనుగొన్న బ్రిటిష్ – అమెరికన్ శాస్త్రవేత్త జాన్ ఓ కీఫ్, నార్వేజియన్ దంపతులు ఎడ్వర్డ్ మోసర్, మే–బ్రిట్ మోసర్‌లు నోబెల్ గెలుచుకున్నారు. వీరి పరిశోధన ప్రధానంగా అల్జీమర్స్ వ్యాధికి చికిత్స చేసేందుకు వీలుకానుంది. పర్యావరణ హితమైన ఎల్ఇడి ల్యాంప్ ఆవిష్కరణ చేసిన జపాన్ శాస్త్రవేత్తలు ఇసాము అకసాకి, హిరోషి అమానో, షుజి నకమురాలకు భౌతికశాస్త్రంలో నోబెల్ బహుమతి లభించింది. గ్లోబల్ వార్మింగ్‌పై పోరాటానికి, తక్కువ ఖర్చుతో పేదల జీవితాలను విద్యుత్ వెలుగులు నింపేందుకు వీలుగా ఈ ఎల్ఇడి లైట్‌ను ఆవిష్కరించారు. రసాయన విభాగంలో అమెరికాకు చెందిన ఎరిక్ బెట్‌జిగ్, విలియం మొర్నర్, జర్మన్ శాస్త్రవేత్త స్టెఫాన్ హెల్‌లకు నోబెల్ లభించింది. వీరు అతి చిన్న అణువులను సైతం కోట్ల రెట్లు పెద్దదిగా చేసి చూపించే నానోస్కోప్‌ను ఆవిష్కరించారు. సాహిత్య రంగంలో ఫ్రెంచ్ సాహితీవేత్త పాట్రిక్ మొడియానో నోబెల్ గెలుచు కున్నారు. ఫ్రాన్స్‌పై నాజీల దురాక్రమణ, అది తన దేశంపై చూపిన ప్రభావంపై తన జీవితకాలం పాట్రిక్ అధ్యయనం చేశారు. 20 ఏళ్ల వయసు నుంచే సాహిత్య సృజన ప్రారంభించిన పాట్రిక్ ఫ్రెంచ్‌లో నలభైకి పైగా రచనలు చేశారు. వాటిల్లో అనేకం ఆంగ్లంలోకి అనువాదం అయ్యాయి. వాటిలో 'మిస్సింగ్ పర్సన్' నవల 1978లో ప్రతిష్ఠాత్మక ప్రిక్స్‌గాన్ కోర్ట్ అవార్డును గెలుచుకుంది. 1968లో ఆయన రాసిన 'లా ప్లేస్ డి లెటాయిల్' నవల యూదులపై నాజీల నరమేథం అనంతరం వచ్చిన అత్యుత్తమ రచనగా ప్రశంసలందుకుంది. ప్రతిష్ఠాత్మకమైన నోబెల్ శాంతి పురస్కారానికి భారత్‌కు చెందిన సామాజిక కార్యకర్త కైలాష్ సత్యార్థి, పాకిస్తాన్‌కు చెందిన బాలల హక్కుల, బాలికల విద్య కోసం ఉద్యమం సాగిస్తున్న మలాలా యూసఫ్‌జాయ్‌లు ఎన్నికయ్యారు. మధ్యప్రదేశ్‌కు చెందిన కైలాష్ సత్యార్థి మూడు దశాబ్దాల కిందట 'బచ్‌పన్ బచావో ఆందోళన్' అనే స్వచ్ఛంద సంస్థను ప్రారంభించారు. బలవంతపు చాకిరి, అక్రమ రవాణా నుంచి బాలలను రక్షించేందుకు ఈ సంస్థ ద్వారా కృషి చేస్తున్నారు. ఇప్పటివరకు దాదాపు ఎనభై వేల మంది బాలబాలికలను రక్షించారు. ఇక పాకిస్తాన్‌లో రెండేళ్ల కిందట తాలిబాన్ ఉగ్రవాదుల దాడిలో తీవ్రంగా గాయపడిన మలాలా పాకిస్తాన్‌లోని బాలల హక్కుల కోసం, బాలికల విద్యాహక్కు కోసం ఉద్యమం కొనసాగిస్తోంది. ఆర్థికశాస్త్రం నోబెల్‌ను ఫ్రెంచ్ ఆర్థికవేత్త జీన్‌టిరోల్ దక్కించుకున్నారు. మార్కెట్ శక్తులు, నియంత్రణ చర్యలపై విశేష పరిశోధనలు చేసినందుకు ఆయనకు ఈ అవార్డు లభించింది. చిన్నా పెద్దా అని తేడా లేకుండా అన్ని కంపెనీలనూ ఒకే గాటన కడుతూ అప్పటివరకూ ఆర్థికవేత్తలు కొనసాగిస్తున్న మార్కెట్ విశ్లేషణా విధానాన్ని టిరోల్ సమూలంగా మార్చేశారు. శక్తిమంతమైన ఒకటి రెండు కంపెనీలు పరిశ్రమను ఏకస్వామ్యంగా మార్చి, వినియోగదారుల ఇష్టాయిష్టాలకు విలువ ఇవ్వకుండా తాము అనుకున్న విధంగానే వస్తూత్పత్తి చేస్తూ, అధిక ధరలను నిర్ణయిస్తున్న తీరును ఆయన బట్టబయలు చేశారు. డిసెంబర్ 10న ఆల్ఫ్రెడ్ నోబెల్ వర్ధంతి రోజున స్టాక్‌హోమ్‌లో ఈ అవార్డులు ప్రధానం చేస్తారు.

## బ్రెజిల్ అధ్యక్షురాలిగా దిల్మా రౌసెఫ్

బ్రెజిల్ అధ్యక్షురాలిగా దిల్మా రౌసెఫ్ మళ్లీ ఎన్నికయ్యారు. 2010 నుంచి ఆమె ఈ పదవిలో కొనసాగుతున్నారు. అక్టోబర్ 5న జరిగిన ఎన్నికల్లో రౌసెఫ్‌కు 41.4 శాతం ఓట్లు లభించగా, ఆమె ప్రత్యర్థి ఎకియో నీవ్స్‌కు 33.8 శాతం ఓట్లు వచ్చాయి. దీంతో ఏ అభ్యర్థికీ 50 శాతానికి పైగా ఓట్లు లభించకపోవడంతో అక్టోబర్ 26న తిరిగి ఎన్నికలు నిర్వహించగా రౌసెఫ్‌కు 51.6 శాతం ఓట్లు లభించాయి. ప్రత్యర్థి నీవ్స్‌కు 48.4 శాతం ఓట్లు వచ్చాయి. మొదటి రౌండ్‌లో మూడో అభ్యర్థి మరినా సెల్వా పోటీ నుంచి తప్పుకున్నారు. ఆమె 2018 వరకు అధ్యక్ష పదవిలో కొనసాగుతారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : వై.రామచంద్రం, ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(1 సెప్టెంబర్ నుండి సెప్టెంబర్ 30 2014 వరకు తెలంగాణలోని 7 జిల్లాలు (938), ఆంధ్రప్రదేశ్‌లోని 6 జిల్లాలలో (524) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 1462)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు స్త్రీ | ఇతరాలు పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | - | 3 | - | 14 | 21 | 24 | 26 | 14 | 3 | 2 | 1 | 1 | - | 1 | 26 | 30 | - | - | - | 2 | 2 |
| హైదరాబాద్ | - | - | - | 16 | 13 | - | - | - | 2 | 3 | 6 | 6 | - | - | 46 | 27 | - | - | - | 18 | - |
| కరీంనగర్ | - | 16 | 20 | - | 12 | - | 25 | - | - | - | - | 8 | - | 4 | 38 | 6 | - | - | - | - | - |
| ఖమ్మం | - | - | - | 2 | 3 | 2 | 11 | 3 | - | - | - | 2 | - | 1 | 9 | 10 | - | - | - | - | 1 |
| మహబూబ్‌నగర్ | - | 15 | - | 18 | 26 | 5 | 4 | 8 | 1 | 3 | 12 | 20 | 25 | 27 | 55 | 12 | 1 | - | - | - | - |
| రంగారెడ్డి | - | 3 | 4 | - | 13 | 17 | 4 | 14 | 2 | 4 | 6 | 2 | 4 | 4 | 7 | 35 | 22 | - | - | - | - |
| నల్గొండ | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| నిజామాబాద్ | - | - | - | 11 | 24 | 1 | 4 | 7 | 1 | - | - | 4 | 4 | 8 | 23 | 22 | - | - | - | - | - |
| వరంగల్ | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| **తెలంగాణ** | **-** | **37** | **24** | **61** | **88** | **49** | **74** | **46** | **9** | **12** | **25** | **43** | **33** | **45** | **204** | **142** | **23** | **-** | **-** | **20** | **-** |
| అనంతపురం | - | 6 | - | 13 | 10 | 3 | 4 | 11 | - | 4 | 6 | 3 | 7 | 5 | 18 | - | - | - | - | - | 1 |
| చిత్తూరు | - | - | - | 3 | 8 | 18 | 9 | - | - | - | 4 | 9 | 11 | - | 21 | 11 | - | - | - | - | 10 |
| కడప | - | 1 | - | 9 | 6 | - | 1 | - | - | - | 5 | - | - | 3 | 26 | 11 | - | - | - | - | 8 |
| కర్నూలు | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| ప్రకాశం | - | 3 | - | 6 | 13 | 2 | 1 | 6 | 2 | 7 | - | 4 | 5 | 5 | 29 | 12 | 1 | - | 1 | - | 4 |
| శ్రీకాకుళం | - | - | - | 1 | 3 | 2 | 11 | 6 | - | 2 | 1 | 1 | 10 | 4 | 24 | 18 | - | - | - | - | - |
| విశాఖపట్నం | 1 | - | - | 1 | 10 | 1 | 3 | - | 1 | 8 | - | 2 | 9 | 3 | 11 | 10 | - | - | - | 15 | - |
| **ఆంధ్రప్రదేశ్** | **1** | **10** | **-** | **33** | **50** | **26** | **29** | **23** | **3** | **21** | **16** | **19** | **42** | **20** | **129** | **62** | **1** | **-** | **1** | **15** | **23** |




సమాచార & ప్రసార కేంద్ర మంత్రిత్వ శాఖ
భారత ప్రభుత్వం




గాంధీ జయంతి రోజున

మహోన్నతమైన వ్యక్తి, జాతిపిత

# మహాత్ముడిని

## గుర్తుచేసుకుందాం




davp 22202/13/0046/1415 RO No. 22202/13/0047/1415

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 160 - November 2014 ● ISSN 2231-6892
● RNI Regn.No.APTEL/2003/11482 ● Published on 27/10/2014 ● Postal Regn. No. L II/RNP/HD/1100/2014-16

# వేలాది మంది అభిమానుల కోరిక
# వీక్షణంను కాపాడుకుందాం
# ఎందరో శ్రేయోభిలాషులు చాస్తున్న స్నేహహస్తం
# వీక్షణం మనుగడ కోసం శాయశక్తులా కృషి చేద్దాం,
# మూలనిధి ఏర్పాటు చేద్దాం

వీక్షణం ఆర్థిక సమస్యల నుంచి గట్టెక్కి చిరకాలం కొనసాగాలంటే చందాదారులు, పాఠకులు పెరగాలి. ప్రతినెలా కనీసం మూడు పేజీల ప్రకటనలు రావాలి. శక్తి ఉన్న దాతలు ఇతరులకు కానుకగా చందాలు, విరాళాలు ఇవ్వాలి. వీక్షణం చిరకాలం మనుగడ సాగించడానికి వీలుగా మూలనిధి ఏర్పడాలి. ఈ విశాల సహాయ చర్యలలో భాగంగా:

- వీక్షణం పాఠకులలో ప్రతి ఒక్కరమూ కనీసం మరొక చందా చేర్పించవచ్చు
- వీక్షణం పాఠకులలో ప్రతి ఒక్కరమూ మన చందాతో పాటు కనీసం రు. 100 వీక్షణం మూలనిధికి విరాళంగా ఇవ్వవచ్చు
- కళాశాలలను, విద్యాసంస్థలను, ప్రభుత్వ, ప్రైవేటు గ్రంథాలయాలను వీక్షణం చందాదారులుగా చేర్పించి వీక్షణం మరింత మంది పాఠకులకు చేరువయ్యేలా చూద్దాం
- ప్రతి న్యూస్ ఏజెంట్ దగ్గరా వీక్షణం విడిప్రతులు అమ్మకానికి ఉండే ఏర్పాట్లు చేయవచ్చు
- ఆర్థిక పరిస్థితి మెరుగ్గా ఉన్న వీక్షణం పాఠకులు తమ బాధ్యతగా వారి సంవత్సరాదాయంలో కనీసం ఒక శాతం వీక్షణం మూలనిధికి విరాళంగా ఇవ్వవచ్చు
- సామాజిక జీవితంలో క్రియాశీలంగా ఉన్న, విస్తృత పరిచయాలు ఉన్న వీక్షణం అభిమానులు తమకు తెలిసిన దాతల నుంచి వీక్షణం మూలనిధికి విరాళాలు సేకరించవచ్చు
- విద్యాసంస్థల, ఆరోగ్య సంస్థల, సాధారణ వ్యాపార సంస్థల నిర్వాహకులతో పరిచయాలు ఉన్న అధ్యాపకులు, మిత్రులు, సామాజిక కార్యకర్తలు వీక్షణం కోసం ఆయా సంస్థల వ్యాపార ప్రకటనలు సేకరించవచ్చు
- వీక్షణం ప్రచారం కోసం, ఆర్థిక సహాయం అర్థించడం కోసం మీ ప్రాంతాలలో సమావేశాలు ఏర్పాటు చేయవచ్చు

**వివరాలకు**

**వీక్షణం,** మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029. ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Deccan Press for Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020 and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao